## యండమూరి వీరేంద్రనాథ్

### అందిస్తున్న సంచలనాత్మక మనోవైజ్ఞానిక పుస్తకములు

మైండ్ పవర్ - నెం. 1 అవడం ఎలా ?

వెల : రు. 150/-

విజయానికి ఐదు మెట్లు

వెల : రు. 150/-

విజయంలో భాగస్వామ్యం

వెల : రు. 80/-

చదువు - ఏకాగ్రత

వెల : రు. 50/-

విజయంవైపు పయనం వెల : రు. 30/-

మీరు మంచి అమ్మాయి కాదు! వెల : రు. 30/-

మిమ్మల్ని మీరు గెలవగలరు వెల : రు. 30/-

మిమ్మల్ని మీ పిల్లలు ప్రేమించాలంటే....

వెల : రు. 30/-



—: నాన్ ఫిక్షన్ :—

* గ్రాఫాలజీ
* మంచి ముత్యాలు (కొటేషన్స్)
* పాపులర్ రచనలు చేయటం ఎలా ?
* పిల్లల పేర్ల ప్రపంచం
* పడమర కోయిల పల్లవి

—: ఇంగ్లీషు :—

* The Art of Studying
* Five Steps to Success (In Print)

# ప్రార్థన

## ఒకటి

నగరానికి నాలుగు కిలోమీటర్ల దక్షిణాన పాతిక ఎకరాల విస్తీర్ణంలో కట్టబడ్డ "మోహన్‌లాల్ కపాడియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కేన్సర్ రిసెర్చి" కాంపౌండ్‌లోకి డాక్టర్ భార్గవ కారు ప్రవేశిస్తున్న తరుణాన....

అదే సమయానికి ఊరికి ఉత్తరాన ఆరు కిలోమీటర్ల దూరాన వున్న తోటలో పొడుగ్గా పెరుగుతూన్న చెట్ల నీడల్లో పిక్నిక్‌కి వచ్చిన పిల్లలందరూ, కొందరు నిలబడీ కొందరు కూర్చొనీ హుషారుగా ముక్త కంఠంతో 'వన్ ట్వంటీ ఫోర్– వన్ ట్వంటీ ఫైవ్- వన్ ట్వంటీ సిక్స్' అని లెక్క పెడుతూంటే వాళ్ళ మధ్యలో పెదాల నడుమ అలసటను బిగపట్టి స్కిప్పింగ్ చేస్తూన్న పన్నెండేళ్ళ పాప లోపల్నుంచి తన్నుకు వస్తూన్న వేడికి ఇక తట్టుకోలేక మోకాళ్ళ మీదకు ముందుకు వంగి, అక్కడా నిలబడలేక క్రిందకు జారిపోయింది.

అప్పుడు సమయం అయిదు గంటలు అవటానికి ఇంకా అయిదు నిముషాలుంది.

* * * *

ఫంక్షన్ అయిదింటికి....

ఈ రోజు నాటికి కాన్స్-క్యూర్ కనిపెట్టబడి సరీగ్గా పది సంవత్సరాలయింది— అందుకే ఫంక్షను. నాలుగో అంతస్తు మేడమీద చిన్న స్టేజీ, ముందో రెండొందల కుర్చీలు అమర్చారు. టేప్‌రికార్డర్ అటాచ్ చెయ్యబడ్డ మైకునుంచి రవిశంకర్ సితార్ వస్తూంది.

అతడు వెళ్ళేసరికి అక్కడ చాలామంది వున్నారు. డాక్టర్ కరుణాకర్ అతడిని చూసి పలకరింపుగా నవ్వి, పక్క కుర్చీ చూపించాడు. భార్గవ కూర్చుని "ఇంకా ఎమ్. డి. రాలేదా?" అనడిగాడు.

"ఇండియన్ పంక్చువాలిటీ" అంటూ నవ్వి కరుణాకర్ తన వాచీ చూసుకుంటూ "ఈ రోజు చంపాలాల్‌కి గోల్డ్‌మెడల్ ఇస్తారనుకుంటా" అన్నాడు.

"ఎందుకు?"

"కాన్స్-క్యూర్ కనిపెట్టబడి పది సంవత్సరాలు పూర్తయినందుకు"

"కనుక్కున్నప్పుడు ఇచ్చారుగా. మళ్ళీ పది సంవత్సరాలకీ— పాతిక సంవత్సరాలకీ- ఇలా యిచ్చుకుంటూ పోవటం దేనికి" అన్నాడు భార్గవ విసుగ్గా. అందులో ఈర్ష్యలేదు. భార్గవ ఇలాటి ఈర్ష్యాసూయలకు అతీతుడని అక్కడ చాలామందికి తెలుసు. తన పనేదో తను చేసుకుంటూ పోతాడు. వాటికి మిగతా వాళ్ళలాగా పెద్దగా అడ్వర్టయిజ్‌మెంట్ ఇవ్వడు.

"చంపాలాల్ మీద మీకు నమ్మకం లేదనుకుంటా" అన్నాడు కరుణాకర్.

"చంపాలాల్ మీద కాదు, అతడు కనుక్కున్న కాన్స్-క్యూర్ మీద. ఏ మాత్రం తార్కిక జ్ఞానం వున్నవాడయినా ఈ విషయం గ్రహిస్తాడు. భారతదేశంలో ఇంత ప్రాచుర్యం పొందిన ఈ మందు తాలూకు పేటెంట్స్‌కోసం ఏ విదేశీ కంపెనీ కూడా ఎందుకు ముందుకు రాలేదు?"

"ఎందుకంటే...."

"ఎందుకంటే ఈ మందు చేసే పనిని- మెథొట్రెక్సేట్, మెర్కాప్టో ప్యూరిన్ లాటి మామూలు మందులు చేస్తాయి కాబట్టి" ఉక్రోషంగా

అన్నాడు. అతడికి ఉక్రోషం ఎద్దు ఈనింది అంటే దూడని కట్టెయ్యమనే మేధావుల మీద.

"....లుకేమియాకి మందు లేదు. పైన నేను చెప్పిన మందులు కొంతవరకూ దీన్ని అరికడతాయి. కానీ ఎంత? నూటికి ఒక శాతం! 'కాన్స్-క్యూర్' వాడటంవల్ల మాత్రం అంతకంటే ఎక్కువగా ఫలితం కనిపిస్తుందా? లేదే. భారతదేశంలో గత పది సంవత్సరాలుగా ఎవరైనా ఈ రోగుల లెక్కలు తీసి, మరణాల సంఖ్య పరిశీలిస్తే ఆ విషయం బయట పడుతుంది. కాన్స్-క్యూర్ వాడిన వాళ్ళు నూటికి ఒకరున్నా ఎక్కువ బ్రతికి బట్టకట్టలేదు. అది వాడకపోతే నూటికి నూరు చచ్చిపోయేవారే. నేను ఒప్పుకుంటాను. కానీ మెథొట్రెక్సేట్ వాడినా ఆ ఒక్కశాతం బ్రతుకు తారు. యింత చిన్న విషయం ఎవరూ గమనించరేం?"

"మీరీ విషయం మెడికల్ జర్నల్‌లో వ్రాయొచ్చుగా"

"ఇంకా నయం. ఈ ఇన్‌స్టిట్యూటే మనకు తిండి పెట్టేది" అంటూ నవ్వాడు భార్గవ.

వాళ్ళు అలా మాట్లాడుకుంటూ వుండగా అక్కడికి ఒక యువకుడు వచ్చాడు. అతడికి ముప్పై ఏళ్ళ దాకా వుంటాయి. కొద్దిగా జీన్‌పాల్ బెల్మెండో పోలికలున్నాయి. కరుణాకర్ అతడిని పరిచయం చేస్తూ "మీట్ మిస్టర్ ఎస్సెన్ బత్తుల. ఆడ్మినిస్ట్రేటివ్ సెక్షను. మన దగ్గిర కొత్తగా చేరాడు ఛార్టెర్డ్ అకౌంటెంటు" అన్నాడు. "ఈయన పేరు భార్గవ. తన గదిలోంచి ఎప్పుడూ బయటకు రాడు కాబట్టి తెలిసే అవకాశం లేదు"

"ఎస్సెన్ బత్తుల- పేరు గమ్మత్తుగా వుందే" అన్నాడు షేక్ హాండిస్తూ భార్గవ.

"అన్నాబత్తుల సోమశేఖరం గురూగారూ. మార్వాడీ కంపెనీల్లో పేరు మార్చుకుంటే తొందరగా ప్రమోషన్ వస్తుందని ఎవరో అన్నారు. అందుకని చేరేముందు జాగ్రత్తపడ్డాను" అన్నాడు. అతడిని చూస్తే భార్గవకి ముచ్చటేసింది.

"ఏమిటి మాట్లాడుకుంటున్నారు- అఫ్‌కోర్స్ ఇద్దరు సైంటిస్టులు కలుసుకుంటే మాట్లాడేది సైన్సే అనుకోండి. కానీ నాదంతా డెబిట్టు-క్రెడిట్టూ"

"మేం మాట్లాడుకునేది మనదేశపు మేధావి వర్గంలో ప్రస్తు జరుగుతున్న 'నా వీపు నువ్వు గోకు. నీ వీపు నేను గోకుతాను' అ విధానం గురించి! నిజంగా ఏం జరిగేదీ మామూలు ప్రజలకి ఎలా తెలీదు.... నా గొప్పదనాన్ని నువ్వు గుర్తించు. నీ మేధావితనాన్ని నే గుర్తించినట్టూ నటిస్తాను. ప్రభుత్వం ఇద్దర్నీ గుర్తిస్తుంది. ఎందుకంటే వా ఫీల్డు గురించి దానికేమీ తెలీదు కాబట్టి.... ఇదీ మేము మాట్లాడుకునే అన్నాడు కరుణాకర్.

"ఇదే అయితే దీని గురించి నాకు కొద్దిగా తెలుసు గురూగారు అన్నాడు శేఖరం.

"ఏమిటి"

"అంటార్కిటికా ఎక్స్‌పెడిషన్.... ముందు సముద్రంలో పడవ వేసుకు వెళ్ళటం మీద ప్రభుత్వం కోట్లు ఖర్చు పెడుతూం అక్కడేమీ లేదని అమెరికా, రష్యాలు ఎప్పుడో వదిలేసిన బీడుమీద అ నర ప్రయోగాలు చేసి, ఏదో సాధించినట్టు పద్మశ్రీలు కొట్టేస్తున్నా ఇందులో ఎవరు ఎవరికి బంధువులో, డబ్బంతా ఎక్కడికి వెళుతూం ఢిల్లీలో ఏం జరుగుతూ వుందో చాలా కొద్దిమందికే తెలుసు. ప్రజ మాత్రం పెంగ్విన్ పక్షుల పక్కన మనవాళ్ళని ఫోటోల్లో చూసి, 'ఆ ఓహో' అని సంబరపడిపోతూ వుంటారు" అన్నాడు.

"ఛార్టెర్డ్ అకౌంటెంట్ అయినా మీకు ఓషనోగ్రఫీ తెలిసినట్టుం అన్నాడు కరుణాకర్ నవ్వుతూ.

"మనవాళ్ళకు అక్కడ ఏదీ దొరకదు గురూగారూ. ఇది ఓష గ్రఫీ కాదు, నాకున్న జ్యోతిషశాస్త్ర ప్రావీణ్యతతో చెబుతున్నా అన్నాడు.

"ఏమిటీ — మీకు కామర్సుతోపాటూ జ్యోతిషంలో కూడా ప్రా ణ్యత వుందా?"

"ఆహా! అస్ట్రాలజీ, హస్తసాముద్రికం, సంఖ్యాశాస్త్రం, ఫా రీడింగ్ అన్నీ"

"ఇవన్నీ ఎప్పుడు నేర్చుకున్నారండీ బాబూ"

"కాలేజీలో చదువుకునే రోజుల్లో...." నవ్వాడు శేఖరం. "ఓ అమ్మాయితో కొద్దిగా పరిచయం పెరిగాక ఆమె చేతుల్ని మన చేతుల్లోకి తీసుకోవటానికి ఉత్తమమైన మార్గం హస్త సాముద్రికం. ఆ తరువాత ఆ అమ్మాయి మనసులోన బైటకి చెప్పించటానికి బెస్టు సాధనం థాట్ రీడింగ్. ముద్దు పెట్టుకోవటానికి ముహూర్తం నిర్ణయించేది అస్ట్రాలజీ. ఎన్ని పెట్టుకోవాలో నిర్ణయించేది సంఖ్యాశాస్త్రం.... న్యూమరాలజీ"

ఎప్పుడూ సీరియస్‌గా వుండే భార్గవ కూడా నవ్వేసేడు. కపాడియా ఇన్‌స్టిట్యూట్‌లో అందరూ నలభై దాటినవారే. పైగా అందరూ తమ తమ రంగాల్లో నిష్ణాతులు. ఇలా సరదాగా- స్వచ్ఛంగా నవ్వుతూ మాట్లాడుకోవటం తక్కువ. వాళ్ళు నవ్వటం చూసి "ఎందుకు నవ్వుతున్నారు? నా ప్రావీణ్యత మీద మీకు నమ్మకం లేదా- కావాలంటే న్యూమరాలజీ ప్రకారం లెక్కకట్టి మీ పేర్లో మొదటి అక్షరం చెప్పమంటారా భార్గవగారూ" అని అడిగాడు.



"చెప్పండి" అన్నాడు భార్గవ.

"బి".... సీరియస్‌గా అన్నాడు. మళ్ళీ నవ్వులు.

శేఖర్ వారివైపు అయోమయం నటిస్తూ చూసి "మీరందరూ ఎందుకు నవ్వుతున్నారు? నా శాస్త్రం మీద మీకు నమ్మకం లేదా?" అని అడిగాడు.

"ఉంది ఉంది, శ్రీమాన్ అన్నాబత్తుల సోమశేఖరంగారూ, మీ శాస్త్రాన్ని ఉపయోగించి ఇప్పటి ప్రోగ్రాంలో హైలెట్స్ ఏమిటి చెప్పండి" అన్నాడు.

శేఖరం మనసులోనే లెక్కలు వేసుకొని, "ఈ ప్రోగ్రాం జరగదు. వర్షం వల్ల ఆగిపోతుంది" అన్నాడు. అందరూ తలెత్తి ఆకాశంకేసి చూశారు. వేసవికాలపు నిర్మలమైన ఆకాశంకేసి చూడగానే తామందరూ ఫూల్స్ అయినట్టు గ్రహించి ఒక్కసారిగా నవ్వేశారు.

"ప్రోగ్రాం సంగతి సరే, మీ భవిష్యత్తు మాటేమిటి?"

"నాది- నాది గొప్ప భవిష్యత్తు. నోరూ, కళ్ళు బావున్నంత కాలం భార్గెత్తు అకౌంటెంట్లుకి ఫర్వాలేదు" అంటూ శేఖరం "ఏదీ మీ చెయ్యి" అని అతడి చేతిని తీసుకుని పరీక్షించసాగాడు. కరుణాకర్ నవ్వు ఆపుకోలేక

పోతున్నాడు. భార్గవ మేధస్సుని చూసి అందరూ అతడితో మామూలుగా సంభాషించటానికి భయపడతారు. తన విజ్ఞానంతో తనచుట్టూ గోడల్ని నిర్మించుకున్న మేధావి భార్గవ. అలాంటి శాస్త్రజ్ఞుడిని సవిస్తున్నాడంటే ఈ కుర్రవాడు సామాన్యుడు కాడు.

శేఖర్ అతడి చేతిని ఇటూ అటూ తిప్పి రేఖల్ని పరీక్షించి, కళ్ళు మూసుకుని మరో క్షణం అంకెల్ని గుణించి "అతి కొద్దికాలంలోనే మీరు గొప్ప చిక్కుల్లో పడబోతున్నారు గురూగారూ. మీ చేతిని, మీ నామ నక్షత్రాన్ని కలిపి చెప్తున్నాను. ప్రపంచం అంతా మీకు ఎదురు తిరుగుతుంది. మీరు పేపర్లోకి ఎక్కుతారు.... మనశ్శాంతి వుండదు. వృత్తిరీత్యా మీ కార్యకలాపాల్లోనూ గృహ సంబంధమైన విషయాల్లోనూ మొత్తం అన్ని వైపుల్నుంచీ ఒక్కసారిగా మీకు వ్యతిరేకత కానవస్తుంది. దాంతో మీరు కాలిన పెనంమీద ఆవగింజలా అల్లల్లాడిపోతారు" అన్నాడు.

ఒక్కసారిగా అక్కడి వాతావరణంలో ఆహ్లాదం స్థానే సీరియస్‌నెస్ చోటు చేసుకున్నట్టయింది. వింటున్న కరుణాకర్ "ఏమిటిది! తాయెత్తు కట్టి డబ్బులు గుంజటానికి ప్రయత్నమా?" అన్నాడు ముందుకు వంగి. శేఖరం కూడా నవ్వి, "నాకు తోచింది చెప్పానంతే" అన్నాడు.

"నాకు జ్యోతిషం గురించి అంతగా తెలీదు గానీ అందులో మంచే గానీ రాబోయే 'చెడు' గురించి చెప్పకూడదనుకుంటానే" అన్నాడు భార్గవ దాన్ని తేలిగ్గా తీసుకుంటూ.

"సారీ గురూగారూ అమెచ్యూర్ పామిస్టుని! ఏం చేస్తున్నప్పుడు, ఏ టైమ్‌లో ఏం మాట్లాడాలో ఏం మాట్లాడకూడదో తెలియనివాణ్ని. చాలా మంది అమ్మాయిలు నాకు ఇదే సర్టిఫికేట్టు ఇచ్చారు. పాపం నన్ను క్షమించి వదిలెయ్యండి" అన్నాడు శేఖర్. వాతావరణం తేలికైంది. ఇంతలో క్రింద శంకర్‌లాల్ విదేశీకారు తాలూకు పియానో హారన్ వినిపించటంతో కలకలం మొదలైంది. అప్పటికే అందరికీ టీలు సర్వ్ చెయ్యబడ్డాయి. చాలా మామూలు మీటింగ్ అది. ఒకవైపు బుట్టలో పూలదండలు తెచ్చి వుంచారు.

"శంపాలాల్‌గారికి సన్మానమా?" అని అడిగాడు.

"అయ్యిండవచ్చు. కాన్స్-క్యూర్ కనిపెట్టి పది సంవత్సరాలైన సందర్భంలో...." అన్నాడు కరుణాకర్ అటే చూస్తూ.

"కాన్స్-క్యూర్ అంటే కాన్సర్ క్యూరా? దాన్ని బాగుచేస్తుందా?"

"మామూలు కేన్సర్‌ని కాదు.... బ్లడ్ కాన్సర్ (లుకేమియా) అంటే తెలుసా మీకు?"

"తెలుసు"

"ఏం తెలుసు?"

"సినిమాల్లో ఇద్దరు హీరోయిన్లలో ఒకరికి వచ్చేది."

కరుణాకర్ నవ్వాపుకోలేక "నేను చెప్పలేను బాబూ, మీకు భార్గవే చెప్తాడు. అతడికే బాగా తెలుసు దీని గురించి" అన్నాడు. భార్గవవైపు తిరిగి "గురూగారూ నేను కామర్సు వాణ్ని. బ్లడ్ కాన్సర్ కాదుకదా— అసలు కేన్సర్ అంటే ఏమిటని అడిగితే ఆన్సర్ చెప్పలేని వాణ్ని. ముందు అది చెప్పండి...." అన్నాడు.

"ప్రోలిఫిరేషన్ అంటే తెలుసా మీకు?"

"అడల్టెరేషన్ అంటే తెలుసు. కల్తీ"

భార్గవ నవ్వాడు. "మనిషిలో అనుక్షణం జరిగే కణ విభజనని ప్రోలిఫిరేషన్ అంటారు. అదే శరీరం పెరుగుదలకి తోడ్పడుతుంది. మనిషి మేల్కొని వున్నా, నిద్రపోతున్నా, శరీరంలో ఈ కణ విభజన ఒక క్రమబద్ధంగా జరుగుతూ వుంటుంది. అలా జరక్కుండా తొందర తొందరగా జరిగితే, ఆ జరిగిన చోటంతా శరీరం అసంబద్ధంగా పెరిగి పోతుంది. దాన్నే కేన్సర్ అంటారు. ఉదాహరణకి రక్తంలో ఈ కేన్సర్ వస్తే తెల్లకణాలు విపరీతంగా పెరిగిపోవటం ప్రారంభించి ఒకానొక స్టేజిలో మిల్లీమీటరు (సి) రక్తంలో 50,000 నుంచీ పదిలక్షల దాకా ఏర్పడుతాయి. అప్పుడిక మరణాన్ని ఆపటం ఎవరికీ సాధ్యమూ కాదు."

"మైగాడ్! పది లక్షలా!"

"అవును. పదిలక్షల పనికిరాని నిర్జీవపు తెల్లకణాలు. అదే లుకేమియా (బ్లడ్ కాన్సర్) కాన్సర్ నివారించటానికి కెమోథెరపీ, రేడియో థెరపీ అనే రెండు మార్గాలున్నాయ్. రేడియో ఆక్టివ్ కిరణాల ద్వారా, పెరిగిన అనవసరపు భాగంలో సూదులు గుచ్చటాన్ని రేడియో థెరపీ అంటారు. బ్లడ్ కాన్సర్‌కి ఇది పనికిరాదు. ఆ మారణ సృష్టిని ఆపు

చెయ్యాలంటే కెమోథెరపీ, అంటే శరీరంలోకి మందు ఇవ్వటం లా చెయ్యాలి" అని భార్గవ చెప్తూంటే శేఖరం రేడియో ప్రకటనలా—

"మీ వంట్లో రక్తకణాలు విజృంభిస్తున్నాయా? చింతించక నేడే మీ ఇంట్లో వుంచుకోండి. కాన్స్-క్యూర్.... సామ్సన్ అం సామ్సన్ వారి తయారీ.... కాన్స్-క్యూర్!! ట్రింగ్ ట్రింగ్" అన్నాడు

మళ్ళీ నవ్వులు.

ఇంతలో శంకర్‌లాల్ అక్కడికి చేరుకోవటంతో అంద ఆయన చుట్టూ చేరారు. శంకర్‌లాల్ కూడా ఒకప్పుడు సైంటిస్టే. కా అతడో పారిశ్రామికవేత్తలా కనబడతాడు. ప్రస్తుతం ఇన్‌స్టిట్యూ తాలూకు ట్రస్ట్ వ్యవహారాలు చూసుకొంటున్నాడు. కొద్దిగా బట్టతల. ఫ కాస్త జుట్టూ బాగా తెల్లబడింది.

ఆయన మైకు పట్టుకుని "ఫ్రెండ్స్" అన్నాడు. అంతలో చ చప్పుడుతో కరెంట్ పోయింది. ఎవరో వుసుక్కున నవ్వారు. భా చెవిలో 'నేనుకాదు గురూగారూ నవ్వింది' అని రహస్యంగా వినిపించి క్రిందినుంచి కొవ్వొత్తులు పట్టుకొచ్చారు ప్యూన్లు. "హూక్కాకా అలవాటున్న" సీనియర్ సైంటిఫిక్ ఆఫీసరు జేబులోంచి లైటరు వెలిగించాడు. గాలికి ఆరిపోయింది అది.

అప్పుడు గమనించాడు భార్గవ ఉత్తర దిక్కునుంచి చల్లటి రివ్వున వీచటాన్ని. అతడు తలెత్తి ఆకాశంకేసి చూడబోతూంటే టప్ ఓ పెద్ద నీటిచుక్క అతడి మొహంమీద పడింది.

రెండు నిముషాలు గడిచేసరికల్లా వర్షం చినుకులు సూదుల్లా సాగాయి.

## 2

చూరునుంచి కారే నీటి చినుకుల కేసి నిస్పృహాయంగా చూస్తూ వరండాలో కూర్చొని వుంది వసుమతి. పిల్లలు ఇంకో టీచర్‌తో వె పోయారు.

ఆస్పత్రి ఆమెకు కొత్తకాదు. ఆమెకు పద్నాలుగేళ్ళ వయసులో ఆమె తండ్రి ఆస్పత్రిలోనే మరణించాడు. కుటుంబ భారం అంతా వసుమ

మీద పడింది. ఆమె బియ్యే పూర్తిచేసే రోజుల్లో తల్లి రాచపుండుతో మరణించింది. ఆ తరువాత సంవత్సరం చెల్లి ప్రేమలో విఫలమై నాటు మంత్రసాని దగ్గర ప్రేమ ఫలితాన్ని పోగొట్టుకునే ప్రయత్నంలో కూడా విఫలమై ప్రభుత్వాస్పత్రిలో మరణించింది. ఆమె టీచర్ ట్రయినింగ్ పూర్తిచేసిన సంవత్సరం మెట్రిక్యులేషన్‌లో తప్పిన తమ్ముడు రైలుక్రింద తలపెట్టి ఆత్మహత్య చేసుకున్నప్పుడు పోస్టుమార్టమ్ చేయబడ్డ శరీరాన్ని తీసుకెళ్ళటానికి, కుటుంబంలో ఒక్కత్తిగా మిగిలిపోయిన ఆమె ఆస్పత్రికి రావలసి వచ్చింది.

ఆస్పత్రి ఆమెకి కొత్తకాదు.

"అమ్మా, నీ వంతు వచ్చింది" అన్నాడు పక్క పేషెంటు ఖంగు ఖంగున దగ్గుతూ— ఆమె ఉలిక్కిపడి లోపలికి వెళ్ళింది.

లోపల డాక్టరు కుర్రవాడు. తనకున్న తెలివితేటలకి ఏ న్యూయార్కులోనో వుండాల్సింది. అదృష్టం బావోలేక ఈ ప్రైమరీ హెల్త్ సెంటర్‌కొచ్చి పడ్డానన్న భావం అతడి మొహంలో కొట్టొచ్చినట్టు కనబడుతూంది.

"ఊఁ ఏమిటి" అన్నాడు నిరాసక్తంగా.

"పాపకి— జ్వరం" అంది వసుమతి.

"నర్సు, టెంపరేచర్" అని అరుస్తూ సర్రున కాగితం లాగి, "పేరు?" అని ప్రశ్నించాడు.

"ప్రార్థన!"

పేరు కాస్త భిన్నంగా వుండేసరికి ఆ డాక్టరు ఒకసారి కళ్ళెత్తి చూసి మళ్ళీ నిర్లక్ష్యంగా వ్రాయటంలో మునిగిపోయాడు. ఈ లోపులో నర్సు టెంపరేచర్ చూసి చెప్పింది.

104.

వసుమతి ఉలిక్కిపడింది. డాక్టరు మాత్రం తనకి ఇలాంటి రోగాలెన్నీ మామూలే అన్నట్టు బరబరా కాగితంమీద గీకేసి ఇక వెళ్ళొచ్చు అన్నట్టు చూసేడు. ఆ చీటీ పట్టుకొని, ప్రార్థనని మరోచేత్తో లేపి నిలబెట్టటానికి ప్రయత్నం చేస్తూ, "ఫర్లేదంటారా" అని అడిగింది ఆశగా.

డాక్టరు తలెత్తి వ్యంగ్యంగా, "అంటే నేనేమన్నా దేముణ్ణి అనుకున్నారా" అన్నాడు. అతడి పక్కనే కూర్చుని కబుర్లు చెబుతున్న

పెద్ద మనిషి అదేదో జోకులా నవ్వాడు. వసుమతి మొహం న
కందిపోయింది. పాపని తీసుకుని పక్క రూమ్‌లోకి వెళ్ళి మందు తీసు
బయట వరండాలో బల్లమీద కూర్చొని, మాత్ర వేసి వళ్ళో పడుకో
కుంది. బయట వర్షం ఇంకా కురుస్తూనే వుంది.

ఇంతలో లోపల్నుంచి బిగ్గరగా నవ్వు వినబడింది. నర్సు అ
మాటలకి డాక్టరు నవ్వుతున్నాడు. ఆమె లోపలికి చూడలేదు. తల్లి
తండ్రినీ, చెల్లినీ, తమ్ముడినీ ఆ లోపలికే అర్పించిన వసుమతి, ఈ
అటు చూడటానికి భయపడి మనుష్యుల సకల పాపాల్ని తన కడుపు
దాచుకుని నిశ్చలంగా పరిభ్రమించే వసుమతిలాగా నిర్లిప్తంగా బయ
చీకటిలోకి చూడసాగింది.

ఆ చీకటిలోంచి.... వర్షపు చినుకుల్ని చీలుస్తూ ముందు
లైట్లు కనబడ్డాయి. నెమ్మదిగా అవి దగ్గరవుతూంటే వరండాలోకి వె
పడసాగింది. అతడి వయసు నలభై వుంటుంది. జుట్టు చెంపలదగ్గర
నెరిసింది. భుజాలదగ్గర సూటు వర్షపు చినుకులకి తడిసింది. దిగి తలుపు
వెయ్యకుండా మెట్లెక్కాడు. అతడు అకస్మాత్తుగా తనిఖీకి వచ్చిన ఆఫీ
వున్నాడు. లోపలికి వెళ్ళబోతున్న వాడల్లా- వరండాలో కొండీ
ఉన్నవాళ్ళిద్దరినీ చూసి ఆగాడు. దగ్గరకొచ్చి ప్రార్థన నుదుటిమీద చే
వేశాడు. ఈ లోపులో కారు చప్పుడికి బైటకొచ్చిన డాక్టర్ గుమ్మం
ఆగిపోయాడు.

"ఏమైంది ఈ పాపకి?" ఇంగ్లీషులో అడిగాడు. అతడి ఇం
ఉచ్చారణ, ఆ వాతావరణాన్ని చూడటంవల్ల కలిగిన ఇరిటేష
మిళితమై సూటిగా వుంది. "ఏమైంది?"

"ఫీవర్ ...."

"వాట్స్ ద రీడింగ్?"

"నాకు.... నాకు.... జ్ఞాపకం లేదు" తడబడ్డాడు.

వృత్తికి సంబంధించిన నిర్లక్ష్యాన్ని గమనించటంవల్ల కలి
కోపాన్ని తమాయించుకుంటూ "అయిదు నిముషాల క్రితం చూసిన ద
అప్పుడే మర్చిపోయారా?" అన్నాడు. డాక్టర్ మాట్లాడలేదు.

"ఎనీవే.... ఏం ఇచ్చారు మందు?"

"నెవోక్విన్."

"నె....వో....క్వి... న్!!!" అతడి గొంతు నమ్మలేనట్టు ధ్వనిం చింది. "డిడ్ షి కంప్లెయిన్ ఛిల్స్?"

"ఇది బాగా మలేరియా వున్న ప్రాంతం!"

అతడు నెమ్మదిగా తలెత్తి, అతికష్టంమీద ఇరిటేషన్ అణుచు కుంటూ తాపీగా అన్నాడు. "SINCE HOW LONG YOU ARE TREATING YOUR PATIENTS BY RANDOM SAMPLES DOCTOR?" (ఎంతకాలం నుంచీ మీరు రోగుల్ని డోకు పద్ధతిన ట్రీట్ చెయ్యటం మొదలుపెట్టారు డాక్టర్.)

డాక్టర్ సమాధానం చెప్పలేదు. అతడు పాప దగ్గరికి వెళ్ళి వేళ్ళతో గొంతు దగ్గర తడుముతూ "ఆంటీ బయోటిక్స్ ఏమీలేవా...., పెన్సిలిన్?" అన్నాడు.

"ఊహూ...."

"ఆంటీ పైరటిక్స్— ఎ. పి. సి.?"

ఇంతసేపటికి ఓ మంచి సమాధానం దొరికినట్టు "లేవు! దీసిజె పి. హెచ్. సి." అన్నాడా డాక్టర్.

"బట్ షూర్ యూ హావె వెట్ క్లాత్!" (ఒక తడిగుడ్డ)

డాక్టర్ ముఖం మ్లానమైంది.

వసుమతికి వాళ్ళు మాట్లాడుకుంటున్న వైద్య సంబంధమయిన మాటలు అర్థంకాలేదు. కానీ అతడు ఆ డాక్టర్ని అలా నిలదీస్తూ వుంటే పర్షంలో తడుస్తూ చిన్నపిల్లలు ఆనందంతో చప్పట్లు కొట్టినట్లు కొట్టా లనిపిస్తూంది. చిన్నపిల్లలు క్లాసులో దెబ్బలాడుతున్నప్పుడు బలంలేని స్టూడెంట్ని బలవంతుడు కొట్టాక, టీచరు వచ్చి వాడిని దండిస్తూ వుంటే మొదటి కుర్రాడికి కలిగే సంతోషం లాంటిది—

వచ్చిందెవరో డాక్టర్కి తెలీదన్న విషయాన్ని ఆమె గ్రహించింది. కానీ ఆ కుర్ర డాక్టరు అన్ని ప్రశ్నలకి మారు మాట్లాడకుండా సమాధానం చెప్పే విధానం చూస్తూంటే, అలా చెప్పాల్సిన అవసరం తనకు లేదని కూడా అతడు మర్చిపోయాడని అనిపిస్తుంది. దానిక్కారణం అడిగే వ్యక్తి కంఠంలో వున్న కమాండ్- సబ్జెక్ట్ని మోనోటోన్లా అతడు ప్రశ్నించే విధానం. అన్నిటికన్నా ముఖ్యంగా అవతలి మనిషిని కట్టిపడేసే తీక్షణ మైన చూపు.

అతడు పాపని చేతుల్లోకి తీసుకుంటూ, డాక్టర్ దగ్గరకు పేషెంట్లు అతడు తమని రక్షించే దేవుడన్న నమ్మకంతో వస్తారు ఫ్రెండ్! మీరు మీ అమూల్యమైన కాలంలో ఒక్క క్షణం వెచ్చించి పాపని నోరు తెరవమని పరీక్షించి వుంటే ఈ జ్వరానికి కారణం మలేరియా కాదనీ, టాన్సిలైటిస్ అనీ తెలిసివుండేది" అంటూ కారువైపు నడుస్తూ.... "రండి వెళదాం" అన్నాడు.

చిత్తరువులా నిలబడిపోయిన వసుమతి అతడి పిలుపుకి ఉలిక్కిపడి నిద్రలో నడిచినట్టు వెళ్ళి కారులో కూర్చుంది. చిన్న కుదుపుతో కారు కదిలింది.

కారు ఊరివైపు వెళ్తుంటే అతనన్నాడు, "ముందు మీ డ్రిల్లు టీచర్ దగ్గర వాకబు చేశాను. అతడిని వదిలిపెడ్తాననుకోకండి. అంత బాధ్యతా రహితంగా ఒక లేడీ టీచర్ని, స్టూడెంట్ని గాలికి వదిలేసి వెనక్కి వచ్చేస్తాడా.... కమిటీలో పెట్టిస్తాను.... అన్నట్టు మీకు థాంక్స్ చెప్పటం మరచిపోయాను కదా! నిజంగా థాంక్స్.... తన స్టూడెంట్సుపట్ల ఇంత శ్రద్ధ తీసుకునే మాస్టర్లు అరుదు"

వసుమతి సిగ్గుతో "నేను చేసిందేముంది? ప్రార్థనంటే నాకిష్టం" అంది.

"ఈజిట్?.... అవునవును. ప్రార్థనంటే ఇష్టం ఎవరికుండదు! షి ఈజ్ నైస్ గర్ల్" అన్నాడు. అప్పుడొచ్చింది ఆమెకి అనుమానం. అయిదు నిముషాల క్రితం ఒక మేధావిలా డాక్టర్‌తో వాదించి, ఇప్పుడు చిన్నపిల్లాడిలా మాటలకోసం తడుముకుంటూ షి ఈజ్ నైస్ గర్ల్ అంటాడు. ఇంతకీ ఇతడెవరా అని? కానీ ఎలా అడగాలో తెలియక వూరుకుంది. అంతలో అతడే "మీ ఇల్లు ఎక్కడో చెప్పండి, ముందు దింపేస్తాను" అన్నాడు. ఆమెకు అలా అవకాశం దొరికి "ముందు ప్రార్థనని...." అంది.

అతడు అయోమయంగా "ప్రార్థనేమిటి? ప్రార్థన నాతోపాటే! నా ఇంట్లో...." అని ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ఆగి, "ఓ! నన్ను నేను పరిచయం చేసుకోలేదుకదూ. నా పేరు భార్గవ. విజయభార్గవ! కపాడియా ఇన్‌స్టిట్యూట్‌లో పని చేస్తున్నాను...." కారు స్లో చేస్తూ.... అన్నాడు. "....ప్రార్థన నా కూతురు"

# 3

"పంచదార నాలుగు చెంచాలు"

"చిన్నవా పెద్దవా?"

"ఇందులో వ్రాసిలేదు"

శ్రీనూ బుర్ర గోక్కుని, పెద్ద చెంచాతో రెండు, చిన్న చెంచాతో రెండూ వేశాడు. "ఊ! ఇంకా"

జిన్నీ చేతిలో పుస్తకంవైపు చూసి చదివి, "అంతే బావా, ఇంకేమీ లేదు పంచదార వేసిన రెండు నిముషాలకి పాలు మరుగును అని వ్రాసుంది అంతే. ఆ తరువాత కోడిగుడ్డు వేయాల్ట" అంది. ఇద్దరూ స్టౌవైపు చూస్తూ కూర్చున్నారు. ఒకటి- రెండు నిమిషాలయినా పాలమీదనుంచి పొంగు రాలేదు.

"మనమో తప్పు చేసేం" అన్నాడు శ్రీనూ.

"ఏమిటి"

"స్టౌ వెలిగించటం మరచిపోయాం"

"అదిందులో వ్రాసిలేదే"

"నీ మొహం. అట్లాటివన్నీ వ్రాయరు"

ఇంతలో 'ఏం చేస్తున్నార్రా' అన్న పిలుపు వినిపించింది. భార్గవ లోపలికి వస్తూ "మీరిద్దరూ చేదేరేమిటి? ప్రార్థనేది?" అన్నాడు.

"డాన్సు క్లాసుకి వెళ్ళింది"

అతడికి కూతురు. తన మొదటి స్టేజి ప్రదర్శన తొందరలోనే జరగబోతూందని చెప్పిన విషయం గుర్తువచ్చింది. దానిపేరు ఏదో వుండాలి రుబ్బురోలు పొత్రం.... అలాటి పేరే ఏదో- ఆఁ "అరంగేట్రం" అందుకే ప్రొద్దునే వెళ్ళిపోతూంది.

"ఏమిటీరోజు అంత స్పెషల్"

"పన్నక్క బర్తడే...."

"భోజనానికి ఇవ్వాళ మా యింటికి రావాలోయ్" అన్నాడు భార్గవ శేఖరాన్ని చూసి.

"ఏమిటి విశేషం?" అని అడిగాడు అతడు.

వాళ్ళిద్దరికీ వారం రోజుల్లోనే పరిచయం దగ్గరయింది. విభి
ధృవాలు ఆకర్షింపబడటంలో విడ్డూరంలేదు.

"ప్రార్థన పుట్టినరోజు" అన్నాడు భార్గవ.

"ఓ! అయితే తప్పకుండా వస్తాను" అన్నాడు శేఖరం. "
గురూగారూ! మీకు అంతకన్నా మంచి విషయం చెప్పదల్చుకున్నాను.

"ఏమిటి?"

శేఖరం తలవంచి రహస్యం చెబుతున్నట్టు "మన సైంటి
ఆఫీసరు కమలగార్ని ప్రేమిద్దామనుకుంటున్నాను" అన్నాడు.

భార్గవ ఆశ్చర్యంగా అతడివైపు చూసి, "ఎవరూ! కమల
ఆవిడకి ముప్పై అయిదేళ్ళు కదోయ్!" అన్నాడు.

"ప్రేమింప బడటానికి అదే సరి అయిన వయసని నేను
తున్నాను. అప్పటికి వాళ్ళకి ప్రేమ తాలూకు నాన్సెన్సికల్ అభిప్రా
పోతాయి."

"కానీ సోడాబుడ్డి కళ్ళద్దాలూ అవీ....ఆవిడేం బావుంటుందోయ్

"అమ్మమ్మ! అలా అనకండి. ఆవిడ తాలూకు విజ్ఞానం
ఆ కళ్ళద్దాల్లోనే వుంది. సోడాబుడ్డి కళ్ళద్దాల వాళ్ళ ప్రపంచం చాలా
షెడ్ గా వుంటుంది. ఎక్కువ ప్రపంచాన్ని చూడలేకపోవడంవ
అలాటివాళ్ళు ప్రేమలో పడ్డారంటే అదే దుంధుడు మారుతంలా
వూపేస్తారు. అందులో ఆనందమే వేరు" అన్నాడు. భార్గవ ఇంకా న
కుదరదన్నట్టు "మరి మొన్న లాబ్ సూపర్ వైజర్ రాంబాయమ్మ
ప్రేమించానన్నావ్" అన్నాడు.

"ఆవిడ్ని కాదు గురూగారూ– ఆవిడ్ని కాదు! మీరు నన్ను
అర్థం చేసుకోవటంలేదు. ఆ క్షణం ఆవిడ అంతలావు బొండు పుస్త
అలా ఏకాగ్రతతో చదివే భంగిమని ప్రేమించాను. ఆవిడకన్నా బరు
వున్న పుస్తకాన్ని, ఆవిడ చదివే తీరు ముచ్చటేసింది. మీకు తెలుసు
విజ్ఞానం ఎక్కడున్నా...."

"నీ విశ్వజనీయమైన ప్రేమకు జోహార్లు"

"థాంక్స్– థాంక్స్"

"ఇంతకీ రాత్రి డిన్నర్ కి వస్తున్నావా?"

"ఒంటరిగాడ్ని. మీరు పిలవాలేగానీ, మధ్యాహ్నం భోజనానికి కూడా రమ్మంటే వచ్చేస్తాను."

"వద్దొద్దు" అంటూ భార్గవ అతడివైపు తేరిపార చూసి, "పెళ్ళి చేసుకోకూడదటోయ్?" అన్నాడు కాస్త మందలిస్తున్నట్టూ.

శేఖరం అదే నమ్రతతో "పెళ్ళి అనేది కేవలం భోజనం కోసమే కాదనేది నా ఉద్దేశ్యం గురూగారూ. దానికే అయితే వంట మనిషి చాలు" అన్నాడు.

"కానీ ఇంట్లో మనకోసం ప్రేమగా ఎదురు చూసేవాళ్ళు ఒకరుంటారు కదోయ్"

"ఎదురు చూడటమే ప్రేమయితే, మంచి అల్సేషన్ కుక్కని పెంచుకోవటం ఉత్తమం."

"నీకెలా చెప్పాలో తెలియటం లేదోయ్! ప్రేమంటే...."

"మీరు చెప్పలేరని నా ఉద్దేశ్యం గురూగారూ. నా ప్రేమని అర్థం చేసుకోలేక నా లాబ్ సూపర్‌వైజర్ తెల్ల జుట్టు రాంబాయమ్మ తనో ఫిజిక్స్ పోస్టుగ్రాడ్యుయేట్‌ని అన్న విషయం కూడా మర్చిపోయి అచ్చతెలుగులో 'దొంగసచ్చినోడా' అని తిట్టింది."

"విషయం అంతవరకూ వచ్చింది"

"నా తప్పేంలేదు గురూగారూ! అంతలావు బొండు పుస్తకాన్ని వళ్ళో వేసుకుని, కిటికీ పక్కన కూర్చొని చదివేస్తూంటే ముచ్చటేసి దగ్గర కెళ్ళి 'ఇంతింత బరువైన వాటిని మోస్తున్న మీ శరీరం ధన్యమైంది' అన్నాను. అందులో 'దొంగసచ్చినోడా' అని తిట్టాల్సిన అవసరం ఏముందో నా కర్థం కాలేదు."

"అవును. నిశ్చయంగా లేదు. కానీ నువ్వు నీ తెలుగుని కొద్దిగా సంస్కరించుకోవటం మంచిదని నా ఉద్దేశ్యం. అలాగే ఆడవాళ్ళు మోసే వాటి గురించీ, వాళ్ళ కళ్ళద్దాల్లోని జ్ఞానం గురించీ ఆలోచించటం మానేసి- అఫ్‌కోర్స్ నువ్వు నిజాయితీగానే ఆలోచిస్తున్నావనుకో- కానీ వాళ్ళు నిన్ను అర్థంచేసుకోలేక పోయినప్పుడు వాళ్ళని క్షమించి, వాళ్ళ మానాన వాళ్ళని వదిలిపెట్టేసి, నువ్వు నీ పనులు చూసుకోవటం మంచిదని నా ఉద్దేశ్యం"

"మీకూ రాంబాయమ్మగారిలాగే నా పట్ల నీచమైన అభిప్రాయం వున్నట్టుంది గురూగారూ! కానీ చేరి పూర్తిగా పదిహేనురోజులు కాక

పోయినా అప్పుడే కపాడియా కేన్సర్ ఇన్‌స్టిట్యూట్‌ని ఇప్పుడొస్తున్న నష్టాలనుంచి రక్షించే మార్గాన్ని ఒక అకౌంటెంట్‌గా కనుక్కున్నాన తెలుసా?"

"ఏం కనుక్కున్నావు?"

"మొన్నరాత్రి నిద్రపట్టక సెక్సు పుస్తకం చదివినట్టూ సామ కంపెనీ బ్యాలెన్సు షీటు బోర్లాపడుకుని చదవసాగాను. మనం పేటెం ఇచ్చిన కాన్స-క్యూర్ మందుని వాళ్ళు ఎంతకు అమ్ముతున్నారో తెలు గురూగురూ- మిల్లీగ్రాము రెండొందలకి.... భారతదేశంలోకెల్లా ఆ ఖరీదైన మందు."

"అవును. ఖరీదైన వ్యాధికి ఖరీదైన మందు"

"మిల్లీగ్రాము రెండొందలు ఖరీదుచేసే ఈ మందులో వాళ ముఖ్యమైన పదార్థం సల్ఫా-2. దీని ఖరీదు నూట అరవై రూపాయ మీరు మొన్న సంభాషణలో ఒక మాట వాడారు.... మెరాప్టోప్యూరిన్ మెథొట్రెక్సేట్ గాని తొందర తొందరగా విడిపోయే రక్తకణాల పేగా అవుతాయని.... అదే యీ సల్ఫా-2 నా? దీనికి బదులు ఇంకో అయిన పదార్థాన్ని వాడలేమా? ఇది కనుక్కున్నాం అనుకోండి. కా క్యూర్ ధర రెండొందల్నుంచీ రెండ్రూపాయలకి పడిపోతుంది. నో బహుమతి మనకే వస్తుంది. ఏ నిష్పత్తిలో పంచుకునేది తరువాత ఆ చిద్దాం. నాకు మాత్రం ఈ ఆలోచన వచ్చిన దగ్గర్నుంచీ మరి ని పట్టటంలేదు. ఏ హేమమాలినినో ఊహించుకుంటూ గడపాల్సిన చలిరాత్రి...."

భార్గవ మాట్లాడలేదు. ఆ యువకుడినే కన్నార్పకుండా చూ న్నాడు.

"ఏమిటి గురూగురూ— ఆలోచిస్తున్నారు?"

"ఇంత విషయ పరిజ్ఞానం వున్నవాడివి ఎప్పుడూ అమ్మాయి గురించి మాట్లాడతావేం?" అన్నాడు భార్గవ నవ్వుతూ.

" 'శరీరం అనే రెఫ్రిజిరేటర్‌లో మెదడు అనే భాగం వేడెక కుండా కాపాడే కంప్రెషరు స్త్రీ తాలూకు ఆలోచన' అన్నాడు ఆచా రజనీష్. మగువా- మద్యమూ- మాంసమూ ఈ మూడు—బై దిబై మాం

అంటే గుర్తొచ్చింది. ఈ రాత్రి డిన్నర్‌లో మాంసం వండించండి. నిరుత్సాహపూరితంగా చెబుతున్నాను. పుట్టింది శ్రోత్రియవంశమైనా నాన్ వెజిటేరియన్‌లంటే చెవికోసుకుంటాను. అందులోనూ 'మటన్'అంటే...."

* * * *

డైనింగ్ టేబిల్ మధ్యలో పొగలు సెగలు కక్కుతున్న గిన్నెలో వున్న మాంసం కూర తాలూకు వాసన ఆ గది అంతా వ్యాపించి వుంది.

శేఖరం చిన్న ముక్కని నోట్లో పెట్టుకుని పీలుస్తూ "ఈ ఎముక లోపల వుండేదాన్ని ఏమంటారు" అని అడిగాడు.

శ్రీను "మూలగ" అన్నాడు, ఇంత చిన్న విషయం తెలీదా అన్నట్టూ.

"భలే రుచిగా వుంటుంది కదూ! కేవలం రుచికోసమే పెట్టాడేమో దేముడు దీన్ని ఎముక మధ్యలో"

"కాదు" భార్గవ అన్నాడు. "ఎముక మధ్యలో నల్లగా, స్తబ్దుగా ఏ ప్రాముఖ్యతా లేనట్టు పడివుండే ఈ గుజ్జులాంటి పదార్థమే మనిషి జీవితాంతం బ్రతకటానికి కావల్సిన 'రక్తాన్ని' తయారుచేసి ఎముకల్లో వుండే సన్నటి రంధ్రాలగుండా శరీరంలోకి పంపిస్తుంది. ఈ 'మూలగ'నే ఇంగ్లీషులో MARROW అంటారు. శరీరంలో ఏ పదార్థం పాడయినా ఫర్లేదు కానీ ఈ 'మారో' పాడయితే మాత్రం మందులేదు"

శేఖరం చేతిలో ఎముక కంచంలో పడేసి. "ఈ క్షణమునుంచీ నేను మూలగ ముట్టనని శపథం చేస్తున్నాను" అన్నాడు. అందరూ నవ్వారు. ఇంతలో జిన్నీ నాలుక బయటపెట్టి "స్" అని అరిచింది. ఆ పిల్ల నాలుక ఎర్రగా ఉంది. భార్గవ కంగారు చూసి ప్రార్థన నవ్వుతూ "ఛెర్రిస్ డాడీ" అంది. "ఫ్రూట్‌సాలిడ్‌లో వేసే చెర్రీని పళ్ళమధ్య పెట్టుకుని నాలుకతో లాగితే రక్తంలా వస్తుంది. స్కూల్లో తనకి ఎవరో చెప్పారట. మొదట నేనూ కంగారుపడ్డాను."

జిన్నీ అందరివైపూ తాను తెలివైన దాన్నే కదా అన్నట్టు చూపింది. భార్గవ దాన్ని చివాట్లు పెట్టాడు. శేఖరం జిన్నీ తరఫున వాదించాడు. మొత్తానికి నవ్వుల మధ్య డిన్నరు పూర్తయింది.

అతడు వెళ్ళిపోయేసరికి తొమ్మిదయింది,

రాత్రి నిశ్శబ్దంగా ఆ గృహాన్ని తన బాహువుల్లోకి తీసు
టూంది.

చదువుతూన్న పుస్తకాన్ని పక్కనపెట్టి వళ్ళు విరుచుకుం
కుర్చీలోంచి లేచాడు భార్గవ. జిన్ని అతడితోనే పడుకుంటూంది. శ్రీ
ప్రార్థనకీ వేర్వేరు గదులున్నాయి. అన్ని గదుల్నీ కలిపే లింకు తెగి
అయిదు సంవత్సరాలయింది.

అతడు తన గదిలోంచి బయటకొచ్చాడు. కిటికీలోంచి పడే వె
పక్కమీద- ప్రార్థనమీద ఒకేలా విశ్లేషిస్తోంది. చూస్తుండగానే పన్నెండే
నిండాయి. ఇంకో అయిదారేళ్ళలో 'ఆడపిల్ల అయి వెళ్ళిపోతుంది. అ
గుండెల్లోనుంచి ఆర్ద్రతతో కూడిన ఆప్యాయత తన్నుకొచ్చింది. 
పక్కనే మోకాళ్ళమీద కూర్చున్నాడు. ప్రార్థన నిద్రపోలేదు. మెలకువ
వుంది. తండ్రిని చూసి నవ్వి మెడచుట్టూ చేతులు వేసి కళ్ళు మూసుకు
కూతురి నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు భార్గవ.

"డాడీ"

"ఊఁ"

"ఐ లైక్ యూ డాడీ"

"ఐ టూ- పమ్మా"

అతడు లేచి కూతురి మెడవరకూ దుప్పటి కప్పి, బయటకొ
నేడు. ప్రార్థన పైకప్పు కేసి, తిరిగే ఫానుకేసి చూస్తూ అలాగే 
పోయింది. ఆ అమ్మాయికెందుకో అప్రయత్నంగా నవ్వొచ్చింది. 
మధ్య ఇరుక్కున్న జెల్లీని నాలుకతో బయటకిలాగి, చిన్నపిల్లలా నా
బయటపెట్టి చూసుకుంది. ఎర్రగా వుంది. మళ్ళీ ఇంకొకసారి చేసి
మరింత ఎర్రగా.

నవ్వుకుంటూనే పక్కకి పత్తిగిల్లి పడుకుని, మరికొన్ని నిముషా
నిద్రలోకి జారుకుంది.

రక్తాన్ని ఘనీభవింప జేసే ప్లాస్మా సరీగ్గా లేకపోవటంవల్ల 
తరువాత చాలాసేపటివరకు ఆ అమ్మాయి చిగుళ్ళనుంచి రక్తం అ
స్రవిస్తూనే వుంది. ఒక పాయ నోటినుండి బయటకొచ్చి తలదిండు మీద
రెండు మూడు చుక్కలు రాలింది కూడా.

అంటే గుర్తొచ్చింది. ఈ రాత్రి డిన్నర్‌లో మాంసం వండించండి. నిర్మొహమాటంగా చెబుతున్నాను. పుట్టింది శోత్రియవంశమైనా నాన్ వెజిటేరియన్ అంటే చెవికోసుకుంటాను. అందులోనూ 'మటన్' అంటే...."

* * * *

డైనింగ్ టేబిల్ మధ్యలో పొగలు సెగలు కక్కుతున్న గిన్నెలో వున్న మాంసం కూర తాలూకు వాసన ఆ గది అంతా వ్యాపించి వుంది.

శేఖరం చిన్న ముక్కని నోట్లో పెట్టుకుని పీలుస్తూ "ఈ ఎముక లోపల వుండేదాన్ని ఏమంటారు" అని అడిగాడు.

శ్రీను "మూలగ" అన్నాడు, ఇంత చిన్న విషయం తెలీదా అన్నట్టూ.

"భలే రుచిగా వుంటుంది కదూ! కేవలం రుచికోసమే పెట్టాడేమో దేముడు దీన్ని ఎముక మధ్యలో"

"కాదు" భార్గవ అన్నాడు. "ఎముక మధ్యలో నల్లగా, స్తబ్దుగా ఏ ప్రాముఖ్యతా లేనట్టు పడివుండే ఈ గుజ్జులాంటి పదార్థమే మనిషి జీవితాంతం బ్రతకటానికి కావల్సిన 'రక్తాన్ని' తయారుచేసి ఎముకల్లో వుండే సన్నటి రంధ్రాలగుండా శరీరంలోకి పంపిస్తుంది. ఈ 'మూలగ'నే ఇంగ్లీషులో MARROW అంటారు. శరీరంలో ఏ పదార్థం పాడయినా ఫర్లేదు కానీ ఈ 'మారో' పాడయితే మాత్రం మందులేదు"

శేఖరం చేతిలో ఎముక కంచంలో పడేసి. "ఈ క్షణమునుంచీ నేను మూలగ ముట్టనని శపధం చేస్తున్నాను" అన్నాడు. అందరూ నవ్వారు. ఇంతలో జిన్నీ నాలుక బయటపెట్టి "స్" అని అరిచింది. ఆ పిల్ల నాలుక ఎర్రగా ఉంది. భార్గవ కంగారు చూసి ప్రార్థన నవ్వుతూ "ఛెర్రిస్ డాడీ" అంది. "ఫ్రూట్‌సాలిడ్‌లో వేసే చెర్రీని పళ్ళమధ్య పెట్టుకుని నాలుకతో లాగితే రక్తంలా వస్తుంది. స్కూల్లో తనకి ఎవరో చెప్పార్ట. మొదట నేనూ కంగారుపడ్డాను."

జిన్నీ అందరివైపూ తాను తెలివైన దాన్నే కదా అన్నట్టు చూసింది. భార్గవ దాన్ని చివాట్లు పెట్టాడు. శేఖరం జిన్నీ తరఫున వాదించాడు. మొత్తానికి నవ్వుల మధ్య డిన్నరు పూర్తయింది.

అతడు వెళ్ళిపోయేసరికి తొమ్మిదయింది,

# 4

"టాన్సిల్స్ అంటే ఏముంది? మూడు నాలుగు నిముషాలకన్నా ఎక్కువ పట్టదు తీసెయ్యటానికి" అన్నాడు పరీక్ష పూర్తిచేసి డాక్టర్.

"వచ్చేనెలలో డాక్టర్ రాబర్ట్సన్ వస్తున్నాడు. ఆయన నాకు బాగా స్నేహితుడు. ఆయనతో చేయిద్దాం" అన్నాడు కుర్చీలోంచి లేస్తూ భార్గవ. డాక్టరు అతనివైపు విస్మయంతో చూసి "ఈ చిన్న ఆపరేషన్‌కి అమెరికా డాక్టర్ రావాలా?" అన్నాడు.

"ఆయనేదో పనిమీద వస్తున్నాడు. నా పని అంటే మరింత ఆనందంతో చేస్తాడు" అంటూ డాక్టర్ చెప్పినదాన్ని సరిదిద్దాడు. డాక్టర్ కుర్చీలోంచి లేచి, "ఏమైనా ఇది మా ఇండియన్ డాక్టర్స్ అందరికీ అవమానకరమైన విషయం" అన్నాడు నవ్వుతూ. భార్గవ కూడా నవ్వి అతనికి షేక్ హేండిస్తూ "పోనీండి, మా అమ్మాయి పెద్ద అయిన తరువాత స్నేహితులందరికీ గర్వంగా చెప్పుకుంటుంది. నాకు చిన్నప్పుడు టాన్సిల్స్ వస్తే మా నాన్న అమెరికా నుంచి డాక్టర్‌ను తెప్పించాడు, అని" అంటూ కూతురివైపు తిరిగి "వెళదామా" అని అడిగాడు. ప్రార్థన కుర్చీలోంచి లేచి "గుడ్‌బై అంకుల్" అంది.

"గుడ్‌బై"

తండ్రీ కూతుళ్ళు వచ్చి కారులో కూర్చున్నారు. భార్గవ కారు స్కూల్‌వైపు పోనిచ్చాడు.

"డాడీ"

"ఊఁ"

—"హాయ్ డాడీ. వన్ మినిట్ డాడీ.... కారాపు" కంగారుగా అనటంతో భార్గవ సడన్‌బ్రేక్ వేశాడు. ప్రార్థన అద్దంపైనుంచి వెనక్కి చూస్తూ "మాటల్లోనే వస్తూంది, వసూ టీచర్" అని చప్పున డోర్ తీసు కొని దిగి రోడ్డుకి అటువైపు నున్న వసుమతిని పిలిచి, ఆమె చూడక పోవటంతో అటు పరుగెత్తింది. భార్గవ అటే చూస్తున్నాడు. పిల్లలకి టీచర్ రోడ్డు క్రాస్ చేయటం ఎలాగో చెప్పలేదా అనుకొంటూ.

ఈ లోపులో ప్రార్థన ఆమెని కారు దగ్గరికి తీసుకొచ్చి తను

మధ్యలో కూర్చుంటూ "రండి టీచర్" అని ఆహ్వానించింది. వసు
కూడా కూర్చున్నాక కారు కదిలింది.

"బావున్నారా" అడిగాడు భార్గవ. ఆమె తలూపింది. ఆ
కూర్చోవటం ఇబ్బందిగా వుంది. అప్పుడంటే పరిస్థితులు వేరు. ఇ
స్కూల్లో ఎవరయినా చూస్తే బావోదు. అందులోనూ శారద
చూసిందంటే మరీనూ. ఆమెకి ఆపరేషన్ చేసి యుట్రెస్ తీసేసి
మధ్య ఈ రకమైన పుకార్లు ప్రచారం చెయ్యటం ఎక్కువైంది.

"ఆ రోజు మీకు కృతజ్ఞతలు చెప్పుకోవడం మర్చిపోయా
అన్నాడు భార్గవ. ఆమె సిగ్గుపడుతూ "చేసిందేముంది. నిజానికి
డికే తీసుకొచ్చేస్తే సరిపోయేది. ఏదో సాధించే దాన్లా తెలివి తక్కు
అక్కడ ఆస్పత్రికి తీసుకెళ్ళి వర్షంలో చిక్కుపడిపోయేట్టు చేసా
అంది.

"చేసిన పని గురించి కాదు నేను అంటున్నది, పడిన క
గురించి. పిల్లలపట్ల ఎంతో అభిమానం వుంటే తప్ప ఆ కంగారు
ఇంతలో స్కూలు వచ్చింది. ముందు వసుమతి, తరువాత ప్ర
కారు దిగారు.

అంతలో మరియమ్మ అక్కడికి వచ్చింది. వసుమతి ఆవిడని
"ఎలా వుంది మరియమ్మా మీ అబ్బాయికి" అంది. ఏసుపాదాన్ని
రోజుల క్రితమే ఆస్పత్రిలో అడ్మిట్ చేసారు. అతనికి అకస్మా
ఎడమవైపు రొమ్ములో నొప్పి వచ్చి క్లాసులోనే విలవిల లాడుతూ
పోయాడు. ఆస్పత్రిలో రకరకాల పరీక్షలు చేసి అక్కడే వుండాల
ఆ రోగం పేరేమిటో మరియమ్మకు సరిగ్గా అర్థంకాలేదు. కా
మాత్రం చాలా పెద్ద రోగమని తెలుసుకుంది. ఆ వయసులో ఆవి
లన్నీ కొడుకుమీదే. అందులోనూ వాడూ అల్లరిచిల్లరగా తిరిగేవాడు
అటువంటివాడు ఒక్కసారిగా ఆస్పత్రి పాలయ్యేసరికి ఆవిడ తట్టు
పోతూంది. స్కూలువాళ్ళు, ఇంటి చుట్టుప్రక్కలవాళ్ళు చందాలు
కొని ఇస్తున్నారు. క్లాసుపిల్లలు కూడా తలా కొంత తెచ్చి ఇచ్చారు.
అవి ఏ మూలకి?

వసుమతి ప్రశ్నకి సమాధానంగా "అలాగే వుందమ్మా! అబ్బా
చాలా నీరసించిపోయాడు" అంది మరియమ్మ చేతులు నులుముకుం

వసుమతి భార్గవవేపు తిరిగి, "మీరేమైనా చెయ్యగలరా? మీరూ డాక్టరేగా" అని అడిగింది.

"ఉహూ. నేను డాక్టర్ని కాదు, కానీ చెప్పండి- ఏమిటి సంగతి?" అన్నాడు భార్గవ అసలు విషయం తెలియక.

"మా క్లాస్‌మేటు ఏనుపాదం దాడి! తనకి నాకే ఫస్టుమార్కులు.... చాలా మంచవాయి" అంది ప్రార్థన తిల్పించుకుని. వసుమతి జరిగింది చెప్పింది. భార్గవ మరియమ్మవేపు సానుభూతితో చూస్తూ "నాకు తెలిసిన వాళ్ళు ఒకరిద్దరు ఆస్పత్రిలో వున్నారమ్మా. తప్పకుండా కనుక్కుంటాను" అన్నాడు. ఆ కొద్దిపాటి సానుభూతికే ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ చేతులు జోడించి, "నిన్నూ, నీ పిల్లాపాపల్ని ప్రభువు రక్షిస్తాడు. నీ మేలు మేము మర్చిపోము" అంది.

అంతలో వసుమతి భయపడినంతా జరిగింది. శారద వాళ్ళని చూసి, ఏమీ పనిలేకపోయినా, ఏదో పని వున్నట్టూ అక్కడికి వచ్చింది. వసుమతి మరి తప్పనట్టూ "మన ప్రార్థన తండ్రి, డాక్టర్ భార్గవ" అంది. ఆమె పరిచయం పూర్తికాలేదు —

"నమస్తే డాక్టర్‌గారూ! నాకు వంట్లో అసలు బావోటం లేదండీ, రెండ్రోజులనుంచీ దగ్గూ ఆయాసం...."

భార్గవ కారు తలుపు చప్పుడయ్యేలా వేసుకుని "నేను డాక్టర్‌ను కాను. సారీ" అని స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు. వసుమతి వస్తున్న నవ్వుని ఆపుకుంది. ప్రార్థన క్లాసుకి వెళ్ళిపోయింది. శారద వసుమతితో కలిసి నడుస్తూ "పరాయి మొగవాళ్ళతో మాట్లాడేటప్పుడు మనం ఇలాగే మన రోగాల గురించి మాట్లాడాలమ్మాయ్. అప్పుడు వాళ్ళకి మనమీద దృష్టి వుండదు" అంది. మగవాళ్ళ బారినుంచి తప్పించుకోవటానికి ఆవిడ కనుక్కున్న కొత్త థియరీ బాగానే వుంది కానీ, నల్లగా లావుగా పొట్టిగా వుండే ఆవిడకి ఈ ఆయుధపు అవసరం ఎందుకు వస్తుందో వసుమతికి అర్థంకాలేదు.

* * * *

భార్గవ తన ఛాంబర్‌కి వెళ్ళేసరికి ఎమ్.డి. నుంచి పిలుపు వచ్చిం దని చెప్పారు. సాధారణంగా శంకర్‌లాల్ ఎవరినీ పిలవడు ఎంతో పని

వుండే తప్పు. సైంటిస్టులు డిస్టర్బ్ కాకూడదు. ఇంత ప్రొద్దున్నే తన
పిలవటానికి కారణం ఏమై వుంటుందా అనుకుంటూనే భార్గవ అత
గదిలోకి ప్రవేశించాడు.

లోపల చాలా చల్లగా వుంది. కాళ్ళక్రింద తివాచీ మెత్తగా తగు
తూంది. శంకర్‌లాల్ రివాల్వింగ్ కుర్చీలో కూర్చుని వున్నాడు. భార్గవ
చూడగానే "ప్లీజ్ కమిన్. రండి" అన్నాడు. భార్గవ వెళ్ళి కూర్చున్నాడు.

"ఎలా వుంది మీ పరిశోధన" ఇంగ్లీషులో అడిగాడు.

"నడుస్తూంది" అన్నాడు భార్గవ. ఎక్కువ మాట్లాడటం అతని
అలవాటులేదు. శంకర్‌లాల్ ఎందుకు పిలిచాడా అని అతడు ఆలోచిస్తు
వున్నాడు.

"మీకొక గుడ్‌న్యూస్ భార్గవా! ఈ సంవత్సరం మీకు పద్మ
లభించబోతూంది. కానీ- ఈ విషయాన్ని కాస్త రహస్యంగా వుంచ
అన్నాడు నవ్వుతూ- "మీ పేరు నేను రికమెండ్ చెయ్యబోతున్నా
నూటికి తొంభై శాతం వచ్చేసినట్టే...."

తొంభై శాతం కాదు, అతడు రికమెండ్ చేస్తే నూటికి నూరుశా
వచ్చేసినట్టే. సైన్సుకి సంబంధించినంతవరకూ దేశంలో కొందరు ప్రము
'ఎవరిని' రికమెండ్ చేస్తే వారికి ఈ బిరుదుల్ని ఇస్తుంది ప్రభుత్వం.

"కానీ నేను కొత్తగా చేసిందికానీ, కనుక్కున్నది కానీ ఏమీలే
అన్నాడు భార్గవ. లాల్ వెంటనే- "అందుకే అడిగాను మిస్టర్ భార్గ
మీరు ప్రస్తుతం చేస్తున్న పరిశోధన ఎంతవరకూ వచ్చిందీ- అని."

భార్గవ నవ్వి-

"జీవకణాన్ని వైరస్ ఎలా నాశనం చేస్తుందో చిన్న కథల
చెప్పుకోవచ్చు. వైరస్ వంట్లో ప్రవేశించగానే, దానికీ లోపలి జీవకణా
మధ్య యుద్ధం జరుగుతుంది. వైరస్‌గానీ ఈ పోరాటంలో గెలిస్తే
జీవకణాన్ని స్వాధీనం చేసుకుని అక్కడ తానే స్వయంగా తన వైరస్
ఉత్పత్తి చేయటం ప్రారంభించటం మొదలుపెడుతుంది. ఒక క
రెండుగా చీలటానికి బదులు మూడొందల అపాయకరమైన కణాల
చీలిపోవటం ప్రారంభిస్తుంది.... అదే కేన్సర్ అని కొందరి భావం.

"శరీరంలో ఒక వైరస్ అణువు మూడువందల అపాయకరమై
కణాల్ని సృష్టించే సమయానికి ఒక అంటీ బాడీని (వ్యతిరేకపదార్థాని

అదే శరీరంలోకి ఇంజెక్టు చేస్తామనుకోండి, ఏమవుతుంది? ఏ శక్తి జీవాన్ని తయారు చేస్తుందో మనకు తెలియదుగాని- ఆ వున్నాడో లేడో తెలియని దేవుని ఫార్ములాని అనుసరించే ఆ వ్యతిరేక శక్తికూడా శరీరంలోకి అభివృద్ధి చెంది, వైరస్‌తో పోరాడుతుంది. కేన్సర్ నిరోధానికి నేను కనుక్కోబోతున్న మందు అదే...."

శంకర్‌లాల్ బిగ్గరగా నవ్వుతూ, "భలే బావుంది భార్గవా! ఈ కథ ఏ చందమామకైనా పంపండి. చాలా బావుంటుంది" అన్నాడు.

విజయభార్గవ మొహం ఎర్రగా కందిపోయింది. అతికష్టంమీద తనని తాను నిగ్రహించుకున్నాడు. ఈ లోపులో లాల్ అన్నాడు-

"డాక్టర్ భార్గవా! నేను మిమ్మల్ని పిలిచిన విషయం సూటిగా చెప్తాను వినండి. కాన్స్-క్యూర్ మందు కనిపెట్టబడి పది సంవత్సరాలు కావొస్తూంది. పోటీ ఉత్పత్తిదారులు దీనిమీదకు నెమ్మదిగా వస్తున్నారు. మన ఇన్‌స్టిట్యూట్ ఇంకో మందు తొందర్లో సామ్సన్ అండ్ సామ్సన్ కంపెనీకి ఇవ్వాలి. దాన్ని మీరు కనుక్కోవాలి. కనుక్కోగలరు కూడా. వెంటనే ప్రయత్నించండి."

అన్యాపదేశంగా అతడు చెపుతున్నది అర్థమయింది. "మీరు కనుక్కోండి- మీకూ పద్మశ్రీ ఇప్పించే బాధ్యత నాది" అంటున్నాడు.

భార్గవ నవ్వి "నేనూ ఆ ప్రయత్నం మీదే వున్నాను. కానీ అదంత సులభం కాదు" అన్నాడు.

"మీరనే యాంటీ-మాటర్ థియరీ గురించి కాదు నేను అడుగుతున్నది. మీరు కనుక్కోవలసింది కేవలం నల్వా-3 ని మాత్రమే" అంటూ నవ్వాడు.

నల్వా-2 పాతబడింది కాబట్టి ఇంకో పేరుతో అదే మందు తన పరిశోధనా ఫలితంగా మార్కెట్‌లోకి రిలీజ్ చెయ్యాలి. దీనికి మోహన్ లాల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కాన్సర్ రిసెర్చి కొత్త ముద్ర వేస్తుంది. దాన్ని ప్రభుత్వం ఆమోదిస్తుంది.

అతడు లేచి నిలబడి, "మీరు చెప్పవలసింది ఇంకేమైనా వుందా?" అని అడిగాడు.

"అదికాదు భార్గవా...."

"మీరు చెప్పవలసింది ఇంకేమైనా వుందా" శాపీగా అన్నా శంకర్‌లాల్ మాట్లాడలేదు. భార్గవ లేచి "వెళ్ళొస్తాను" అన్నాడు. శం లాల్ వాడిపోయిన మొహంతో అతడివేపే చూడసాగాడు. భార్గవ కొచ్చేసేక, ఇంటర్‌కమ్ నొక్కి సెక్రటరీతో, "డాక్టర్ భార్గవ పెర ఫైలు ఒకసారి పంపించు" అన్నాడు.

భార్గవ తన హాల్లోకి వచ్చేశాడు. అతడి మనసు చికాగ్గా కానీ మరుక్షణమే అతడు తన పరిశోధనలో మునిగిపోయాడు. ఒకసా లోకంలోకి వెళ్తే అతడు మామూలు మనిషి కాడు. ఈసారి ఎలుకల వెంటనే చచ్చిపోయాయి. ఇన్‌స్టిట్యూట్ చేసే కుందేళ్ళ సప్లయ్ తక్కు అదో చికాకు.

అతడు ఆ రోజు పని కట్టేసేసరికి అయిదయింది. అప్పుడు జ్ఞా వచ్చింది మరియమ్మ చెప్పిన సంగతి. ఆస్పత్రికి ఫోన్‌చేసి పాత మిత్ర పలకరించి, అబ్బాయి విషయం అడిగాడు. "చాలా పెద్దపని పెట్టు ననుకో. కానీ ఆ ముసలావిడని చూస్తే జాలేసింది. కాస్త ఎంక్వయి చెప్పు, పన్నెండేళ్ళ కుర్రవాడు. పేరు ఏసుపాదం. ముందు చూడాలనుకుంటా. రేపు మళ్ళీ ఫోన్ చెయ్యనా–"

"పేరు ఏసుపాదం కదూ"

"అవును"

"కొద్దిగా కుంటుతూ వుంటాడు"

"అనుకుంటా"

"చూడక్కర్లేదు. అతడు నా వార్డులోనే వున్నాడు."

"ఏమిటి కంప్లెయింట్?"

"సారీ భార్గవా! అతడిది ఎడ్వాన్స్‌డ్ స్టేజీ ఆఫ్ లింఫో లుకేమియా"

భార్గవ చేతిలోంచి ఫోన్ జారిపోయింది. మనసంతా చికా భావన. ఆ కుర్రవాడిని అతడు చూడను కూడా లేదు. కానీ....కానీ...

మరియమ్మ దీనవదనం కళ్ళముందు కదలాడింది. ప్రొద్దున్నే ఆశీర్వదించింది- "నిన్నూ, నీ పిల్లల్ని ప్రభువు చల్లగా చూస్తాడు బా అని.

ప్రభువు!!

ఒక చిన్నారి గులాబీ పూర్తిగా విచ్చుకోకముందే దాని రేకుల్ని నిర్దాక్షిణ్యంగా నలిపివేసే దారుణమైన కాన్సర్‌ని సృష్టించింది ఆ ప్రభువే అయితే అతడి చల్లదనం నా కక్కర్లేదు.

# 5

కొన్ని కొన్ని సంఘటనల ప్రభావం మనిషి మీద విపరీతంగా వుంటుంది. పర్సు జేబులో పెట్టుకోవడం మర్చిపోవడంవల్ల రైలుమిస్సయి ఆ రైలుకి తరువాత అక్సిడెంటవ్వచ్చు. కేవలం పర్సువల్ల మనిషి రక్షింపబడవచ్చు.

ఒక సిటీబస్సు ఎక్కబోయి, ఆ డ్రైవరు ఆపక ఇంకో బస్సు ఎక్కవలసివస్తే, అందులో చిన్నప్పుడు తెలిసిన అమ్మాయి కనబడి ఆ పరిచయం వివాహానికి దారితీసి జీవిత గమనాన్నే మార్చెయ్యవచ్చు. ఇలాటి ఉదాహరణలు ఎన్నో.

ఆ రోజు సాయంత్రం టీచర్స్ రూములో వసుమతితో పాటూ డ్రాయింగ్ టీచర్ పద్మావతి, శారద కాక మరో ఇద్దరు టీచర్లు కూర్చుని వున్నారు. అయిదున్నరయింది. చీకటి పడబోతూంది.

పద్మావతి టీచర్ పుస్తకాలు ఎక్కువ చదువుతుంది. అందులోనూ ఇంగ్లీషు నవలలు మరీను. ఆ రోజు పేపరు బల్లమీద వుంటే యధాలాపంగా తీసి చూస్తూ 'అరె' అంది. అందరూ అటు చూసేరు.

"ఐయాన్ రాండ్ పాసెస్ అవే" అంది హెడ్డింగ్ చదువుతూ.

"ఐయాన్ రాండ్ ఎవరు?" అని అడిగాడు ఒక డ్రాయింగ్ టీచర్.

"ఫౌంటెన్ హెడ్ అని, ఒక గొప్ప నవల రైటర్"

ఎవరూ మాట్లాడలేదు. ఆ వార్తతో పద్మావతి బాగా డిస్టర్బ్ అయినట్టూ ఆమె మొహమే చెపుతుంది. ఆమె అంటే అందరికీ గౌరవమే. ఎవరి విషయాల్లోనూ జోక్యం కల్పించుకోకుండా ఒక మూల కూర్చొని పుస్తకం చదువుకోవటమో, తనపని తాను చేసుకోవటమో చేస్తూ వుంటుంది. తనలో తానే ఆలోచిస్తున్నట్టూ ఆమె అంది.... "చాలా గొప్ప రైటర్, సూదో కమ్యూనిస్టుల్ని దుయ్యబడుతూ నిలబడ్డ ఒకే ఒక రైటరు."

శారద ఎందుకో తెలీదు కాస్త ఇబ్బందిగా కదిలింది.

"ఫోటో చూశాను. అరవై ఏళ్ళ వయసులో కూడా మొహ
ఒక ధీమా...పర్సనాల్టీ వున్నాయి. ఆ స్టైయిల్ మామూలు వాళ్ళకి
క్రితం సంవత్సరం మనదేశం రావటం జరిగిందట. అది నిజమో
తెలీదు కానీ మన ఎయిర్ పోర్ట్‌లో ఒక అరగంట ఆగినప్పుడు చాలా
అభిమానులు వెళ్ళి చూశార్ట కూడా."

శారద చప్పున "క్రితం సంవత్సరం ఎప్పుడు?" అని అడి
పద్మావతి ఆమెవైపు అనుమానంగా చూస్తూ "క్రితం వేసవిలో"

"ఆఁ! నాకు తెలుసు. నా ఫ్రెండ్ రమ్యంటే నేనూ వె
అంది. అందరూ ఆమెవైపు ఇంటరెస్టింగ్‌గా చూశారు. ఉన్నట్టుండి
ప్రాముఖ్యత అక్కడ పెరిగింది.

"చాలా మందేమీ రాలేదు. ఓ పదిమందిదాకా వుంటాం."

"ఏదీ ఐయాన్ రాండ్ వచ్చినప్పుడా?" విస్మయంగా అడి
పద్మావతి.

"ఐయాన్ రాండే! మీరంతగా పొగిడే పర్సనాల్టీ అతడిలో
కనబడలేదు. అఫ్‌కోర్స్! మీరు కేవలం ఫోటోలు చూశారు కాబట్టి
పోతున్నారు... నేను చూశాను, మాట్లాడాను కూడా. అసలు అంద
లోనూ నన్నూ, నా ఫ్రెండ్‌నీ గుచ్చి గుచ్చి చూశాడు. నా ఫ్రెండ్‌కి
గ్రాఫ్ ఇస్తున్నప్పుడు వేళ్ళు నొక్కాడట కూడాను."

"ఎవరి సంగతి మీరు చెప్తున్నది? ఐయాన్ రాండ్ సంగతా?"

"అవును, ఆ మహాశయుడి సంగతే. ఫౌంటెన్ హెడ్ సంగ
కింకా జ్ఞాపకం. ఆ నవల మీరెందుకు వ్రాశారు అని అడిగాను.
అమ్మాయిల అభిమానం సంపాదిద్దామని- అన్నాడు లేకిగా"
ఆనాడు జరిగిన సంఘటన జ్ఞాపకం చేసుకుంటూ శారద. మి
టీచర్లు ఇద్దరూ శారదవైపు అడ్మిరేషన్‌తో చూస్తున్నారు. ఐ
రాండ్‌ని ఆకర్షించటం అంటే సామాన్యమైన విషయం కాదు. అందులో
ఆమె చెపుతున్న విషయం మరింత ఇంటరెస్టింగ్‌గా వుంది. ప్ర
ప్రఖ్యాతి గాంచిన ఒక ప్రముఖ వ్యక్తి బలహీనతతో తనకున్న అతి
సంబంధం గురించి.

"మీరు చెపుతున్నది ఐయాన్ రాండ్ గురించేనా?"

"ఆహాఁ? మా ఫ్రెండ్ ఆటోగ్రాఫ్‌లో అతడేం వ్రాశాడో తెలుసా? 'నాకు మూడు అన్న నెంబర్ అంటే చాలా యిష్టం. సిరాక్ హోటల్ మూడు పదాల పేరున్న హోటలు.... మూడొకట్లు నా రూమ్ నెంబర్. నా మూడో నవల బాగా పాపులరయింది. దాన్ని మధ్యాహ్నం మూడింటికి ప్రారంభించాను' అని వ్రాశాడు. మేం అందులో అర్థం అంత గ్రహించలేం అనుకున్నాడు కాబోలు. ఆ రోజు మూడింటికి ఫోన్ చేశాం. హుషారుగా మాట్లాడబోయాడు. తల వాచేటట్టూ చివాట్లు పెట్టాం ఫోన్ లోనే. నాకు యింకా జ్ఞాపకం వుంది.... అదీ ఐయాన్ రాండ్ చరిత్ర."

"కానీ ఐయాన్ రాండ్ మొగవాడు కాదే. ఆమె ఒక రచయిత్రి...."

ఆ గదిలో బాంబు పేలినట్టయింది. ఇంకా ఏదో చెప్పబోతున్న శారద నోరు సగం తెరిచింది అలాగే వుండిపోయింది. గదంతా నిశ్శబ్దమై పోయింది.

ఒక్కసారి వసుమతి బిగ్గరగా నవ్వబోయి, అతికష్టంమీద ఆపుకుంది. అయినా తెరలు తెరలుగా నవ్వు వస్తూంటే చేతిరుమాలు అడ్డు పెట్టుకుంది. శారద ఆమెవైపు కోపంగా చూడబోయింది. పద్మావతి తన పుస్తకాలు సర్దుకొని ఆమె దగ్గిరకివచ్చి నిలబడి తాపీగా, "కొందర్ని చూస్తే కోపం వస్తుంది. కొందర్ని చూస్తే అసహ్యమేస్తుంది.... మరికొందర్ని చూస్తే మొహంమీద ఉమ్మెయ్యాలనిపిస్తుంది. మిమ్మల్ని చూస్తే మాత్రం నాకు జాలేస్తుంది" అనేసి అక్కణ్ణుంచి విసవిస వెళ్ళిపోయింది.

నవ్వుతో ఎర్రబడ్డ తన మొహం కనిపించకుండా వసుమతి తల దించుకుంది. ఏమీ తోచనట్టూ శారద అటూ ఇటూ చూసి ఆ గదిలోంచి బైటకొచ్చేసింది. ఆట స్థలమంతా నిర్మానుష్యంగా ఉంది. పిల్లలు ఇళ్ళకి వెళ్ళిపోయారు. కసి, ఉక్రోషం కలగలుపుగా ఆమె నల్లటి మొహం మరింత వికృతమైంది. అత్త తిట్టినందుకుగాక తోటికోడలు నవ్వినందుకు అన్న సామెత అక్షరాల వర్తించినట్టూ ఆమెకి వసుమతిమీద పీకెలదాకా కోపం వచ్చింది. నేలమీద పడివున్న బొగ్గు తీసుకొని విరిగిన గోడమీద బరబరా వ్రాసింది.

'వసుమతి + భార్గవ రాసక్రీడ = జూనియర్ ప్రార్థన' అని.

ఆమె తను వ్రాసిన అక్షరాల వైపు పైశాచిక ఆనందంతో చ
సుంది. తననెవరూ గమనించటం లేదుకదా అని మళ్ళీ ఇంకో
చుట్టూ చూసి, సంతృప్తి చెంది, అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. ఆ
వాత అరగంటకు వసుమతి స్కూల్‌నుంచి ఇంటికి బయలుదే
అప్పటికే చీకట్లు దట్టంగా అలుముకోవటం వల్ల గోడమీద రాతలు ఆ
కనపడలేదు.

స్కూల్‌కి దూరంగా ఒక చిన్న గదిలో ఒంటరిగా వుంటు
ఆమె. ఆ గదిలో సామాన్లు కూడా ఏమీలేవు. గోడమీద మాత్రం,
తరువాత ఒకరుగా వెళ్ళిపోయిన తండ్రి, తమ్ముడు, చెల్లి, తల్లి ఫో
వున్నాయంతే.

గదికి వచ్చి ఫ్లాస్కులో వున్న టీ తాగి, పిల్లల ఎక్సర్సై
పుస్తకాలు ముందేసుకుని కూర్చుంది. ఆమె పుస్తకాలు దిద్దటం పూ
చేసేటప్పటికి టైమ్ ఎనిమిదయింది. మరీ ఆలస్యంచేస్తే బావోదని
తయారయి బయల్దేరింది.

ఆ రోజే ప్రార్థనా, ఆమె తండ్రి వసుమతిని భోజనానికి పిలి
ఆమె వెళ్ళేసరికి ప్రార్థన ముందు వరండాలో నిలబడి చూస్తూ
టీచర్‌ని చూడగానే ఉత్సాహంగా మెట్లు దిగుతూ "రండి టీచర్" అ
వసుమతి గేటు తెరుచుకుని లోపలికి ప్రవేశించింది.

చుట్టూ బాగా ఖాళీస్థలం వున్న ఇల్లు అది. ఖాళీలో వు
మొక్కలు సరయిన పోషణ లేక అస్తవ్యస్తంగా పెరిగినా, అదో
మైన శోభనిచ్చినయ్. 1910 సంవత్సరపు కట్టడం అది. క్రింద పో
మేడ అయినా పై రెండు గదుల మీదా పెంకులున్నాయి. కప్పు
ఎత్తుగా వుండటంవల్ల హుందాగా వుంది. పైన గోడ అక్కడక్క
పెచ్చులూడిపోయినా అంతగా పట్టించుకోలేదు భార్గవ. ఇంటి పక్క
పైకి చెక్కమెట్ల కట్టడం వుంది. బ్రిటీషు కాలంనాటి కలెక్టరాఫీసు
వుంటుంది ఆ ఇల్లు. ఈ రకమైన వాతావరణం అంటే భార్గవకు చా
యిష్టం.

"చాలాసేపట్నుంచి చూస్తున్నాను టీచర్ మీ కోసం" అ
ప్రార్థన. ఆ పాపకి టీచర్ తమ మాట మన్నించి ఇంటికి రావ

ప్రెసిడెంట్ సాధారణ స్నేహితుడి ఇంటికి వచ్చినట్టు వుంది. వసుమతి జిప్సీని దగ్గరికి తీసుకుంటూ "ఎంతమంది చెల్లెళ్ళు నీకు?" అనడిగింది.

"మేమిద్దరమే టీచర్. శ్రీనూ కూడా మాతోనే ఉంటాడు" అంది ప్రార్థన.

"శ్రీనూ ఎవరూ?"

ఆమె వళ్ళో కుందేలు పిల్లలా కూర్చొని వున్న జిప్సీ కదలకుండానే "....పాటూ నీళ్ళలాగా మా జీవితాల్లో పెనవేసుకుపోయిన శ్రీనూ నాకు దావ. ఏ శక్తీ మమ్మల్ని వేరుచెయ్యలేదు" అంది. ఒక్కసారిగా వళ్ళో బాంబు పడినట్టూ వసుమతి ఆ మాటలకి బెదిరి జిప్సీవైపు చూసింది.

ప్రార్థన ఆమె కంగారు గుర్తించి, "భయపడకండి టీచర్! జిప్సీ, శ్రీనూ అప్పుడప్పుడు అలానే మాట్లాడతారు" అంది.

"అప్పుడప్పుడా" అంది అయోమయంగా వసుమతి.

"అవును టీచర్, వారానికి రెండు మూడు రోజులు అలా మాట్లాడు తుంటారు. తర్వాత మళ్ళీ మామూలుగా అయిపోతారు. కారణం తెలీదు. డాడీ డాక్టర్‌కి చూపించారు కూడా, అయినా తగ్గలేదు"

"డాడీ ఏరీ?"

తొందర తొందరగా మాట్లాడుతున్న ప్రార్థన ఒక్కసారిగా ఆగి ఆ ప్రశ్నకి జవాబు చెప్పటానికి తటపటాయిస్తూ "ఇంకా రాలేదు" అంది. వసుమతికి కూడా ఇది ఇబ్బందికరమయిన పరిస్థితే- విందుకు పిలిచిన హోస్టు ఇంట్లో లేకపోతే గెస్టు వచ్చి కూర్చోవటం- కానీ ఆమె వెంటనే, ప్రార్థన పరిస్థితిని గమనించింది. తన రాకవల్ల ఆ చిన్నపిల్ల మొహంలో కనపడిన సంతోషం, తండ్రి లేకపోవటంవల్ల పడుతున్న ఇబ్బందీ- అన్నీ చూడగలుగుతూంది. ఒక టీచర్‌గా పిల్లల మనస్తత్వాన్ని చదవగలగటం ఆమెకు కష్టమేమీ కాదు. తనే ఆ పరిస్థితి నుంచి ఆ పిల్లల ఆలోచనను మార్చటానికి ప్రయత్నిస్తూ, "నాకు మీ ఇల్లు చూపించరా ఏం?" అనడిగింది. ఆమె ట్రాప్‌లో వాళ్ళు సరిగ్గానే పడ్డారు- ముగ్గురూ ఉత్సాహంగా "రండి టీచర్, రండి" అని అన్ని గదులూ చూపించారు.

వసుమతికి తన గది జ్ఞాపకం వచ్చింది. ఈ పిల్లలు వా
కతో, క్రమశిక్షణతో తమ చేతనయినంతలో ఈ యింటిని అ
తీర్చిదిద్దుతున్నారు. చాలా మంచి పిల్లలు. కాని ఎక్కడో ఏదో
స్తూంది. ఆ లోపాన్ని నిస్తేజంగా వున్న ఆ గదుల గోడలూ, ప
చెప్తున్నాయి.

"డాడీ వచ్చేసరికి ఆలస్యం అవుతుందేమో, మనం భోజన
ద్దామా" అంది ప్రార్థన.

సాధ్యమయినంత వరకూ పెద్దమనిషి తరహా ఆ ఇంటి
తలు స్వీకరించటానికి ఆ పన్నెండేళ్ళ పాప చేసే ప్రయత్నాలు
వుంటే వసుమతికి లోలోపల నవ్వొస్తూంది. దాన్ని కనపడని
"ప్రతిరోజూ ఇలాగే అవుతూంటుందా?" అనడిగింది.

"అవుతూ వుంటుంది. ఎప్పుడైనా మరీ అవసరం అవు
ఫోన్ ఇవ్వరు."

"డిన్నర్ అవుతుందనేమో"

"ఫోన్ చెయ్యనా"

"ఊహూ. వద్దు వద్దు" అంది వసుమతి. "మీరు చేసె
భోజనం. నేను ఉంటాను"

ప్రార్థన ఒప్పుకోలేదు. కానీ మరో అరగంట గడిచేసరికి
ఆగలేకపోయింది. ముగ్గురికీ వడ్డించింది వసుమతి.

"కూరలో కొంచెం ఉప్పు తక్కువైంది జీన్నీ" అన్నాడు
భారంగా.

"నన్నపార్థం చేసుకోకు శ్రీనూ. నీ జ్ఞాపకాల్లో వరి ఉప్పు లే
మర్చిపోయి వుంటాను."

"నేనంత దుర్మార్గుణ్ని కాదు జీన్నీ...."

"అంత త్యాగాన్ని నేను భరించలేను శ్రీనూ! నేను ముత్త
గానే నన్ను ఈ లోకంనుంచి వెళ్ళిపోనీ"

ప్రార్థన అరచేతిలోనికి సీతు తీసుకొని వాళ్ళిద్దరి తలమీద
మర్ధించినట్టూ మర్ధించింది. వసుమతి అదిరిపోయి వాళ్ళవైపు చూడసా
వారానికి రెండ్రోజుల పాటూ వీచే ఈ గాలి ఏమిటో ఆమెకి అర్థంకా

అంతలోనే పిల్లల భోజనాలు పూర్తయ్యాయి.

రాత్రి తొమ్మిదిన్నరయింది. పిల్లలు నిద్రకు జోగసాగారు. వసుమతి ఇప్పుడు నిజంగా ఇరకాటంలో పడింది. "నేను వెళతాను, మళ్ళీ ఇంకొకసారి వస్తాను" అంది.

"వద్దు టీచర్, ప్లీజ్" అంది అర్థిస్తున్నట్టు. "డాడీ వచ్చేస్తూ వుంటారు. ఇంత ఆలస్యం ఎప్పుడూ చెయ్యలేదు. బహుశా ఏదో మీటింగ్ వుండి వుంటుంది"

* * * *

మీటింగు జరిగి, మెట్లు దిగుతూంటే, శేఖరం అన్నాడు.

"నేను జీవితంలో భయపడేది మూడింటికే గురూగారూ! అందులో ఒకటి, మైకు పట్టుకుని వదలని మనిషి"

"మిగతా రెండూ ఏమిటి?"

"రెండోది పందికొక్కు"

భార్గవ నవ్వాపుకొని "....పందికొక్కా" అనడిగాడు.

"అవును. చిన్నప్పుడు నిద్రపోతూంటే నా కాలి చిటికెన వేలు కొరికింది. అప్పట్నుంచీ అదంటే భయం"

"....మూడోది"

"మ్మ్మ్మ్మ్మ్.... మూడోది చెప్పక తప్పదంటే చెపుతాను. స్త్రీ అంటే అందరూ కాదు, దేవంజాతి స్త్రీ"

భార్గవ విస్మయంతో "పద్మినీజాతి వగయిరా వుందని తెలుసు కానీ దేవంజాతి వుందని నేనెక్కడా వినలేదే...." అన్నాడు.

"ఉంది గురూగారూ ఉంది. తన గురించి సెల్ఫ్‌పిటీతో ఎప్పుడూ ఆలోచిస్తూ— అందరూ ఎప్పుడూ తన గురించే మాట్లాడుకుంటున్నారని దురభిప్రాయపడే స్త్రీలని దేవంజాతి స్త్రీలు అంటారు. తమ కాంప్లెక్స్ నుంచి బయటపడాలని ఇతరుల సానుభూతిని కోరుతూ వుంటారు వీరు. ఉదాహరణకి మీరు 'రాముడు చాలా గొప్పవాడు. పితృవాక్య పరిపాలనా దక్షుడు. బ్రతికితే రాముడిలా వ్యక్తిత్వంతో పదిరోజులు బ్రతికినా చాపున్ను. సీతని అడవులకి పంపించటం ఒక్కటే అతను చేసిన తప్పు' అన్నారనుకోండి. ఆ రాముడి దగ్గరికి పీక్కు పనిగట్టుకుని వెళ్ళి ఫలానా అన్నాదత్తుల సోమశేఖరం మీ గురించి ఏం అన్నాడో తెలుసా రాముడు గారూ?

'మీరు సీతని అడవులకి పంపటం మీకు వ్యక్తిత్వం లేకపోవ
సూచిస్తుందట. పితృవాక్యాన్ని ఎంత గొప్పగా అమలు జరిపారో,
చాకలివాడి మాటని కూడా మీరు అంత గొప్పగానూ అమలు
శారట' అంటారు. అలా అనేసి రాముడి సానుభూతి పొంద
చూస్తారు. ఇలాంటి మనుష్యుల మొహంలో ఎప్పుడూ జాలితో
నవ్వు వుంటుంది. కళ్ళు విచారంగా, సాడిస్టిక్‌గా వుంటాయి.
పాలిటీ ప్రకారం ఇలా దేగకళ్ళనూ, పందికొక్కు పళ్ళనీ సంతరించు
స్త్రీలని 'దేవంజాతి స్త్రీలు' అంటారు...."

భార్గవ నవ్వాపుకోలేక "నువ్వు ఎప్పుడూ సీరియస్‌గా ఆలోచి
శేఖరం?" అనడిగాడు.

"పొరపాటు పడుతున్నారు గురూగారూ! సీరియస్‌గా ఆలో
టము వేరు, సీరియస్‌గా వుండటం వేరు. సీరియస్‌గా ఆలోచించే
ఎప్పుడూ నవ్వుతూ వుండకూడదని రూలేంలేదు."

"కానీ నువ్వు కేవలం స్త్రీలనే దుయ్యబట్టటం బావోలేదు. పురు
దేవంజాతి వాళ్ళు లేరనా?"

"ఎందుకు లేరూ? తప్పకుండా వున్నారు. కానీ వీళ్ళని '
కాన్' జాతి పురుషులంటారు"

"దయో–కానా? అంటే?"

"డయోరియా ఆఫ్ స్పీచ్.... కానిస్టిపేషన్ ఆఫ్ థాట్"

మళ్ళీ నవ్వులు. శేఖరం అన్నాడు– "మన చంపాలాల్
చెందినవాడే. ఏదో మీ పని మీరు చేసుకుపోతుంటే మీ గురించి
చారం చెయ్యవలసిన అవసరం ఏముంది చెప్పండి? నా వుద్దేశ్యం
దయోకాన్ పురుషుడి సంపర్కంవల్ల దేవంజాతి స్త్రీకి పుట్టిన
ఉంటాడు"

భార్గవ మొహంలో నవ్వు మాయమైంది. బాధాపూరిత స్వ
అన్నాడు– "అవును, నేనూ వింటున్నాను. నా థియరీని హేళన
అందరి దగ్గరా అంటున్నాడట కదా"

శేఖరం మాట్లాడలేదు.

"కెమిస్ట్రీకి సంబంధించిన అణువు (ఆటం) జీవశాస్త్రానికి

రించిన అణువు (సెల్)కి ముడిపెట్టటం హాస్యాస్పదమైన విషయమే. కానీ సైన్సులో మనకు తెలిసినంతవరకూ ఏదీ హాస్యాస్పదం కాదు....

....ఇక్కడ నేను చెప్పేది ఎవరూ అర్థం చేసుకోవటానికి ప్రయత్నము చెయ్యటంలేదు. వైరస్ అయినా, క్రోమోజోము అయినా ఏది అయినాసరే అణువులతోనే నిర్మితమై వుండాలి కదా- ఇనుము, ఉదజని, ఆమ్లజని, కార్బియం ఏదయినాగానీ వీటితోనే జీవకణం ఏర్పడి ఉండాలి. జీవకణానికీ, మరణించిన కణానికీ గల భౌతికమైన తేడా ఇంకా శాస్త్రజ్ఞులు కనుక్కోలేదు. జీవకణపు అణువుల్లో వున్న ప్రోటాన్లూ, ఎలక్ట్రాన్లలో ఏదయినా దారుణమైన మార్పు జరిగి వుండాలి, లేదా అణువుల స్థానభ్రంశమైనా జరిగి జీవకణం చచ్చిపోయి వుంటాయి. జీవకణంలో ఎక్కడో మధ్యలో సూక్ష్మాతిసూక్ష్మమైన మార్పు చాలు దాన్ని చంపి వేయటానికి అన్నది నిర్వివాదాంశం! అది కనుక్కుంటే మహమ్మారిలా వ్యాపిస్తూన్న ఈ కేన్సర్‌ను నాశనం చేయవచ్చు. కణాల వ్యాప్తిని నిరోధించవచ్చు. అదే కేన్సర్‌కి మందు.

అసలు మరణం అంటే కణపు అణువుల్లో జరిగే ఇంటర్ చేంజా? అన్నది. దీన్ని తెలుసుకోవటానికి ఇప్పటికి రెండొందల కుందేళ్ళనీ, వెయ్యికి పైగా ఎలుకల్నీ చంపాను గానీ రహస్యం బోధపడ లేదు" అంటూ నవ్వాడు విషాదంగా. "....ఈ పరిస్థితుల్లోనే నాకు కొద్దిగా ఓదార్పు కావాలి. కొద్దిగా ఓదార్పు— నేనున్నాననే ఒక స్నేహితుడూ...." అంటూ శేఖరం చేతిమీద చెయ్యివేసి "నువ్వు నా పక్కనుంటావా శేఖరం? ఐ యామ్ బాడ్లీ ఇన్ నీడ్ ఆఫ్ సమ్ వన్ లైక్ యూ" అన్నాడు. శేఖరం కదిలిపోయి "తప్పకుండా" అన్నాడు ఆర్ధ్రత నిండిన కంఠంతో.

ఏదో తెలియని ఆత్మీయ భావంతో యిద్దరూ కొద్దిసేపు మాట్లాడ లేదు. చీకటిలో రోడ్డు నల్లత్రాచులా మెరుస్తూంది. వాతావరణాన్ని తేలిక చేస్తూ శేఖరం "అయితే మీరు నాకు స్నేహితుడూ, బ్రదరూ కాదు" అన్నాడు.

"మరి?"

"డాడీ"

భార్గవ తెప్పున అరిచినంత పనిచేసి "వ్హాట్" అన్నాడు.

"అవును. ప్రార్థన 'అన్నయ్యా' అంది కాబట్టి మీరు మా
డాడీ అన్నమాట. ఊరందరికీ మరదలు అంటారే- అలాగే ఊరి
తండ్రి అన్నమాట."

భార్గవ ఇబ్బందిగా.... "నాకు ఇంకా నలభై నిండలేదు
అన్నాడు.

"ఇంకేం మరీ మంచిది. కంగ్రాచ్యులేషన్స్ నాన్నగారూ!
నాకు మంచి పార్టీ ఇవ్వాలి. చెప్పండి ఈ రోజే ఇస్తారా?"

"ఏమిటి?"

"డిన్నర్"

హఠాత్తుగా ఏదో స్ఫురించినట్టూ భార్గవ కారు సడెన్‌బ్రే
"మైగాడ్ మేమామెని డిన్నర్‌కి పిలిచాం.... ఈ రోజే—" అంటూ
చూసుకున్నాడు కంగారుగా.

* * * *

"మీరు నన్ను క్షమించారని తెలుసు. కానీ ఇంకొకసారి
తున్నాను. అసలు నేను చేసిన పని తలుచుకుంటూంటే నాకే
వుంది. అతిథి నింటికి పిలిచి నేను లేకపోవటం—"

"మీరు దాన్ని గురించి మర్చిపోరా ఏం?" అంది వసుమ
గిన్నె అతడివేపు జరుపుతూ. ఆమె చాలా ఇబ్బందిపడిన మాట
శ్రీనూ, జిన్నీ ముందే నిద్రపోయారు. ప్రార్థన చాలాసేపటివరకు
కువగా వుండటానికి ప్రయత్నించి సోఫాలోనే నిద్రపోయింది.
వాత వసుమతి ఒక్కతే అంత పెద్ద ఇంట్లో తనని భోజనానికి
మహాశయుని కోసం ఇబ్బందిగా ఎదురు చూడసాగింది. ఆమెకి
రాలేదు- కానీ చాలా ఇబ్బందికరంగా వుండింది. ఆ ఇబ్బందికన్నా
రాగానే మొదలుపెట్టిన క్షమాపణల పరంపర మరింత ఇబ్బందికర
భార్గవ కారు శబ్దం వినపడగానే ఆమె ప్రార్థనని నిద్ర లేప
ప్రయత్నించింది- కానీ ఆ పాపకి నిద్రాభంగం కలిగించటం ఇష్టం
యింది. దాంతో ఆ ప్రయత్నం విరమించుకుంది.

ఇది జరిగిన పది నిముషాలకు ప్రార్థనకి మెలకువ వచ్చింది.
డైనింగ్ రూమ్‌కి వస్తూంటే తండ్రి కంఠం వినిపించింది. ఆమె అ
ఆగి చూసింది.

డైనింగ్ టేబిల్ దగ్గర భోజనం చేస్తూన్న వాళ్ళిద్దరి మీదకు బయట్నుంచి వెన్నెల జల్లులా పడుతూంది. ప్రార్థనకి ఆ దృశ్యమెంతో అపురూపంగా తోచింది. ఆ దృశ్యంలో గొప్పతనమేమీ లేదుగాని, లేని వాళ్ళకే తెలుస్తుంది ఆ గొప్పతనం! తన చిన్న ప్రపంచంలో తనకి అందరికన్నా ఇష్టమైన ఇద్దరు వ్యక్తులు తన పరోక్షంలో అలా స్నేహితుల్లా దగ్గర దగ్గరగా కూర్చుని మాట్లాడుకోవడం ఆ పాపకి చాలా నచ్చింది. చప్పుడు చెయ్యకుండా వెనక్కి వెళ్ళి తన ప్రక్క చేరుకుంది. ఆ తరువాత టీచరు వెళ్ళటానికి ఉద్యుక్తురాలై తన గదిలోకి వచ్చినప్పుడు కూడా నిద్రనే నటించింది.

.............

"మీరు నన్ను క్షమించాలి."

"మీరింకోసారి అలా అంటే నేను నిజంగా క్షమించను" కాస్త చొరవ తీసుకుని అన్నది వసుమతి. ఆమె స్వతహాగా ఎక్కువ మాట్లాడదు. కానీ అతడూ తన 'టైపే' అవటంతో ఆమె బిడియం తగ్గింది.

కారులో ఆమెని డ్రాప్ చేస్తున్నాడు అతడు.

"మీరెప్పుడూ ఇలాగే ఆలస్యంగా వస్తారా?" అని అడిగింది.

"ఉహూ. పని లేకపోతే తొందరగా యింటికి వచ్చేస్తాను. కానీ సాధారణంగా 'లాబ్'లో ఆలస్యం అవుతూ వుంటుంది" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. ఆమె అలా అకస్మాత్తుగా మౌనం వహించేసరికి అతడు విస్మయం చెంది, "ఏమిటాలోచిస్తున్నారు?" అడిగాడు.

"ఆ పిల్లల గురించి...."

అతడు మరింత ఆశ్చర్యంతో, "వాళ్ళ గురించి ఏముంది?" అని అడిగాడు.

"ఏమీలేదా?" ఆమె విషాదంగా నవ్వింది. "—ఇరవై సంవత్సరాల క్రితం నేనూ యిలాగే వున్నాను- ఇంట్లో బిక్కు బిక్కుమంటూ ఆలస్యంగా వచ్చే తండ్రి కోసం ఎదురుచూస్తూ. మీకు చిన్నపిల్లల మనస్తత్వం గురించి చెప్పేంత పెద్దదాన్ని కాదు. మీ ప్రపంచంలో అంతా సైంటిస్టులూ, మేధావులూ, గొప్పవాళ్ళు వుండవచ్చు. కానీ మీ చిన్న పిల్లల ప్రపంచంలో అంతా తమ తల్లిదండ్రులే! నా తండ్రి తన జీవితమంతా ప్రపంచం కోసమే అన్నట్లు తిరిగాడు. అదో గొప్ప త్యాగమను

కున్న భ్రమలో కుటుంబానికి ఎప్పుడూ ఏమీ చెయ్యలేదు. నా అ
చెపుతున్నాను భార్గవగారూ! ఎంత తపించిపోయే వాళ్ళమో మే
తరువాత అదే కోపంగానూ, అయిష్టంగానూ మారింది ఆయనపట్ల
దాన్ని సంస్కరిస్తున్నానన్న భ్రమలో కవిత్వం రాస్తూ కుటుంబాన్ని
పోయిన ఆయన. చివరి క్షణాల్లో కుటుంబ సభ్యుల సానుభూతే
పోయాడు...."

ఎందుకో తెలీదు కానీ ఆమెకి దుఃఖం వచ్చింది. బహు
తాలూకు జ్ఞాపకాలు కల్గించిన దుఃఖం కావొచ్చు. అతికష్టంమీద
యించుకుని "..అంత దయనీయమైన పరిస్థితి ఎవరికీ రాకూడదు.
మీకు చాలా చిన్న విషయంగా కనబడవచ్చు, కానీ ఆ కో
ఆలోచిస్తే.." అనబోతూంటే భార్గవ కల్పించుకుని, "అర్థమైంది" అ
ఆమె తలెత్తి చూసింది.

"రేపట్నుంచి ఆరింటికే వస్తాను ఇంటికి."

ఆమెకి నవ్వొచ్చింది. "ఇదే మా ఇల్లు, ఆపండి" అన్నది.
ఆగేక, ఆమె దిగి తన ఇంటివైపు నడిచింది.

అతడు కారు రివర్స్ చేస్తున్నాడు. అతడి దృష్టి
పడింది. అప్రయత్నంగా దాన్ని స్పృశించాడు. కారు కుదుపుకి
నెమ్మదిగా అటూ ఇటూ వూగుతూంది.

## 6

పెండ్యూలమ్‌లా వూగుతున్న వైరు వైపు చూస్తున్నారు
అతడి ముందో టీకరు వుంది.

1952లో అమెరికన్ సైంటిస్టు స్టేన్లీ మిల్లర్ చేసిన ప్ర
అది. ఇంకా జరుగుతూనే వుంది.

భూమి పుట్టిన కొన్ని కోట్ల సంవత్సరాలకి, తదేకమైన
రశ్మి సోకి యెక్కడో సముద్ర గర్భంలో ఒక జీవకణువు
వుండవచ్చు. అప్పుడు విశ్వంలో హైడ్రోజన్, హీలియం, ఆ
నియాన్, సిలికాన్, కార్బన్, ఒరన్, సల్ఫర్, ఆర్గాన్ తప్ప
లేవు.

ఒక చిన్న టీకరులో, భూమి పుట్టినప్పుడు ఏ వాతావరణం

అదే వాతావరణాన్ని సృష్టించి. నియాన్, ఆక్సిజన్ లాటి వాటిని అందులో వుంచి, అగకుండా శక్తిని పంపుతూ వుంటే ఈ మూల పదార్థాల ద్వారా 'జీవం' సృష్టింపబడుతుందా అన్న ప్రయోగం అది.

"సర్"

ఆలోచన్ల నుంచి చెదిరి అతడు పక్కకి తిరిగాడు.

"మీకు ఫోన్ కాల్"

అతడు ఆశ్చర్యపోయాడు. తనకి ఎంతో అవసరమయితే తప్ప ఫోన్స్ రావు, అందులోనూ తనకి!

వెళ్ళి అందుకొని "హలో" అన్నాడు.

అంతే. ఆ కంఠం గురించే చూస్తున్నట్టూ అవతల్నుంచి ఒక్కసారి ఏడుపు వినిపించింది. అది ప్రార్థనది. "....నాన్నా.... తొందరగా రా నాన్నా! వచ్చెయ్యి తొందరగా" అని ఫోన్ పెట్టేసింది. అతడు స్తబ్దుడయ్యాడు.

అతడినే చూస్తున్న శేఖరం "ఏమైంది" అని అడిగాడు.

"ఏమో తెలీదు. ప్రార్థన స్కూల్ నుంచి ఫోన్ చేసింది. ఏడుస్తోంది" అని బయటకు పరుగెడుతూ "నువ్వూ వస్తావా.... ప్లీజ్...." అన్నాడు.

ఇద్దరూ పది నిముషాల్లో స్కూలు చేరుకున్నారు. గేటు దగ్గిరే ప్రార్థన బిక్కమొహంతో నిలబడి వుంది. దూరంగా నలుగురు కుర్రాళ్ళు ప్రహరీ గోడనే చూస్తూ నవ్వుకుంటున్నారు.

ఆ గోడమీద అక్షరాల్ని చూస్తూనే విజయభార్గవ మొహం అమితమైన కోపంతో ఎర్రబడింది. ఆతికష్టంమీద తనని తాను తమాయించుకున్నాడు. తనే ఇంత షాక్ అయితే.... ఆమె?

"ఏదీ మీ టీచర్?"

"ఏడుస్తూ ఇంటికి వెళ్ళిపోయింది డాడీ."

అతడు కారు ఎక్కి సర్రున పోనిచ్చాడు. శేఖరాన్నిగానీ కూతుర్నిగానీ పట్టించుకోలేదు.

శేఖరం కూడా వెళ్ళిపోతూన్న భార్గవని పట్టించుకోలేదు. గోడమీద అక్షరాల్నే చూస్తూ "ఎవరు ఇది వ్రాశారో తెలిసిందా?" అడిగాడు.

"ఊహూ లేదు. హెడ్ మిస్ట్రెస్ పీటీని చెరిపిస్తానన్నారు. కానీ...."

కానీ...." ఆ పాప ఏడుపు ఆపుకోలేకపోయింది. అతడు ఆమెని రుస్తున్నట్టూ దగ్గిరకు తీసుకొని గోడవైపు మళ్ళీ ఇంకొకసారి చూ చూసి, ప్రార్థనవైపు తిరిగి, మీ స్కూల్లో కథలు వ్రాసేవాళ్ళు ఎ వున్నారా?" అని అడిగాడు.

ఆ స్థితిలో కూడా ప్రార్థన ఆశ్చర్యపోయి, "మా శారద వుంది.... ఏం?" అని అడిగింది.

శేఖరం మాట్లాడలేదు ఆలోచనల్లో పడ్డాడు. భార్గవ ప్లస్ ప రావక్రీడ=జూనియర్ ప్రార్థన.

ఈజీక్వల్టు అన్నదాన్ని గుర్తుగా వేసిన వాళ్ళు ప్లస్‌ని అ ఎందుకు వ్రాస్తారు? ప్రింటింగ్‌లో ప్లస్ అంత బావోదని సాధా అలా వాడతారు. అలా వాడేవారు రచయితలైనా కావాలి, లేకపో టింగ్ గురించి బాగా తెలిసినవాళ్ళై వుండాలి. స్కూల్లో మొద వుండటానికే ఎక్కువ ఛాన్సు వుంది.

"శారద టీచర్ అంటే ఎవరికీ పడదు. తనే వ్రాసి వుంటు

"మనం అంత తొందరగా ఒక నిర్ధారణకి వచ్చేయ్యకూడదు హాండెడ్‌గా పట్టుకోవాలి. చిన్న నాటకం ఆడదాం పద. ఆ దేవంజా దూరంనుంచే నాకు చూపించు."

ఇద్దరూ టీచర్స్ రూమ్‌వైపు బయల్దేరారు. ప్రార్థన కూడా త మూడ్ నుంచి బయటపడి పూర్వపు ఉత్సాహం తెచ్చుకుంది.

టీచర్స్ రూమ్‌కి కాస్త అవతల ప్రార్థనని నిలబెట్టి, శేఖర లికి వెళ్ళాడు. గదిలో ఒక మూల ఇంకెవరో టీచర్ పని చేసుకుం మధ్య టేబిల్ దగ్గిర శారద ఒక్కర్తే వున్నది.

"నమస్తే, నా పేరు ఎస్. ఎన్. బత్తుల. మాది కన్నడి అన్నాడు. "మీ కథలు చదువుతూ వుంటాను. చాలా బావుంటాయి."

శారద అమితమైన ఆనందంతో బాధపడుతున్న దాన్లా న నిజానికి ఆమె కథలు వ్రాసినవి యాభయ్ - ప్రచురితమైనవి అయి

"మీ కథలు కన్నడంలోకి అనువదించాలనుకుంటున్నాను. మీ పర్మిషన్ కావాలి. మీకు యాభై శాతం రాయల్టీ ఇస్తాను"

శారద మొహం సంతోషంతో వెలిగిపోయింది. "తప్పకుం శేముందండీ?" అంది.

"మీ కభ్యంతరం లేకపోతే అనుమతి ఉత్తరం వ్రాసిస్తారా?"

శారద నోట్ బుక్‌లోంచి కాగితం చింపి, "ఏం వ్రాయమంటారు?" అనడిగింది.

"నా నవల్ని శ్రీ యస్. యస్. బత్తుల కన్నడంలోకి అనువదించటానికీ, 'రాసక్రీడ' అనే పేరుతో పుస్తక రూపంలో ప్రచురించటానికి అనుమతి ఇవ్వటమైంది"

అతడు చెపుతూంటే ఆమె వ్రాసి సంతకం పెట్టి ఇచ్చింది. "థాంక్స్" అన్నాడు. అతడు లేస్తూ "మీలాగే మీ సంతకం కూడా అందముగా వుంది. కంగ్రాట్స్! మీ ఆటోగ్రాఫ్ జీవితాంతం ఉంచుకుంటాను."

ఆమె ముసిముసిగా సిగ్గుపడి "థాంక్స్" అంది.

"నెలరోజుల్లో పుస్తకం పూర్తవగానే వచ్చి కలుస్తాను. అంతవరకూ కలవ" అని బయటకు వచ్చేసాడు. అతడి చేతిలో ఆమె రాసిన కాగితం వుంది. గోడమీద వ్రాసింది ఆవిడే అన్నది నిర్ధారణ అయిపోయింది. ఆమె అతడికి వ్రాసి యిచ్చిన అనుమతి పత్రంలో 'రాసక్రీడ' అని వుండాల్సినచోట స్పష్టంగా 'రాసక్రీడ' అని వ్రాసి వుంది.

* * * *

"ప్లీజ్ ఏడవకండి" అన్నాడు భార్గవ ఇబ్బందిగా. ఆ సైంటిస్టుకి ఆడవాళ్ళు ఏడుస్తూంటే ఏం చేయాలో తెలీదు.

వసుమతి ఇంకా వెక్కుతూనే వుంది.

అనునయిస్తున్నట్టూ.... "ఇలాంటి సమయాల్లోనే మీరు ధైర్యం తెచ్చుకోవాలి. ఇంత చిన్న విషయంమీద రాజీనామా చేసేస్తారా? లక్ష మంది లక్ష అనుకుంటారు. ముందు ఆ గోడమీద అంత దారుణంగా వ్రాసింది యెవరో కనుక్కోనివ్వండి. వాణ్ణి హైడ్రో క్లోరిక్ ఆసిడ్‌లో ముంచెయ్యకపోతే నా పేరు భార్గవ కాదు" అన్నాడు.

* * * *

"వ్రాసిందెవరో కనుక్కున్నాం అంతటితో అయిపోలేదు. మీ టీచర్ నాకు తెలీదు కానీ, భార్గవ మాత్రం చాలా సెన్సిటివ్. ఏదో రకంగా సర్ది చెప్పాలి" అన్నాడు శేఖరం.

ప్రార్థన కాస్త టైములోనూ బాగా తేరుకుంది. టీచర్ గురించీ, తండ్రి గురించీ గోడమీద చూసేసరికి ఆ పాప ముందు బాగా బెదిరిపోయి

ఏడవటం ప్రారంభించినా, శేఖరం పక్కనుండటంతో కొంతంత
వచ్చిపడ్డట్టయింది.

"నాదే తప్పు, టీచర్‌ని నాన్న డిన్నర్‌కి పిలిచాడని
చెప్పాను. ఈ సంగతి శారదా టీచర్‌కి తెలిస్తే ఇలా వ్రాసి
అంది ప్రార్థన.

"భార్గవ మీ వసుమతిగార్ని డిన్నర్‌కి పిలవనే లేదా?"

"ఊహూ. నాన్నకి ఎలానూ జ్ఞాపకం వుండదని నేనే,
కలిసి పిలిచామని టీచర్‌కి చెప్పాను."

"నీ తెలివి తగలెయ్య– ఎందుకు పిలిచావు?"

"ఎందుకంటే.... ఎందుకంటే...." తడబడింది ప్రార్థన.
టీచర్‌ని యింటికి పిలిస్తే బావుంటుందనిపించింది."

"ఇంకేముంది డిన్నరయ్యాక ఈయన ఆవిడని కా
పెట్టటం ఆ దేవంజాతి స్త్రీ చూసి వుంటుంది. దాంతో ఉక్రోషం
ఇలా వ్రాసి ఉంటుంది...."

* * * *

"ఆ వ్రాసిన వాళ్ళెవరో నా కారులో మీ బొమ్మచూసి
ఆపుకోలేక ఇలా వ్రాసి వుంటారు" అన్నాడు భార్గవ. వసు
స్తిమితపడింది. కానీ ఇంకా విచారంగానే వుంది- "కారులో బొ
మేమిటి?" అనడిగింది అర్థంకాక.

"మీరిచ్చిన బొమ్మని ప్రార్థన నా కారులో కట్టిందిగా
చూశ్నేదా?"

ఆమె విస్తుపోయి.... "నేను బొమ్మను యివ్వడం ఏమి
బొమ్మ ప్రార్థన తయారుచేపించదే. నేనిచ్చానని చెప్పింది. ఎం
అంది.

"మీరిచ్చారని అంటేగాని కట్టుకోనని అనుకున్నదేమో!
ఇంత అర్థం వుందని నేను అనుకోలేదు సుమా! దాన్ని చూసి
'ఎంత బావుంది ఈ బొమ్మ' అనుకునేవాడిని...." అని, కొంచెం
"....అలా అనుకున్నప్పుడల్లా మీరే గుర్తు వచ్చేవారు" అన్నాడు

* * * *

"ఎప్పుడూ తనే గుర్తొస్తుంది నాకు. తనతో కబుర్లు చెప్పాలనీ, తను మా ఇంటికి మాటిమాటికీ రావాలనీ అనిపిస్తుంది. అందుకే డిన్నర్ అని అబద్ధమాడేను" చెప్పుకుంది ప్రార్థన.

"ఒక్కదానికేనా? జెస్సికీ, శ్రీనూకి కూడా అలానే అని పిస్తుందా?"

"మా అందరికీ"

"అలా అయితే మన మోహన్ని చెయ్యొచ్చు"

"ఏమిటి?"

దానికి సమాధానం చెప్పకుండా శేఖరం గంభీరంగా "ప్రోటాను చుట్టూ ఎలక్ట్రాన్లు తిరిగితే అది అణువు అవుతుంది. అమ్మాయి చుట్టూ అబ్బాయి తిరిగితే అది ప్రేమ అవుతుంది" అన్నాడు.

ప్రార్థన బిక్కమొహంవేసి "నాకు భయమేస్తుంది. ఏమీ అర్థం కావటంలేదు" అంది.

* * * *

"నాకేమీ అర్థంకావటంలేదు" అంది వసుమతి.

తనన్న మాటలకు ఆమెలో అణువిచ్ఛేద సిద్ధాంతం, న్యూటన్ మూడోచలన సూత్రంలాంటి రియాక్షన్స్ ఏమీ రాకపోయేసరికి భార్గవ మరింత ధైర్యంచేసి గొంతు సర్దుకుని.... "విశ్వం అనంతం కాదు, పరిమితం కాదు వసుమతిగారూ! అయితే దానికి అవధులు లేవు. అదే ఐన్‌స్టీన్ కనిపెట్టిన సాపేక్ష సిద్ధాంతం" అన్నాడు.

వసుమతి తెల్లమొహం వేసి "మీకేమైనా మతిపోయిందా" అనబోయి నాలిక కరుచుకుంది. భార్గవ ఆమె మొహంలో భావం చూసి బుర్ర గోక్కుని "ఇదేమిటి? 'అపేక్ష' సిద్ధాంతం చెప్పబోయి సాపేక్ష సిద్ధాంతం చెప్పాను" అనుకున్నాడు.

* * * *

"ఇందులో అర్థంకాకపోవటానికి ఏమీలేదు. సైంటిస్టులు మన భాషలో మాట కూడా సరిగ్గా చెప్పలేదు. మనమే సాయపడాలి. లేకపోతే అపేక్ష సిద్ధాంతం చెప్పబోయి సాపేక్ష సిద్ధాంతం చెప్పేస్తారు" అన్నాడు శేఖరం.

"అపేక్ష సిద్ధాంతం ఏమిటి?"

"ప్రేమ అనంతంకాదు. పరిమితం. అయితే దానికి అ
అదే అన్నాబత్తుల సోమశేఖరం కనిపెట్టిన ఆపేక్ష సిద్ధాంతం.
గురుత్వాకర్షణ శక్తిలాగే ప్రేమాకర్షణ శక్తికాదా! స్త్రీ పు
తమతమ ద్రవ్యరాసుల గుణలబ్దానికి (అమంగళం అప్రతి
గాక) అనులోమ నిష్పత్తిగల, తమ మధ్య దూరం స్క్వేర్కి
నిష్పత్తి ఫోర్సుతో ఆకర్షించుకుంటారు. దూరం సున్నా అయితే
ఇన్ఫినిట్ అవుతుంది"

ప్రార్థన అతడి మొహంలోకి తేరిపార చూసి, "నీకు
దన్నయ్యా" అంది.

"పిచ్చికాదు. ఆ దేవంజాతి స్త్రీని చెప్పుతో కొట్టి బు
చెయ్యాలంటే మనందరం, అంటే నువ్వూ, నేనూ, జిప్సీ, శ్రీ
ఒక మహత్తరమైన పనికి పూనుకోవాలి. ఈ శుభకార్యంలో
మొగపెళ్ళి తరపువాట్నా, నేనేమో ఆడపెళ్ళి తరపువాడినీ అ
ఇది చాలా క్లిష్టమైన పనే అనుకో. కాని మనందరం తల్చుకుంటే
కానిదేముంది, మరి సంప్రదింపులు ప్రారంభిద్దామా...."

మొదట ప్రార్థనకి అర్థంకాలేదు. క్రమక్రమంగా అర్థ
ఆ పాప మొహం ఆనందంతో విచ్చుకుంది!!

* * * *

ఇది జరిగిన వారం రోజులకి టీచర్స్ రూమ్లో వసుమతి
కార్డులు పంచుతూ శారద దగ్గరి కొచ్చి తనకీ ఒకటి అందించింది

"ఏమిటిది?"

"వచ్చేనెల పదో తారీఖున ముహూర్తం"

"దేనికి?"

"జూనియర్ ప్రార్థన చట్టబద్ధంగా ఈ భూమ్మీదకు రా
పెళ్ళి అనే మంగళప్రదమైన రాసక్రీడ తాలూకు ముహూర్తం.
మీరు తప్పక రావాలి. ప్లీజ్...." అన్నది. ఆమె మొహం
రంగుల్ని పరిశీలిస్తూ.

మొదట పెద్ద చప్పుడు. తర్వాత బుసకొట్టిన శబ్ద
వినిపించాయి. మొదటి శబ్దం శారద స్థూలకాయం కుర్చీలో ప
వచ్చింది. రెండోది బి.పి. ఎక్కువయి ఆవిడ తీసే ఊపిరిపల్లి

# రెండు

రాత్రి పన్నెండింటికి.... చీకటి దట్టంగా అలుముకొని వున్న ఆ ప్రదేశంలో ఒక చిన్న కదలిక— చెత్తా చెదారం మధ్యనుంచి అటూ ఇటూ చెదిరి- ఒక చిన్న తల బయటికి వచ్చింది.

ఆ తర్వాత ఆ చెత్తలోంచి దాని శరీరం పూర్తిగా బయటికి వచ్చింది. అప్పుడు దాని ఆకారం చూస్తే ఎవరికైనా వళ్ళు గగుర్పొడుస్తుంది. చిన్నసైజు బావురుపిల్లిలా వుందది. శరీర పరిమాణానికి ఏ మాత్రం పొందికలేని చిన్నతల— మధ్యలో సన్నగా చీలిన నోరులాంటి ప్రదేశం నుంచి పై పెదవి కండరం కాస్త పైకి వెళ్ళగానే కనపడే రంపం లాంటి కోరలు. ఇవి కాదు భయపెట్టేవి.... దాని కళ్ళు.

అప్పుడే ఎగరటం నేర్చుకుంటున్న పక్షిపిల్ల ఒకటి, కొత్తగా నడక నేర్చుకున్న ఉత్సాహంలో గాలిలో ఎగిరి తల్లిదండ్రుల్నించి దూరమయి రెక్కల్లో శక్తి వున్నంతవరకూ ఎగిరి ఎగిరీ- జాలిగా అరుస్తూ ఆకాశంలోంచి టప్పుని నేలకు జారిపోయి ఆ కుప్పమీద పడింది.

ఆ నిశ్శబ్దంలోంచి తిరిగి చిన్న కదలిక.

అపాయాన్ని పసిగట్టిన పక్షిపిల్ల లేవలేక కదల్లేక నిస్సహాయంగా చూసింది.

కసుక్కుమంటూ రెండు పళ్ళు దాని లేత శరీరంలోకి దిగాయి.

ఆ శరీరం కొద్దిసేపు కొట్టుకోవటానికి విఫల ప్రయత్నం చేసి, తర్వాత అచేతనమయింది.

* * * *

"ఎప్పుడు పెట్టుకుందాం ఆపరేషన్?" రాబర్ట్సన్ కుర్చీలోంచి ముందుకు వంగుతూ అన్నాడు.

భార్గవ వాచీ చూసుకొని, "ఇరవై ఎనిమిదో తారీఖునైతే బావుంటుంది" అన్నాడు.

"గుడ్. బై దిబై నీ మ్యారేజి ఎప్పుడన్నావ్?"

"పదో తారీఖు"

"సారీ, అంతవరకూ వుండలేకపోతున్నాను"

"నేనే సారీ చెప్పాలి సీను. సరదాగా మా దేశం వచ్చి
స్వార్థంతో పని చెపుతున్నాను. ఒకోసారి నా ఆలోచన్లు నా
అనిపిస్తాయి"

"పదిహేను నిముషాల ఆపరేషన్ కోసం నువ్వు నన్నేరి
దిలో పెట్టినట్టు మాట్లాడతావేం? ఇక ఆ సంగతి ఆలోచించటం
మనకు కావల్సిన ఆపరేషన్ థియేటర్ చూడు"

"చూసేను. గ్రాండ్స్ నర్సింగ్‌హోమ్, ఈ ఊళ్ళోకెల్లా అ
మైనది. ఇరవై ఎనిమిదో తారీఖు సాయంత్రం బుక్ చేసేను"

"గుడ్" అంటూ లేచాడు రాబర్ట్‌సన్. భార్గవ కూడా లేచి
న్డాడు. వయసు, విజ్ఞానం తెచ్చిన హుందాతనం, దానికితోడు
పొడవూ. రాబర్ట్‌సన్ ప్రక్కనే పొడవైన భార్గవ పొట్టిగా కనబడుత

"గుడ్, ఒకరోజు టైము వుంటుంది కదా. వచ్చిన
ప్రిలిమనరీస్ అవీ చూసుకుందాంలే...." ఇద్దరూ కారు దగ్గర
న్నారు. (ఆపరేషన్‌కి ముందు చేసే పరీక్షల్ని ప్రిలిమనరీస్
షేక్‌హాండిస్తూ రాబర్ట్‌సన్ నవ్వాడు- "నాకే గమ్మత్తుగా వుం
కాలం తర్వాత టాన్సిల్స్ ఆపరేట్ చెయ్యబోతున్నాను"

భార్గవ నవ్వలేదు. అతడికి మొహమాటంగా వుంది.
హుషారులో మిత్రుడిని అడిగేసేడు కానీ ఇప్పుడు సిగ్గుపడుతు
ప్రపంచంలోకెల్లా మొదటి ముగ్గురు ప్రముఖ సర్జన్లలో ఒకరైన రా
ఇంత చిన్న పనికి ఆహ్వానించటం....

* * * *

"ఆపరేషన్ అయ్యాక ఆ అమెరికన్ డాక్టర్ రెండ్రోజు
పోతే ఫర్లేదా" అనుమానం వెలిబుచ్చింది వసుమతి.

"ఆపరేషన్ అయ్యాక పదినిమిషాల్లో వెళ్ళిపోయినా ఫర్లే
ఐస్‌క్రీం తినిపించి యింటికి తీసుకొచ్చెయ్యొచ్చు. అంత చిన్న
యిది"

"ఐస్‌క్రీం ఎందుకు?"

"గొంతులో రక్తం తొందరగా అరికట్టబడటానికి"

వసుమతి ఏదో చెబ్దామనుకొని మళ్ళీ మానేసి, "ఆపరేష
రోజంతా ఆస్పత్రిలో వుండాలా?" అని అడిగింది.

"అసలు దానికి ఆపరేషన్ అన్నంత పెద్ద పేరే అనవసరం. ముందురోజు మామూలుగా స్కూలుకి వెళ్ళవచ్చు కూడా"

"మీరు ముందురోజే క్యాంప్‌నుంచి వచ్చేస్తారుగా"

"వచ్చేస్తాం. ఏం?"

వసుమతి ఊరిస్తున్నట్టూ "మీరొచ్చిన రోజు చెప్తాను. ఆ సాయంత్రం ఏ ప్రోగ్రాం పెట్టుకోకండి" అంది.

"ఏమిటి?"

"ఉహూ– తర్వాత చెప్తానన్నాగా. మీరు అసలు వూహించలేరు, అంతా నేనే స్వయంగా చేస్తున్నాను. మీరు చూస్తే అదిరిపోతారు"

భార్గవ నవ్వి "నీ నోటివెంట ఆ మాట వినటం చాలా గమ్మత్తుగా వుంది" అన్నాడు.

ఆమె అర్థంకాక, "ఏ మాట" అంది.

"అదిరిపోవటం.... అన్నమాట. అది స్త్రీ శరీరానికి సంబంధించిన మాట అనీ, సాధారణంగా మొగవాళ్ళే ఉపయోగిస్తారనీ అనుకుంటున్నాను"

ఆమె సిగ్గుపడి, చిరుకోపంతో "మీరు మీ సోమశేఖరం మాటలు బాగా వంటబట్టినట్టున్నాయే" అంది. భార్గవ నవ్వేడు. ఆమె అతడి చేతిమీద చెయ్యివేస్తూ "మర్చిపోకండేం. మళ్ళీ ఆ సాయంత్రం ఏ ప్రోగ్రామో ఉందని దాటెయ్యవద్దు" అంది.

"అంత ముఖ్యమైనదా 'నీ' ప్రోగ్రాం"

"ఆఁ, మనిద్దరి జీవితాల్లోనూ చాలా ముఖ్యమైనది"

"ఏమిటి"

"ఉహూ, ఇప్పుడు చెప్పను"

* * * *

ఇరవై ఏడో తారీఖు.

ప్రొద్దున్న పదింటికి.

గ్రాండ్స్ నర్సింగ్‌హోమ్‌లో....

తెల్లటి దుస్తులు వేసుకున్న లావుపాటి నర్సు ప్రార్థన చూపుడు

వేలుమీద సూదితో చప్పున పొడిచి, లోపల్నుంచి పొంగిన రక్తా
మీదకు తీసుకుంది.

అట్టమీద క్లిప్పుకున్న కాగితంలో ఆ విషయాన్ని వ్రా
కుంటూండగా ఇంకో నర్సు వచ్చి ఆవిడకి ఫోన్ వచ్చిందని చెప్పి

లావు నర్సు వరండాలోకి వెళ్ళి ఫోన్ అందుకుంది.
ఫోన్ చేసింది, ఆమె బాయ్‌ఫ్రెండు. సాయంత్రం పార్కులో
సినిమాకి వెళ్ళాలా అన్న విషయం మీద పావుగంటా, ఏ టై
రావాలా అన్న విషయం మీద పావుగంటా చర్చించుకున్న
తిరిగి ప్రార్థన దగ్గిర కొచ్చింది.

ఈ లోపులో ప్రార్థన చుక్కచుక్కగా వస్తున్న రక్తాన్ని
చేతి రుమాల్తో చాలా అవస్థ పడాల్సి వచ్చింది. రక్తం క్లాట్
దాదాపు ఇరవై నిముషాలు పట్టింది.

లోపలికి వచ్చిన నర్సు తను చెయ్యవలసిన రెండు పరీక్
మాత్రమే చేశానని గుర్తొచ్చి నాలుక్కర్చుకుని, పాప చేతి
చూసింది. సూదితో పొడిచినచోట మామూలుగానే వుంది.

ప్లాస్టిక్ గొట్టం పక్కన పడేసి.... మళ్ళీ రెండో
ఇంకోసారి గుచ్చటం ఎందుకని, 'బ్లడ్ క్లాటింగ్ టైమ్!'
చోట.... 'నాలుగు నిముషాలు' అని వ్రాసి, రిపోర్టు తీసుకె
అందించింది.

డాక్టర్ రాబర్టుసన్ రిపోర్టు చేతుల్లోకి తీసుకొని పరిశీలిం

బ్లడ్ క్లాటింగ్ టైము, బ్లడ్ బ్లీడింగ్ టైము, వైట్
ఇజ్నోఫిల్ గ్రాన్యూల్ సైటిస్....

రిపోర్టు జూనియర్ డాక్టరుకి అందజేస్తూ "ఓ.కే" అన్నా

## 2

ప్రొద్దున్న ఆరింటికే ఆస్పత్రి చైతన్యాన్ని సంతరి
ఇద్దరు నర్సులు హడావుడిగా తిరుగుతున్నారు. నర్స్ రిసెప్షన్
వెనుకనున్న ఆఫీసు నుంచి ప్రార్థన తాలూకు కేస్‌షీటు తీసు
టర్ లోకి వెళుతూంది. ప్రార్థన తాలూకు బ్లడ్ రిపోర్టు, బ్ల

మ. (రక్తస్రావం అగటానికి వచ్చే సమయం) రక్తం ఏ గ్రూపుకి
చెందింది వగైరా అంశాలున్న రిపోర్టు అది.

ఆకాశం కొద్దిగా మేఘావృతమై వుంది. సూర్యుడు ఇంకా తూర్పు
నుంచి పూర్తిగా బయటకి రాలేదు.

అత్యవసరం అయితే తప్ప అంత తెల్లవార్నే ఆపరేషన్ చెయ్య
ఆ ఆస్పత్రికి కొత్త అవటంవల్ల కాస్త కొత్తగా వుంది తప్పితే మిగతా
అంతా మామూలుగానే సాగిపోతూంది.

డాక్టరు రాబర్ట్సన్ అయిదున్నరకే తన సామాను తీసుకొని
అక్కడినుంచి ఇటే విమానాశ్రయానికి వెళ్ళిపోవటానికి హోటల్ ఖాళీచేసి
వచ్చేడు.

పావు తక్కువ ఆరింటికి ప్రార్థనని తీసుకొని భార్గవ, వసుమతి
వచ్చేరు. రాత్రినుంచీ ఏమీ తినకపోయినా ప్రార్థన హుషారుగానే వుంది.
ఒకసారి ఆపరేషన్ అయిపోతే యెన్ని ఐస్క్రీములు తిన్నా ఫర్లేదని
డాక్టరు చెప్పారు. ఆమె ఐస్క్రీము అంటే పడి ఛస్తుంది. కానీ ఎప్పుడు
తిన్నా జలుబు చేస్తుంది. దానికి కారణం టాన్సిల్సేనట. అందుకే ఈ
ఆపరేషన్ అంటే సహజంగా వుండాల్సిన భయం లేకపోగా, ఎప్పుడు
అవుతుందా అని తొందరగా వుంది.

ప్రార్థన రాగానే, ఆమెని తీసుకుని వెళ్ళి, ఒక నర్సు మొట్టమొదట
డెట్టాల్ వాటర్తో నోటిని శుభ్రం చేసింది.

ఈ లోపులో నర్సు ప్రార్థన తలని కొద్దిగా వెనక్కి వంచి, కళ్ళ
మీద దూదివుంచి బ్యాండేజి కట్టింది. పేషెంట్ ఆపరేషన్ థియేటర్లోకి
రాగానే అక్కడి వాతావరణాన్నీ, లైట్లనీ, మాస్కులు కట్టుకున్న
డాక్టర్లనీ, కత్తుల్నీ చూసి ఒక్కసారిగా 'షాక్' తగలకుండా కళ్ళకి
కట్టుకడతారు.

"పడుకుంటావా?"

ప్రార్థన తలూపి, వెల్లకిలా పడుకుంది.

తరువాత చక్రాలు కదులుతున్న చప్పుడు. స్ట్రెచర్ తోసుకు వెళు
తుంటే పాపకి గమ్మత్తుగా వుంది. స్ట్రెచర్ మలుపు తిరగటం తెలుస్తూంది.
ఒక్కసారి చల్లటిగాలి తగిలింది. రూంలోంచి వరండాలోకి వచ్చినట్టూ

గ్రహించింది. ఆపరేషన్ గది తలుపులు తెరుచుకోవటం
స్ట్రెచర్ మళ్ళీ ఇంకో మలుపు తిరిగింది.

అకస్మాత్తుగా కళ్ళమీద వెయ్యి కాండిల్స్ లైటు వా
టంతో ఒక కొత్త వాతావరణంలోకి ప్రవేశించినట్టూ మార్పు
రకమైన మందుల వాసన. బ్యాండేజి సందులోంచి లైటు కి
సూదుల్లాగా కనపడుతున్నాయి. తిరుగుతున్న పరికరంమీద
వుంది. కుడికన్ను క్రిందనుంచి కొద్దిగా కనిపిస్తూంది. ప్రార్థన
తల కొద్దిగా పైకెత్తి చూసింది. మూతికి గుడ్డ కట్టుకొని
అంకుల్ గమ్మత్తుగా కనపడ్డారు. అంతలో ఒక చెయ్యి వచ్చి
పడుకోబెట్టింది. సన్నటి స్వరంతో ఎవరో ఏదో అడుగుతున
కత్తులు ఒకదాని కొకటి తగిలి, రాపిడి అయిన ధ్వని.

రాబర్ట్సన్ దగ్గిరకొచ్చి అడిగాడు. "హౌ ఆర్యూ డే
"బ్లయిండ్" అంది.

ఎప్పుడూ సీరియస్‌గా వుండే అన స్తటిస్టు కూడా
నవ్వాడు. ప్రార్థన దగ్గిరకొచ్చి "ఇప్పుడు నీకో ఇంజెక్షన్ ఇ
ఓ.కే...." అన్నాడు.

"ఊఁ" అంది ప్రార్థన.

అతడు తన చెయ్యి అతడి చేతుల్లోకి తీసుకోవడం
ఒక్కసారిగా చురుక్కుమని మంట. ఏదో లోపలికి గుచ్చు
అదృష్టవశాత్తూ వీన్ మొదటిసారే దొరికింది.

"నొప్పిగా వుందా?"

"ఉహూ. లేదు"

"అప్పలుంటదు"

ప్రార్థన మాట్లాడలేదు.

"నీకు డాడీ అంటే ఇష్టమా? మమ్మీ అంటేనా?"

"డాడీ అంటే.... ఉహూ.... కాదు. నిన్న రాత్రిన
అంటే"

"ఏం, నిన్న రాత్రి ఏమయ్యింది?"

"మమ్మీ నన్ను డాన్స్‌కి తీసు....కెళ్ళింది"

"నిన్న డాన్సు బాగా జరిగిందా?"

"బాగా....జరిగిం....ది"

"డాన్స్ ఎవరు చేసేరు నువ్వేనా?"

"ఆఁ ...నేనే...చేశా....ను"

"చప్పట్లు కొట్టారా?"

"కొట్టారు, బా....గా....కొ....ట్టా....రు"

"ఏమిటి?"

"చప్ప....ట....ట...." అంతే.

—ఆమె ఆపు చెయ్యటంతో థియేటర్‌లో గాఢమైన నిశ్శబ్దం ఒక క్షణం రాజ్యమేలింది.

కొద్దికొద్దిగా ఇస్తూన్న పెంటథాల్ మందుని ఆపుచేసి, సూది శరీరానికి అలాగే వుంచి సిరంజి తీసేశాడు.

రెప్పని పైకెత్తి, కనుగుడ్డు లోపలి భాగం పరిశీలించి, పాప పూర్తిగా మత్తులోకి వెళ్ళిపోయిందని గ్రహించాడు.

అసిస్టెంట్లు చేసే ఈ పనులని రాబర్ట్సన్ మౌనంగా గమనిస్తున్నాడు.

(చాలామంది అనుకుంటారు. మత్తు ఇంజెక్షన్ ఇవ్వగానే మనిషికి స్పృహ తప్పుతుందనీ. ఆపరేషన్ మొదలవుతుందనీ! సినిమాలు తప్పుడు పట్టిస్తున్న అభిప్రాయం ఇది!! స్పృహ తప్పటంవేరు, మత్తెక్కటం వేరు. శరీరం మత్తెక్కకపోతే స్పృహ తప్పినా బాధ తెలుస్తుంది.)

సూదికి మరో సిరెంజి అమర్చి పాప శరీరంలోకి స్కొలిన్ ఇంజెక్ట్ చేసేడు.

ప్రార్థన శరీరం భూకంపం వచ్చినట్టూ రెండు క్షణాలపాటూ ప్రకంపనాలకి లోనై అటూ ఇటూ కదిలి, ఒక్కసారిగా పక్షవాతం వచ్చినట్టూ చచ్చుబడిపోయింది. కండరాలన్నీ పనిచెయ్యటం మానేసి, ఛాతి కండరాలు కూడా కదలకపోవటంవల్ల ఆమె వూపిరి ఆగిపోయింది. ఆపరేషన్‌లో ఇది రెండో అంశం. శరీరాన్ని 'పారలైజ్' చెయ్యటం!

అసిస్టెంట్ చేతులు మిషన్‌కన్నా వేగంగా కదిలినయ్. ఊపిరి ఆగిపోయిన తర్వాత రోగిని ఆ స్థితిలో ఎక్కువసేపు వుంచకూడదు.

చేతినుంచి స్కొలిన్ సిరెంజిని తీసేసి, అదే సూదికి గ్లూకోజ్ సెలైన్ అమర్చారు, ఆమె శరీరంలోకి ఆ ద్రవం నెమ్మదిగా ప్రవ

హిస్తోందని సంతృప్తి పడ్డాక, వేగంగా కదిలి ఎండో-ట్రాకి చేతుల్లోకి తీసుకొని, మరొక చేత్తో ఆమె నోటిని వెడ గొట్టాన్ని ఆమె నోట్లోకి కొద్దికొద్దిగా జొనిపాడు. స్కా వల్ల దృఢత్వం కోల్పోయిన ఆమె కండరాలు ఆ గొట్టానికి నిచ్చాయి. గొంతుగుండా గొట్టం లోపలికి వెళ్ళి ఊపిరితి చేరుకుంది. ఆ గొట్టపు రెండో చివర బాయిల్స్ అపరేషన్ వుంది.

అతడు దాన్ని ప్రారంభించగానే ఆక్సిజన్, నైట్రా మిశ్రమవాయువు సన్నటి ఒత్తిడితో ఆమె ఊపిరితిత్తుల్లో ప్రవేశించి, తిరిగి శ్వాస ప్రారంభమయింది.

ఈ ఆక్సైడే శరీరానికి స్పర్శజ్ఞానాన్ని పోగొట్టేది. తిత్తులోకి ప్రవహిస్తున్నంతకాలం పేషెంట్ మత్తులోనే వు పాప శరీరం ఆపరేషనుకు సిద్ధమయింది.

అన్నీ సవ్యంగా వున్నాయో లేవో చూసుకుని, బి.పి. మరోమారు పరీక్షించుకుని, అనస్తటిస్టు పక్కకు తొలగి, తిరిగి 'రెడీ సర్' అన్నాడు.

అప్పటికి సర్జను పని ప్రారంభం అయింది.

ఒక నర్సువచ్చి పేషెంట్ శరీరాన్నంతా ఆకుపచ్చటి కప్పేసింది. కేవలం ముఖం దగ్గిర మాత్రం నోరు కనపడే వుందంతే. అక్కడున్న వాళ్ళందరూ ఆకుపచ్చటి డ్రెస్లో రక్తం ఎర్రరంగు కొట్టొచ్చినట్టూ కనపడకుండా వుండటా రంగు దోహదం చేస్తుంది. లేకపోతే ఆపరేషను చేస్తున్న ఎర్రటి రక్తం ఎంతటి డాక్టరునయినా మానసికంగా బలహీను ఆకుపచ్చమీద ఎరుపు నల్లగా కనపడుతుంది.

రాబర్టుసన్ ఒక క్షణం పాప నోటిని పరీక్షించి, స్పిరి చుట్టూ శుభ్రం చేశాడు. ట్యూబ్‌ని కాస్త పక్కకి తొలగించ గాగ్‌ని పెట్టాడు. నాలుకని అది క్రిందకు నొక్కి వుంచి, ఇరువైపులా స్పష్టంగా కనబడేటట్టూ చేస్తుంది.

అసిస్టెంట్స్ ఇద్దరూ అతడు చేసేపనిని జాగ్రత్తగా న్నారు. చాలా సున్నితంగా, కాసి వేగంగా, చురుగ్గా క

చేతివేళ్ళ సామర్థ్యాన్ని తమ స్మృతుల్లో భద్రపర్చుకుంటున్నారు. రాబర్ట్సన్ ఒక్కసారి గొంతు లోపలిభాగాన్ని పరిశీలించి, చేతిలోకి వల్‌సెల్లమ్‌ని తీసుకొని దాంతో పాప గొంతులో కుడివైపు ఉబ్బెత్తుగా వున్న మొదటి టాన్సిల్‌ని పట్టుకొని కాస్త ముందుకు లాగాడు. తాటికాయ నుంచి చూపుడువేల్తో తోస్తే ముంజె బైటికి వచ్చినట్టూ టాన్సిల్ ముందుకు వచ్చింది.

నాలుక మీదనుంచి కత్తి గొంతు దగ్గరికి తీసుకువెళ్ళి సుతారంగా దాన్ని కోసేరు.

మొట్టమొదటి శత్రు సైనికుడు చీకట్లోంచి బయటికొచ్చినట్టూ మొదటి రక్తపుచుక్క బయటకొచ్చింది.

*　　*　　*　　*

స్....స్‌స్‌స్

ఎలక్ట్రికల్ బ్లడ్ సక్కర్ సన్నటి శబ్దం చేస్తూంది.

రాబర్ట్సన్ కుడిచేత్తో దాన్ని పాప నోటి లోపలకు దూర్చాడు. ఆ గొట్టంలోంచి గాలి వేగంగా లోపలికి పీల్చుకోబడుతుంది. దాన్ని కొండనాలుక పక్కకు తీసుకువెళ్ళగానే, బయటకొచ్చిన రక్తమంతా దాని గుండా గొట్టం నుంచి బయటికి వెళ్ళిపోయింది.

అతడు గొట్టాన్ని నర్సుకు అందించి, నైఫ్ తీసుకొని, యింకో చేతిలో వల్‌సెల్లమ్ మరోమారు తీసుకొని టాన్సిల్‌ని పట్టుకోబోయాడు.

ఈ లోపులో తిరిగి రక్తం బయటకొచ్చింది.

అసిస్టెంట్స్ ఇద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు. టాన్సిల్ కత్తిరించకుండానే అతడు సక్కర్ ఉపయోగించటం వారికి కొత్తగా వుంది. అతడూ అలా చేసేవాడు కాదు. కానీ అనుకున్న దానికన్నా ఎక్కువగా రక్తం బయటకు వచ్చింది.

అతడు ఈసారి దాన్ని పట్టించుకోకుండా వల్‌సెల్లమ్‌ని కొద్దిగా వెనక్కిలాగి, దాంతోపాటూ వచ్చిన టాన్సిల్‌ని కత్తితోకోసి, స్టిక్కర్ ఉపయోగించి బయటకు లాగేసి బేసినులో పడేసేడు.

పాప అనారోగ్యానికి, మాటిమాటికీ వస్తున్న జ్వరానికీ కారణం అనుకుంటున్న చిన్న కండరం ముక్క బేసిను నీళ్ళలో తేలుతూంది.

అసిస్టెంట్స్ ఇద్దరూ తేలిగ్గా గాలి పీల్చుకున్నారు.

రాబర్ట్సన్ మరోమారు సక్కర్ తీసుకుని ముందుకు
అడ్డుగా వున్న రాయి తొలగించగానే నూతిలోంచి జలపడి
గొంతులో కండరం తొలగించిన చోటునుంచి రక్తం
వచ్చింది.

సక్కర్ ద్వారా దాన్ని బయటికి పీల్చేసి, పొడి అ
గాయం దగ్గిర దూదిపెట్టి, గట్టిగా ఒత్తి పట్టుకున్నాడు.

పక్కనున్న నర్సులూ, అసిస్టెంట్లూ రిలాక్స్ అయ
వైపు ఆపరేషను దాదాపు అయిపోయినట్టే. అనస్తటిస్టు పాప
వెళుతున్న గాలిని మరొకసారి పరీక్షించుకొని సంతృప్తి చెంద

ఆ తర్వాత ఒత్తి పట్టుకున్న దూదిని గాయం దగ్గిర
గించి బేసిన్‌లో పడేసేడు రాబర్టుసన్.

మరో టాన్సిల్‌ని పరీక్షించటం కోసం ఈసారి ఎ
వంగబోతూ, గొంతును చూసి అదిరిపడ్డాడు. అతడు దూది
గానే గొంతులో జల పూరినట్టూ మళ్ళీ రక్తం బయటకొచ్చి
ఎర్రగా అయింది. మళ్ళీ సక్కరు ఉపయోగించి శుభ్రం చేసే
న్‌లో ముంచిన దూదిని గాయం దగ్గర పెట్టి బలం అంత
గించి గట్టిగా వత్తి పట్టుకుని రక్తం రాకుండా నిరోధించాడు.
మూడు నాలుగు నిముషాలు అలానే వుంచి మళ్ళీ తీసేసేడు.
నంతసేపూ బాగానే వుంటుంది- తీసెయ్యగానే స్రవిస్తుంది.

అనస్తటీస్టు అతడిపక్కగా వచ్చి "హావ్ యూ గాట్ ఎ
వర్" అని అడిగాడు.

పాప మీదనుంచి కళ్ళు తిప్పకుండా అడిగాడు
"హా ఈచ్ బీ. పీ?"

అనస్తటీస్టు తన పరికరాల వైపు చూసుకుని "
అన్నాడు. అంటూ పాపవైపు తిరిగి, "మైగాడ్" అన్నాడు. "
వూజింగ్" పాప నోరు రక్తసిక్తమై వుంది. నాలుక తెగిన
ఎర్రటి చిక్కదనంతో కనబడుతూంది.

రాబర్టుసన్ మళ్ళీ సక్కరు ఉపయోగించి పొరపాటు
రక్తనాళం తెగిపోయిందా అని పరీక్ష చేశాడు. అయితే అట
లేదు. గాయం చిన్నదిగానే వుంది కానీ స్రావం ఆగటంలేదు.

దూదితో గాయాన్ని మరింత గట్టిగా నొక్కి పట్టాడు. ఆ బలానికి పాప గొంతు నొక్కుకుపోతుందా అనిపించేలా వుంది. ఐదు నిముషాలు అలాగే పట్టుకుని గడియారం వంక చూసేడు.

ఏడున్నర!

మైగాడ్ అనుకున్నాడు. విమానం తొమ్మిదింటికి. అదికాదు అతడు ఆలోచిస్తున్నది. ఆపరేషను ప్రారంభించి అప్పుడే గంట కావస్తుంది.

అలా నొక్కి పట్టుకునే అతడు పాపవైపు చూసేడు. అకస్మాత్తుగా అతడి చెవుల్లో ఒక ధ్వని వినిపించింది.

దదిరై .... దిరై .... దత్తరి దత్త తాహ తద్దిగిడ్రై దిరై దత్తరి దత్తతాహం....

రెండు కాళ్ళ తన కర్ణపుటాలమీద నేరుగా నృత్యం చేస్తున్నట్టు— కితం రాత్రి భార్గవ సన్నటి స్వరంతో తనకి ఇచ్చిన వివరణ గుర్తొచ్చింది. "మా పురాణాల్లో రాక్షసులు వుంటారు. వారిని- సంహరించడానికి దేవుడు చేసే ప్రళయతాండవం ఇది. దిదిరై .... దిరై" కూతురి నృత్యాన్ని వివరించాడు.

అతనెన్నో ఆపరేషన్లు చేసేడు. ఇంతకన్నా ఎక్కువ ప్రమాదకరమైన స్థితుల్లో పడ్డాడు. కానీ ఈ స్థితి వేరు. పాప లేతదనం, పాప ముగ్ధత్వం, పాప నృత్యం అన్నీ గుర్తొస్తున్నాయి. తాను అనవసరంగా- తన అహాన్ని సంతృప్తిపరచుకోవటానికి ఈ ఆపరేషన్ చేస్తానన్నాడా? ఇండియన్ డాక్టర్ల ముందు తన గొప్పతనం నిరూపించుకోవాలన్న పాడిజం తన మనసులో ఏ మూలో రవ్వంత వుందా? ఆ పాపంవల్లే తనసీ రోజు ఇలా దేవుడు శిక్షించబోతున్నాడా? నో.... దానికీపాప బలి కాకూడదు.

అతడికి కళ్ళు తిరుగుతున్నట్టు అనిపించింది. పాప గొంతు దగ్గర గాయాన్ని బలంగా దూదితో నొక్కిపట్టి వుంచిన చేతులు కంపిస్తున్నాయి. బేసిన్ వేపు చూసేడు. బేసిన్ నిండా దూది రక్తంతో తడిసి ముద్దలు ముద్దలుగా పడివుంది. ఈ ఉదయం పాప శరీరం నుంచి యీ విధంగా రక్తమంతా తోడెయ్యటానికే నేనిక్కడ నిర్దేశింపబడ్డానా అనుకున్నాడు.

అయిదు నిముషాలు అయింది. అతడు దూది తొలగించి గాయం వేపు చూసేడు. గాయం తెల్లగా వుంది. సంతృప్తిగా అమ్మయ్య అనుకో

బోయేడు. అంతలో తెలుపు నెమ్మదిగా ఎర్రబడటం ప్రా
పుట్టలోంచి చీమలు నెమ్మదిగా బైటకొచ్చినట్టూ ఆ ఎర్రదనం స
వడివడిగా పాకిపోయింది. అతడి మొహం పాలిపోయింది. ఒక
జుట్టులోంచి నుదుటిమీదకు జారి ధారాపాతమయింది. జీవిత
మొదటిసారి అయ్యాడతడు —

పానిక్!

* * * *

"అబ్బ, వళ్ళంతా నొప్పులే బాబూ" అంది ఆమె. అప్ప
పావుతక్కువ ఎనిమిదయింది. పక్కమీద పడుకున్న అతడు పక్
ఆమెవేపు చూసి నవ్వేడు. అతడు మెడికల్ కాలేజీ స్టూడెంట
అయిదో సంవత్సరం, అయిదు సంవత్సరాల్నుంచీ చదువుతున్నా

"అప్పుడే లేచావేం" అని అడిగాడు.

"తొమ్మిదింటికి ఆస్పత్రికి వెళ్ళాలి"

"అ— బోరు— మానేద్దూ"

"బోరే. ఏముంది ఎప్పుడు చూసినా బ్లడ్ టెస్టూ... టెస్టూ. ఆ ఉద్యోగం అంతేనే బోరుకొడుతుంది."

"పోనీ లాబ్ నుండి జనరల్‌కి మార్పించుకోరాదూ—"

"అది మరీ బోరు బాబూ. డాక్టర్ల తోపాటూ పేషెంట్ల కూడా భరించాలి."

"అవును. ఇక్కడయితే స్టూడెంటు కుర్రాళ్ళ కంటికి
ఫ్రెష్‌గా కనిపిస్తూ వుండవచ్చు. టెస్టులు ముఖ్యం. టెస్టుల
మీరేం వ్రాసిస్తే అది వేదం. అందులో ఈ మధ్య టెక్నీషియ
మీ మీదే అంతా వదిలిపెట్టి రెస్ట్ తీసుకుంటున్నారుగా, ఇక మీదే

"ఏం రాజ్యమో, రాత్రంతా నిద్రలేకుండా చేసేవు. ఇప
ఆస్పత్రిలో ఏం పని చెయ్యను? యూరిన్ రిపోర్టులో షుగ
వ్రాసినా ఆశ్చర్యపోనక్కరలేదు" బ్రా తొడుక్కుంటూ అంది

ప్రజల్ని పరిరక్షించాల్సిన పవిత్రమైన వైద్యరంగాన్ని ఇ
తీసుకునే వీళ్ళకోసమా నేను ఉదయిస్తున్నది అనుకున్న సూర్యుడ
చాటుకి తప్పుకున్నాడు. మినుక్కు మినుక్కు మంటూ
దీపాన్ని అరచేతులు అడ్డుపెట్టయినా రక్షించటానికి అహర్నిశల

రాబర్ట్సన్ లాంటి డాక్టర్లు ఇంకా చాలామంది వున్నందుకే ఈ వృత్తికి గౌరవం వుంటుంది. వాళ్ళకోసమే సూర్యుడు ఉదయిస్తాడు.

ప్రాణం వేరే సంగతి. దాన్ని వుంచేదీ, తీసుకునేదీ, నిర్ణయించేది డాక్టర్లు కాదు.

* * * *

"ఒకసారి కేస్‌షీట్ ఇవ్వండి" అని డాక్టర్ అడగ్గానే సిస్టర్ దాన్ని అందించింది.

ప్రార్థన తాలూకు కేస్‌షీట్ వెంట రాబర్ట్సన్ కళ్ళు పరుగెడుతున్నాయి. ఆపరేషన్ మధ్యలో కేస్‌షీట్ స్టడీ చెయ్యవలసి రావటం చాలా దురదృష్టకరమైన విషయం. అయినా తప్పదు.

బ్లడ్ క్లాటింగ్ టైమ్.

బ్లడ్ బ్లీడింగ్ టైమ్, రక్తం గడ్డకట్టే టైమ్.... అంతా సరిగ్గానే వుంది. మరెక్కడ తప్పు?

ఆఖరిసారి ప్రయత్నిద్దామని, డాక్టర్ తిరిగి గాయం మీదనుంచి కాటన్ తీశాడు. మళ్ళీ బుసబుసా రక్తం!

ఈ లోపులో అనస్తటిస్టు కంగారుగా అరిచేడు. "ప్రెస్ ఇట్!! ప్రెస్ ఇట్!!!" రాబర్ట్సన్ ఒక్కసారిగా షాకై, వెంటనే తిరిగి వత్తేడు. అనస్తటిస్టు ఆందోళనగా "బి. పి. ఈజ్ డ్రాపింగ్. బి. పి. పడిపోతూంది" అన్నాడు. హాలంతా ఒక రకమైన ఉద్వేగం నిండుకుంది.

అందరికళ్ళూ వరికరంవైపు తిరిగినయ్.

తొంభై నాలుగు.... ఎనభై ఎనిమిది.... ఎనభై మూడు.... డెబ్బై తొమ్మిది....

అనస్తటిస్టు పేషెంట్ శరీరంలోకి మరింత వేగంగా సెలైన్ వెళ్ళే ఏర్పాటు చేశాడు. అయినా లాభం లేకపోయింది. 'మైగాడ్' అనుకున్నాడు మనసులో.

రెండు చేతుల్తోనూ స్పాంజి హోల్డర్‌ని పట్టుకుని చేతుల్లో వున్న బలం అంతా ఉపయోగించి దూడితో ఆమె గొంతు లోపలి భాగాన్ని నొక్కసాగాడు. అసలు తన బలానికే గాయం మరింత పెద్దదవుతుందేమోనన్న అనుమానం వేసిందతనికి, కానీ వేరేమార్గం లేదు. బి. పి.

పడిపోవటం ఇంకా ఆగలేదు. కానీ పాయింట్ కీ పాయింట్ కీ మ
ఎక్కువ అవుతూంది.

ఆపరేషన్లలో రక్తం 'క్లాట్' అవకపోతే ఇక డాక్టర్ల
వర్ణనాతీతం. సలహా చెప్పే వారుండరు. ఆలోచించటానికి టైమ్
కళ్ళముందే రోగి నెమ్మది నెమ్మదిగా, మృత్యువు వేపుకు సాగిపో
నిస్సహాయంగా చూస్తూ వుండాలే తప్ప యింకేమీ చెయ్యలేరు.
కత్తితో కోసిన చోటునుంచే ప్రాణం రక్తం రూపేణా బయటకు పో
ఎంతటి డాక్టర్ కయినా దుఃఖం రాక మానదు.

అందులోనూ ఈ స్థితి మరీ ఘోరమైంది. ప్రాణంమీద
అపెండిసైటిస్సూ కాదు. ప్రాణాలుతీసే హార్టుడిసీజూ కాదు.
ఆడుతూ పాడుతూ తిరిగే ఓ పాపకి తీరిగ్గా తిని కూర్చుని
ఆపరేట్ చెయ్యబోవటం.

పాప మొహం దగ్గర గుడ్డ అంతా నల్లగా మారి వుంది. ఆ
గుడ్డమీద రక్తం పడీ.... పడీ....

ఉన్నట్టుండి ఆ గది చైతన్యవంతమైంది. రాబర్టుసన్
తిరిగి "మాచింగ్ బెస్ట్ ప్లీజ్. క్విక్" అన్నాడు. నర్సు పా
చెయ్యి గుడ్డ క్రిందనుంచి బయటికి తీసి, నరానికి సూదిగుచ్చిన ర
సాగింది. బి. పి. మళ్ళీ తగ్గింది. అందరూ ఆందోళనగా వున్నారు.
రక్తం తీసుకుని దాదాపు పరుగెత్తింది.

వరండాలో వడివడిగా వెళుతూన్న నర్సుని చూసి, దూర
బడ్డ వసుమతికి ఏమీ అర్థంకాలేదు. భార్గవ ఎక్కడో కారు దగ్గిర
మాట్లాడుతున్నాడు. ఆపరేషన్ పూర్తయ్యాక డాక్టర్ని అట్నుం
విమానాశ్రయానికి తీసుకువెళ్ళటానికి చర్చిస్తున్నారు వాళ్ళు.

"ఐస్‌క్రీమ్ ఎంతసేపటికి పెట్టొచ్చు?"

"ఏం?"

"నేను తెస్తానని చెప్పాను."

"ఎయిర్‌పోర్ట్‌నుంచి వచ్చేటప్పుడు తెద్దాంలే."

లోపల బద్దలవుతూన్న అగ్నిపర్వతాల సంగతి తెలియక,
ఐస్‌క్రీముల గురించి మాట్లాడుకుంటున్నారు.

బయట ఈ సంభాషణ జరుగుతూంటే రక్తాన్ని తీసుకెళ్ళిన సిస్టర్ లాబ్ చీఫ్ పేథాలజిస్ట్‌కి అంతా చెప్పి, శాంపిల్ ఇచ్చింది. అంతా హడావుడి. ప్రతిక్షణమూ విలువైనదే.

చీఫ్ అనుభవజ్ఞుడు. పాపని పరీక్ష చేసిన నర్సు సంగతి అతడికి తెలుసు. నూటికీ, కోటికీ ఒక్కరుంటారు. మొత్తం వృత్తికే పేరు తెచ్చే వారు! జరిగిందేమిటో స్పష్టంగా తెలుస్తూంది. కానీ అతడు తన భావాల్ని వ్యక్తం చెయ్యలేదు. మనసులోనే దాచుకున్నాడు. మౌనంగా నర్సు దగ్గి నుంచి శాంపిల్ తీసుకుని తను దగ్గిరవున్న రక్తంతో మాచింగ్ చెయ్యటం ప్రారంభించాడు.

చాలా సినిమాల్లోనూ, పుస్తకాలలోనూ హీరోతో డాక్టర్లు "మీ గ్రూపు సరిపోయింది" అంటూ వుంటారు. అది తప్పు. గ్రూపు సరిపోవటం ఒక్కటే సరిపోదు. పేషెంటు రక్తం, ఈ ఫారిన్ రక్తాన్ని తనలోకి ఆహ్వానించగలిగి వుండాలి. అందుకే 'మాచింగ్ టెస్ట్'.

అతడు టేబిల్‌మీదకు వంగి పని ప్రారంభించాడు. సరిగ్గా అయిదు నిముషాల తర్వాత అతడి పని ముగిసింది. కావల్సిన బ్లడ్‌ని ఆపరేషన్ థియేటర్‌కి పంపిన రెండు నిముషాలకు నర్సు వచ్చింది. ప్రార్థనకు టెస్టులు నిర్వహించిన నర్సు.

లాబ్ చీఫ్‌కి సలభై అయిదేళ్ళుంటాయి. బలంగా ఎత్తుగా సైన్యంలో పనిచేసేవాడిలా వుంటాడు. రాత్రంతా నిద్రలేక మొహం పీక్కుపోయివున్న నర్సుని పరకాయించి చూసి, "కేస్ నెంబర్ 126 టెస్టు చేసింది నువ్వేనా" అని అడిగాడు.

"ఎవరూ?"

"ప్రార్థన అనే పాప."

"ఆ.... అవును. ఏం?"

"క్లాటింగ్ టెస్టు చెయ్యలేదా?"

"చే.... చేశాను."

"నువ్వు అబద్ధం చెపుతున్నావు."

"లేదు, నిజమే చెపుతున్నాను."

చీఫ్ చిన్న గొట్టాన్ని ఎత్తి పట్టుకున్నాడు. కనల్‌గ్రింపులో

వేసుకొని పీల్చే గొట్టం (స్ట్రా)లా వుండది. చీపురుపుల్ల అంత ప
ప్లాస్టిక్ గొట్టం. దీన్ని కాప్యులా అంటారు.

(వేలి దగ్గిర సూదితో పొడిచి వస్తున్న రక్తాన్ని ప
గొట్టంలోకి పీలుస్తారు. ఒక నిముషం తరువాత కొనముక్క ని
రెండో నిముషం తరువాత మరో ముక్క విరుస్తారు. ఇలా
తరువాత నిముషం చీపురుపుల్లని విరిచినట్టూ విరుచుకుంటూ
ఏ ముక్క దగ్గిర రక్తం జీళ్ళపాకంలా సాగుతుందో. అన్నో
తరువాత ఆ రోగి రక్తానికి గడ్డకట్టే గుణం వుందన్నమాట.
క్లాటింగ్ టెస్టు అంటారు. ప్రతి ఆపరేషను ముందూ తప్పక చెయ్య
పరీక్ష ఇది.)

టాప్ చీఫ్ అన్నాడు- "ప్రతి విషయంలోనూ నేను
వుంటాననీ, లెక్క చూసుకుంటాననీ నీకు తెలుసుకదా. నువ్వు
తప్పు ఏమిటంటే- వాడకుండా వదిలేసిన 'కాప్యులా'ని తిరిగి
స్టోరులో పెట్టేయటం- నిజం చెప్పు. చెప్తే నిన్ను పోలీసుల
చెయ్యకుండా చూస్తాను."

ఆమె బెదిరిపోయి 'పోలీసులా' అంది.

"అవును. నువ్వు చేసిన తప్పువల్ల అక్కడ ఏమైందో తె

"ఏమైంది?"

"పాప చచ్చిపోయింది."

నర్సు ఆకులా వణికిపోయింది.

"నిజం చెప్పు, ఏమైంది? ఉన్నదున్నట్టూ చెప్తేనే నిన్ను
గలను" గద్దించాడు. పాప చచ్చిపోయిందనేసరికి పూర్తిగా బెదిరి
వెక్కుతూ- "టెస్టు చెయ్యబోతూంటే ఫోన్‌కాల్ వచ్చింది. దా
అని మరి చెప్పలేకపోయింది. అతడు చెయ్యిచాచి ఆమె చెం
ఎంత బలంగా కొట్టేడంటే- దానికి ఆమె నిలదొక్కుకోలేక తూలి
పడింది. ఆ చర్యకి నర్సులు, అసోసియేషన్ వారు చెయ్య
స్ట్రైయిక్ గురించి, తన పనిష్మెంట్ గురించీ ఆలోచించలేదు
నిశ్శబ్దంలోంచీ బాంబు పడ్డట్టూ అతడి మాటలు వినిపించినవ్..
లాటి ఒక్క పురుగువల్ల మొత్తం వృత్తికే చెడ్డపేరు
అక్కడ ఆపరేషన్ థియేటర్‌లో ఏం జరుగుతుందో నాకు

ఒకవేళ అక్కడ రోగికి ఏమైనా అయిందంటే మాత్రం నిన్ను చంపి కాకులకూ గ్రద్దలకూ వేసేస్తాను. దేముణ్ని ప్రార్థించుకో."

*   *   *   *

బాటిల్ మీద బాటిల్— మొత్తం అయిదు బాటిల్స్ రక్తం ఎక్కించబడింది. అప్పటివరకూ స్పాంజి హోల్డర్‌ని అలాగే గాయం దగ్గర నొక్కి పట్టుకొని వున్నాడు సర్జన్. ఒక చేత్తో అమ్మాయిని పరిచేస్తూ మరోచేత్తో బి.పి. పరీక్షించాడు. రక్తం శరీరమంతా ప్రవహించి, కావల్సిన ప్లేట్‌లెట్స్‌ని గాయం దగ్గరికి చేర్చింది. ఇదంతా అంతర్గతమయిన చర్య.

సర్జనూ, అనస్తటిస్టూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. అనస్తటిస్టు తల పంకించాడు. గాయంమీద దూదిని సుతారంగా వెనక్కి తొలగించి చూశాడు సర్జను. సిస్టర్ సక్కర్ రెడీగా పట్టుకుని వుంది. కొద్దిగా రక్తం బయటకు వచ్చింది. దాన్ని నెమ్మదిగా తుడిచాడు. మరి కొద్ది రక్తం రాబోయి.... ఆగిపోయింది!

ఆ గదిలో ఒక్కసారిగా 'వ్' మన్న శబ్దం వచ్చింది.

చీఫ్ సర్జనూ, అతని అసిస్టెంట్లూ, నర్సులూ అందరూ ఒక్కసారి అప్పటివరకూ బిగపట్టిన గాలిని సంతృప్తిగా విడవటంతో వచ్చిన శబ్దం అది.

*   *   *   *

మిగతాదంతా తొందరగా జరిగిపోయింది.

బి.పి. నూటికిపైగా పెరిగింది.

"రెండో టాన్సిల్స్ ఇప్పుడిక ముట్టుకోవద్దు" అన్నాడు రాబర్ట్సన్.

"రక్తాన్ని మళ్ళీ రి-ఇన్వెస్టిగేట్ చేయిద్దాం."

"షల్ ఐ రికవర్ ది పేషెంట్."

"యస్—"

నైట్రస్ ఆక్సైడ్ ప్రవాహాన్ని ఆపుచేసి ప్రోస్టిగ్‌మిన్ ఇంజెక్షన్ చేసేడు. రెస్పిరేషన్ ప్రారంభమై పాప శరీరం తిరిగి కంపించింది. ఆమె ఊపిరి తీసుకోవటం ప్రారంభించగానే ఆక్సిజన్ కూడా తీసేసేడు. కంపనం ఆగిపోయింది. ఆ తరువాత అయిదు నిముషాలకు ప్రార్థనకి మగతగా మెలకువ వచ్చింది.

*   *   *   *

"నమస్తే నేను వెళ్ళొస్తాను" చేతులు జోడించి అన్నాడు

వసుమతి కూడా నమస్కారం చేసింది.

"సారీ, ఒకవైపు మాత్రమే చెయ్యగలిగాను. బ్లడ్ కౌం అవలేదు."

వింటూన్న వసుమతి మొహంలో ఆందోళన కొట్టొ పడింది. అయితే ఈ విషయాన్నంతా ముందే వివరంగా భార్గవ తేలిగ్గా "పాప అనీమిక్‌గా వుందట, మనం ముందు చూసుకోలేదు. అనవసరంగా అందర్నీ కంగారు పెట్టేసేం" అ

"నో- నో- చూసుకోవటం మా బాధ్యత. క్లాటింగ్ వై ఏదో పొరపాటు జరిగింది" అని వసుమతివైపు తిరిగి, "మీకు డాక్టర్ అన్నాజీరావు తెలుసా" అని అడిగాడు.

ఆమె తలూపింది.

"అతడితో మాట్లాడాను ఇప్పుడే. మీకు తీరిగ్గా వున్నప్పు ఒకసారి తీసుకెళ్ళండి. పూర్తిగా పరీక్ష చేస్తారు."

భార్గవ "అదేమిటి— నాకు చెప్పకుండా ఆమెకి చెప అంటూ నవ్వేడు.

"పిల్లల విషయంలో తండ్రులకన్నా తల్లుల వుంటారు."

వసుమతి మనసులోనే సంతోషించింది. 'పరాయి' అ మామూలు మాటల్లో కూడా అందరూ విస్మరిస్తున్నందుకు. ఆ కూడా డాక్టరు మాటలు ఆమె మనసును తొలుస్తూనే వున్నాయి. ఆమె తనకు తానే ధైర్యం చెప్పుకుంది. ఈ విషయాలన్నిటిలో ఎక్కువర్థు. అతడు ఇంత ధైర్యంగా వున్నాడంటే బహుశా చిన్న విషయానికి అనవసరంగా భయపడుతూందేమో.

"నేను అట్నుంచి అటే ఇన్‌స్టిట్యూట్‌కి వె అక్కణ్ణుంచి నీకు ఫోన్ చేస్తాను" అన్నాడు భార్గవ. ఆమె ఈ మధ్య అతడికి చాలా పని వుంటూంది. మామూలు రోజుల్లో ఏడింటికే వెళ్ళిపోతున్నాడు.

ఆమె వరండాలో నిలబడి చూస్తూంది. కారు కదిలింది.

...్రిప్ చేస్తున్నారు. వెనుకసీట్లో రాబర్ట్సన్ కూర్చొని వున్నాడు. మిగతా ...రు అతడికి వీడ్కోలు చెపుతున్నారు.

ఎందుకో అనిపించింది ఆమెకి, విమానం దాటిపోయి అతడు వెను ...తిరిగివస్తే బావుణ్ణు అని.

## 3

"ఇంకా ఎన్ని గుచ్చాలి బాబో, నాకు చేతులు నొప్పెడుతున్నాయి—" ...అంది జెస్సీ.

"ఎన్ని గుచ్చితే అంత బావుంటుంది" అంది ప్రార్థన. ఈ లోపులో ...నూ గ్లాసులో బియ్యం పోసి తీసుకొచ్చాడు.

"ఇది దేనికి?"

"అగరొత్తులు గుచ్చటానికి" అంటూ బల్లమీద పెట్టాడు.

"గ్లాసులో పాలు పోస్తారు, బియ్యం పొయ్యరు" అంది జెస్సీ.

"మొన్న సినిమాలో కూడా, ఊదొత్తులే పెట్టారు" అంటూ వాదిం...డు శ్రీనూ. ప్రార్థన ఇద్దరిమధ్య రాజీ కుదర్చటానికి ప్రయత్నిస్తూ ...పోసి రెండూ పెడ్దాం— సరేనా" అంది.

జెస్సీ వెళ్ళి ఫ్రిజ్‌లో పాలు గ్లాసులో పోసి తీసుకొచ్చింది. శ్రీనూ [illegible] "ఐసుపాలు పొయ్యరు, వేడిపాలు పోస్తారు" అని వెక్కిరించాడు.

"అన్నా పన్నక్కా?"

ప్రార్థనక్కూడా ఈ విషయం సరిగ్గా తెలీదు. "పోసి రెండు ...నలా పెడదామా— ఒకటి ఫ్రిజ్‌లో పాలూ, ఒకటి వేడి పాలూ" అని ...డిగింది జెస్సీ.

"అక్కర్లే. మొన్న టి.వి.లో నాగేస్వరావన్లే— 'గ్లాసులో ఈ వేడి ...లాగే జీవితం లాట' అని నాకు తెల్సు. వేడివే పెడ్తేది" ధీమాగా ...ప్పాడు శ్రీనూ.

మంచంచుట్టూ పూలు కట్టటం పూర్తయింది.

ముగ్గురూ దూరంగా నిలబడి తాము చేసిన పనివంక సంతృప్తి ...గా చూసున్నారు.

జిన్నీ కిటికీ తలుపు తెరిచింది. కిటికీలోంచి కనబడ్తూన్న
వేపు చూసి, "ఇంకేం చంద్రుడు కూడా వచ్చేసేడు."

"చంద్రుడెందుకు?" ప్రార్థనకి అర్థంకాలేదు.

'ఇంత చిన్న విషయం తెలీదా' అన్నట్టూ శ్రీనూ ఆమెవై
"పాట పాడటానికి...." అని, జిన్నీవైపు తిరిగి, "ఏ సినిమా
అనడిగాడు.

"అమ్మాయి కోరికలు"

"అమ్మపాడితే పాడుతుందేమో గానీ నాన్న చచ్చినా పా

ఈ లోపులో ప్రార్థన మరిన్ని పూలు తెచ్చి పక్కమీద

అసలీ ఆలోచన వచ్చింది జిన్నీకి!

భార్గవ, వసుమతి ప్రొద్దున్న రిజిస్ట్రార్ ఆఫీసుకి వెళ్ళి
గుడికి వెళ్ళి– సాయంత్రం స్నేహితులకి పార్టీ ఇచ్చి ఇంటికి
గదిని ఇలా సినిమాలోలా అలంకరిద్దామని అనగానే ప్రార్థన
వప్పుకుంది. జిన్నీ ఏం చెప్పినా వెంటనే దాన్ని వద్దనే శ్రీనూ కూ
సరేనన్నాడు.

రిజిస్ట్రార్ ఆఫీసులో సంతకం పెడుతున్నప్పుడు కూడా
భార్గవ ఒకే విషయం గురించి ఆలోచిస్తున్నారు. చాలా చిన్న సమ
అవే ఇబ్బంది పెడతాయి. ఆ రాత్రి ఏదయినా హోటల్లో రూ
తుందామన్నాడు భార్గవ. వద్దంది వసుమతి. జీవితంలో ఇదే
రాత్రి అని తెలుసు. అయినా అతడితో కలిసి బయట ఎక్కడో
యిష్టంలేదు. పెళ్ళయిన మొదటిరోజే తండ్రిని తల్లి ఎక్కడో
తీసుకుపోయిందన్న భావం ఆ చిన్నపిల్లల మనసులో పడటం ఇ

తన వాళ్ళంటూ ఎవరూ లేని లోటును వసుమతి మొ
ఫీలయింది. అనవసరంగా పెద్దరికాన్ని తెచ్చుకుంది గానీ ఆ
నెంతసే? చాలా చిన్న కోర్కె ఆమెది. ఈ ఒక్కరోజు తన
వుండి తనతో అన్ని పనులూ చేయించే ఒక్క ముత్తయిదువన్నా
వుంటే బావుణ్ను అని. ఆ ఇంటిలో పరిచయమైన మొదటిరోజే
ఆమెకు స్నేహితులయ్యారు. కానీ ఈ మొదటిరోజు ఆమెని

...నే వుంది. ఆ రోజే ఆ ఇంట్లో కొత్త హోదాలో ప్రవేశించటం,
...తి వుండిపోవటం.

అయితే ఆమె భయం తొందర్లోనే పోయింది. రిసెప్షన్‌నించి వచ్చే
...టికి రాత్రి తొమ్మిదయింది. పిల్లలు భోజనాలు చెయ్యకుండా వేచి
...న్నారు. రిసెప్షన్‌లో కడుపు పూర్తిగా నిండిపోయినా, వాళ్ళ సంతృప్తి
...కం డైనింగ్ టేబుల్ దగ్గిర కూర్చున్నారు ఇద్దరూ.

బయటనుంచి రాగానే భార్గవకి తన గదిలోకి వెళ్ళటం అలవాటు.
...తో క్షణం గదిని చూసి అవాక్కయినా, వెంటనే మామూలుగా
...లు మార్చుకొని వచ్చేసేడు. ముసి ముసిగా నవ్వే జీన్నీని కళ్ళతో
...కృతటోయి వూరుకున్నాడు. ఆ అమ్మాయి ఒక్కతే నవ్వుని దాచుకో
...తూంది.

భోజనాలు పూర్తయ్యాక వసుమతి మళ్ళీ ఇబ్బందిలో పడింది
...లు పడుకునే వరకూ ఎక్కడ వుండాలా అని. జీన్నీ శ్రీనూలది ఒక
... ప్రార్థనది వేరే గది. అందరూ తలో గదిలోకి వెళ్ళిపోయారు. ఆమె
...నింగ్ టేబుల్ సర్దటమనే కొత్త బాధ్యతని ఆనందంగా స్వీకరించి
...క్కడే అరగంట గడిపి, గడియారం పదికొడ్తూ వుండగా భార్గవ గది
...వేశించి లోనికి అడుగుపెట్టింది.

.............

ఆ అలంకరణలో 'పవిత్రనం' లేదు. చిన్నపిల్లలు కట్టిన మాలలు
...వ్యస్తంగా మంచానికి వేలాడుతున్నాయి. వెలిగించిన అగరొత్తులు కొస
...కూ వచ్చి చివర్లు మెరుగుతున్నాయి. కానీ ఆమె చూస్తోంది వాటినికాదు,
...తలా గది లోపలి భాగాన్ని చూడగానే ఆమె ఒక క్షణం అచేతనురా
...ది. అంతలో వెనుక అలికిడై వెనుదిరిగి చూసింది. దొంగతనంగా
...మ్మం తలుపు చాటునుంచి చూస్తూన్న జీన్నీ పట్టుబడిపోయి, తల్లిని
...క్కరించి దొంగలా లోపలికి వెళ్ళిపోయింది.

వసుమతికి వున్నట్టుండి ఎందుకో దుఃఖం వచ్చింది. అయితే ఆ
...ఖం విచారంవల్ల వచ్చినది కాదు. కొద్దిగా విచారమూ, కొద్దిగా ఉద్వే
...మూ, భరించలేని ఆనందమూ అన్నీ కలవటం వల్ల వచ్చిన కన్నీళ్ళు
...వి. ముగ్గురు పిల్లలు- తమకు తెలిసీ తెలియని జ్ఞానంతో అల్లిన ఆ

పొదరిల్లుని చూసి- 'నా గురించీ ఆలోచించే వారున్నారన్న' అ
కళ్ళచేరిన చెమ్మ అది. అతికష్టంమీద తనని తాను సంబాళించుకు

ఆమెని మరి ఇబ్బంది పెట్టటం ఇష్టం లేనట్టుగా భార్గవ
వేసేసేడు.

* * * *

అప్పుడు రాత్రి పదకొండయింది.

అతడి పక్కన ఊర్మిళ వుంది.

అతడు ఆమెవంకే చూస్తున్నాడు. చాలా సామాన్యమైన
ఆ శరీరం విద్యుల్లత కాదు. ఆ లలాట మర్ధచంద్రమూ, ఆ
దర్పణమూ కావు. జడ భృంగావళి కాదు. కేశాలు చామరాలుగా
బొమ్మలు స్మర చాపాలు గానీ కావు.

అయినా ఆమె అతని భార్య.

నాసిక తిలప్రసూనమూ, నేత్రము కందళీ కుట్మలమూ,
ఉత్పలపంక్తి, దంతము ముత్యమూ- పలుకు వేణునాదమూ-

అయినా ఆమె అతని భార్య.

నఖములు కుందకళికలై- స్తనములు, చక్రవాకములై,
మైనదై, వళులు విచ్చెనులై- పృష్ఠము కాంచన పట్టమై,
పులినమై, ఊరువులు కదళీకాండములై, హాసము వెన్నెలై,
ఫేనమై, కైవరమై ప్రభవించిన అప్సరస కాదు.

కానీ అతని భార్య.

అది చాలు.

చాలామంది అనుకుంటారు- ఆకర్షణ వల్ల ప్రేమ పుడు
అది తప్పు.

ప్రేమ కేవలం రెసిప్రొకేషన్ వల్లే పుడుతుంది. తొలి స్ప
తొలిరాత్రి అనుభవంలోనో, అవతల్నుంచి వచ్చే రెసిప్రొకేషన్
పెరిగి అన్ని రంగాలకూ విస్తరించి రెండు జీవితాలు పెనవేసుకో
తోడ్పడుతుంది. చూడటానికి చాలా చిన్న విషయంగా కనబడినా
ఎంతో వాస్తవముంది. ప్లెటానిక్ లవ్‌కి కూడా ఈ వాస్తవం
స్తుంది. అయితే అందులో రెసిప్రొకేషన్ భావాలకి సంబంధించినది

వాస్తవంపట్ల అవగాహన లేని మరో విషయం.... అహర్నిశలూ నిచేసే మనిషి ఐహికవాంఛల గురించి. పని-వాంఛ డైరెక్ట్‌ల ప్రోపొర్ష టని చాలామంది భావించరు. పనిచేసే కొద్దీ అలసట దూరమై సమయం లా ఊరుకుండో వాంఛకూడా అలానే పెరుగుతుంది. అతడి సంబంధాలు ుదటి భార్యతో సరిగ్గా లేవన్న విషయం వాస్తవమే. పోతే అతడికి తిక విలువలపట్ల పెద్దగా నమ్మకంలేదు. కానీ నమ్మకం లేకపోవటము రు. వదులుకునే శ్రమ తీసుకోవటం వేరు. ఇంతకాలం గడిచిపోయే వితాన్ని అలాగే గడిచిపోనిచ్చేడు. ఆ నిర్లిప్తతని ఛేదిస్తూ ఇప్పుడు దురుగా ఈమె వుంది. మనసనే సముద్రంలో కోరిక ఉత్తుంగ తరం మై కాలం వేసిన చెలియలికట్టని దాటుతూంది. ఈమె తన జీవితంతో లా కలిసిపోతుందో చూడాలి. పెదవిమీద నవ్వూ, కడుపుమీద ముడతా ంసిద్ధతని సూచిస్తున్నాయి.

ఆమె అతడివేపు చూసింది. ఆమె భావాలు వేరు. ఆమె దీని ురించి చదివిందే తప్ప తెలీదు. మనసు వణుకుతూంది. దాంట్లోనూ ొద్దిగా ఆనందం లేకపోలేదు. అయితే ఈ ఆనందంకన్నా- తనకంటూ ఒక ఇల్లు తన గురించి కూడా ఇకనుంచీ ఆలోచించే వాళ్ళున్నారన్న ంతృప్తి ఎక్కువ. సంతృప్తినుంచి కోరిక పుడుతుంది. అసంతృప్తి నుంచి పుట్టే ఆవేశంకన్నా- సంతృప్తినుంచి పుట్టే ఆవేశం ఆహ్లాదకర మయినది.

అందుకే అతడు ఆమె భుజాలమీద చేతులు వేయగానే అప్రయ త్నంగా దగ్గరికి జరిగింది. అతడు మొట్టమొదటిసారి ఆమెని నుదుటిపైన పాపటి దగ్గర చుంబించాడు. ఒక అధికారాన్ని శాసిస్తున్నట్టూ ఒక ప్రేమని పంచి ఇస్తున్నట్టూ, ఒక ఆర్తిని ఇద్దరం పంచుకుందామన్నట్టూ వుందా తొలిముద్దు. అంతే, ఆ తర్వాత ఉవ్వెత్తుగా లేచిన కెరటం అతడిని ఉక్కిరి బిక్కిరి చేయబోయింది. చేతుల్ని తలపీ ఒకేసారి క్రిందికి జార్చేడు. అతడి ఆత్రంలో అనుభవం వుంది.

అంతలో ఆమె అతడినుంచి విడివడి సాలోచనగా "ఏదో శబ్దం రావటంలేదూ" అనడిగింది.

అతడు చెవులు రిక్కించి విన్నాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. ఇద్దరూ ఒకర్నొకరూ చూసుకున్నారు. కొంచెంసేపు మౌనంగా వుంది

అతడు ఆమెవేపు కదలబోయాడు. అప్పుడు వినిపించింది.... ప్రస్ఫుటంగా....

ఊఊఊమ్ అని....

సన్నటి మూలుగు.

ఇద్దరూ పడిపడిగా పక్కగదిలోకి వెళ్ళారు. ప్రార్థన మూలుగుతుంది. భార్గవ ఆమె వంటిమీద చేయివేసి చటుక్కున

వళ్ళు కాలిపోతూంది.

ముందు ఏదయినా ఇంజెక్షన్ చేద్దామా అనుకుని, ప్రయత్నం విరమించుకుని జ్వరం తగ్గటానికి మాత్ర వెతికాడు. వసుమతి ప్రార్థనని నిద్రలేపింది. టాబ్లెట్ వేసి వేయగానే జారుకుంది. ప్రార్థనకి ఇలా వున్నట్టుండి జ్వరం వచ్చి తిరిగి తగ్గి మాటిమాటికీ జరుగుతున్నా ఇప్పుడొచ్చినంత తీవ్రంగా ముందెన్నడూ రాకపోవటంతో ఆమె కంగారుపడింది.

"పదిరోజులయి పోయిందప్పుడే. మనం డాక్టర్ దగ్గరికి వెళ్ళనేలేదు" అంది.

"ఏ డాక్టర్ దగ్గరికి?"

"రాబర్ట్సన్ చెప్పారుగా?"

"ఎందుకు? తగ్గిపోతుంది!" అంటూ కూతురిమీద మళ్ళీ సారి చెయ్యివేశాడు. మునుపటంత తీవ్రత లేదుగానీ, ఇంకా వుంది. వసుమతి మంచం దగ్గరగా కుర్చీ లాక్కుని వేసుకుం "నేనిక్కడ వుంటాను" అంది. భార్గవ ఏదో అనబోయి ఆమె మొ చూసి "సరే" అన్నట్టూ తల పంకించి వెనుతిరిగేడు.

అతడు పడుకున్నాడన్న మాటేగానీ నిద్ర పట్టలేదు. గంటో గంటలో గడిచి వుంటాయి. లేచి గడియారం చూస్తే మూడైంది. గదిలోకి వచ్చాడు. వసుమతి కుర్చీలో కూర్చునే ఒక చేతిని చేతిమీద వేసి నిద్రపోతూంది. అతడు కూతుర్ని మరోసారి స్పృశిం టెంపరేచర్ తగ్గిపోయింది. వసుమతిని లేపి సరిగ్గా పడుకొమ్మని మనుకుని మళ్ళీ మనసు మార్చుకుని ఆ గదిలోంచి బయటికొచ్చే

అతడు తిన్నగా తన గదికి వెళ్ళలేదు. లోపల పూలు

పెడుతున్నాయి. తలుపు తెరుచుకుని బయటకొచ్చాడు. విశాలమయిన కాంపౌండులో విసిరేసినట్టున్న పురాతనమైన ఇల్లు.

అతడు ఆ చీకటిలో అలానే చాలాసేపు నిలబడ్డాడు. ఆకాశం మేఘావృతమై వుంది. చల్లటిగాలి రివ్వున వీస్తూంది, ఏ క్షణమైనా వర్షం మొదలయ్యేలా వుంది. ఎందుకో అతడికి సోమశేఖరం గుర్తొచ్చాడు ఆ క్షణాన.

## 4

'డాక్టర్ అన్నాజీరావు హెమటాలజిస్టు'

అన్న బోర్డుకి ఎదురుగా కూర్చుని ఉన్నారు ఇద్దరూ. టైము పదకొండు కావొస్తూంది. ఆ ఆస్పత్రి వరండా నానా గందరగోళంగా వుంది. ఒక తల్లి పిల్లాడ్ని తీసుకుని బయటకు వచ్చింది. వరండాలో దూరంగా తల్లులూ, పిల్లలూ, పెద్దవాళ్ళూ కూర్చుని వున్నారు. రోగులు ఎవరో, తీసుకొచ్చిన వాళ్ళెవరో తెలియటంలేదు. పావుగంట తర్వాత వాళ్ళకి పిలుపు వచ్చింది. ప్రార్థన చెయ్యి పట్టుకొని ఆమె లోపలికి ప్రవేశించింది.

విశాలమైన గది మధ్యలో తెల్లటి టేబుల్ వెనుక కూర్చుని వున్నాడు డాక్టర్. అతడిని చూడగానే ఎవరికయినా సదభిప్రాయం కలుగుతుంది. తెల్లటిజుట్టు, విశాలమయిన నుదురు. ఎత్తుగా బలంగా వున్నాడు.

ప్రార్థనని చూడగానే 'ఓ నువ్వా' అన్నాడు చిర్నవ్వుతో.

"మొన్న నీ డాన్సుకి వచ్చాను. నా మనవరాలు నీ క్లాసే. పట్టు పట్టి నీ డాన్సుకి తీసుకొచ్చింది మమ్మల్నందర్నీ! తెలుసుగా రజిత"

వసుమతి తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. డాక్టర్ తెలిసిన వాడవటం ఆమెకు రిలీఫ్ నిచ్చింది.

"కంగ్రాట్స్ పాపా! నీ డాన్స్ చాలా బావుంది" పక్కనున్న కుర్చీమీద కూర్చోపెడుతూ అన్నాడు అన్నాజీరావు. తర్వాత తల్లి వేపు తిరిగి రాబర్ట్‌సన్ వెళ్ళిపోతూ కేసు పూర్తిగా స్టడీ చెయ్యమని చెప్పాడు. "ప్రార్థన అంటే ఎవరో అనుకున్నాను" అని ఆగి "మొత్తం అరగంటసేపు

వట్టవచ్చు. మీరు కాస్త బయట కూర్చుంటారా" అని ఇంగ్లీషులో
మర్యాదగా. "ఎంతసేపు అక్కర్లేదు. అరగంట"

వసుమతి క్షణం తటపటాయించింది. పరీక్ష జరిగినంతసే
పక్కనే వుండవచ్చు అనుకుంది. అయినా ఏమీ మాట్లాడకుండా
కొచ్చేసింది.

అన్నాజీరావు ప్రార్థనవేపు తిరిగి నవ్వేడు. "నువ్వు చేసిన
బటమ్స్‌లోకి అదే బావుందమ్మాయ్. ఏమిటది. పేర్? అదే.... అల
టమో. ఏది ఏమిటది?" అనడిగాడు తల గోక్కుంటూ.

ప్రార్థన నవ్వేసి 'తరంగం' అంది.

లోపల ఈ సంభాషణ జరుగుతూ వుంటే బయట వసుమతి
'ఐసోలేషన్ సెల్' గురించి వాకబు చేసింది. మోహన్‌లాల్ క
పేరిట వచ్చిన డొనేషన్లలో ఆ ఆస్పత్రిలోనే ఐసోలేషన్ సెల్
బడింది. మామూలు ప్రపంచానికి 'దూరంగా' వుంచవలసిన పే
అక్కడ వుంచుతారు. ఆరోగ్య నిరోధకశక్తి బలహీనమైనప్పుడు
సూక్ష్మక్రిములు చాలా సులభంగా రోగిని స్వాధీన పర్చుకుంటాయి.
నిరోధించటం కోసం రోగిచుట్టూ కృత్రిమ వాతావరణం సృష్టించాలి.
ఐసోలేషన్ సెల్.

అక్కడ అన్ని తలుపులూ వేసి వున్నాయి. వరండాలు ని
ష్యంగా వున్నాయి. వసుమతి నర్సు దగ్గరకెళ్ళి 'ఏసుపాదం'
వాకబు చేసింది.

"సెల్ నెం 12" అంది నర్సు డెస్కుమీద రిజిష్టర్ చూసకు

లోపల ఒక దోమతెర కప్పిన పక్క లాంటిది వుంది. దాని
దూరంలో అద్దం కిటికీ పక్క స్టూల్‌మీద మరియమ్మ కూర్చుని
చదువుకుంటూంది. ఆ ముసలామె కూర్చున్న ఆ భంగిమలోనే
వుంది. ఆ గది నిశ్శబ్దం భయం కొల్పేలా వుంది.

అలికిడికి మరియమ్మ తలతిప్పి, 'ఎవరూ' అని అడుగుతూ
నిలబడింది.

'నేను, వసుమతిని' అంది సన్నటి స్వరంతో, అడుగు ము
వేసి! ఇప్పుడు తెరలోపల్నుంచి ఏసుపాదం కనిపిస్తున్నాడు. చూసి
ఉలిక్కిపడింది. తన స్టూడెంటేనా ఇతడు? నెలరోజుల క్రితం

క్లాసులో ఫస్ట్ వచ్చిన వాడేనా? పసక కాంతిలా, పచ్చగా పాలిపోయిన అతడి శరీరం తెల్లటి పక్కకి అతుక్కుపోయి అస్థిపంజరంలా కనపడు తూంది. సన్నటి హిస్‌మన్న ఆక్సిజన్ శబ్దం వస్తూంది. అతడి కళ్ళు తెరలోంచి చూస్తూనే వున్నాయ్. కానీ కనురెప్పల్లో కదలిక లేదు. కను గుడ్లు మాత్రం కొద్దిగా కదిలినయ్.

"ఈ కనువు వూడ్చే పనిమనిషిని చూడటానికి ఇంతకాలానికి నువ్వొన్నా వచ్చావమ్మా, సంతోషం" అంది మరియమ్మ. ఆ వృద్ధురాలి కళ్ళు ఏడ్చీ ఏడ్చీ ఎర్రబడ్డాయి. మొహంలో ముడతలు మరింత ఎక్కు వయ్యాయి.

"ఒక్కరు, ఒక్కరంటే ఒక్కరు వచ్చి పలకరించిన పాపాన పోలేదు."

వసుమతి ఇరుకునబడ్డట్టూ "ఎ....ఎలా వుంది?" అని అడిగింది.

"బ్రతకడమ్మా, వాడు బ్రతకడు. ఈ ముసలితనంలో నన్ను ఒంటరి దానిగానే బ్రతకమని వ్రాసిపెట్టాడా ప్రభువు."

"ఇంత సీరియస్‌గా వుందని నాకు తెలీదు" నెమ్మదిగా అంది వసుమతి.

ఈ లోపులో ఆ ముసలామె కాస్త తేమాయించుకుంది. "బైబిల్‌లో ప్రభువు చెప్పాడమ్మా. మనం మనచుట్టూ మనని ఓదార్చే జనం ఉండాలని ఎప్పుడు కోరుకుంటామో, అప్పుడే ఒక్కరూ దగ్గరకు రారట."

ఆమె మరో పది నిముషాలు మాట్లాడింది. వసుమతి ఆమె దగ్గర శలవు తీసుకుని వచ్చేస్తూంటే, "నా కొడుకని చెప్పటం కాదుగానీ అమ్మా వాడు రత్నం. నిజంగా రత్నమే. అటువంటి వాడిని తన దగ్గరకి ఇంత చిన్న వయసులో పిలిపించుకోవటానికి ఆ ప్రభువుకి మనసెలా ఒప్పిందో" అంది గద్గదమైన కంఠంతో.... వసుమతి ఏమీ మాట్లాడలేక పోయింది.

దోమతెర లోపల ఆ కుర్రవాడు. వీళ్ళవైపు చూడటంలేదు. ఒక అతీతమైన స్థితిలో మెలకువగావుండే, పైకప్పుకేసి చూస్తున్నాడు. ఆమెకి మాటిమాటికీ అతడే గుర్తొస్తున్నాడు. ఆ కళ్ళల్లో ఆర్తి, ఆ మొహంలో అభినత్వం.... దేముడు అతడిని తక్కువకులంలో పుట్టించాడు. సమాజం తక్కువవాడుగా నొక్కిపెట్టింది. ఆ ఇరుకు సందుల్లోంచి, చదువు అనే

ఆయుధంతో బయటకి రాబోతున్న ఆ బ్రైట్ స్టూడెంటుని- ఆ
కపు కుర్రవాణ్ని విధి ఎంత కర్కశంగా తన బాహువుల్లోకి
బోతూంది? పేరుకూడా మంచిదే పెట్టారు లింఫోబ్లాస్టిక్ లుకేమియా

ఆమె అక్కడ మరి వుండలేక ఆమె దగ్గిర శలవు
వచ్చేసింది.

ఆస్పత్రి అంటే ఆమెకు అసహ్యం పుడుతూంది. ఆమె ద
అందర్నీ వరుసగా లాక్కుంటూనే వుంది. తల్లినీ, తండ్రినీ,
తమ్ముణ్ని.

* * * *

ఆమె తిరిగి పేథాలజీ డిపార్టుమెంట్ దగ్గిరకు వచ్చేసరికి
నలభై నిముషాలయింది. ఆలస్యం అయిందని కంగారుపడు
సిస్టర్‌ని అడిగింది.

"ప్రార్థన అనే పాప తల్లి మీరేనా?"

"అవును"

"మీ కోసమే డాక్టరుగారు చూస్తున్నారు, వెళ్ళండి."

ఆలస్యం అయినందుకు తనని తాను తిట్టుకుంటూ వసుమ
తోసుకుని లోపలకు ప్రవేశించింది. లోపల డాక్టరు ఎవరితో
మాట్లాడుతున్నాడు.

ప్రార్థన గదిలో లేదు.

వసుమతి విస్మయంతో చుట్టూ చూసింది. అన్నాజీరావ
మని చేత్తో సైగచేసి, మరో రెండు నిమిషాలు మాట్లాడి ఫోన్ పె
ఆ డాక్టరు మొహంలో మునుపటి ఉత్సాహం, హుషారు లేకపో
ఆమె గమనించింది. అతడి నుదుటిమీద ముడుత ఇప్పుడు
స్పష్టంగా కనిపిస్తూంది. ముఖ్యంగా- ఆమెని చూసి అతడు న
నవ్వలేదు. ఆమె వళ్ళు అకారణంగా జలదరించింది.

"మిసెస్ భార్గవా" అన్నాడు. "ఒక పరీక్ష చెయ్యడానికి
మతి కావాలి."

"అంతా.... అంతా బాగానే వుందికదా" కంఠాన్ని ఎంత
లుగా వుంచుకోవటానికి ప్రయత్నించినా అందులో ఆతృత ధ్వ

"అంతా బాగానే వుంది మిసెస్ భార్గవా" అంటూ డె

నుంచి ఒక కాగితం ఆమె ముందుకు తోశాడు. దీనిమీద మీ సంతకం కావాలి, ఒక స్పెషల్ పరీక్ష నిర్వహించటానికి-"

ఆమె కాగితాన్ని చేతుల్లోకి తీసుకోకుండా "ప్రార్థన ఎక్కడుంది?" అని అడిగింది.

"లోపల రూమ్‌లో.... మీరు కావాలంటే చూడవచ్చు. కానీ ఈ ఒక్క పరీక్ష చేస్తేనే మొత్తం అంతా పూర్తవుతుంది. ఈ పరీక్షకి మాత్రం మీ సంతకం కావాలి" అంటూ కాగితాన్ని మరింత ముందుకు తోసేడు.

ఆమె మొహం పాలిపోయింది. మామూలు పరీక్షలకోసం ఈ సంతకాలు తీసుకోరని తెలుసు. ఆ కాగితం అందుకోవటానికి బలం చాలలేదు. "ఏ పరీక్షకోసం ఈ సంతకం?" అని మాత్రం ఎలానో అనగలిగింది.

"బోన్ మారో టెస్ట్.... ఎముక లోపలి మూలుగని పరీక్ష చెయ్యాలి."

ఆమె ఒక్కసారిగా బల్లమీద తూలింది. తిరిగే గోళాలు సమస్తం ఆగిపోయినట్టూ- భూమి అగ్నిగోళమై పేలిపోయినట్టూ వణికిపోయింది.

గది గోడలు గిర్రున తిరగసాగేయి. మూసిన కళ్ళముందు ఓ దృశ్యం కదలాడింది. ఇంద్రధనస్సు ఛాయలో ఏడు గుర్రాలు పూన్చిన రథంలో దేవదూతల మధ్య ఇద్దరు పిల్లలు కూర్చుని వున్నారు. వాళ్ళ తలమీద బంగారు కిరీటాలు ధగ ధగమంటున్నాయి. రథం మేఘాల మధ్య నుంచి సాగి అదృశ్యమైపోయింది.

* * * *

ఇంతలో డాక్టర్ అన్నాజీరావు ఛుఙంతో తలుపు తోసుకుని లోపలికి వచ్చాడు. అతడు తన శరీరానికి చేతులు దూరంగా వుంచుకున్నాడు. అతడి వెనుకే ఇద్దరు సిస్టర్స్ వచ్చారు. ఒకామె లావుగా భయంకరంగా వుంది. ఒకామె మొహంలో మాత్రం చిరునవ్వు! కాస్త దయ కనబడుతున్నాయి.

వాళ్ళని చూడగానే ప్రార్థన కళ్ళలో భయం కొట్టొచ్చినట్టు కనబడింది. నర్సు అందించిన టవల్‌తో చేతులు తుడుచుకున్నాక, అతి జాగ్రత్తగా గ్లోవ్స్ తొడుక్కున్నాడు డాక్టరు. ప్రార్థన కన్నార్పకుండా అతడి చర్యలే చూస్తుంది. ఆ పాపకి ఎందుకో అంతకు ముందురోజు జరిగినట్టే తల్లో తండ్రో వచ్చి దొంగతనంగా ఆస్పత్రినుంచి తీసుకు

వెళ్ళిపోతే బావుణ్ను అనిపించింది. ఈ లోపులో నర్సు ట్రే దగ్గిర జరిపింది. దాన్ని చూడగానే పై ప్రాణాలు పైనే పోయాయి. లైట్ల కాంతి ఆ స్టెయిన్‌లెస్ స్టీల్ పరికరాలమీద వికృతంగా మెరుస్తుంది.

ఆ ట్రే దగ్గిరకి వస్తుంటే ప్రార్థన పక్కమీద లేచి కూర్చోబోయింది. కానీ అంతలోనే ఒక లావులాటి చెయ్యివచ్చి ఆమెని వెనక్కి నొక్కి పెట్టింది.

"ప్లీజ్...." అన్నాడు డాక్టరు. కానీ అతడి కంఠంలో అభ్యర్థనకన్నా ఆజ్ఞ ఎక్కువగా వుంది.

"నాకు.... నాకు నాన్న కావాలి" అంది నిస్సహాయంగా.

అతడు దాన్ని వినిపించుకోకుండా "కాల్ అనదర్ సిస్టర్..." అన్నాడు. లావుపాటి నర్సు వెళ్ళి ఇంకోకామెతో తిరిగి వచ్చింది.

అన్నాజీరావు ప్రార్థనవేపు తిరిగి నవ్వేడు. ప్రార్థన కళ్ళలో భయం కొట్టొచ్చినట్టు కనబడింది. "మీరేం చేస్తారిప్పుడు" అని అడిగింది.

అదే నవ్వుతో "ఒక్క నిమిషం ఓపికపట్టమ్మా, అయిపోతుంది" అన్నాడు డాక్టరు వంగుతూ. ఆమె గింజుకుంటూ "ఊహూ, నేను వెళ్ళిపోతాను- నేను వెళ్ళిపోతాను" అన్నది.

"ప్రార్థనా- చిన్నపిల్లలా బిహేవ్ చేయకు."

ఆమె కంటివెంట నీరు జలజలరాలింది. మేక కసాయివాడి వంక చూసినట్టు చూసింది. ఇది మామూలు సూదిగుచ్చటం కాదని ఆమెకి తెలిసిపోయింది. తను మరీ చిన్నపిల్లలా ప్రవర్తిస్తున్నానని అనుకుంది గానీ భయం ఆ భావాన్ని డామినేట్ చేస్తుంది. ముఖ్యంగా ఆమె చేతులు (సూదులు గుచ్చటంవల్ల) నొప్పిగా వున్నాయి. ఇప్పుడిక ఎక్కడ ఏం చేస్తారో తెలియటంలేదు.

ఇంతలో కాళ్ళదగ్గర ఏదో కదిలినట్టు అవుతే అటు చూసింది. లావుపాటి నర్సు తోలుబెల్టుతో తన కాళ్ళు కట్టెయ్యబోతూంది. అది చూసి చూడగానే కాళ్ళు వెంటనే వెనక్కి లాక్కోబోయింది, కానీ— రెండో నర్సు చప్పున వాటిని పట్టుకుంది. ప్రార్థన నిస్సహాయంగా, అలానే పక్కమీద వత్తిగిలి పడుకోవాల్సి వచ్చింది.

"ఒక్క నిముషం ప్రార్థనా! బి ఎ గుడ్ బేబీ...." డాక్టరు అటు తిరిగి అన్నాడు. చిన్న కత్తితో ఇంజెక్షన్ బాటిల్ చివర బద్ద

కొడుతున్న శబ్దం వినిపించింది. కొత్తగా వచ్చిన నర్సు ప్రార్థన గౌను మోకాళ్ళ పైకి ఎత్తింది. ప్రార్థన రెసిస్ట్ చెయ్యబోయి ఆగిపోయింది. ఇంతలో డాక్టరు ఇటు తిరిగి, దూదితో ఆమె తొడపైన రాసేడు. చల్లటి స్పిరిట్ లాటి ద్రవం కాలిమీదనుంచి పొత్తికడుపుమీదకి ధారగా జారింది. ఈ కొత్తరకం పరీక్ష అంత బాధగా లేకపోవటం ఆమెకి సంతృప్తి నిచ్చింది. ముఖ్యంగా రక్తపరీక్షలోలా సూదులు గుచ్చకపోవటం, ఇది ఇంత సులభంగా అయిపోతుందని అనుకోలేదు.

ఆమె రిలీఫ్‌తో కళ్ళు విప్పింది. ఎదురుగా ముగ్గురు నర్సులూ నవ్వుతూ కనపడ్డారు. కానీ వాళ్ళ మొహాలమీద నవ్వు అతికినట్టు, కేవలం తనకోసమే నవ్వుతున్నట్లూ కృత్రిమంగా వుంది. చప్పున ఆమెకేదో అనుమానం వచ్చి డాక్టరువేపు చూసింది.

డాక్టరు ఒక ఆకుపచ్చటి గుడ్డని తన కాలి పైభాగాన కప్పటం గమనించింది. డాక్టరు వెనుదిరిగి ట్రేలోంచి మరో పరికరాన్ని తీసుకున్నాడు. చెక్కలకి స్క్రూలు బిగించేముందు రంధ్రం చేయటం కోసం వడ్రంగులు ఉపయోగించే 'బర్మా'లా వుందది. ప్రార్థన దాన్నిచూసి, రాబోయే ప్రమాదాన్ని గమనించి జింకపిల్ల బెదిరినట్టు బెదిరింది. ముగ్గురు నర్సులూ షార్ప్‌గా రియాక్టు అయ్యారు. కాలి దగ్గర ఇనుప గొలుసు బిగిసినట్టు వత్తిడి ఎక్కువయింది. లేవబోయిన పాపని ఒక నర్సు వెనక్కి నొక్కిపెట్టింది. ఈ లోపులో డాక్టరు సిరెంజి తీసుకుని ఇటు తిరిగాడు. దాదాపు మూడు 'రత్నం' పెన్నుల మందంలో వున్నదా సిరెంజి.

"నో...." ఊపిరితిత్తుల్లోవున్న శక్తినంతా కూడదీసుకుని గట్టిగా అరిచింది. కాళ్ళదగ్గిరా, ఛాతీమీదా మరింత వత్తిడి ఎక్కువయింది.

అంతలో ఒక నిప్పుల్లో కాల్చిన ఇనుపముక్క దూర్చినట్టూ, చర్మాన్ని చీల్చుకుని సూది లోపల ప్రవేశించింది.

ఆ తరువాత కొన్ని నిముషాలకి ఎముక తొలుస్తున్న శబ్దం ప్రారంభమయింది. అదృష్టవశాత్తూ ప్రార్థనకి అది వినిపించలేదు. భయంతో అంతకుముందే స్పృహ తప్పింది.

* * * *

డాక్టర్ విజయభార్గవ కారు ఆస్పత్రి కాంపౌండ్‌లోకి ప్రవేశించి మొక్కల పక్కగా ఆగింది. అతడు దిగి పేథాలజీ వేపు నడిచాడు. అతడికి తన భార్య ఎక్కడనుంచి ఫోన్ చేసిందో తెలియలేదు. సరాసరి అన్నాజీరావు ఛాంబర్‌కి వచ్చాడు. అక్కడ ఆమె కనబడలేదు. ఎదురుగా వస్తున్న నర్సుని అడిగాడు.

"ఆయన థియేటర్‌లో వున్నారు" అంది. అతడికి ఏం చెయ్యాలో తోచలేదు. ప్రార్థన పరీక్ష పూర్తిచేసి అతడు థియేటర్‌కి వెళ్ళిపోతే, తల్లీ, కూతుళ్ళు ఇద్దరూ యింటికి వెళ్ళిపోవచ్చు కదా. మళ్ళీ తనకి ఫోన్ చెయ్యటం దేనికి? అందులోనూ ఇక్కడికి రమ్మని?

అతడు థియేటర్ వేపు నడిచాడు.

వరండా అంతా ఖాళీగా వుంది. డాక్టరు బహుశా ఇంకా థియేటర్‌లో వున్నాడేమో అనుకుని, కూర్చోవటం కోసం ఆంటీ రూమ్ తెరిచాడు.

అక్కడ వుంది వసుమతి. అటువేపు తిరిగి కిటికీలోంచి బయటికి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నదల్లా చప్పుడుకి వెనక్కి తిరిగి భర్తని చూడగానే గాలిలా అతడి దగ్గిరకి వచ్చింది. అతడి భుజాలు పట్టుకుని వూపేస్తూ "—ఏమండీ" అని మాత్రం అనగలిగింది. ఈ హఠాత్ పరిణామానికి అతడు నిశ్చేష్టుడయ్యాడు. ఏదో తెలియని భయంతో వళ్ళు జలదరించింది. "ఏమిటి? ఏమైంది వసుమతి?" అన్నాడు కంపిస్తున్న గొంతుతో. ఆమె మాట్లాడలేదు. ఆమె తన మెడచుట్టూ వేసిన చేతుల బరువుకి అతడు నిలదొక్కుకోలేక ముందుకు వంగవలసి వచ్చింది. ఆమెని సరిగ్గా నిల్చోపెడుతూ "ఏమిటిది. ఏమైంది?" అని మళ్ళీ ఇంకో సారి అడిగాడు.

అంతలో తలుపు తెరుచుకుని అన్నాజీరావు బయటకొచ్చాడు. పరాయివ్యక్తి వచ్చాడని కూడా ఆమె భర్తనుంచి దూరంకాలేదు. ఆమెని అలాగే పొదివి పట్టుకొని అతడు డాక్టర్ వేపు తిరిగాడు. "మీరయినా చెప్పండి, ఏమిటి అసలు విషయం?"

అన్నాజీరావు ఆమెవేపు చూసి "మీరు చెప్పలేదా?" అని అడిగాడు. వసుమతి జవాబు చెప్పలేదు. అసలు ఆమె ఈ మాటలు విన్నదో లేదో కూడా అనుమానమే.

"నేను కొంచెంసేపు బయట వుంటాను" జనాంతికంగా అని, అన్నాజీరావు బయటికి నడవబోయాడు. భార్గవ చప్పున అతడిని ఆపు చేసి "అసలేమయింది. చెప్తారా లేదా?" అన్నాడు ఇరిటేషన్ నిండిన గొంతుతో.

"వెల్...." అన్నాడు డాక్టరు. "విల్ యూ ప్లీజ్ సిట్‌డౌన్"

భార్గవ కోపంతో "విల్ యూ ప్లీజ్ టెల్ మి" అని అరిచాడు.

అన్నాజీరావు అతడివేపు తలెత్తి చూసేడు. డాక్టర్‌గా పుట్టటం మనిషి చేసుకున్న దురదృష్టం.... తప్పదు. అతడి పెదాలు స్పష్టంగా కదిలాయి. "భార్గవా...." అన్నాడు, "ప్రార్థనకి లుకేమియా."

సగం తెరుచుకున్న భార్గవ నోరు అలానే వుండిపోయింది. కళ్ళలోకి రక్తం కెరటంలా ప్రవహించింది. ఉన్నట్టుండి ఆ గది చల్లబడుతున్నట్టు, అన్నివేపుల్నుంచీ కుదించుకుపోతున్నట్టు భావన కలిగింది. ఆ గదిలో ముగ్గురు వ్యక్తుల్నీ నిశ్శబ్దం తన కబంధ హస్తాల్లోకి తీసుకుని వికటాట్టహాసం చేసింది. ఆ అచేతనావస్థలోంచి ఒక్కసారి స్పృహ వచ్చినట్టు కదిలాడు భార్గవ. మెరుపులా డాక్టర్‌ని చేరుకుని పిచ్చి ఆవేశంలో అతడి భుజాలూ, షై పట్టుకుని వూపేస్తూ "ఎంత ధైర్యం మీకు? నా మీద ప్రాక్టికల్ జోకు వేస్తారా?.... ఆఁ" అంటూ పిచ్చిగా నవ్వేసాడు. గొంతు గద్గదికమయింది. అతడి పట్టు విడిపించుకోవటానికి అన్నాజీరావు పెనుగులాడసాగేడు. వసుమతి చప్పున కదిలి వాళ్ళిద్దరి మధ్యకూ చేరుకుని బలవంతంగా భర్త చేతులు విడిపించే ప్రయత్నం చేసింది. ఎప్పుడూ ఎంతో గంభీరంగా పెద్దమనిషిలా వుండే అతడు ఆ విధంగా మారిపోవటంతో ఆమెకి ఆశ్చర్యం కలగలేదు. పైకి కనబడకపోయినా, ప్రార్థనని అతడు ఎంతగా ప్రేమిస్తున్నాడో— ప్రార్థనంటే ఎంత అభిమానమో ఆమెకు తెలుసు. అయినా ఆ పాపంటే అభిమానం లేనిదెవరికి? ఈ వార్త తెలియగానే ఆమెకైతే భూమే కంపించింది. కానీ ఇప్పుడు అతడిని వోదార్చవలసిన బాధ్యత వుంది. అసలు ప్రార్థనలాటి పాపకి అనారోగ్యం ఏమిటి? లేత చిగుర్ని తినటానికి పురుగుకెలా మనసొప్పుతుంది. విరిసీ విరియని గులాబీని కోయటానికి మనిషికెలా బుద్ధి పుడుతుంది? చిన్నారి పాపల్ని తన దగ్గిరకి అంత తొందరగా తిరిగి పిలిపించుకోవటానికి దేవుడికి ఎందుకు కోరిక కలుగుతుంది?

అన్నాజీరావు ఇబ్బందిగా అతడి చేతుల్లోంచి పైకి విడిపిం
టానికి ప్రయత్నం చేయసాగేడు. వసుమతి కూడా స్ట్రిగుల్ అ
అతడు మామూలు మనిషి అవటానికి రెండు నిముషాలు పట్టింది.
ఐదు నిమిషాల క్రితం భార్గవకీ, ఇప్పటి భార్గవకీ అసలు సంబంధ
ఎన్నో సంవత్సరాల వృద్ధాప్యం మీదపడినట్టు వున్నాడు. ము
ముడతలు స్పష్టంగా కనపడుతున్నాయి.

అతికష్టంమీద తనని తాను కంట్రోలు చేసుకుంటూ "ప్ర
లుకేమియా అని ఎలా తెలిసింది?" అని అడిగాడు.

"డయాగెజ్ చేసేం భార్గవా"

భార్గవ వెంటనే అడిగాడు— "ఏ రకం లింఫోసైటిక్?"

"సారీ భార్గవా! ఐయామ్ రియల్లీ సారీ— అక్యూట్
బ్లాస్టిక్ లుకేమియా"

అయిపోయింది. చివరి ఆశ కూడా తెగిపోయింది.

"అక్యూట్ మైలోబ్లాస్టిక్!! అక్యూట్....? అక్యూట్...."

"అవును భార్గవా! ఆమె రక్తంలో తెల్లకణాల కౌంటు
పైగా వుంది" ఇంగ్లీషులో అన్నాడు అన్నాజీరావు.

కిటికీలోనుంచి వచ్చిన బలమైన గాలితెరకి టేబిల్‌మీద
రెపరెప లాడింది.

యాభైవేలు.

ప్రతీ ఒక్క చిన్న రక్తపు చుక్కలోనూ, యాభైవేల
రక్తకణాల చొప్పున అవి వేగంగా శరీరం అంతా ప్రవహిస్తూ
కాలేయాన్నీ, మెదడునీ, మొత్తం శరీరాన్ని, ప్రాణాన్ని నిర్జీవం
టానికి కంకణం కట్టుకొని క్షణక్షణానికీ విపరీతంగా పెరిగిపోతూ
కాలహోమాన్ని సృష్టిస్తున్నాయి. దిదిత్తై....దిత్తై మంటూ విలయ
చేసిన కాళ్ళు చచ్చుబడిపోతాయి. రామ పట్టాభిషేకాన్ని, బాలగోప
అభినయించిన లేతచేతులు నిర్జీవమైపోతాయి. డాక్టర్లకేం? రెండ
చెప్పేస్తారు.... సారీ,... సారీ.... అని.

అతడు ఎడమచేతి పిడికిలి బిగించి కుడిచేతిలో కొట్టుకు
అంతలో అనుమానం వచ్చిన వాడిలా చప్పున తలెత్తి అడిగాడు....

"యూ సెడ్.... మైలోబ్లాస్టిక్ లుకేమియా"

"అవును భార్గవా"

"కానీ మైలోబ్లాస్టిక్ లుకేమియా రక్త పరీక్షలో బయటపడదు. అదైతే టాన్సిల్స్ ఆపరేషన్‌కి ముందే బయటపడి వుండేది."

అన్నాజీరావు మాట్లాడలేదు.

"బోన్ మారో ఆస్పిరేషన్ (ఎముక లోపలి మూలగ పరీక్ష) చెయ్యకుండా నా కూతురికి మైలోబ్లాస్టిక్ అని ఎలా నిర్ధారణ చెయ్యగలిగారు!" కటుగ్గా అడిగాడు.

"ఆ పరీక్ష కూడా జరపబడింది భార్గవా"

"కానీ ఆ పరీక్ష చెయ్యటానికి నేను మీకు అనుమతి ఇవ్వలేదు."

"నేను ఇచ్చాను" అన్న స్వరం పక్కనుంచి వినబడేసరికి భార్గవ విసురుగా అటు తిరిగాడు. వసుమతి తప్పు చేసేనేమో అన్న అనుమానంతో బెదిరి, తడబడుతూ మళ్ళీ ఇంకొక్కసారి "నే—నేను ఇచ్చాను" అన్నది. అతడు దాన్ని పట్టించుకోకుండా "స్లైడ్స్ ఎక్కడున్నాయ్" అని అడిగాడు.

"లాబ్‌లో"

"నేను ఒకసారి చూడాలనుకుంటున్నాను."

అన్నాజీరావు కొద్దిగా తటపటాయించి, "అలాగే" అన్నాడు. ఇద్దరూ లాబ్‌లోకి వెళ్ళారు. హెమటాలజిస్టు అందించాడు. గ్లాసుమీద చిన్న కాగితం అతికించి వుంది — 'ప్రార్థన నెం. 287462' అని. అతడికి నవ్వేసింది. ప్రార్థనకి కూడా ఒక నెంబరు ఇవ్వబడటం.

స్లైడ్‌ని మైక్రోస్కోప్ కింద అమర్చి నెమ్మదిగా కదిపాడు. [illegible] కదుల్తున్న కొద్దీ ఆకారాలు మరింత స్పష్టమవసాగేయి. అతడు ఒక కన్ను మూసి, రెండో కన్నుతో గొట్టంలోకి చూడసాగేడు. అతడి వెన్ను జలదరించింది. స్పష్టమయిన జీవాకృతిలో కళకళలాడుతూ వుండవలసిన కణాల స్థానే విభిన్న రాక్షసాకృతిలో వేలవేల న్యూక్లియోలు వున్నాయి.

అతడికి దుఃఖం వచ్చింది. అది దుఃఖం కూడా కాదు, వ్యథ. వ్యథ దుఃఖంకన్నా బాధాకరమయినది. క్రింది అద్దంలోంచి పడుతున్న

సూర్యకాంతిలో నిస్తేజంగా వున్న ఆ కణాల్ని చూసి అత పోయాడు. అది తన స్వంత రక్తమైనా కూడా అతడు అంత వుండేవాడు కాదేమో. అతడి ముఖంలో వస్తూన్న మార్పుని గమనిస్తున్నారు.

"నేను చెప్పినది కరక్టే అనుకుంటాను" అన్నాడు డాక్టరు కుంటూ. ఆ మాటలు అగ్నికి ఆజ్యం తోడైనట్టు అతడిని మరింత చేశాయి. తన చుట్టూ జరుగుతున్న కుట్రలో అందరూ ఉక్రోషం వచ్చింది. ఒక్కసారిగా స్టూల్ని వెనక్కి విసురు చేతితో మైక్రోస్కోప్ని విసిరేసేడు. అది గోడకి తగిలి పెద్ద భళ్ళున పగిలిపోయింది.

ఆ గదిలో వున్న ఇద్దరూ క్షణంపాటు స్థాణువులయ్యారు. తేరుకున్నది వసుమతే. ఒక్క వూపులో వెళ్ళి భర్త చేతులు "మీకేమైనా మతి పోయిందా?" అని అరిచింది.

సడెన్‌గా అతడిలో మార్పు వచ్చింది. ఉన్నట్టుండి కా ఆమెవంక, తనని పట్టుకున్న ఆమె చేతుల వంకా చూసేడు. అకస్మాత్తుగా వచ్చిన ఆ స్తబ్దతని చూసి ఆమె బెదిరి అతడిని వ 'మతిపోయిందా' అని తను తొందరపడి అనేసింది. ఐతే అత గురించి పట్టించుకోలేదు.

"ప్రార్థన ఎక్కడుంది?" అని అడిగాడు.

"ఐ సి–4లో"

మోహన్‌లాల్ కపాడియా జ్ఞాపకార్థం ఆస్పత్రిలో కట్ట రింగు ఐ సి–4. కేన్సర్ రోగులకి అక్కడ చికిత్స జరుగుతుంది.

అన్నాజీరావు అడుగు ముందుకు వేసి భార్గవని అనునయి చెయ్యి వేశాడు.

"పరీక్ష పూర్తవగానే ప్రార్థనని ఆస్పత్రిలో ఇన్‌పే అడ్మిట్ చేశాను. రక్తంలో క్షణ క్షణానికి పెరిగిపోతున్న తె కౌంట్‌ని వెంటనే తగ్గించాలి. మీకు తెలుసుగా డాక్టర్ మహేం దేశంలోకెల్లా ప్రసిద్ధి చెందిన కేన్సర్ స్పెషలిస్టు. అతడి ఆధ్వ ట్రీట్‌మెంట్ మొదలవబోతూంది భార్గవా! మీరూ డాక్టరే. ఈ పరి మనం ధైర్యంగా వుండాలి...."

వసుమతి కృతజ్ఞతా పూర్వకంగా అతడివైపు చూసింది. అతడి నెమ్మది, మర్యాదా ఆమెకు నచ్చినయ్. ఆ పరిస్థితుల్లో ఇంకెవరున్నా వారితో రభస జరిగి వుండేది. ఆమె అతడితో ఏదో అనబోతూ వుంటే అప్పటివరకూ ఏదో ఆలోచిస్తున్న భార్గవ కళ్ళు తెరిచి, "నేను ముందు ప్రార్థనని చూడాలి" అంటూ అక్కడున్న వారిని పట్టించుకోకుండా తలుపు తెరుచుకుని వడివడిగా బయటకు నడిచాడు. వసుమతి అతడిని అనుసరించబోయి, ఆగి- డాక్టర్‌వైపు చూసింది. అన్నాజీరావు కదలకుండా నిలబడి వున్నాడు. అతడి ముఖంలో నిర్లిప్తత ఆమెకు బాధ కలిగించింది. భర్త అతడితో మర్యాద కోసమయినా ఏమీ చెప్పకుండా అలా వెళ్ళిపోవటం భర్తమీద కోపాన్ని కలిగించింది కూడా. ఆమె దృష్టి మైక్రోస్కోపు మీద పడింది. ఆమె ఏదో అనబోతూంటే "మీరు వెళ్ళి ముందు పేషెంట్‌ని చూసిరండి" అన్నాడు అతడు. ఆమె తలూపి బయటకు వచ్చింది.

ఐ సి-4 మిగతా ఆస్పత్రికి దూరంగా వుంది. పొడవైన వరండా ఎంత నడిచినా తరగటంలేదు. అతడు ముందుకు నడిచి, ఒక సెల్ ముందు ఆగాడు.

ఆ గదిలో ప్రార్థన వుంది. కళ్ళు తెరిచే పైకప్పుకేసి చూస్తూ వుంది.

తన కూతుర్ని చూడగానే అతడి గుండె లోతుల్లోంచి ఆప్యాయత పొంగి పొర్లింది. అప్పటివరకూ వున్న కోపమూ, కసీ పోయి- వాటి స్థానే జాలీ, వేదనా నిండుకున్నాయి. క్రితంరోజు యిదే సమయానికి తనకోసం బుట్టెడు మల్లెపూలని గదిలోకి దొంగతనంగా చేరవేసి దారాల్తో మాలకట్టిన పాప ఇరవై నాలుగు గంటల్లో పూలమధ్య పడుకుని వెళ్ళిపోవటానికి ఆయత్తమవుతూంది. పువ్వులాగా రాలిపోతూంది. ఆ భావం రాగానే అప్పటివరకూ తమాయించుకున్నవాడు ఇక ఆపుకోలేక ఒక్క అడుగులో మంచం దగ్గరికి వెళ్ళి కూతుర్ని కౌగలించుకున్నాడు. ఆమెకూడా దానికోసమే చూస్తున్నట్టూ చప్పున అతడి మెడ చుట్టూ చేతులు వేసి జాలిగా 'నాన్నా' అంది. ఆ ఒక్క పదంలోనూ— "చూసేవా నాన్నా! నువ్వు లేనప్పుడు వీళ్ళంతా కలిసి నన్నేం చేసేరో" అన్న భావం వుంది. అతడు వెంటనే మాట్లాడలేదు. గుండెల్లోంచి ఉబికి

ఉబికి వచ్చే వేదనని కనపడనివ్వకుండా తమాయించుకోవటం
పనివున్నట్టూ ఆమె తలదగ్గిర దిండు సర్దేనెపంమీద తల
అలా కొద్దిక్షణాలు వుండి నెమ్మదిగా తలెత్తాడు. తెల్లగా
కూతురి మొహంమీద పట్టుకుచ్చులా పడుతున్న జుట్టుని
నుదుటిని చుంబించి "ఎలావుంది పన్నా" అని అడిగాడు.

ప్రార్థన వెంటనే జవాబు ఇవ్వలేదు. వదిలేస్తే
వెళ్ళిపోతాడో అన్నట్టుగా అతడి చెయ్యి గట్టిగా పట్టుకుని "
మేనా" అని అడిగింది.

అతడి గుండె ఒక్క-క్షణం ఆగిపోయినట్టయింది.
ఏడమ్మా?" అని అడిగాడు.

"నేను ఈ రాత్రికూడా ఇక్కడే వుండాల్దా" ఫిర్యాదు
అన్నది.

"అవునమ్మా."

"ఊహూ, నేనిక్కడ వుండను డాడీ"

"ఎంతమ్మా! ఒక్కసారి కళ్ళు మూసుకుంటే
పోతుంది"

"కానీ మ్యాలు వెళ్ళకపోతే ఎలా డాడీ? వచ్చేనె
కూడా! నేను బానే వున్నాను కదా."

"ఎంతమ్మా, ఇంకా రెండు పరీక్షలు చేసి వదిలేస్తాడు."

అతడికి ఆ పర్షంరోజు ప్రార్థనని వసుమతి
వెళ్ళినప్పటి సంగతి గుర్తొచ్చింది. ఆ పబ్లిక్ హెల్త్ సెంటర్లో
డబాయించాడు. టాన్సిల్స్ అని చూడకుండా మలేరియాకి
నందుకు....! మరి తను చేసింది ఏమిటి? కేన్సర్ ఇన్స్టి
పనిచేస్తూ కళ్ళముందు తిరుగుతున్న పాపకి కేన్సర్ అని
లేకపోయాడు.

అతడు పాప చేతిద్వారా ఎక్కించబడుతూన్న ద్రవం
బాటిల్ వైపు చూశాడు.

ప్లేట్ లెట్స్. (కొత్తరకం)

అతడు కూతురి శరీరంమీద చెయ్యివేసి, ఆప్యాయంగా
లోపలికి ప్రవహిస్తున్న ప్లేట్ లెట్స్ ఏమీ సాధించలేవని

లుసు! ఈ శరీరంలో, తను వేసిన చెయ్యి క్రింద వడివడిగా ప్రవహించే రక్తంలో వున్న వేల వేల నిర్జీవ తెల్ల కణాలు క్షణక్షణానికి అభివృద్ధి చెందుతూ, వేగంగా పెరిగిపోతూ, ఏమైనా కొద్దిగా 'మంచి' ప్లేట్‌లెట్స్ వుంటే వాటిని కూడా చంపేస్తున్నాయని తెలుసు!! పాపని రక్షించటానికి ప్రయత్నం చేసే ప్లేట్‌లెట్స్ నిస్సహాయంగా ఈ పోరాటంలో స్తున్నాయని తెలుసు!!! మనిషికి కేన్సర్ గురించి అంతా తెలుసు, రాకుండా నిరోధించడమే తెలీదు.

ప్లేట్‌లెట్స్ కాక ఇంకా ఏం వాడుతున్నారా అని అతడు తల తిప్పి చూసేడు. గోడదగ్గర వున్న బల్లమీద మూడు సీసాలు వున్నాయి.

అతడు కూతుర్ని వదిలి బల్ల దగ్గరకు నడిచాడు. చిన్న ఇంజక్షన్ బాటిల్‌లో వున్న ఆ సీసాని చేతిలోకి తీసుకుని దానిమీద వున్న పేరు చూసేడు.

కేన్స్‌క్యూర్!

భరించలేని నిస్సహాయతతోనూ, ఉక్రోషంతోనూ, అతడి మొహం బడిపోయింది. అలాగే మరో క్షణం వుండివుంటే ఏమయ్యేదో తెలీదు. టి. వెనుకనుంచి 'హల్లో' అని వినిపించింది.

గుమ్మం దగ్గిర మహేంద్రజైన్ నిలబడి వున్నాడు. దేశంలోకెల్లా గొప్ప కేన్సర్ స్పెషలిస్టు అతడు. చూడటానికి గమ్మత్తుగా వున్నాడు. కొద్దిగా పొట్టిగా, గుండ్రంగా వున్నాడు. కళ్ళు చిన్నవైనా చురుగ్గా వున్నాయి. నుదురు మాత్రం విశాలంగా వుండి, తెలివితేటల్ని స్తుంది. ఏ రోగికైనా అతడిని చూస్తే ధైర్యం, నమ్మకం కలుగుతాయి. కానీ బైటచూస్తే మాత్రం ఎవరూ అతడిని డాక్టరు అనుకోరు. మిఠాయి కొట్టు యజమాని అనుకుంటారు. కేన్సర్ రంగంలో అతడు చేసిన కృషి అపూర్వం అని చెప్పుకుంటారు. ముఖ్యంగా చిన్నపిల్లల్లో వచ్చే లింఫోబ్లాస్టిక్ లుకేమియాని నిరోధించటంలో అతడు అగ్రగామి.

మహేంద్రజైన్‌ని చూడగానే భార్గవ బైటకి వచ్చాడు. పాప ముందు ఏమీ మాట్లాడటం అతడికి ఇష్టంలేదు. వాళ్ళిద్దరూ బైటికి వస్తూంటే పశుపతి కూడా రావటం కనిపించింది.

"భార్గవా" అన్నాడు డాక్టర్ మహేంద్ర. "—కూతురి అనారోగ్యం

గురించి మాకు ఎంత తెలుసో, ఈ ఫీల్డులోనే వున్నారు కా
అంతే తెలుసు. మనం చెయ్యగలిగినంతా చేద్దాం"

భార్గవ విసుగ్గా "ఏమిటి మీరు చెయ్యగలిగింది?" అని
అతడు అలా అడిగేసరికి మహేంద్ర ఉలిక్కిపడి చూసేరు.
భర్త ప్రవర్తన అర్థంకాలేదు. దేనికైనా ఒక లిమిట్ వుంటు
రోగాన్ని డాక్టర్లే సృష్టించారన్నట్టూ ప్రవర్తిస్తున్నాడు అతడు.

"నా ప్రశ్నకి సమాధానం చెప్పలేదు మీరు" రెట్టించాడు

"వెల్" అన్నాడు మహేంద్ర. "ముందు మనం కె
(మందులు) ద్వారా పాపలో క్షణక్షణానికి పెరిగిపోతున్న కె
విరోధించాలి."

భార్గవే అన్నాడు. "నాకేమీ తెలీదనుకొని, నేనూ ఒక
తండ్రినే అనుకొని సమాధానం చెప్పండి. కెమోథెరపీలో మీ
ఏమిటి?"

"ఏముంది భార్గవా! మన దేశంలోకెల్లా అత్యంత ప్ర
మైన మందు- కేన్సర్క్యూర్."

భార్గవ అతడివైపు సూటిగా చూసి "దాని సైడ్ ఎఫెక్ట
అడుగుతున్నాను నేను. మీరు చెప్పలేకపోతే నేను చెప్తాను
మీరు శరీరంలోకి పంపించే మందు కేవలం కేన్సర్ కణాన్ని
చంపి వూరుకోదు. అది గుండెనీ కాలేయాన్నీ కూడా తినటం
ధిస్తుంది. దాంతో పేషెంటు జుట్టు వూడిపోతుంది. చర్మం చిట్లి
వికృతంగా అందవిహీనంగా తయారవుతుంది. వీటన్నిటికన్నా
మైనది.... 'బాధ' మీరు కేన్సర్ నిరోధానికి మందు ఎక్కిస్తే
ఆ శరీరం బాధతో విలవిల లాడిపోతుంది. ఆ నరకయాతన
కూడా వద్దు అనేలా వంకర్లు తిరిగిపోతుంది. పోనీ ఇదంతా చేసిన
అయినా పాప బ్రతుకుతుందా అంటే.... చెప్పండి డాక్టర్! కె
వల్ల ఎంతమంది పేషెంట్లు కేన్సర్ నుంచి కవర్ అయ్యారు?"

"దాదాపు ఎనిమిది శాతం."

"నేనడుగుతున్నది చిన్న పిల్లల్లో సాధారణంగా వచ్చే
సైటిక్ లుకేమియా గురించికాదు, నా కూతురికి వచ్చిన మైలో
లుకేమియా గురించి"

"....ఒక శాతం"

"అంటే నూటికి ఒకరన్న మాట. అదీ ఎంతకాలం? అయిదారు సంవత్సరాలు. రక్తంలో తిరిగి బలం పుంజుకుని మళ్ళీ విజృంభిస్తుంది."

మహేంద్ర విసుగ్గా "అయితే ఏం చెయ్యమంటారు? ట్రీట్‌మెంట్ మానెయ్యమంటారా?" అని అడిగాడు. వసుమతి చప్పున కదిలి అతడితో ఏదో అనబోయింది. ఈ లోపులో భార్గవే అన్నాడు. "నా కూతురు బ్రతికే ఛాన్సు నూటికి ఒక వంతు మాత్రమే వున్నప్పుడు అందుకోసం ఆ ప్రాణాన్ని నిప్పుల్లో కాల్చినట్టు బాధ పెట్టటానికి నేను ఒప్పుకోను. పోనీ అలా చేసినా ఆ తరువాత నా కూతురు ఎంతకాలం బ్రతుకుతుంది? లో అయిదు సంవత్సరాలు! నా కూతురి జీవితకాలాన్ని అయిదు సంవత్సరాలపాటు పొడిగించటానికి మాత్రమే ఇదంతా చెయ్యవలసి వస్తే దానికి నేను ఒప్పుకోను...."

మహేంద్ర అతికష్టంమీద తన కోపాన్ని అణచుకుని "మంచిది భార్గవా! ఈ రోజే మీ కూతుర్ని మీ ఇంటికి తీసుకు వెళ్ళిపోవచ్చు" అన్నాడు తాపీగా.

వసుమతి గాలిలా వాళ్ళ మధ్యకు దూసుకొచ్చి, "మీకేమయినా మతిపోయిందా" అడిగింది.

"సరిగ్గా ఇదేమాట అయిదు నిమిషాలక్రితం కూడా అన్నావు"

"అంటాను ఒకసారి కాదు- వెయ్యిసార్లు అంటాను. చావు బ్రతుకుల మధ్యనున్న పాపకి మందులు కూడా వాడకుండా వదిలేస్తారా?" హిస్టీరియా వచ్చినదానిలా అడిగింది.

"కానీ కాన్స్-క్యూర్ పేషెంట్‌ని బ్రతికించదు వసుమతీ! చావుని పోస్ట్‌పోన్ చేస్తుందంతే"

"కాని, ఈ లోపులో ఇంకేదయినా మందు కనుక్కోబడవచ్చు."

"అదికూడా కేవలం నూటికి ఒకరిమీదే ఫలిస్తుంది."

"ఆ ఒక్కరూ ప్రార్థనే కావొచ్చు."

"మూర్ఖంగా వాదించకు. కెమోథెరపీ గురించి నీకు తెలీదు. చిత్రహింస అనుభవించాల్సి వస్తుంది."

ఆమె స్వరం హెచ్చింది, "వాదిస్తున్నది మీరు! కన్నకూతుర్ని

మందులు వాడకుండా చంపెయ్యటంకన్నా— కష్టమో, నష్టమె
భరించటమే మంచిది" అన్నది.

అతడు వెంటనే రియాక్టు అయి, "అవును. దార
మంచిది" అంటూ బిగ్గరగా నవ్వి, "అయిదు సంవత్సరాలపా
భరించటమే మంచిదట— హహ్హహ్హా...." అని సడెన్‌గా నవ్వాపి,
ఇంత సులభంగా నువ్వెలా చెప్పగల్గుతున్నావో తెలుసా?" అని

"ఎలా?"

"అనుభవించేది నువ్వుకాదు కాబట్టి! ప్రార్థన నీ కన్న
కాదు కాబట్టి!! హహ్హా.... హహహ్హా.... కన్నకూతురట.... కన్న
అని తిరిగి పిచ్చిగా నవ్వసాగేడు.

ఆ క్షణం ఆమె తన స్థితి మర్చిపోయింది. తనో హై
స్కూల్ టీచర్‌ననీ, అతడో రిసెర్చి స్కాలర్ అనీ, తమ వివా
ఒకరోజు కూడా కాలేదనీ, అతడు తన భర్త అని మర్చిపోయింది.
పెట్టి అతడి చెంపమీద బలంగా కొట్టింది. కొట్టిన మరుక్షణం తనే
చేసిందో ఆమె తెలుసుకుంది. లోపల్నుంచి దుఃఖం పొంగి పొర్లు
తాను సముదాయించుకోలేక చేతుల్లో మొహం దాచుకుని కిటికీపై
భోరున విలపించసాగింది.

ఈ హఠాత్ పరిణామానికి డాక్టర్ మహేంద్ర కూడా
పయ్యాడు. బయట ఆస్పత్రి సిబ్బంది మాత్రం తన పని తాను
పోతూంది. ఇలాటి హృదయ విదారకమైన ఏడుపులు అక్క
సామాన్యమే— ఆస్పత్రి కాబట్టి....

* * * *

శేఖరం బండిని ఇంటిముందు ఆపి లోపలికి ప్రవేశించాడు.
అవర్లో ఎవరో చెప్పారు. భార్గవ ఫోన్‌చేస్తే వెళ్ళాడని. విషయం
కనుక్కుందామని బయులుదేరాడు.

బహుశా రెండో టాన్సిల్ ఆపరేషన్ గురించి వసుమతి
ఫోన్‌చేసి వుంటుందని అనుకున్నాడు. టాన్సిల్స్ గుర్తురాగానే
తాను వాగ్దానం చేసిన ఐస్‌క్రీమ్ కూడా గుర్తొచ్చింది. వెళ్తూ వెళ్తూ
ఐస్‌క్రీమ్ కొన్నాడు. అతనికి అన్నిట్లోకీ బటర్ స్కాచ్ ఇష్టం.
ప్యాక్‌చేసి బయులుదేరాడు.

ఆస్పత్రి ఆవరణలోకి అతడు ప్రవేశించి బండీ ఆపు చెయ్యబోతూంటే వరండాలోంచి వస్తూ భార్గవ కనపడ్డాడు. భార్గవ ఆకారాన్ని చూసి అతడు ఆశ్చర్యపోయాడు. జుట్టంతా చెదిరిపోయి వుంది. మనిషి ఏదో నిద్రలో నడుస్తున్నట్టు వస్తున్నట్టు వస్తున్నాడు.

శేఖరాన్ని చూసి "నన్ను కాస్త లాట్ దగ్గిర దింపుతావా" అని అడిగాడు. శేఖరం విస్మయంగా "ఏమిటి విషయం" అన్నాడు.

భార్గవ విసుగ్గా "అది చెప్తేగానీ దింపవా ఏమిటీ" అని అన్నాడు. శేఖరం నొచ్చుకుని, మారు మాట్లాడకుండా అతడి చేతుల్లోంచి తాళాలు తీసుకుని అతడి కారువైపు నడిచాడు. ఇద్దరూ కూర్చున్నాక డ్రైవ్ చెయ్యసాగేడు. భార్గవ నుదుటిమీద చెయ్యి వేసుకుని సీటు వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాడు. అయిదు నిముషాలు డ్రైవ్ చేసిన తరువాత శేఖరం తిరిగి అడిగాడు. "అసలేమైంది" అని.

భార్గవ కళ్ళు తెరవకుండానే "ప్రార్థనకి కేన్సర్ శేఖరం.... అక్యూట్ మైలో బ్లాస్టిక్ లుకేమియా" అన్నాడు.

కీచుమన్న శబ్దంతో కారు ఆగిపోయింది. వెనకనుంచి వస్తూన్న మ్యాటడర్ వ్యాను ఆ వేగానికి తట్టుకోలేక వచ్చి బంపర్ని ఢీ కొనబోయి అతి కష్టంమీద తప్పించుకుని తిడుతూ వెళ్ళిపోయాడు. శేఖర్ వీటిని పట్టించుకోకుండా భార్గవవైపు తిరిగి "నిజమేనా.... మీరు చెప్తున్నది- నిజమేనా" అని అడిగాడు. భార్గవ మాట్లాడలేదు. అసలు ఈ లోకంలో లేనట్టే కళ్ళు మూసుకుని వున్నాడు. రెండు నిముషాల తరువాత అతడు కళ్ళు విప్పేసరికి కారు తిరిగి ఆస్పత్రి ఆవరణలో ప్రవేశిస్తూ వుండటం గమనించి, చివుక్కున శేఖరంవైపు తిరిగి, "ఏమిటిది" అన్నాడు.

అతడెంతో మాట్లాడదామనుకున్నాడు. కానీ మాట రాలేదు. ఎలాగో శక్తి తెచ్చుకుని "ఒకసారి చూసి వెళ్ళిపోదాం" అనగలిగాడు. ఈ వార్త అతడిని ఎంత కదిలించివేసిందో అతడి కంఠమే చెపుతూంది.

భార్గవ ఒకసారి గొంతు పెద్దదిచేసి, "నేను వెళ్ళిపోలేక కాదు. నన్ను సాయం అడిగింది" అన్నాడు.

శేఖరం అతడివైపు చిత్రంగా చూసి, "ప్రార్థనంటే నా కెంత ఇష్టమో నీకు తెలుసు కదా" అన్నాడు.

"ఇష్టమే ఇష్టంలేనిదెవరికి? అందుకే ఇష్టం వచ్చినట్టు చేసుకోండి,

కెమోథెరపీ అన్న పేరుతో సూదులు పొడవండి. రేడియో థెర
పీతో శరీరాన్ని కాల్చండి. కాదన్నదెవరు...."

కారు ఆస్పత్రి ఆవరణంలో పక్కగా ఆపుచేస్తూ "మీరేం మ
తున్నారో నాకు అర్థంకావటంలేదు. ఈ ఆస్పత్రి కాకపోతే
ఆస్పత్రిలో చేర్పిద్దాం" అన్నాడు.

"ఏ ఆస్పత్రి అయినా ఒకటే...."

"మీకీ దేశపు ఆస్పత్రులమీద నమ్మకం లేకపోతే అందరం
వేసుకుని అయినా ప్రార్థనని విదేశాలకు పంపిద్దాం. ప్రార్థన ప్ర
ఆరు మూడైనా మూడారయిన.... ప్రార్థన బ్రతకాలి."

"విదేశాలా?" బిగ్గరగా నవ్వాడు భార్గవ. "ఈ ప్రప
ఎక్కడా కేన్సర్‌కి పూర్తిగా మందు కనుక్కోబడదు, ఎందుకో
శేఖరం, కేన్సర్ చాలా పెద్ద బిజినెస్. డబ్బున్న వాళ్ళకి వచ్చే
చాలా ఖరీదయిన వ్యాధిగా వుండిపోవాల్సిందే? కేన్సర్‌ని
చెయ్యటానికి ఒక చౌక అయిన మందుగానీ మూలికగానీ కనుక్కో
మరుక్షణం అమెరికాలో కోట్ల కోట్ల రూపాయలతో స్థాపించబడ్డ
ఇన్‌స్టిట్యూట్‌లు మూలబడ్తాయి. ఎందరో కేన్సర్ స్పెషలిస్టు
వస్తారు. మొత్తం ఆర్థిక వ్యవస్థే దెబ్బతింటుంది. అందుకే ఏం
యినా అసలు మందు కనుక్కోకుండా నొక్కెయ్యటానికి ప్రయ
న్నారు. ఎవరికీ తెలియని సత్యం ఇది! నేను దీన్ని బయటపెడితే
పిచ్చెక్కిందంటారు"

"అంటే ప్రార్థనకి ఏ మందూ ఉపయోగించవద్దంటారా?"

"మరణాన్ని ప్రశాంతంగా ఆహ్వానిద్దామంటాను."

"ఆస్పత్రి నుంచి శ్మశానానికి తీసుకెళ్ళి చుట్టూ కూర్చుని
చేద్దామంటారా" కోపమూ, వ్యంగ్యము మిళితమైన స్వరంతో అడి

"ఆస్పత్రికన్నా శ్మశానమే మంచిది నా దృష్టిలో" నిర్ల
అన్నాడు భార్గవ.

శేఖరం కారుదిగి, డోరు చప్పుడయ్యేలా వేశాడు. "ఎవ
క్కర్లేదు. నేనే అంటున్నాను. మీకు పిచ్చెక్కింది" అని. మరేమీ మ
కుండా ఇంటెన్సివ్ కేర్‌వైపు వడివడిగా నడిచాడు. భార్గవ కూడా
విసురుగానూ కారు స్టార్టుచేసి పోనిచ్చాడు,

శేఖరం ప్రార్థన వున్న గదికి చేరుకొనేసరికి అక్కడ పరిస్థితి మరీ ఘోరంగా వుంది. వసుమతి ఇంకా షాక్‌నుంచి తేరుకోలేదు. శేఖరం తనని తానే మహేంద్రజైన్‌కి పరిచయం చేసుకున్నాడు.

"మీరు రావటం మాకెంతో ఆనందాన్నిస్తోంది మిస్టర్ శేఖరం! మీ స్నేహితుడు ఇక్కడంతా మెస్ చేసి వెళ్ళాడు...." అంటూ జరిగింది వివరించాడు.

శేఖరం బాధగా, "ఈ విషయంలో మీరేమీ అనుకోకండి. ఈ వేళ కాపోతే రేపైనా భార్గవని నేను ఒప్పిస్తాను" అన్నాడు.

మహేంద్రజైన్ వసుమతివైపు తిరిగి, "ఎటువంటి పరిస్థితుల్లోనూ మీరు ధైర్యం కోల్పోకండి. మీరు మా వైపు స్థిరంగా వుంటే మేమూ కాన్ఫిడెన్స్‌తో 'రెమిషన్' కోసం ప్రయత్నించగల్గుతాం."

ఆమెకు అర్థంకాలేదు. తను స్థిరంగా వుండటం ఏమిటి? పాప బాగవటం కావాలి.... అస్పష్టంగా తలూపింది.

శేఖరం అడిగాడు "మీరు మాటిమాటికీ రెమిషన్ అన్న పదాన్ని ఉపయోగిస్తున్నారు! దాని అర్థం ఏమిటి?"

"లుకేమియా (బ్లడ్ కాన్సర్)లో ముఖ్యమైన లక్షణం. —పనికిరాని తెల్లకణాలు పెరిగిపోవటం. వాటిని ఆపుచెయ్యకపోతే శరీరంలోని రక్తాన్నంతా అవి ఆక్రమించుకుంటాయి. అలా ఆపుచెయ్యగలగటాన్ని రెమిషన్ అంటారు. ముందు దాన్ని సాధించాలి— తర్వాత ఏం చేసినా"

శేఖరం అర్థమయిందన్నట్టు తలూపేడు.

"రండి, చూద్దురుగాని"

శేఖరం తటపటాయించాడు. అతడు పైకి జీవితాన్ని చాలా తేలిగ్గా తీసుకొనేవాడుగానూ, అమ్మాయిల గురించి మాట్లాడేవాడుగానూ కనిపించినా, అంతరాంతరాల్లో చాలా సున్నిత హృదయుడు. ప్రార్థన విషయం తెలిసినప్పటినుంచీ అతడి మనసు మనసులో లేదు. కానీ అతడిలో గొప్ప విషయం ఏమిటంటే, మనసుని ముఖంలో ప్రతిబింబించక పోవటం, కేవలం నవ్వునే అవతలివారికి పంచటం. ప్రార్థనని చూడలేడని తెలుసుకానీ లోపలకు వెళ్ళకపోతే బావోదు అని వెళ్ళాడు.

ప్రార్థన అతడిని చూసి విచ్చుకున్న నవ్వుతో "హలో" అంది. అతడి కళ్ళు తడి అయ్యాయి. నవ్వి "హల్లో" అన్నాడు. ప్రార్థన చేతికి

ఐ.వి. ఫ్లూయిడ్ గొట్టం వుంది కాపీ దానికి అలవాటు పడినట్టు
"ఏమిటి నువ్వుకూడా వచ్చేసేవు?" అని అడిగింది.

శేఖరం తడబడి. "నీకు జ్వరం వచ్చిందా" అన్నాడు.

"ఎవరు చెప్పారు? ఇదిగో చూడు" అంటూ ఖాళీగా వున్న
చేతిని ఎత్తింది. అతడు దాన్ని అందుకున్నాడు.

"చల్లగా వుంది కదూ"

"ఆః చల్లగానే వుంది"

"చూడు ఇంతదానికి స్కూలు మానిపించేసింది. ఇదే
వున్నప్పుడయితే ఒక్కరోజు రాకపోతే కోప్పడేది."

తల పక్కకి తిప్పుకుని వసుమతి అతికష్టంమీద తన
నిగ్రహించుకుంది.

ఈ లోపులో డాక్టర్ స్విచ్ ఆన్ చెయ్యగానే బుచ్చు
మిషన్ చప్పుడు చేసినట్టు శబ్దం అయి, రెండు సెకన్లలో
అక్షరాలు కనబడ్డాయి.

వసుమతి ఆ గదిలోంచి బయటకు వెళ్ళిపోయింది. ఆమె
జేగురు రంగులోకి మారింది. ఈ హఠాత్ సంఘటనకి కారణం
శేఖరం కూడా బయటకొచ్చాడు. వసుమతి స్తంభం పక్కగా నిల
తాను కంట్రోల్ చేసుకోవటానికి ప్రయత్నిస్తోంది.

"ఏమైంది?.... ఏమైంది?" అని అడిగాడు అనునయిస్తు

"ఆ మిషనులో అంకెలు చూసేవా శేఖరం?"

"చూసేను"

"ఎంతుంది"

"54,000"

"ప్రొద్దున ప్రార్థనని తీసుకొచ్చినప్పుడు నా కళ్ళముందే
చేసేరు. అప్పుడు కౌంటు ఎంతుందో తెలుసా శేఖరం? 50,000.
యాభై వేలు" అని, ఏడుస్తూ ఆమె "డాక్టరు నర్సుతో చెప్పుతుంటే
కౌంటు లక్ష దాటితే మనిషి దక్కదట" అంది.

శేఖరం స్థాణువయ్యాడు. అతడు ఛార్టెర్డు అకౌంటెంటు.
పుట్టి లెక్కల్లో పెరిగినవాడు! మూడు గంటల్లో నాలుగువేల
పెరుగుతున్న కణాలు లక్ష అవటానికి ఎంతకాలం పడుతుందో

లెక్కకట్టాడు. మరణం ఎంత దూరంలో వుందో అంత సరీగ్గా లెక్కకట్టి చెప్పగలిగిన ఆ మిషన్ని చూసి అతడివళ్లు జలదరించింది. అభినందించాలా?

సైన్స్– బ్లడీ సైన్స్.

కొంచెంసేపు ఒంటరిగా వుండాలన్న కోర్కె బలీయమైంది. పసు పని అక్కడే వున్నదనీ- ఆమెకు ధైర్యం చెప్పవలసిన బాధ్యత తన మీద వున్నదనీ కూడా ఆలోచించలేదు. అతడి కళ్ళముందు ప్రార్థనే కదలాడుతుంది. ఆ రోజు డైనింగ్ రూమ్‌లో వాష్‌బేసిన్ దగ్గర చెయ్యి కడుక్కుంటూ వుంటే నీళ్ళుపోస్తూ 'నేను నిన్ను అన్నయ్యా అని పిలవచ్చునా' అని తడబడుతూ అడిగే ప్రార్థన ముఖమే కనబడుతూంది. పాపా! మమ్మల్నందర్నీ ఇంత దుఃఖంలో, వ్యథతో ముంచెయ్యటం కోసమేనా అమ్మా దేవుడు నిన్ను అంత ముగ్ధగా, అపురూపంగా, బ్రిలియంట్‌గా సృష్టించింది?

అతడు తన బండి పార్క్ చేసిన చోటికి నడిచాడు. ఈ ప్రపంచం నుంచీ, మనుష్యుల్నుంచీ అయితే దూరంగా వెళ్ళగలడుగానీ, మనసునుంచి ఎలా పారిపోగలడు? అయినా వెళ్ళిపోవాలి.... ఎక్కడా ఆగకుండా అలానే వెహికల్‌మీద గంటలతరబడి డ్రైవ్ చేయాలనిపిస్తూంది అతడికి. అంత పిచ్చిగా వుంది. విసురుగా కూర్చొని స్టార్టు చేయబోయాడు కాళ్ళ దగ్గర తడి తగిలి, వంగి చూసేడు.

ప్యాక్ చేసిన ఐస్‌క్రీమ్ కరిగి కాగితంలోంచి చుక్కలు చుక్కలుగా కారిపోతూంది.

## 5

సామ్సన్ అండ్ సామ్సన్.

పన్నెండెకరాల విస్తీర్ణంలో కట్టబడ్డ మూడంతస్తుల భవనం! ఎత్తుగా పక్కనే బాయిలర్, దానికి కొద్దిదూరంలో వాటర్ కూలింగ్ ప్లాంట్. ఒక పక్క చిన్న ఆఫీసు. ఒక డిజైనర్ గీసినట్టు పెద్ద పెద్ద పైప్లైను. సంవత్సరానికి అరవై కోట్ల అమ్మకాల్తో ఆరుకోట్ల లాభాల్తో నడుస్తూన్న మందుల కంపెనీ సామ్సన్ అండ్ సామ్సన్.

ఇద్దరు కేంద్ర మంత్రులకు అందులో వాటాలున్నాయి. రాష్ట్రి

ముఖ్యమంత్రి దగ్గర బంధువులు ఇద్దరికీ అందులో పెద్ద పెద్ద
లున్నాయి. ఆ కంపెనీలో స్త్రీయులు లేవు. ట్రేడ్ యూ
అందులో ప్రవేశించటానికి ప్రయత్నించి అంతగా సఫలీకృత
పోయాయి. సంభై శాతం బోనస్- ప్రకటిస్తూన్న భారతదేశ
తక్కువ ప్రభావంతమైన కంపెనీల్లో ఒకటి- సామ్సన్ అండ్ సా

పది సంవత్సరాల క్రితం అది చాలా సామాన్యమైన
మోహన్‌లాల్ కపాడియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కేన్సర్ రిసె
కేన్స-ట్యూర్ మందు తాలూకు పేటెంట్ కొనుక్కొన్న తరువా
దశ తిరిగింది. పేరు ధర పాతిక నుంచి నూటయాభైకి
మరిన్ని రంగాల్లో విస్తృతమైంది.

సామ్సన్ అండ్ సామ్సన్ కంపెనీ మానేజింగ్ డైరెక్ట
ఆర్. ఎస్. కె. నాయుడు. ఆరడుగుల ఎత్తు. భారీ విగ్రహం.
అందరికీ హడల్. కానీ మనిషి మాత్రం సౌమ్యుడు. సగంకాలం
భద్రాచలం, పుట్టపర్తిలాంటి ప్రదేశాల్లో గడుపుతూ వుంటారు.
సగంకాలం ఢిల్లీలో వుంటాడు. ఒక మార్వాడీ అమ్మాయిని చేసు
ఇప్పటి మాటకాదది, పాతిక సంవత్సరాల క్రితం సంగతి. ఆ
జరిగాక అతడిని అదృష్టం వరించింది అని చెప్పుకుంటారు. అతని
కేషన్స్ సంగతి ఎవరికీ తెలీదు. గత చరిత్ర గుర్తురాదు. ఆ
కలిగించదు. ఏయే దేశంలో ఏయే మందు ఎంతకి అమ్ముడు పో
ఏ మందు దిగుమతి చేసుకుంటే ఎంత లాభం వస్తుందో అత
చివర లెక్కకట్టి చెప్పగలడు. బోర్డు మీటింగ్‌లో కూర్చుంటే ఏ డై
ఏ అవసరం వుందో వాళ్ళు చెప్పకుండానే తెలుసుకోగలడు. ముఖ్య
రాజకీయాలు, సాయిబాబా భక్తులతో తాత్వికచర్చలు, భారతదే
డ్రగ్ కంట్రోలర్‌తో స్త్రీ సంబంధమైన విషయాలు ఒకే లెవల్
నుంచుకుండా మాట్లాడగలడు. అందుకే ఆరెస్కే నాయుడు కొ
'మాత్ర'తో వస్తున్నాడంటే మిగతా కంపెనీలు భయపడతాయి.
టానిక్ పరిచయం చేస్తున్నాడంటే తమ అడ్వర్‌టైజ్‌మెంట్
సరిచేసుకుంటాయి.

అంతవరకూ ఎందుకు?

అనుబంధ సంస్థగా ఒక కంపెనీ పెట్టాడు. పాలని మైదాలో కలిపి బాగా వేడిచేసి చల్లబడేవరకు ఇగిర్చి ఆ పొడిలో 'కోకో' గింజల పొడి కలిపి దానికి పంచదార చేర్చాడు— అంతే.

"న్యూట్రా కోకోమాల్ట్" తయారయింది.

దానికి ఐ.ఎస్.ఐ మార్క్ సంపాదించాడు. మరుసటి రోజునుంచీ రేడియోలో ప్రకటనలు ప్రారంభమయ్యాయి. "మీ పాప ఆరోగ్యకరమైన లేత నవ్వులు మీ ఇంట్లో ప్రతిబింబించాలనుకుంటున్నారా? ఇప్పట్నుంచే వాడటం ప్రారంభించండి.... న్యూట్రా కోకోమాల్ట్ అనారోగ్యంనుంచి తొందరగా కోలుకోవటానికి అయిదు రకాల విటమిన్లు కలిసిన మాల్టు న్యూట్రా కోకోమాల్టు రోజంతా మిమ్మల్ని హుషారుగా ఉంచటానికి కాఫీకన్నా మేలయినది.... న్యూట్రా కోకోమాల్టు."

అంతే అర్నెల్లకల్లా అది అమ్మకంలో టాప్ అయింది. అర్థరూపాయి మైదాలో రెండు రూపాయల పాలు కలిపి పన్నెండు రూపాయలకి అమ్మగలిగే ఘనత అతడికే దక్కింది. తద్వారు మాల్టుకన్నా …గోధుమలు ఇంకా ఎక్కువ బలం ఇవ్వగలవన్న సత్యాన్ని గ్రహించలేని ప్రజలు, ఈ పానీయాల్ని తాగి రోజురోజుకీ పెరుగుతున్న తమ కండల్ని, బలాన్ని చూసుకొని సంతృప్తి పడుతున్నారు. ప్రజల అజ్ఞానాన్ని పారద్రోలే బాధ్యత ప్రభుత్వానిది కాదు. (ఇప్పటి మీరు చేస్తున్నది అదే. ప్రియమైన పాఠకులారా! మీ వంటింట్లో డబ్బాలమీద కంపోజిషన్‌ని ఒకసారి పరీక్షించి చూసుకోండి) ఒక వస్తువుగానీ, ప్రొడక్టుగానీ, దానిధర, ఎలా నిర్ణయించాలో నాయుడికి బాగా తెలుసు. ఎవరెవర్ని ఎలా ఎలా ఆకట్టుకోవాలో కరతలామలకం. అన్నీ తెలియకపోతే అతడు 'కాన్సెక్యూర్'ని మిల్లీగ్రాము రెండొందలకి అమ్మగలడు.

* * * *

అక్కడ అంతా నిశ్శబ్దంగా వుంది. లోపల ఫ్యాక్టరీలో కూడా …సం పని వారు మౌనంగా చేసుకుపోతున్నారు.

పులి నిద్రపోతున్నప్పుడు బోనుచుట్టూ పేరుకున్న నిశ్శబ్దంలాంటి నిశ్శబ్దం అది. భార్గవ లోపలికి వెళ్ళడాన్ని గార్డు గమనించలేదు. అతడు

ఫెన్సింగ్ దాటి అట్టపెట్టెల మధ్యకు చేరుకున్నాడు. ఖాళీ పెట్టె
పెట్టెలమీద మాత్రం పెద్ద అక్షరాలతో వ్రాసి వుంది.

కాన్స్-కర్ఫ్యూర్ అని.

అతడు వాటిని దాటి లోపలికి వెళ్ళబోతూండే
"హేయ్ ఎవరది?" అన్న కంఠం ఒకటి బొంగురుగా వి
భార్గవ ఉలిక్కిపడి వెనుదిరిగాడు.

భార్గవ గుండెల్లో రాయి పడ్డట్టయింది. అనుమతి లేకుం
వరకూ రావటం తప్పని తెలుసు. దానికి కూడా సరి అయి
లేదు. అందుకని వెంటనే సరి అయిన సమాధానం చెప్పలేక
అతడి మౌనం అవతలి వ్యక్తికి అనుమానం తెప్పించింది.

"అగక్కడే...." అని అరచి దగ్గరకు రాబోయాడు.
అనుమానం బాగా దృఢమైనట్టూ అతడి వైఖరే చెప్తూంది.
ఏం చెయ్యాలో పాలుపోలేదు. తన పేరూ, ఉద్యోగం చెప్పొచ్చు
కానీ అక్కడికి ఎందుకు వచ్చాడో చెప్పాలి. అది
తన పేరు చెపితే ఈ విషయం శంకర్‌లాల్ వరకూ వెళ్తుంది.
కాన్స్-కర్ఫ్యూర్ పట్ల నమ్మకం లేదన్న సంగతి అతడికి తెలుసు.
పరిస్థితుల్లో తనిక్కడికి చాలా అనధికారంగా వచ్చాడన్న విష
వరకూ వెళ్ళటం బావోదు. తన పేరు చెప్పకపోతే చాలా
పరిస్థితులు ఎదుర్కోవలసి వుంటుంది. సామ్సన్ అండ్ సామ్స
సెక్యూరిటీ ఎంత కాఠిన్యమయినదో తనకి తెలియందికాదు.

భార్గవ ఈ ఆలోచనల్లో ఉండగానే ఆ గార్డు దగ్గరికి
భార్గవ చుట్టూ చూసేడు. పారిపోవటానికి చోటులేదు. ఎత్తయిన
ఫెన్సింగు. అయినా తను పారిపోవటానికి ప్రయత్నిస్తున్నా
వాళ్ళు 'షూట్' చేసినా చెయ్యొచ్చు. అందులోనూ నాయుడుగారి
చంపి ఏ బాయిలర్‌లోనో పడేస్తే బట్టలతో సహా ఆసిడ్‌లో కరిగి

అతడో నిర్ణయానికి వచ్చాడు. తనపేరు చెప్పకుండా-
వెళ్ళబోయి, దారితప్పి ఇటు వచ్చాను అని చెప్తాడు. అది
శక్యం కాని విషయమైనా, ఈ పరిస్థితులలో తప్పదు. అదే
ఆఫీసుకి తీసుకువెళ్ళి రెండు మూడు ప్రశ్నలువేసి వదిలేస్తారు
పోవచ్చు.

అతడు ఆ నిర్ణయానికి వచ్చి రెండు అడుగులు తనూ ముందుకు వేసేడు. దాంతో అవతలివ్యక్తి చటుక్కున ఆగిపోయి, చేతిలోని 'వాకీ టాకీ' (దూరంగా వున్న తనవాళ్ళతో మాట్లాడటానికి వాడే వైర్‌లెస్ టెలియంత్రం) నోటి దగ్గరికి తీసుకుని ఏదో మాట్లాడటం ప్రారంభించాడు.

భార్గవకి అర్థంకాలేదు. సామ్సన్ అండ్ సామ్సన్ చాలా పెద్ద కంపెనీ కావచ్చు. కానీ సెక్యూరిటీ విషయాలు మరీ ఇంత పకడ్బందీగా వున్నాయా? ఒక పరాయి వ్యక్తిని చూస్తే వాకీ టాకీలో చెప్పవలసిన అవసరం ఏముంది? అకస్మాత్తుగా భార్గవకి భయం వేసింది. ఏదో జరుగబోతోందని ఎందుకో అనిపించింది. పారిపోవాలి.... అక్కణ్నించి పారిపోవాలి.

భార్గవ ఆలోచనల్ని దూరంనుంచే పసిగట్టినట్టున్నాడు గార్డు, 'ఆగు' అని అరుస్తూ దగ్గరకు రాబోయాడు. ఇంతలో దూరంగా మరోవ్యక్తి రావటం కనిపించింది. భార్గవ వెనక్కి తిరిగి ఫ్యాక్టరీలోకి వెళ్ళబోయాడు. వెనకనుంచి బిగ్గరగా విజిల్ వినిపించింది. రెండు అడుగులువేసి భార్గవ ఆగిపోయాడు.

ముందునుంచి మరో గార్డు వస్తున్నాడు.

భార్గవ పని బోనులో పడ్డట్టు అయింది. తనెంత తప్పు చేశాడో అర్థమయింది. మొదటి గార్డు వచ్చినప్పుడే దగ్గరకు వెళ్ళి వివరాలు చెప్పి వుంటే బావుండేది. ఇప్పుడిక తన పేరు చెప్పటానికి కూడా వీల్లేదు.

అంతలో ఒక చిత్రం జరిగింది.

చెవులు చిల్లులు పడేలా సైరన్ వినిపించింది.

ఆ ఊళ్ళో అందరికీ సామ్సన్ అండ్ సామ్సన్ మందుల కంపెనీ నుంచి ఆ టైమ్‌కి వినబడే సైరన్ గురించి తెలుసు. ముందు సన్నగా మొదలై తరువాత ఎక్కువై క్రమక్రమంగా సన్నబడుతుంది. అది వినబడగానే వాచీలు సరిచేసుకోవటం కూడా ప్రజలకి అలవాటే. చిన్నపిల్లలకి తమాషాగా వుండే ఆ సైరన్‌ని పిల్లలు ఆడుకొనేటప్పుడు ఇమిటేట్ చేస్తూ వుంటారు కూడా.

అందువల్ల ఆ సైరన్ అతడికి ఏమీ అనిపించలేదు.

కానీ దగ్గరికి వస్తున్న గార్డులు మాత్రం ఆగి, జే
మాస్క్‌లుతీసి మొహానికి తగిలించుకోవటం చూసేడు. ద్ర
ద్రొద్దున్నే పాలు సరఫరాచేసే ప్లాస్టిక్ సంచుల్లా వున్నాయి అవి
తలమీదనుంచి క్రిందికి జార్చుకుని మెడదగ్గిర తాడు బిగించుకు
వాళ్ళు అదేదో చాలా అలవాటయిన విద్యగా, ఆ సమయానికి అలో
చెయ్యవలసిన చర్యగా వాళ్ళు దాన్ని చేస్తున్నారు. ఇంతకా
ఈ సైరన్‌ని షిఫ్టు మారటానికి వేసే సైరన్ అనుకునేవాడు.

అతడు తనచుట్టూ అంతా నిర్మానుష్యంగా వుండట
చాడు. ముగ్గురు గార్డులు మూడువైపులా వున్నా, వారు తమ
లలో నిమగ్నమై వున్నారు. ఆ తరువాత అంతకన్నా మంచి
వస్తుందనుకోలేదు. చటుక్కున నాలుగోవేపు పరిగెత్తాడు.

సైరన్ వున్నట్టుండి ఆగిపోవటంతో అక్కడ అ
నిశ్శబ్దం వ్యాపించింది. ఎండ ఇంకా తగ్గలేదు. సైరన్ మొ
నిముషాలపాటూ మ్రోగిందీ అనుకుంటే. ఈ కొద్దిపాటి సమ
తను చాలాదూరం పరుగెత్తుకుంటూ వచ్చాననుకున్నాడు అ
లెక్కన ఇంకో నిముషంలో ఆఫీసుదగ్గర వుంటాడు. పరుగెత్తే హ
వున్న భార్గవ వెనుకే గార్డులు ఆగిపోవటం, గాలి పీల్చకుండా
మాస్క్‌లు తగిలించుకోవటం గమనించలేదు.

అతడు మరో అడుగు వెయ్యగానే స్ స్ స్ మన్న శబ్ద
సారిగా వినిపించింది. అతడు తలతిప్పి చూడబోయాడు, కానీ
ఆలస్యం అయింది. కడుపులోంచి, లావా పొంగినట్టు ఏదో ద్ర
కొస్తున్న అనుభూతి కలిగింది. కళ్ళు తిరిగాయి. కాలు పట్టుతప్పి
జారిపోయాడు. కడుపులో ద్రవం వాంతిరూపంలో బైటకొచ్చింది
టికే అతడికి స్పృహ తప్పింది. గొట్టంలోంచి వస్తున్న గాలి
చుట్టుముట్టింది.

స్పృహలో లేకుండానే, హిస్టీరియా వున్న మనిషి కొట్టు
కాళ్ళు చేతులూ కొట్టుకున్నాడు. నోట్లోంచి వస్తున్న ద్రవం అ
ఉబికి వస్తూనే వుంది.

అయితే అది కడుపులో జీర్ణంకాని పదార్థంకాదు. రక్తం.

* * * *

అతను వెళ్ళేసరికి ఇల్లంతా నిర్మానుష్యంగా వుంది. వంటింట్లో జిన్నీ, శ్రీనూ తమకు తామే వడ్డించుకుని నిశ్శబ్దంగా తింటున్నారు.... మొహంతా చెదిరిపోయి, పది లంఘణాలు తీసినవాడిలా వచ్చిన అతడిని చూసి ఆ పిల్లలిద్దరూ బెదిరిపోయారు.

"ఏమైంది నాన్నా"

భార్గవ కుర్చీ లాక్కుని వాళ్ళపక్కనే మౌనంగా కూర్చున్నాడు— ఏమీ మాట్లాడలేదు.

"ఏమైంది నాన్నా" తిరిగి అడిగింది జిన్నీ.

వాళ్ళకి అర్థమయ్యేటట్టూ ఎలా చెప్తాడు? 'ఇంకో పదిరోజుల తర్వాత మీ అక్కయ్య ఈ లోకంలో వుండదు' అని వాళ్ళకే భాషలో చెప్పగలడు?

"అమ్మ, పన్నక్కా ఏరి?"

"ఇంకా ఆస్పత్రిలోనే వున్నారు."

"ఇంకా ఎందుకు?"

అతడు వివరించి చెప్తున్నట్టుగా అన్నాడు. "చూడు జిన్నీ పన్నూ సీరియస్‌గా వుంది. చాలా సీరియస్‌గా.... మీరు అల్లరి చేయకుండా... కంగారు పడకూడదు."

"ఏమైంది డాడీ?"

"ప్రొద్దున్న తనకి మారో ఆస్పిరేషన్ చేసారు."

"మారో అంటే మూలగ కదూ" అంది జిన్నీ.

భార్గవ ఆశ్చర్యంతో "నీకెలా తెలుసు?" అని అడిగాడు.

"శేఖరం అంకుల్ భోజనానికి వచ్చినప్పుడు చెప్పావు గుర్తులేదూ? ఎముకలోంచే తను మూలగ తిననని ఒట్టేసుకున్నాడు. అదేగా-"

"అవును, అదే. దాన్నే పరీక్ష చేస్తారు."

"ఎముక్కి కన్నంపెట్టి తీస్తారా?"

"అవును."

"బాగా నొప్పిగా వుంటుందా?"

అప్పటివరకూ నిశ్శబ్దంగా వున్న శ్రీనూ తలెత్తి అడిగాడు.

"అక్కకి బాగా జ్వరంగా వుందా?"

"ఉంది."

"తగ్గుతుందా?"

ఆ పిల్లవాడు చాలా మామూలుగా అడిగినా మాటిగా
భార్గవ తడబడి, తమాయించుకుని, "త....తగ్గుతుంది" అన్నా
స్నది ఆపి "డాడీ" అన్నాడు శ్రీనూ. ఏమిటన్నట్టు చూసేడు

"మొన్న వన్నక్కకి రక్తం పాడయిందని కొత్త ర
చారు?"

"అవును"

"అలాగే ఎముకలకి కష్టంపెట్టే మొత్తం మూలగ లాగే
మూలగ ఎక్కిస్తే"

మనసులోనే వాళ్ళ తెలివికి ఆశ్చర్యపడుతూ, "దాన్ని
మారో ట్రాన్స్‌ప్లాంటేషన్ అంటారు. ఇంకా మనదేశానికి రా

"వస్తే వన్నక్కకి నయం అయిపోతుందా?"

"రోగం లేతగా వుంటే నయం అవుతుంది. కేన్సర్
పెరిగిపోతే అవదు" అన్నాడు. ప్రార్థనది టెర్మినల్ కేస్ అన్న
వాళ్ళకి చెప్పదల్చుకోలేదు. (మరణం నిర్ధారణ అయి, రోగి కొ
కృశిస్తూ వుంటే దాన్ని టెర్మినల్ కేసు అంటారు.)

పిల్లలిద్దరూ చాలాసేపు మాట్లాడలేదు. ఏమనుకున్నా
శ్రీనూ తింటున్న ముక్కని కంచంలో పడేసి, "ఈ రోజు
మూలగ తినను" అన్నాడు.

టిప్సీ "నేను కూడా" అంది.

ఈ ఇబ్బందికరమైన స్థితిని తప్పించటానికి "పదండి,
తొందరగా తయారవండి, మనం ఆస్పత్రికి వెళ్ళాలి" అన్నాడు

వాళ్ళు ఆస్పత్రికి వెళ్ళేసరికి వసుమతి బయట వరండా
వుంది. కారిడార్‌లో ఇద్దర్నీ చెరోవైపునా చేతులు పట్టుకుని
భార్గవని చూడగానే ఆమెకి అంతక్రితం జరిగిన సంఘటన
తప్పుచేసిన దానిలా బాధపడసాగింది. భార్గవ మొహం
మామూలుగా వుంది. వాళ్ళు ఆమెని చూడలేదు.

వాళ్ళు ముగ్గురూ అలా ప్రార్థన మంచం దగ్గిర నిలబ
డుతూ వుంటే ఆమె దూరంగా నిలబడి చూడసాగింది. ఒక్క
కుటుంబానికి ఎంత దగ్గిరగా వచ్చి ఎంత దూరంగా వెళ్ళిపోయిం

...క్యంతా ఒకటి. తను ఒక్కతే వేరే అన్న భావం ఎంత కాదనుకున్నా ...జరుగుతుంది.

లోపల ప్రార్థన పిల్లలిద్దర్నీ చూసి "హాయ్" అంది నవ్వుతూ.

'హాయ్ పిన్నక్కా'

ఈ లోపులో భార్గవ కేస్‌షీట్ చూసేడు. సెల్‌కౌంట్ 56,000 ...లెవెల్ ఆఫ్ కాన్స్-ట్యూటర్ ఎంతుందా అని చూసేడు. 3 డోసెస్, అతడి ...పరిపడింది. పేషెంట్‌ని చేర్చి ఇంకా పూర్తిగా ఆరుగంటలు ...దు. అప్పుడే మూడు డోసులు....

టెంపరేచర్ చూసేడు. నూట ఒకటి.

భార్గవ అవన్నీ పరీక్షిస్తూంటే పిల్లలు ప్రార్థనతో మాట్లాడసాగేరు.

"పరీక్షలు మార్చి ఆఖరులో అట. ఈ రోజు బోర్డులో పెట్టారు."

"నిజమా? తొందరగా వచ్చెయ్యాలి అయితే"

ఈ లోపులో వసుమతి లోపలికి వచ్చింది. భార్గవ ఆమెతో, "నువ్వి...డే వుండాల్సి వుంటుందేమో రాత్రికి" అన్నాడు.

ఆమె బాధపడింది. అతడనకముందే ఆ మాట తను అనాల్సింది. ...లా తనెప్పుడూ లేదే.... జరిగిపోయినదానికి క్షమాపణ చెప్పుకోవాలి. ...కలి వుంది. ఎలా ప్రారంభించాలో తెలియటంలేదు. దాన్ని ఇతడు ...యకోకపోవడం మరింత బాధ కలిగిస్తూంది....నేను మీలో ఒకదానినే, ...న్నా మీలో ఒకరిగా గుర్తించండి, ప్రార్థన మీ అందరికన్నా ఎక్కువగా ...కావాలి, మీకు ఇదెలా చెప్పటం?

ఆమె మౌనాన్ని అతను మరోలా అర్థం చేసుకుని "పోనీ పిల్లల్తో ...ళ్లో వుండు, నేను ఇక్కడ వుంటాను" అన్నాడు. ఆమె కంగారుగా ...తి లేదు నేనుంటాను" అన్నది.

అతడు మరేమీ మాట్లాడకుండా, "మంచిది. ఈసారి వచ్చినపుడు ...క్కల్ని తీసుకొస్తాను" అని, పిల్లలవైపు తిరిగి "వెళదామా" ...న్నాడు. వాళ్ళు ప్రార్థనవైపు తిరిగి చెయ్యూపి, తండ్రితో కలిసి ...టకు నడిచారు. అందరూ అలా వెళ్ళిపోయేసరికి వసుమతి గోడకి ...కుని నిలబడి క్రింది పెదవిని పంటితో నొక్కిపట్టి రాబోతున్న ...ఏడ్పుని ఆపు చేసుకుంది. ఆ చిన్నపిల్లలు కూడా తన ఉనికిని

గుర్తించలేదు. ప్రార్థనకి తన దగ్గరున్నంత చనువు వీరికి
వేరే సంగతి. కాపీ.... కాపీ....

రూము ముందున్న వరండాలోంచి ఆమె క్రిందికి
బడింది. పిల్లలిద్దరూ చెరోవైపూ అతడి చేతులు పట్టుకుని
ఇంకా సాయంత్రం కాలేదు. ఎండ వేడిగా మొహానికి కొడుతు
కారు దగ్గరికి చేరుకుంటున్నారు. ఆమె అలానే నిలబడి వుంది.

ఇరవై నాలుగ్గంటల్లో జీవితం ఎంతగా మారిపోయి
కుంటూంటే బాధగా కన్నా భగవంతుడి లీలపట్ల ఆశ్చర్యంగా

* * * *

ఆమె అలా వరండా చివర నిలబడి వెళ్ళిపోతున్న భర్త
చూస్తున్న సమయానికి, మరోవైపు నుంచి శారద ప్రార్థన
లోకి ప్రవేశించింది.

"ఏమ్మా, బాగున్నావా?"

ప్రార్థన ఆమెని చూసి సంభ్రమంతో లేవబోయి, చేతి
ఫ్లూయిడ్ తాలూకు గొట్టం అడ్డుపడగా, మళ్ళీ పడుకుంటూ "
అంది సంభ్రమంతో. తన చిన్న అనారోగ్యాన్ని పరామ
టీచర్ స్వయంగా రావటం ప్రార్థనకి సంతోషాన్ని కలుగ
సంభాషణలో వచ్చింది 'శారద' అన్న విషయం మర్చిపోయిం

"ఏసుపాదాన్ని చూడటానికి వచ్చానమ్మా. నువ్వు ఇక
వని చెప్పాడు.... పాపం నీకూ కేన్సరటగా...."

ఆ పాపకి ముందు ఆమె చెప్తున్నది అర్థంకాలేదు.
వయసుకూడా లేదు. కేన్సరన్న పదం తెలుసు, దాని ప్రమా
తెలీదు. కేన్సరన్న పదంకన్నా శారద చెపుతూన్న తీరే ఆ
భయపెట్టింది.

"అందులోనూ బ్లడ్ కేన్సరొస్తే మరీ కష్టమటగా.
ఇదంతా నీ తప్పుకాదులే. ఒక్కొక్కరు అడుగుపెట్టిన వేళా
ఆ రోజు చెప్పాపెట్టకుండా శుభలేఖలు పంచినప్పుడే అను
కాలూ అవీ చూడకుండా ఈ పెళ్ళిళ్ళేమిటి? అని. అయినా
పెళ్ళిళ్ళు చేసుకునేవాళ్ళు ఇలా గపచిప్‌గానే చేసుకోవాలి.

చిత్రలు బయటపడ్తాయి. అయినా మీ నాన్నగారికి తెలియకపోతే ఏమైనా చెప్పొద్దు అమ్మాయ్.... పుట్టింట్లో వుండగా తల్లిని, తండ్రిని, తమ్ముణ్ని చంపింది. ఇప్పుడు ఈ ఇంటికొచ్చి నిన్ను.... అయినా నా కెందుకులే అమ్మాయ్! క్లాసులో బ్రిలియంట్ స్టూడెంట్ కి ప్రాణంమీద కొచ్చిందంటే మనసు ఆగక వచ్చాముగానీ- లేకపోతే నాకు అవసరం ఏముంది! వెళ్ళొస్తానమ్మాయ్...." అని లేచి బయటకొచ్చి వరండాలో నిల్చుని అటు చూస్తున్న వసుమతిని పలకరించకుండా మరోవైపునుంచి వెళ్ళిపోయింది.

క్రిందికి చూస్తున్న వసుమతి, భార్గవ కారు ఎందుకో గేటు దగ్గిర ఆగటం గమనించింది. అలా ఆగటానికి కారణం తీస్కి. ఏదో జ్ఞాపకం వచ్చినదానిలా "డాడీ ఒక్క క్షణం. ఇది ఇవ్వటం మర్చిపోయాను" అంది [illegible]గా. ఆ చేతిలో ఇంటిదగ్గర్నుంచి తెచ్చిన ప్యాకెట్ వుంది. భార్గవ నవ్వుకుంటూ కారు వెనక్కి తిప్పి ఆపుచేశాడు.

అప్పుడు వినిపించింది- గుండెలవిసిపోయేలా కేక. ఆ కంఠం వసుమతిది.

*　　　*　　　*　　　*

ఆస్పత్రి గేటునుంచి రివర్స్‌లో వెనక్కి వస్తున్న కారునిచూసి- వాళ్ళు మళ్ళీ వెనక్కి ఎందుకు వస్తున్నారో అర్థంగాక చూస్తూ నిలబడిన వసుమతికి, లోపల గదిలో ఏదో పడి భళ్ళున పగిలిన శబ్దం వినిపించింది. లోపలికి వెళ్ళింది. ఆమె ఇంకా పూర్తిగా లోపలికి వెళ్ళకుండానే 'ఏక్. క్ క్ క్' మన్న స్వరం- గొంతులో ఏదో అడ్డుపడితే ఊపిరి లోపలికి తీస్కోవటానికి కష్టపడుతూ. పాముకాటు పడ్డ కప్ప ఆఖరిక్షణంలో హృదయ విదారకంగా అరిచినట్టూ వినిపించింది.

వసుమతి లోపలికి పరుగెత్తబోయి గుమ్మం దగ్గిరే ఆగిపోయింది.

ప్రార్థన పక్కమీద లేదు.

ఒక్క క్షణంపాటు వసుమతికి చూస్తున్న దృశ్యం అర్థంకాలేదు. అర్థం అయ్యేసరికి ఆమె గుండె ఆగినంత పనయింది.

చేతికి గుచ్చిన సూది గాలిలో వేలాడుతుంది. దాని చివర రక్తం చుక్క అలాగే వుంది. పగిలిన ఐ.వి. ఫ్లూయిడ్ సీసా పెంకులు మంచానికి అటువైపు చిందర వందరగా పడివున్నాయి. ప్రార్థన ఒక చెయ్యి

ఆ గాజు పెంకులమీద పడి అక్కణ్నించి రక్తం స్రవిస్తోంది
ఆ బాధ తెలిసినట్టు లేదు. శరీరం అంతా నేలమీదకు పడిపోయి
స్టాండుకి కట్టి వుండటంవల్ల ఒక సమాధిలోంచి పొడుచుకు
పక్క వెనుకనుంచి పైకి కనబడుతూంది. ఒక కాలుకూడా
క్రిందకి జారక, గాలిలో వేలాడుతూంది.

"పన్నూ" అంది వసుమతి వణుకుతూన్న కంఠంతో.
మళ్ళీ 'పన్నూ' అని అరుస్తూ గాలిలా లోపలికి దూసుకెళ్ళి
గోడకి మధ్య జారిపోయిన ఆ పాప శరీరాన్ని రెండు చేతుల్తో
పైకి లాగింది.

ప్రార్థన ఛాతి గాలిలో ఎగిరెగిరి పడుతూంది. వసుమతి
వళ్ళోకి తీసుకుని గెడ్డాన్ని పట్టుకుని చూపబోయి, మొహం
చటుక్కున ఆగిపోయింది.

ప్రార్థన కనుపాపలు లోపలివైపు వెనక్కి తిరిగిపోయి
కనుగుడ్లు బయటికి కనపడుతున్నాయి.

"హెల్ప్" అని అరిచింది వసుమతి. ఆమె గొంతు కీచు
చింది. తరువాత వరుసగా 'హెల్ప్.... హె....ల్....ప్....'
పెడుతూనే వుంది. ఆస్పత్రి గోడలు ప్రతిధ్వనించేలా, పి
ఆమె పెడుతూన్న కేకలు విని- ఆ కంఠాన్ని ముందు గుర్తించి
కారు దగ్గర్నుంచి జావ్వలా పరుగెత్తాడు.

ఈ లోపులో పైన గదిలో హడావుడి మొదలయింది
నర్సు పరుగెత్తుకు వచ్చింది. తరువాత ఇద్దరు హౌస్ సర్జన్లు
బాగా కుర్రవాళ్ళలా వున్నారు. అందులో మరీ లేతగా వున్న
దాదాపు వసుమతి చేతుల్లోంచి పేషెంట్‌ని లాక్కొని పక్కమీద
పెట్టాడు. రెండో హౌస్ సర్జన్ పాప కండిషన్ చూసి బెదిరి
అతడి మొహం చూస్తేనే తెలుస్తుంది. నర్సుమాత్రం అను
వుంది. చప్పున బి.పి. పరికరాల్ని దగ్గరకు లాగి చేతికి
ఈ లోపున మొదటి హౌస్ సర్జన్ స్టెత్‌తో పాప ఛాతి పరీక్షించ
అన్నాడు. హార్ట్‌బీట్ చాలా ఫాస్టుగా వుంది. ఇండివిడ్యువల్
వినపడటం లేదు.

'డాక్టర్‌ని పిలవండి అర్జెంటుగా' అంది నర్సు తనే వాళ్ళమీద అరిచినట్లు. రెండో హౌస్ సర్జెన్ బయటికి పరుగెత్తాడు. ఈ లోపులో ఉన్న అతడు పాపనే పరీక్షగా చూస్తూ "సైనోటిక్‌గా కనబడటంలేదూ" అన్నారు. ఈ లోపులో ఇంకో నర్స్ పరుగెత్తుకు వచ్చింది. 'మౌత్ టు మౌత్ ఇవ్వనా' అని అడిగాడు.

వసుమతి గోడకి బల్లిలా అతుక్కుపోయి ఇదంతా చూస్తోంది. అందరూ పాప చుట్టూ చేరి చేస్తున్నది ఏమిటో— మాట్లాడుతున్న ఇంగ్లీషు పదాలు ఏమిటో ఆమెకు అర్థంకాలేదు. సముద్రంలో పడి సీరియస్ అయినా, వళ్ళు కాలి సీరియస్ అయినా ఒకటే చికిత్సలా వుంది. ఆమెకు ఒకటిమాత్రం అర్థమైంది, పాప కండిషన్ అకస్మాత్తుగా సీరియస్ అయింది. ప్రస్తుతం చాలా ప్రమాదకరంగా వుంది. చుట్టూ మూగిన మనుష్యుల మధ్యనుంచి, వడిలిపోయిన తోటకూరకాడలా కనిపిస్తూంది.

ఇంతలో వైట్‌కోట్‌లో ఒక నలభయ్ ఏళ్ళ డాక్టర్ వచ్చింది. రాగానే "ఎనీ కార్డియాక్ హిస్టరీ?" అని అడిగింది.

"లేదు డాక్టర్"

"బి. పి?"

నర్సు చెప్పింది.

"వెంటనే కార్డియోవర్షు చెయ్యాలి" అంటూ డాక్టర్ నర్సుకు ఇంగ్లీషులో తొందర తొందరగా సూచన్లు ఇచ్చింది. నర్సు బయటకు పరిగెత్తింది. ఈ లోపులో డాక్టర్ పాప గొంతు క్రింద అరచేత్తో పిడికిలి బిగించి 'ధబ్'మని గట్టిగా గుద్దింది. ఆ చప్పుడుకి వసుమతి కంపించి పోయింది. హౌస్ సర్జెన్ ఇంజెక్షన్ ప్రిపేరుచేసి, చేతికి గుచ్చాడు. ముందుగా వెళ్ళిన నర్సు చక్రాల స్టాండు తోయించుకుని వచ్చింది. ఇంకో ఇద్దరు తెల్లని కోటుల్లో వచ్చారు.

ముందు వచ్చిన డాక్టరు రెండు ఎలక్ట్రిక్ వైర్లు జాయింటు చేయబడి వున్న పాడ్‌లను ప్రార్థన వీపు వెనుక ఒకటి, ఛాతీమీద ఒకటి అమర్చి "కాస్త వెనగ్గా వుండండి" అంటూ స్విచ్ వేసింది. యాభయ్ వాట్స్ షాక్ మూడు సెకండ్లపాటు తగిలి పాప చేపపిల్లలా ఎగిరిపడి ఒక్కసారిగా

శరీరం కుదించుకుపోయి, ఆ తరువాత చేతులు గాలిలో విసిరే
కేక పెట్టింది.

భార్గవ వరండాలో ఒకవైపు నుంచి పరుగెత్తుకుంటూ
మరోవైపు నుంచి డాక్టర్ మహేంద్ర కూడా దాదాపు అదే
పరుగెత్తుకుంటూ గదిలో ప్రవేశించారు.

వాళ్ళిద్దరూ చెరోవైపు నుంచీ ప్రవేశించే సమయా
కాస్త రికవర్ అయింది. డాక్టర్ మహేంద్ర చకచకా మిగతా
సులు ఇచ్చి ప్రార్థన చేతిని తీసుకుని పల్స్ చూసి, సంతృ
పాడు. అతడు భార్గవని గమనించలేదు. వసుమతితో, "
సడెన్‌గా హార్ట్‌బీట్ ఎక్కువయిందంతే" అన్నాడు. "రం
మాట్లాడుకుందాం...." అన్నాడు ఆమెని గదిలో వుంచ
లేనట్టుగా.

వసుమతి కూతురి మొహంవైపు చూసి, పూర్వప్ర క
బయటకు నడిచింది. ఒక తోటీ గాజు. పెంకులు తుడిచేసి వె
మరో నర్సు ఇంకో బాటిల్ కోసం వెళ్ళింది.

ప్రార్థనతో పాటు గదిలో ఒక్క పాప మాత్రం మిగి
అది జీన్నీ!

ఆమె చేతిలో ఒక బొమ్మ వుంది.

తండ్రిని కారు ఆపమని, తీసుకొచ్చిన బొమ్మ అది.
క్రితం ఆ బొమ్మ తనకిమ్మని ప్రార్థన అడిగినప్పుడు. ప్రా
ఇవ్వనని పంతం పట్టిన పాప.

పడుకుని వున్న అక్కని డిస్టర్బ్ చేయకుండా, తల
తను తెచ్చిన బొమ్మని జాగ్రత్తగా పెట్టేసి, అక్కకీ
కొచ్చేసింది.

"వెంట్రిక్యులర్ ట్రాకికార్డియా" అన్నాడు మహేంద్ర
భార్గవా.... ప్రార్థన పరిస్థితి ఏమీ బాగోలేదు. మందులకు అను
అవ్వటం లేదు."

"కానీ అరగంట క్రితం కొంటు కాస్త తగ్గిందన్నారు
వసుమతి ఆశాజనకంగా. ఆ పరిస్థితుల్లో ఆ మాత్రం నమ్మ
లేకపోతే ఆమె తట్టుకునేట్టు లేదు.

"అవును, కొత్త గుణం చూపించింది. కాన్స్-క్యూర్ చాలా పవర్‌ఫుల్ మందు. రోజు విడిచి రోజు వాడాలి. కానీ ప్రార్థన శరీరంలో కేన్సర్ గంట గంటకూ వ్యాపించిపోతుంది. అందువల్ల ...."

"అందువల్ల .... మీరేం చేసేరు?"

కర్కశంగా వెనుకనుంచి కంఠం వినపడేసరికి మహేంద్ర తలతిప్పి భార్గవను చూసేడు. భార్గవ ప్రార్థన గదిలోంచి బయటకొచ్చి గుమ్మం దగ్గర నిలబడి వున్నాడు. అతడి కళ్ళు ఎర్రగా వున్నాయి. గదినీ, గదిలో డాక్టర్లని ఎలక్ట్రికల్ పరికరాల్నీ చూస్తేనే అతడికి జరిగింది అర్థమయింది.

మహేంద్ర భార్గవని చూసి, సంతోషంతో "ఓ, మీరూ వున్నారా? గుడ్" అన్నాడు.

భార్గవ నవ్వలేదు. "ప్రార్థన సడెన్ అర్రిత్‌మియాకి కారణమేమిటి?" అని అడిగాడు సూటిగా.

మహేంద్ర ఇబ్బందిగా చూసి, "వెల్ — మీరూ డాక్టరే, మీకు తెలియనిదేముంది? ప్రార్థన కౌంట్ చాలా త్వర త్వరగా లక్షవైపు సాగిపోతూంది. ఏం చెయ్యాలో- దాన్ని ఎలా ఆపుచెయ్యాలో తోచటంలేదు. కాన్స్-క్యూర్ డబుల్ డోస్ ఇచ్చాను. దాంతో ఆమె గుండె వెంటనే రియాక్ట్ అయింది. అఫ్‌కోర్స్.... ఇలాంటి తాత్కాలికమైన సైడ్-ఎఫెక్ట్స్ సాధారణమే ఒక్కసారి అసలు రోగం తగ్గిపోతే మిగతావి వాటంతట అవే కంట్రోల్ అయిపోతాయి. ఉ॥ జుట్టు రాలటం— చర్మం పెట్లిపోవటం వగైరా...." అన్నాడు.

"నే నడిగిన ప్రశ్నకి ఇంత వివరణ అనవసరం" అన్నాడు భార్గవ. అతడికి ఇంకా తన కూతురి బలహీనమైన స్వరం ఆర్ద్రంగా అరవటం వినిపిస్తూనే వుంది. తలచుకున్నకొద్దీ ఇరిటేట్ అవుతున్నాడు. "నేనడుగుతున్నది నా కూతురిలో ఇంత కొద్దిసేపట్లో ఇంత రియాక్షన్ ఎలా వచ్చిందీ అని."

"చెప్పానుగా, కాన్స్-క్యూర్ డబుల్ డోస్ వాడేమని"

"కానీ కాన్స్-క్యూర్ లాటి పవర్‌ఫుల్ మందు ఒక డోసు వేస్తే కనీసం ఇరవై నాలుగ్గంటలు వేచి చూడాలి కదా"

మహేంద్ర అవునన్నట్టు తలూపి. "మామూలు కేసుల్లో అయితే

అలాగే చూడాలి. కానీ ఇది అబ్ నార్మల్ కేసు, అందుకని దబ
ప్రయోగించి చూసేను" అన్నాడు.

"ప్రయోగించి చూసేరా" భార్గవ కంఠం కీచుమంది. "నా
బావుగానీ కోతిగానీ కాదు డాక్టర్- మీరు ప్రయోగాలు జర
అన్నాడు వెటకారమూ, కోపమూ మిళితమైన స్వరంతో.

వసుమతి చప్పున అతడి దగ్గరికి వెళ్ళి అనునయిస్తూ
"ఏమండీ" అంది. అతడు ఆమెని పట్టించుకోకుండా, "నా
ఇక్కడ చేర్పించింది రోగం నయం కావటానికి. అంతేకానీ, మీర
గాలు చెయ్యటానికి కాదు. నా కూతురికి ఇంతవరకూ ఏ గుం
లేదు. మీ ప్రయోగంవల్ల అదొచ్చింది, దీనికి మీరేం సంజాయిషీ
అన్నాడు.

మహేంద్ర ఒక్క అడుగు ముందుకువేసి, తాపీగా అ
"ఒకటే సంజాయిషీ! మా ట్రీట్‌మెంట్ మీకు నచ్చని పక్షంలో
ణ్ణించి ఇంకో అన్‌కాలజిస్టు దగ్గరకో లేకపోతే డైరక్టుగా శ్మ
తీసుకెళ్ళమని."

"ఏమిటి— ఏమన్నారు మీరూ" అని భార్గవ అడుగు
వేసేడు.

వసుమతి భయభ్రాంతురాలై "నో" అని అరుస్తూ
మధ్యకూ వెళ్ళింది.

మహేంద్ర తాపీగా– "చెప్పండి, తీసుకెళ్ళిపోతారా?" అ
డాడు. వసుమతి కంగారుగా "లేదు....లేదు" అంటూ అతడి
వెళ్ళి "డాక్టరుగారూ! ప్లీజ్" అంది. అతడు ఆమెను పట్టించు
భార్గవతో, "చెప్పండి" అన్నాడు ఇంకొకసారి. వసుమతి చేతిలో
చీటీ వుంది.

అతడు తాపీగా ఆ చీటీ అందుకుని మడత విప్పి చూసేడు.

కాన్స్-కూ్యర్.

అతడు తిరిగి దాన్ని మడతపెట్టాడు.

తనకందిస్తున్నాడేమో అనుకుని ఆమె చెయ్యి చాచింది.
ఆ చీటీని ముక్కలు ముక్కలుగా చింపి వరండా గోడమీదినుంచి

పెరేసేను. ఆమె అవాక్కయి, ఏదో అనబోతూ వుంటే అతనే అన్నాడు. "చెప్పినవన్నీ సర్దు– వెళ్ళిపోదాం."

"ఏ.... ఎక్కడికి?"

"ఇంటికి.... పాపని తీసుకుని."

మళ్ళీ ఇదేమిట్రా భగవంతుడా! అనుకుంటూ అతడివేపు వేలగా చూసింది. భార్గవ జుట్టు చిందరవందరగా వుంది. పెరిగిన గడ్డం- కళ్ళ క్రింద ముడతలు.... దాదాపు పిచ్చివాడిలా వున్నాడు. "ఇక్కడంతా తప్పు! తప్పు!! ఇది ఆస్పత్రికాదు, డబ్బులిచ్చి పిండే కార్ఖానా.... పదండి ...ప్రార్థనని తీసుకొని వెళ్ళిపోదాం" అని అతడు అంటూ వుండగా లోపల్నించి మహేంద్ర వచ్చాడు. భార్గవ అతడితో "మేము మా పేషెంట్ని తీసుకు వెళ్ళిపోవాలనుకుంటున్నాము" అన్నాడు.

మహేంద్ర విస్మయంతో "....ఎక్కడికి?" అని అడిగాడు. రాష్ట్రంలో ఇంకో కేన్సర్ ఆస్పత్రి లేదు.... దేశంలోకెల్లా అదే గొప్ప ఆస్పత్రి.

"ఎక్కడికి తీసుకెళతారు."

"శ్మశానానికి. ఇక్కడికన్నా అదే మంచిది."

డాక్టర్ మొహం ఎర్రగా మారింది. "నా కర్తవ్యంతరంలేదు. వెంటనే రిపోర్ట్ చేస్తాను" అన్నాడు. వసుమతి కంగారుగా "ఆయన మాటలు పట్టించుకోకండి" అంది. ఇద్దరూ ఒకర్నొకరు శత్రువుల్లా చూసుకున్నారు.

"లేటెస్ట్ కౌంట్ ఎంత?" భార్గవ అడిగాడు వ్యంగ్యంగా. అతడి కంఠంలో హేళన గుర్తించకుండా, "58,000" అన్నాడు మహేంద్ర సిన్సియర్‌గా.

అతడు వసుమతివైపు తిరిగి, "చూసేవా, రెమిషన్ కాదుకదా- కనీసం కూడా సాధించలేకపోయారు. ప్రొద్దున్నకి కౌంటు 65,000 అవుతుంది. అంటే రోజుకు 15,000 చొప్పున పెరుగుతున్నాయి. ఈ లెక్కన ఇంకో మూడురోజులు బ్రతుకుతుంది నా కూతురు. దీన్ని ఆపు చెయ్యటం కోసం ఈ రోజు డబుల్ డోస్ వాడారు వీళ్ళు. వీళ్ళదేం పోయింది! రేపు మూడు డోసులు వాడతారు. గుండె కాలిపోయి, స్ప్లీన్ పగిలిపోయి బాధపడేది నా కూతురు...." అంటూ ఒక నిశ్చయానికి

వచ్చినట్టూ అతను అన్నాడు. "—ఆఖరిరోజుల్లో నా కూతురు ప్ర
మరణించాలని కోరుకుంటున్నాను. అందుకే ఈ నరకకూ
తీసుకు వెళ్ళిపోవాలనుకుంటున్నాను.

మహేంద్ర అతడివైపే సూటిగా చూస్తూ "మీకు మతిపో
అన్నాడు. "ఇంకెవరైనా ఈ మాట అని వుండే అరెస్టు చేయిం
వాణ్ని."

"నాకు కాదు పోయింది, మీకు! మీ అందరికీ!! నా
నయంకాదు. మీరందరూ వేయి గొంతుకల్తో కాదన్నా అది న

"మీరంత నిశ్చయంగా ఎలా చెప్పగలరు?"

"కెమోథెరపీ మీద నాకు నమ్మకం లేదు కాబట్టి."

"అదీ, అలా చెప్పండి! మసూచిని నయంచేసే విధానంలో
ర్ని నయం చేయగలం అన్న 'ఇమ్యూనో థెరపీ' మీద! మీ వి
ఇలాంటి ముదిరిపోయిన అక్యూట్ కేసులు నయంకావు. అందుకే
పాటున మా పద్ధతిలో ఈ కేన్సరు నయం అవుతే, ఇక మిమ్మ
రిసెర్చినీ ఎవరూ గుర్తించరు.... మీ ఉద్యోగాలు పోతాయి....
స్వార్థం.... మీరెంత స్వార్థపరులంటే మా విధానంలో ఎక్కడ
అయిపోతుందో అని. చివరికి స్వంత కూతురి ప్రాణాలు బలిపె
కూడా సిద్ధపడ్డారు. దానికి మీరు అందంగా తొడుగుతున్న ము
'మీరు నయం చెయ్యలేరు' అని. నమ్మల్ని మాటిమాటికీ దెప్పి
టం.... మీ స్వార్థాన్ని చూస్తూంటే నాకు అసహ్యం వేస్తూంది. మీ
నిరూపించుకోవటం కోసం ఒక నిండు ప్రాణాన్ని— ఒక ప
తాన్ని బలిపెడుతున్నారు. ఒక తండ్రి చెయ్యవలసిన ప
డాక్టర్‌గా కాదు, సాటి మనిషిగా సలహా ఇస్తున్నాను.

వసుమతి స్థాణువైంది. ఆమె డాక్టర్ని చూడటం లేదు,
చూస్తూంది. ఆ క్షణం అతడు డాక్టర్‌ని హత్య చేస్తాడన్పించి
పడింది. అతడు ఉషాసులో చెట్టుకొమ్మలా వూగిపోతున్నాడు.
గుర్తించిన రెండు థియరీలు, ఇద్దరు మనుష్యుల రూపంలో ఢీ కొ
పర్వతాన్ని సృష్టిస్తున్నాయి.... ప్రార్థన అంటే అతనికి ఎంత
డాక్టర్ మహేంద్ర అతడిని ఎంత దారుణంగా 'హర్ట్' చేసే

...ంచసాగింది. చప్పున భర్త దగ్గరగా వెళ్ళి 'ఏమండీ' అంటూ చెయ్యి ...ట్టుకుంది.

భార్గవ ఒక్కసారిగా ఆమెని విదిలించుకుని వెనుదిరిగాడు.

"ఏమండీ, ఎక్కడికండీ? ఒక్కక్షణం ఆగండి." అంటూ ఆమె ...త్యు అభ్యర్థనను మన్నించకుండా విసవిసా కారు దగ్గరికి నడిచి, ...ర్లో సహా వెళ్ళిపోయాడు.

ఆమె చిత్తరువులా నిలబడిపోయింది. డాక్టర్ కూడా వెళ్ళటానికి ...క్తమవుతూ, "నా ఆఫీసుకు రండి. డిశ్చార్జి సర్టిఫికెట్టు ఇస్తాను" ...న్నాడు నిర్లిప్తంగా....

ఆమె గాలిలా అతడి దగ్గరకు వెళ్ళి అతని చేతుల్ని పట్టుకుని, ...ంతమంది మనుష్యుల మధ్య నేను మీకు చేతులెత్తి నమస్కరించ ...ను ఈ నడి వరండాలో మీ కాళ్ళమీదపడి ప్రార్థించలేను. కానీ మీ ...ంతగా పట్టింపుతో ఈ స్థితి ఇలాగే కొనసాగిందంటే మాత్రం ...మరొక్క క్షణంకూడా భరించలేను డాక్టర్‌గారూ! నాకు పిచ్చెక్కి ...ంది.... నన్ను రక్షించండి. ప్లీజ్.... నన్ను రక్షించండి."

అప్పటివరకూ ఎంతో నిగ్రహం చూపించిన ఆమె అలా ఒక్క ...సారిగా బావురుమనేసరికి మహేంద్ర కరిగిపోయాడు. "రండమ్మా నాతో ...ండి" అంటూ తన గదివైపు కదిలాడు.

అతడి గదిలో ఆమె తేరుకోవటానికి అయిదు నిమిషాలు పట్టింది. ...న్నాడు- "ఒక చిన్న పాపని బాధపెట్టటం మాకు మాత్రం ఇష్టమా? ...చిన్న విషయం మీ భర్త అర్థం చేసుకోడేం?"

ఆమె మాట్లాడలేదు.

"మామూలు పేషెంట్లు అందరికన్నా ఈ కేస్‌ని చాలా జాగ్రత్తగా చూస్తూ మీ అమ్మాయిని నేనే స్వయంగా నా పర్యవేక్షణలో వుంచి ట్రీట్ చేస్తున్నాను. మీరే చూసేరు కదా! నా కసలు టైమ్ వుండదు. ...నా ప్రతి అరగంటకీ ఎక్కడున్నా నాకు రిపోర్టు అందచెయ్యమని ...న్నాను. ఇంత ఇంటరెస్టు తీసుకోవలసిన అవసరం నాకు లేదు. నాకు ...డబ్బు ప్రైవేటు ప్రాక్టీసు కూడాలేదు.... పోనీ ఆ ఇంటరెస్టుతో ఏమైనా ...స్తున్నానా అంటే- అది మీకు తెలుసు కదా."

ఆ విషయం నిజమే. ఇరవై నాలుగ్గంటలూ అ
అంకితమయిన కొద్ది డాక్టర్లలో మహేంద్ర ఒకరు. ఆ విష
కాదనలేదు. ఆమె తలెత్తి అతడికి క్షమాపణలు చెప్పుకో
అతడు కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు. తనలో తాను
కొంటున్నట్టూ అన్నాడు.... "నాకేగానీ ప్రార్థనలాంటి కూ
పరిస్థితి ఎదురవుతే ఏం చేస్తాను?" అని వెనక్కి తిరిగాడు.
తీసుకోను. కొన ప్రాణం వున్నా దాని కోసం చివరివరకూ
ఈ పోరాటంలో నా కూతురి చేతులూ, కాళ్ళు, అందం అన్నీ
వచ్చినా సరే, నేనా బొందిలో ప్రాణం నిలపటానికే
ప్రయత్నిస్తాను. ఎందుకంటే 'ప్రాణం' అన్నిటికన్నా ముఖ్యం

మంద్రస్వరంతో అతడు తనని ఒక తండ్రిగా వూహి
మాట్లాడే ఆ మాటలు వింటూంటే ఆమె కనుల నీరు నిలి
మైన మనసుతో అలానే చూస్తూ వుండిపోయింది.

"నేను మీకు మొదటిరోజే చెప్పాను– కేన్సర్ భయంక
ట్రీట్‌మెంట్ పేషెంట్‌ని బాలా బాధ పెడుతుందని.... మీరు
వుతో వుండాలని కూడా అన్నాను. మేమిదంతా మీకు చెప్ప
మాదే తప్పు. కానీ మేమేమీ రహస్యంగా, మా లాభం కోసం
లేదే ఇది...."

ఆమె తలూపింది.

"ఇప్పుడు జరుగుతున్నది చూస్తుంటే, మీ భర్త ఏ
పాపని ఇక్కడ్నుంచి తీసుకుపోయేటట్టు వున్నారు.
అపార్థం చేసుకోకండి. ఏ క్షణం పేషెంటు వుంటుందో....
వెళ్ళిపోతుందో తెలియని పరిస్థితులలో ట్రీట్‌మెంట్ కష్టం.
ఏ డాక్టర్‌కైనా...."

ఆమె అర్థం చేసుకున్నట్టూ "డాక్టర్‌గారూ.... మీరట
మానం పెట్టుకోకండి" అంది. "మా పాప గురించి మీరం
ఇంటరెస్టు తీసుకోవటం మా అదృష్టంగా భావిస్తున్నాం. పా
వుంటుంది. ఉంటుందని హామీ ఇస్తున్నాను" ఆవేశంగా అన్నది.

"మీరిస్తారు బాగానే వుంది. కానీ రేపేదైనా జరిగి,
ఆస్పత్రి మీద దావావేస్తే, అది వ్యక్తిగతంగా నామీ

పేషెంట్‌ని తీసుకువెళ్ళిపోతానంటే ఆపుచేసిన డాక్టరెవరూ అంటే, అది మహేంద్ర అని ప్రతివాడూ సాక్ష్యం ఇస్తాడు. నా ఉద్యోగం పోతుంది. నేనెందుకు అంత రిస్కు తీసుకోవాలో నాకు అర్థంకావటంలేదు."

"అలా అనకండి ప్లీజ్...."

"దయచేసి నా స్థానంలో వుండి మీరు ఆలోచించండి."

ఆమెకి అతడు చెప్తున్న దాంట్లో నిజం స్పష్టంగా కనిపిస్తూంది. "ఏం చెయ్యాలో చెప్పండి, మీరేది చెయ్యమంటే అది చేస్తాను. మాకు కావలసిందల్లా పాపపట్ల ఇప్పుడు మీరెంత ఇంటరెస్టు చూపిస్తున్నారో అంత శ్రద్ధతో ట్రీట్‌మెంట్ కొనసాగటం."

"అలా అయితే పాపకి మీరే గార్డియన్‌గా లిఖిత పూర్వకమైన పత్రం ఇవ్వాలి."

"నేనా...."

"అవును. కనీసం అది నా ఫైల్లో వుంటే. నాకు సేఫ్! నేను మీకు స్వార్థపరుడిలా కనపడవచ్చు. కానీ ఒక పేషెంట్ కోసం, నా ఉద్యోగాన్ని, నా పొజిషన్ని రిస్కు తీసుకోలేను. నన్ను క్షమించండి...."

"మీకెలా కావాలో చెప్పండి వ్రాసిస్తాను." అంది ఆమె ఒక నిర్ణయానికి వచ్చినట్టు.

"నిజానికి ఎలా కావాలో నాకు తెలీదు. ఇలాంటి కేసులు చూడటానికి లాయరున్నారు."

"ఇంత చిన్న విషయానికి లాయరెందుకు డాక్టర్‌గారూ."

"మీరు మామూలు తెల్లకాగితంమీద వ్రాసిస్తే అది చెల్లదనీ, మిమ్మల్ని ఇరుకున పెట్టి అది వ్రాయించుకున్నామనీ రేపు మీ భర్త వాదించవచ్చు. అందుకని ప్రతిది చట్టబద్ధంగానే చెయ్యాలి."

ఆమె లేచి "సరే" అంది.

"రేప్రొద్దున రమ్మంటాను లాయర్ని...."

ఆమె తలూపి బయటకొచ్చేసింది. ప్రార్థన వున్న గదివైపు వెళ్తూ ఆమె అనుకుంది. "రేపు భార్గవ కాస్త మంచి మూడ్‌లో ఉన్నప్పుడు ఈ విషయం చెప్పాలి. ఉత్తరం ఇస్తేగానీ వాళ్ళు ట్రీట్ చెయ్యమని

అన్నారంటే అతడు మరింత మండిపడవచ్చు.... జాగ్రత్తగా
పాపకి కాస్త గుణం కనిపిస్తే అంతా భోగమంటలా విరిపో
వరకూ తనే పీటిని చక్కబెట్టాలి. ఒక భార్యగా తన బాధ్య
పరిస్థితుల్లోనే తను బెదిరిపోకూడదు. భర్త మానసిక వ
పోతూవుంటే అతడి బాధని తనే స్వీకరించాలి. అతడికి
విశ్రాంతి నివ్వాలి.

ఆమె అలా ఆలోచిస్తూ వెళ్ళిపోయాక డాక్టర్ మ
దగ్గరికి లాక్కొని తనకు తెలిసిన లాయర్ కి ఫోన్ చేశాడు.

ప్రతివాద భయంకర వేంకట శేషాచలపతిరావు పంతు
ఉరఫ్ లాయర్ పంతులు.

పేరులోలా భయంకరంగా ఉండడు. సన్నగా, బో
పడిపోయేలా వుంటాడు. రైల్వే స్టేషన్ లో కనబడితే కూలీ
ఆస్పత్రిలో కనబడితే టి. బి. పేషెంట్ అనుకుంటాం.

కోర్టు మధ్యలో అతడు నల్లపిల్లిని కూర్చోపెట్టి తె
నిరూపించగలడు. వాల్మీకి రామాయణం వాల్మీకి వ్రాయలేదని
జడ్జిమెంట్ ఇప్పించగలడు. అతడు రాజకీయాల్లో చేరుంటే
అయివుండేవాడు. స్మగ్లర్లలో చేరివుంటే పెద్ద పారిశ్రామి
వుండేవాడు. అవేమీ చేయక లాయరుగా మిగిలిపోయాడు. ఫో
అన్నాడు.

"నేను డాక్టర్ మహేంద్రని మాట్లాడుతున్నాను."

"చెప్పండి సార్"

"ఒక కేసుంది, కాస్త సాయం చెయ్యాలి."

"ఏది సార్? కేన్సర్ కేసా?"

ఒక డాక్టరు ఫోన్ చెయ్యగానే ఒక లాయరు "ఏ
కేసా?" అని వెంటనే ఎందుకు అడిగాడో తెలుసుకోవాలం
కోర్టుకీ సంబంధం తెలుసుకోవాలి.

చాలా రకాల కేన్సర్ లలో, ట్రీట్ మెంట్ ఇవ్వటం ద
జీవితాన్ని అయిదారు సంవత్సరాలపాటూ పొడిగించవచ్చ
రకాల ట్రీట్ మెంట్ లకి లక్షనుంచీ ఎనిమిది లక్షలదాకా ఖర్చ
హరణకి ఎముకల్లో మూలగనంతా తీసేసి వేరే మూలగని ఎ

…ంగైన లక్షలు ఖర్చవుతుంది. ఒక మనిషిని (కేవలం) అయిదారు …సంవత్సరాలపాటు బ్రతికించటానికి ఇంత డబ్బు ఖర్చు పెట్టాలా? …కి ఎప్పుడూ సమస్యే. రోగికి బ్రతకాలని వుంటుంది. మిగతా …ల సభ్యులకు వుండదు. ఉండదంటే పూర్తిగా వుండదని కాదు— …న్నై ముప్పై సంవత్సరాల్నుంచీ కూడబెట్టిన డబ్బునంతా ప్రయోజనం (?) దానికి ఖర్చు పెట్టటానికి ఇష్టం వుండదు. అది పైకి చెప్పలేరు. …తరగతి కుటుంబాల్లో అయితే మనసుకీ మనిషికీ ఘర్షణ జరుగుతుంది. …తరగతిలో అయితే స్వార్జితమా పిత్రార్జితమా అన్న సమస్య తలెత్తు… తన ఆస్తి తన కుటుంబసభ్యులు తన అనారోగ్యానికి ఖర్చుపెట్టటం …కోర్టుకు వెళతాడో వృద్ధుడు. గార్డియన్, డబ్బున్న మైనర్ యొక్క …ని శ్రద్ధగా ట్రీట్ చేయడం లేదని కేసుపెడ్తారు మరొకరు? చిన్న …ల్లో మరీ కష్టం. రేడియం ట్రీట్‌మెంట్‌కి రెండు వేలంటాడు …. అంత డబ్బు వుండదు. రోగికి విషయం తెలియనివ్వరు. తలలో …కి తలనొప్పి మందు వాడతారు. ఇదంతా జరుగుతుందా? మనుష్యు… హీనంగా వుంటారా— అంటే? వుంటారు. కేన్సరూ చావు తాలూకు …మా, మనిషిని ఆ స్థితికి తీసుకెళతాయి, కోర్టుకు లాగుతాయి. అదే …కీ, కోర్టుకీ వున్న సంబంధం.

లాయరు పంతులుకి సెక్షన్లన్నీ నోటిచివర వుంటాయి. ప్రతివాక్యం …ఒక కేసు తాలూకా వివరం చెబుతూ వుంటాడు. వినేవాడికి తన …విజ్ఞానంతో స్పెల్‌బౌండ్ చేయటం అతడికివెన్నతో పెట్టిన విద్య. …సార్! ఏం చెయ్యాలి?" అని అడిగాడు.

"ప్రార్థన అని ఒక పన్నెండేళ్ళ పాపని ఆస్పత్రిలో చేర్చారు. తండ్రి …కార్గప. అతడు ట్రీట్‌మెంట్ వద్దంటున్నారు" అన్నాడు డాక్టర్ …హేంద్ర కేసు వివరాలు చెబుతూ.

"డబ్బులు ఖర్చవుతాయనా"

"కారణాలు ఏమయితేనేం.... తల్లి మాత్రం చాలా మంచిది. …వ్యవస్థురాలు. ఆమెకి సాయం చెయ్యాలి. అందుకే మీకు ఫోన్ చేసేను. …అవుతుందా?"

"హిందూ మైనారిటీ అండ్ గార్డియన్‌షిప్ యాక్ట్, సెక్షన్ 6

ప్రకారం, అయిదు సంవత్సరాలు దాటిన పిల్లలకి న్యాయ
తండ్రే. తల్లికే విధమైన హక్కూ లేదు."

"అంత సులభంగా తేల్చేస్తే ఇక మీలాంటి లాయర్ల
పంతులు నవ్వేడు. "....నారాయణదాస్ వర్సెస్
అన్న కేసులో తండ్రి పట్టించుకోకపోతే తల్లి కోర్టు
హక్కు పొందవచ్చునని పాట్నాకోర్టు తీర్పు యిచ్చిం
అన్నాడు.

"కానీ ఈ కేసులో తండ్రి తనే సంరక్షణ వహిస్తే
ఏ పరిస్థితిలో కూడా తల్లికి హక్కులేదా?"

"ఒక రకంగా అయితే ఉంటుంది"

"ఎలా?"

"ఆ కూతురు అక్రమ సంతానం అయి, ఆమె పుట్టు
ఏ సంబంధమూ లేకపోతే, సెక్షన్ సిక్స్, బి ప్రకారం
హక్కులూ వుంటాయని రాజ్యలక్ష్మి వర్సెస్ రామచంద్రన్
1967లో కోర్టు తీర్పు ఇచ్చింది."

"మిమ్మల్ని తగలెయ్య, ఇంతకన్నా మామూలు పద్ధ
"ఎందుకు లేవు! మీరు పంపించండి, నేను చూసు
న్యాయసూత్రం చెప్పినా, పిల్లలకి అన్యాయం జరక్కూడద
ఈ విషయం 1977లో సుప్రీంకోర్టు ధృవపర్చింది."

"అవును, పాప ఆరోగ్యం ముఖ్యం. అందుకే నేను
ట్గా తీసుకుని ఈ కేసుని మీ దగ్గరికి పంపుతున్నాను. ప్లీజ

"మీరు చెప్పారు కాబట్టి తీసుకోను"

"రేపు సాయంత్రానికల్లా ఆమెని గార్డియన్‌గా ధృ
కోర్టునుంచి ఆర్డర్లు కావాలి. తెప్పించగలరా?"

"లాయర్ పంతుల్ని మీరు తక్కువ ఎస్టిమేషన్
ఒక పాప ప్రాణాన్ని రక్షించటంకోసం-కావాలంటే ప్రార్థన అ
భార్గవ అనే వాడికి పుట్టలేదని నిరూపించి అయినా సరే
తెప్పిస్తాను"

"గుడ్" అని ఫోన్ పెట్టేసేదు మహేంద్ర.

# మూడు

శరీరంలో అనవసరమైన జీవకణం విపరీతంగా పెరిగిపోవటమే ...ర్!! మశూచి, టి. బి., ప్లేగు మనిషిని వంద సంవత్సరాల క్రితం ...గా భయపెట్టేవి. వాటి పేరు చెప్తేనే మనుషులు స్పృహతప్పి ...పేవారు. కాలక్రమేణా మనిషి వాటికి మందు కనుక్కొన్నాడు. ...కాలంలో ఎంతోమంది తమ ప్రాణాల్ని కోల్పోయేరు. ప్రస్తుతం ...టి. బి.ని చాలా సామాన్యమైన వ్యాధిగా చూస్తున్నాం. కానీ పాత ...నశిస్తూ ఉంటే మనిషి క్రొత్తరోగాల్ని ఎదుర్కొనవలసి ...ంది. పరిస్థితి వత్తిడులు హార్టు అటాక్ లనీ, వాతావరణ కాలుష్యం ...లనీ తయారు చేసేయి. ఈ రెండూ ప్రస్తుతం మనిషిని అమితంగా ...పెడుతున్న మారణహోమాలు. ఈ కేన్సర్ అనే రాక్షసి దావాన...లా వ్యాపిస్తూ 'రాజు-కూలి' అనే తేడా లేకుండా కాల్చేసుకుంటూ ...ంది. ప్రతి సంవత్సరం 3,00,000 మంది కేవలం ఈ వ్యాధివల్ల ...స్తున్నారు. వాతావరణ కాలుష్యం ఇలాగే కొనసాగి, ఈ లోపులో ...కి మందు కనుక్కోబడకపోతే 1999 నాటికి వేలసంఖ్యలో మాత్రమే ... అనాథ మిగులుతుంది.

కేన్సర్ అన్న పదానికి అర్థం లాటిన్ లో "పీత" (క్రాబ్). పీత ...అది అన్నివైపులకీ పాక్కుంటూ పోతుంది. కాబట్టి దానికా పేరు ...ది. దాదాపు డెబ్భై సంవత్సరాల క్రితం కేన్సర్ తో యుద్ధం ప్రారంభ...మైంది. కానీ కేన్సర్ కి మందు కనుక్కోబడటం కొన్ని "పెద్ద" ...పెనీకీ, ఇన్ స్టిట్యూట్ లకీ ఇష్టంలేదు. ఒక చిన్న మారో ట్రాన్స్...ప్లాంటేషన్ కి ఆరేడు లక్షల రూపాయల దాకా ఖర్చవుతుంది. బాగా డబ్బున్న...వాళ్ళకి వచ్చే ఈ ఖరీదయిన జబ్బుకి ఓ వందరూపాయలు ఖర్చుతో ...నయమయ్యే మందు కనుక్కోబడితే— అప్పుడింత పెద్ద పెద్ద ఆస్పత్రులూ, ...భారీ ఫీజులు వసూలుచేసే డాక్టర్లూ ఏమవుతారు? అందుకే "కొన్ని ...పెద్ద" దీన్ని నొక్కెయ్యటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. కానీ ఇది ...గదు.

శరీరంలో అవసరమైన జీవకణాలు విపరీతంగ
మనిషిని చంపటమే కేన్సర్! దీన్ని నిరోధించాలి అంటే
కణానికీ, కేన్సర్ జీవకణానికీ తేడా కనుక్కోవాలి. అలా
సైంటిస్టుకోసం భవిష్యత్తులో నోబెల్ బహుమతి సిద్ధంగా

మనిషి తనను ఛిద్రం చేసుకుంటూ - తనను సృష్టించే
క్కోవటానికి ప్రయత్నిస్తున్నాడు. లోతుకు వెళ్ళినకొద్దీ
జటిలమవుతూంది.

ఉదాహరణకు రక్తంలో వుండే ఒక హిమోగ్లోబిన్
దాని మాలిక్యూలర్ బరువు 67,000. కానీ అందులో
ఇనుము పరమాణువులు మాత్రమే. వీటి బరువు (4×
కణపు బరువులో మూడువందలో వంతు (1/300).
మిగతావన్నీ ఎమినో యాసిడ్స్. ఒక ఎమినో ఆసిడ్
120. కాబట్టి ఈ లెక్కన ఒక కణంలో 550 ఎమినో
వుండాలి.

ఈ విధంగా సైంటిస్టులు లెక్క కట్టేసరికి ఒక
రహస్యం బయటపడినట్టూ అనిపించింది.

కానీ 1935లో ఆఖరి ఎమినో ఆసిడ్ కనుక్కో
పంతొమ్మిది రకాల ఎమినో ఆసిడ్స్ వున్నాయని నిర్ధారణ
త్తంగా వీటిని గ్లైసి-వాల్-లియా-ప్రొహిస్- ఇలా పంతొ
పిలుస్తారు.

దీనినిబట్టి తేలిందేమిటంటే జీవకణంలో కేవలం
ఆసిడ్ తన స్థానం మార్చుకోవటంద్వారా మొత్తం కణం
మార్చేస్తుందన్నమాట.

ఒక ప్రొటీన్ కణంలో ఈ అమరిక ఏ వరుసక్రమం
కనుక్కున్నందుకు 1958లో 'సింగర్'కి నోబెల్ బహుమతి

అప్పట్నుంచీ మనిషికీ, దేముడికీ యుద్ధం జరుగు
దేముడి సృష్టి రహస్యాన్ని కనుక్కోవటానికి మనిషి
త్నిస్తున్నాడు. ఒక్కో విషయం తెలుస్తూన్నకొద్దీ
నంలో వున్నామో బయట పడుతూంది. మొన్న

ప్లర్' కనుక్కొనేవరకూ మన శరీరంలో ప్రవేశించిన శత్రువుల్తో యుద్ధం చెయ్యటానికి కావల్సిన యాంటీ బాడీస్‌ని తయారు చేసేది మెడ దగ్గరగా వుండే థైమస్‌గ్లాండ్ అని మనకు తెలీదు. (ఇరవై సంవత్స రాల క్రితం మనం ఇంత అజ్ఞానంలో వున్నాం.)

'పెరిగిపోవటానికి' కేన్సర్‌కీ దగ్గిర దగ్గిర సంబంధం వుందని పైన చెప్పటం జరిగింది. సృష్టికి కారణభూతమయిన సెక్స్ హార్మోను తప్పుదారి పడితే, అది కేన్సర్‌ని సృష్టించటం మొదలు పెడుతుందని హెన్రీచ్ వీలెండ్ కనుక్కొన్నాడు. ఇతడికి 1927 సంవత్సరపు నోబెల్ బహుమతి లభిం చింది. ఇది కేన్సర్ రంగంలో రెండో గెలుపు.

అప్పటివరకూ మామూలుగా వుండి, ఒక వయసు వచ్చేసరికి వేగంగా పెరిగే అవయవాలే కేన్సర్‌కి గురికావటం గమనార్హం. బాలి కల్లో పన్నెండునుంచీ పద్నాలుగు సంవత్సరాల వయసులో ఆకస్మికంగా పెరిగే స్తనాలూ, జననాంగాల్లో ఆ వయసులో వచ్చే మార్పులూ మగవాళ్లలో ప్రోస్టేట్స్‌లో వచ్చే మార్పులూ- ఇలా 'తక్కువ' సమయంలో వృద్ధి చెందే అవయవాలే ఎక్కువ కేన్సర్‌కి లోనవుతాయి.

కేన్సర్ రంగంలో ఈ విధంగా శాస్త్రజ్ఞులు ముందుకు వెళుతు న్నారు. ఎంత ముందుకు వెళ్ళినా రహస్యం శోధింపబడటం లేదు, అదంత తేలిక కాదు. ఎందుకంటే ఆ రహస్యం కనుక్కున్న మరుక్షణం స్త్రీ పురుష సంగమం అవసరం లేకుండా జీవోత్పత్తి ప్రారంభానికి అంకురార్పణ జరుగుతుంది.

*　　*　　*　　*

ఆఫ్రికా ఖండపు దక్షిణ భాగాన ఒక ప్రాంతం పేరు బోట్స్వానా. ఆ ప్రాంతమంతా చిట్టడవి. 'లింపోపో' అనే నది ఈ ప్రాంతం నుంచే ప్రవహిస్తుంది. ఇక్కడి మనుష్యులు 'చిమాంగ్‌వాతో' తెగకి చెందిన వాళ్ళు. ఈ దేశపు దక్షిణ ప్రాంతమంతా పెద్ద కల్హారా ఎడారి. ఈ ఎడా రిలో వుండే బుష్‌మెన్ అనే ఆదిమవాసులు చాలా ప్రమాదకరమైన మనుషులు.

ఈ దేశం యొక్క పూర్వచరిత్ర ఎవరికీ తెలీదు.

మొట్టమొదటి మానవుడు ఈ ప్రదేశాల్లోనే పరిణతి చెందాడని చరిత్రకారులు చెపుతారు.

అయిదువేల సంవత్సరాల క్రితం బోయర్లు అనే తెగవా
మెన్లకీ ఈ ప్రాంతంపై ఆధిపత్యం కోసం యుద్ధాలు జరుగుతు
చాలా దారుణమైన యుద్ధాలు అవి. విషం పూసిన బాణాల్తోనూ,
దాడులు జరిపేవారు.

ఎలా వచ్చాయో తెలీదుకానీ, దక్షిణ భారతదేశపు అడ
మరిశ జాతి కోయలకీ, చిమాంగ్‌వాతో తెగకీ దగ్గిర పోలికలు
కొన్ని వేల సంవత్సరాల క్రితం బహుశా వీళ్ల వలస
వుండాలి. అది వేరే సంగతి.

ఈ బుష్‌మెన్‌లు యుద్ధంలో శత్రువుల్ని జయిస్తే
మామూలుగా వదిలిపెట్టేవారు కాదు. శిరస్సు కత్తిరించి తెచ్చేవా
పౌర్ణమి రోజు ఎనిమిది రకాల మూలికలతో వంటపెట్టిన ర
ఆ తలని వేసేవారు.

రెండు నిమిషాలలో ఆ శిరస్సు చిన్న టెన్నీస్ బంతి
లోకి కుదించుకు పోయేది. అయినా ఆ మనిషి పోలికలు క
ఉట్టిపడేవి. నుదురు, నోరు, ముక్కు అన్నీ స్పష్టంగా తెలి
మచ్చలు కూడా మాయమయ్యేవి కావు. కాని తల మాత్రం
పోయేది. ఈ 'కుదింపు'కి హేతువు వాళ్ళకి తెలీదు. ఆ
శిరస్సులని మాత్రం తమ విజయానికి చిహ్నంగా తమ ఇళ్ళకి
కట్టుకునేవారు ఆ ఆదిమవాసులు.

తరువాత చరిత్ర మారింది.

బోయర్లకీ, చిమాంగ్‌వాతో తెగలకీ జరిగిన యుద్ధంలో
పోయి, బ్రిటీష్ ప్రభుత్వ రక్షణ ఆశ్రయించారు. రెండు పిల్లు
లాగ బ్రిటీష్‌వారు ఈ దేశాన్ని ఆక్రమించి పాలించటం మొద
1966లో బోచ్వానా స్వతంత్రదేశమైంది.

ఆటవికులు, రెడ్ ఇండియన్లు, బుష్‌మెన్‌లు క్రమక్రమ
రించి, అక్కడ నాగరికత విస్తరిస్తోంది.

మనిషి శరీరం కుంచించుకు పోయేటట్టూ చేసిన ఆ మూ
వివరించే సత్యం చరిత్ర పుటలలో నిక్షిప్తమై పోతూంది.

* * * *

ఒక సైన్సు జర్నల్‌లో ప్రచురితమైన ఈ వ్యాసాన్ని లాన్‌లో కూర్చొని అతడు చదువుతూ వుండగా శంకర్‌లాల్ దగ్గర్నుంచి పిలుపు వచ్చింది. అప్పుడే ఈ వార్త ఆఫీసంతా పాకిపోయినందుకు మనసులోనే ఆశ్చర్యపడుతూ అతడు ఎమ్. డి. గదిలోకి వెళ్ళాడు.

"కూర్చోండి భార్గవా! ఐయామ్ సారీ. మీ కూతురికి...." అంటూ ఇంకేదో చెప్పబోతూంటే 'ఇట్సాల్ రైట్' అన్నాడు కూర్చుంటూ.

శంకర్‌లాల్ కొంచెంసేపు మౌనంగా వుండి "ఏ స్టేజిలో వుంది?" అని అడిగాడు.

"అబ్సల్యూట్.... సిక్స్టీ థౌజెండ్ కౌంట్"

"మైగాడ్"

భార్గవ మాట్లాడలేదు.

"నేను అకౌంటెంట్‌తో చెప్పాను. అడ్వాన్సు ఎంత కావల్సినా తీసుకోండి. ఫ్యామిలీ ఇన్సూరెన్సు క్రింద తర్వాత క్లెయిమ్ చేద్దురుగాని."

"థాంక్స్" క్లుప్తంగా అన్నాడు భార్గవ.

"డాక్టర్ మహేంద్రతో నన్ను మాట్లాడమంటారా?"

"ఎవరు మాట్లాడి మాత్రం చేసేదేముంది?"

అతడు ఎక్కడికక్కడ మాటల్ని తుంచేస్తూ ముభావంగా మాట్లాడటాన్ని శంకర్‌లాల్ మరోలా అర్థం చేసుకుని "పోనీ కొన్నాళ్ళు శలవు తీసుకుని వెళకూడదా? మీ కూతురి దగ్గర వుండండి" అన్నాడు సానుభూతితో.

"అక్కర్లేదు. ఇంకెంత? పన్నెండు రోజులు"

అతడు పచ్చినిజాన్ని అంత నిర్లిప్తంగా మాట్లాడటంతో శంకర్‌లాల్ అవాక్కయ్యాడు.

అతడికేం మాట్లాడాలో తోచలేదు. "మీ ఆస్పత్రి బిల్లు సరాసరి మాకే పంపమని వ్రాయమని చెప్పాను" అన్నాడు.

"థాంక్స్" అన్నాడు భార్గవ. "కానీ ఇప్పటికే అది ఎనిమిదివేలు అయింది. ఈ పదిరోజులలో ఇంకో యాభయ్ వేలదాకా అవుతుంది. ఒకటి రెండు రోజులు నా కూతురు ఎక్కువ బ్రతికితే, మరో అయిదారు వేలు ఎక్కువవుతుంది"

"మైగాడ్! మీరెంత దారుణంగా మాట్లాడుతున్నారు"

"ఉన్న నిజాన్ని పచ్చిగా మాట్లాడుతున్నాను. నాకు
పదివేలకంటే ఎక్కువ రాదు."

"బోర్డులో పెట్టి మిగతా ఖర్చుకూడా రి-ఇమ్‌బర్స్ చేయి

ఈ మాటకి భార్గవ కొంత చలించి, "థాంక్స్. మీకు నా
ఎలా చెప్పుకోవాలో తెలియటం లేదు" అన్నాడు.

"సల్ఫా-3 కనుక్కోవటం ద్వారా" తాపీగా అన్నాడు క
భార్గవ ఉలిక్కిపడి చూసేడు.

"అవును భార్గవా! మన చంపాలాల్ ఫార్ములా సల్ఫా
అవుట్ డేటెట్ అయిపోయింది. ఈ సంవత్సరపు పద్మశ్రీ రి
తారీఖుకూడా దగ్గర పడింది. ఇక నీదే ఆలస్యం—"

భార్గవ విసురుగా కుర్చీలోంచి లేచాడు.

"ఒక తండ్రిగా సర్వస్వం ధారపోసయినా నా కూతుర్ని
కోటానికి వెనుదీయను నేను. కానీ ఒక డాక్టర్‌గా, ఒక సైం
కాన్సర్‌క్యూర్ మందేమిటో తెలిసేక- నా కూతురికోసం ఆ మందు
మిమ్మల్ని తిట్టుకోని క్షణంలేదు. రేపు నేను సల్ఫా-3 ఫార్ములా
దానికో అందమైన పేరుపెట్టి మార్కెట్‌లోకి వదుల్తారు మీరు.
మంది తండ్రులూ, తల్లులూ కొండంత ఆశతో దాన్ని వాడటం
పెడ్తారు. చివరికి రోగి చచ్చిపోతే- ఎలాగూ చచ్చిపోతారు కాబట్టి
ఉసురు మీతోపాటు నాకూ తగులుతుంది. ఒక నిరర్ధకమై
వాడుతూ నేనెంత బాధపడుతున్నానో, అంత నిరర్ధకమైన మ
నా పేరుమీద మీకివ్వలేను. క్షమించండి...." అంటూ అక్క
వెళ్ళిపోయాడు.

అతడు వెనకే స్ప్రింగ్ డోర్స్ మూసుకుపోయాయి.

* * * *

భార్గవ తిరిగి తన లాబ్‌కి రాబోతూంటే వరండాలో
తగిలాడు. లూజు చొక్కా ఇన్-షర్ట్ వేసేడు. కాళ్ళకి మా
లున్నాయి. చేతిలో చిన్న షార్టుహాండు పుస్తకంలా వుంది.

"గుడ్ ఈవెనింగ్. నేను 'గుడ్ మార్నింగ్' పత్రికా
రేపు పేపర్లో కేన్సర్ గురించిన ఒక వ్యాసం ప్రచురిస్తున్నాం.
ప్రముఖుల అభిప్రాయాలు సేకరించి వేద్దామని వచ్చాను" అన్నా

"క్షమించండి. నేను బిజీగా ఉన్నాను" అన్నాడు భార్గవ. నిజానికి అతను ఇప్పుడు ఏ ఇంటర్వ్యూ ఇచ్చే మూడ్‌లో లేడు. శంకర్‌లాల్ అన్న మాటలే మనసులో మెదుల్తున్నాయి. అదీగాక- ఎంత తొలగించినా ప్రార్థన గురించి ఆలోచనలు వచ్చి ముసురుకుంటున్నాయి.

ఇంతలో వరండా ముఖద్వారం తెరుచుకుని విసురుగా చంపాలాల్ వచ్చాడు. అతడి మొహం కందిపోయి వుంది. వచ్చీ రాగానే పెద్ద కంఠంతో "ఏమిటి? కాన్స్-క్యూర్ గురించి ఎమ్.డి. దగ్గర ఏదో అన్నారట" అన్నాడు. అతడి స్వరంలో, ఈ రోజు అటో ఇటో తేల్చుకోవాలి అన్న నిశ్చయం కనబడుతూంది.

తను గదిలో వచ్చీ రాకముందే ఆ వార్త చంపాలాల్‌కి క్షణాల మీద చేరిపోవటం గమనించి భార్గవ విస్మయం చెందాడు. అతడికి పట్టలేనంత అసహ్యం కూడా వేసింది.

"అవును, అన్నాను. తప్పా" అన్నాడు తాపీగా.

ఊహించని ఈ సమాధానానికి చంపాలాల్ ఒక క్షణం బిత్తరపోయి రెట్టించిన కోపంతో, "ఏమన్నారు మీరు? మళ్ళీ అనండి" అన్నాడు.

"అంటాను. తప్పేముంది? కేన్సర్ వ్యాధికి మీరు కనుక్కున్న మందు వాడటంవల్ల ఏ మాత్రమూ లాభంలేదని ఒకసారి కాదు- వెయ్యిసార్లు అంటాను."

"ఎంత ధైర్యం మీకు?" ఇంగ్లీషులో బిగ్గరగా అరిచేడు చంపాలాల్. అతడి ఎర్రటి, లావాటి బుగ్గలు మరింత ఎర్రబడ్డాయి. "పది సంవత్సరాలుగా దేశంలోని డాక్టర్లు, స్పెషలిస్టులు ఇది తప్ప కేన్సర్‌కి ఇంకొక మందులేదని ముక్తకంఠంతో వప్పుకున్నప్పుడు దాన్ని మీరెలా కాదనగలరు?"

"కేన్సర్ వచ్చింది ఈసారి నా కూతురికి కాబట్టి"

కళ్ళు చిట్లించి "అయితే" అన్నాడు.

"నాకు సంబంధంలేని విషయం కాబట్టి నేను జోక్యం కలిగించుకోలేదు ఇన్నాళ్ళు. చివరికి అది నా కూతురు మీదే వాడటం మొదలు పెట్టేసరికి వద్దన్నానంతే...."

"ఎందుకో...."

"అక్యూట్ మైలోబ్లాస్టిక్ లుకేమియాకి మీ మందు పని చెయ్య కాబట్టి"

"ఈర్ష్య! ఇదంతా ఈర్ష్య! ఒక సైంటిస్టుకి కళ్ళముందే పద్మ బిరుదు రావటం. అతడు కనుక్కున్న మందుకి కోట్లలో పేటెంట్ రావటం ఇదంతా చూసి కళ్ళు తిరిగిపోతున్నాయి. ఈ అక్కసుని వెళ్ళబుచ్చుకుంటున్నావు నువ్వు" ఈసారి హిందీలో అరిచేడు.

"నాకు కళ్ళు తిరిగిపోలేదు కాబట్టే వాస్తవాన్ని చూడగలుగుతున్నాను. కేన్స్రక్యూర్ కంపోజిషన్ ఏమిటి? అసలు దాంట్లో బేసిక్ డ్ర ఏమిటి? డ్రగ్ కంట్రోలర్ నుంచి పద్మశ్రీ బిరుదు ఇచ్చిన వాళ్ళవరకు ఒక్కరైనా దీన్ని ఆలోచించారా? ఒక్కక్షణం ఆలోచిస్తే చాలు బైటపడతాయి" అంటూ లోపలికి వెళ్ళాడు తన లాబ్‌లోకి.

వెళ్ళాడన్న మాటేగానీ మనసంతా చికాకుగా తయారయి సాయంత్రం మరి పని చెయ్యలేకపోయాడు.

సాయంత్రం ఆస్పత్రి కూడా వెళ్ళలేదు.

వెళితే భరించలేడని తెలుసు.

తెల్లవారేసరికి కౌంటు 70,000 అవుతుంది.

దాన్ని ఎవరూ ఆపలేరు.

రాత్రంతా నిద్ర లేకుండా గడిపాడు.

తెల్లవారేక ఇంక వుండబట్టలేక ఆస్పత్రికి ఫోన్ చేసేడు. డ్యూ నర్సు ఎత్తింది ఫోన్. అతడు ఊహించినది కరక్టే. కౌంటు 72,0 వుంది. అతడు బాధగా కళ్ళు మూసుకున్నాడు. ఒక కన్నీటిచుక్క చెం మీదకు రాలింది.

అమ్మా? ప్రార్థనా! ఎంత దయనీయమయిన స్థితి అమ్మా ఇ నేనుండీ నీకేమీ చెయ్యలేకపోతున్నాను. కనీసం దగ్గరుండి ఓదా కూడా చెప్పలేకపోతున్నాను. నన్ను క్షమించు చిట్టితల్లీ. మరు జన్మంట వుంటే అప్పుడు నువ్వు నాకు తల్లివై పుట్టు— గుక్కెడు పాలకో గొంతు ఆర్చుకుపోయేలా నేను రోదిస్తూ వుంటే నిర్దాక్షిణ్యంగా నన్ ఏ పెంటకుప్ప మీదో పారెయ్యి. నేను ఇప్పుడు నీకు చేస్తున్న దానికి అ నాకు సరి అయిన శిక్ష. ఈ రంగంలో సైంటిస్టుని అయ్యుండీ నేను నిన్ రక్షించుకోలేక పోయినందుకు అదికూడా చిన్న శిక్షే అవుతుందేమో.

# 2

**జీవితంలో** కొన్ని కొన్ని సంఘటనలు మామూలుగా జరిగిపోతూ వుంటాయి. అయితే వాటి పరిణామాన్ని బట్టి వాటి ప్రాముఖ్యత పెరుగుతుంది. మనిషి మీద దాని ప్రభావం లేకపోతే వాటికి విలువే వుండదు.

ఆ రోజు విజయభార్గవ తొందరగా ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళాడు. అక్కడ పనికూడా ఎక్కువగా లేదు. కాని ఇంట్లో వుండలేక- అన్నత్రిలో గడపలేక- ఇన్‌స్టిట్యూట్ కాస్త బావున్నట్టు తోచింది.

ఆ రోజు ప్రొద్దున్నే ఎనిమిదిన్నరకి బోర్డు మీటింగ్ ప్రారంభమయింది. అది పూర్తయ్యేసరికి పదకొండు అయింది.

పదకొండున్నరకి శంకర్‌లాల్ నుంచి పిలుపు వచ్చింది. బహుశా బోర్డు మీటింగ్‌లో తన ఇన్స్యూరెన్స్ బాబూకా సంగతి చెప్పటం కోసమేమో అనుకుంటూ వెళ్ళాడు.

ఎయిర్ కండిషన్డ్ రూమ్‌లో శంకర్‌లాల్ కూర్చుని వున్నాడు. అతని మొహం ఎన్నడూ లేనంత ప్రశాంతంగా వుంది. భార్గవని చూడగానే లేచి, "రండి భార్గవా" అన్నాడు.

అతడు కూర్చున్నాక, "ఈ రోజు ప్రొద్దున్న బోర్డు మీటింగు జరిగింది" అన్నాడు.

"అవును విన్నాను" అన్నాడు భార్గవ.

"సల్ఫా-3 మందు మీద రిసెర్చి కొత్తగా వచ్చిన డాక్టర్ చక్రవర్తికి ఇవ్వటానికి నిర్ణయం జరిగింది?"

భార్గవ చప్పున తలెత్తి చూసేడు. శంకర్‌లాల్ కళ్ళల్లో అదోలాటి భావం, 'మంచి ఛాన్సు పోగొట్టుకున్నావ్ సుమా' లాటి భావం....

భార్గవ తలూపి "పోన్లెండి, నాకు దానిమీద అంత ఇంటరెస్టు లేదు" అన్నాడు.

శంకర్‌లాల్ చాలా ఖాసీగా "మీకు అసలు ఈ ఇన్‌స్టిట్యూట్‌మీదే ఇంటరెస్టు లేదని బోర్డు సభ్యులు అభిప్రాయపడ్డారు డాక్టర్ భార్గవా" అన్నాడు.

భార్గవ ఉలిక్కిపడి చూసేడు. "ఏమిటి, ఏమిటి మీరంటున్నది" అన్నాడు తడబడుతూ.

శంకర్‌లాల్ డ్రాయర్‌లోంచి ఒక న్యూస్ పేపరు తీసి పెడుతూ "ప్రొద్దున్న బోర్డురూమ్‌లో ఈ పేపరు ఒక తుఫానుని సృ చింది. మొత్తం మెంబర్లందరూ చిటపటలాడిపోయారు" అన్నాడు.

భార్గవ పేపర్‌వైపు చూసేడు. ఆ పత్రిక పేరు—

"గుడ్ మార్నింగ్"

ఏదో తెలియని భయంతో అతడి వెన్ను జలదరించింది. ఠక్కున ఆ పేపర్ని ముందుకు లాక్కుని చదవటం ప్రారంభిం మొదటి పేజీలోనే తాటికాయంత అక్షరాలతో వుందా వార్త.

"డా॥ భార్గవ కాన్సెక్యూర్‌పై సవాల్"

"కాన్స్-క్యూర్ అనే మందు కేన్సర్‌ని అసలు తగ్గించదనీ అంతా మోసమనీ పది సంవత్సరాలనుంచీ ప్రజలు దివ్య ఔష వాడుతున్న ఆ మందు కేవలం బూటకమని డాక్టర్ భార్గవ అన్నారు. మందుని కనుక్కున్న పద్మశ్రీ చంపాలాల్, డాక్టర్ భార్గవ విషయంపై ఒకర్నొకరు దాదాపు తిట్టుకోవడం మా విలేఖరి స జరిగింది. ఈ ఇద్దరు డాక్టర్లూ మోహన్‌లాల్ ఇన్‌స్టిట్యూట్‌లోనే చేయటం గమనించతగ్గ విషయం. సామ్సన్ అండ్ సామ్సన్ కంపె 'కాన్స్-క్యూర్' తాలూకు పేటెంట్‌ని అమ్మింది కూడా మోహన్‌ల ఇన్‌స్టిట్యూటే అవటం మరో విశేషం...."

ఇలా సాగిపోయింది ఆ న్యూస్. భార్గవ దాన్ని చదవటం పూ కేన్సర్‌పట్ల ప్రముఖుల అభిప్రాయాన్ని ప్రచురించటానికి వచ్చిన విలే ఈ అవకాశాన్ని చాలా చక్కగా వాడుకున్నాడన్నమాట. అత కుంచించుకుపోతున్న ఫీలింగు కలిగింది.

ఆ గది నిశ్శబ్దంగా వుంది.

ఆ నిశ్శబ్దంలోంచి శంకర్‌లాల్ కంఠం మంద్రస్థాయిలో వి పించసాగింది.

"ఒక కార్యాలయంలో పనిచేసే ప్రతి మనిషికి కొన్ని ఎథిక్ వుండాలి భార్గవా! అఫీషియల్ సీక్రెట్స్ గురించయితే అసలు చెప్ప నవసరం లేదు. కేన్స్-క్యూర్ ఎటువంటి మందూ అని నేను ఇక్క

త్రింపదోపటంలేదు[?]. మీరు చేసింది తప్పు! ఘోరమైన తప్పు!! ఈ ఇన్స్టిట్యూట్‌లో పనిచేస్తూ- ఈ ఇన్స్టిట్యూట్ పేటెంట్ చేసిన మందు సుంచి[?] బాధ్యతా రహితంగా ఒక పత్రికా విలేఖరి సమక్షంలో మీరు మాట్లాడిన మాటల్ని అంత తేలిగ్గా తీసుకోలేదు బోర్డు. ఈ పేపర్ చూసి, బోర్డులో ప్రతీ మెంబరూ ఈ అవమానం తమకే జరిగినట్టూ భావించారు. ఈ ఇన్స్టిట్యూట్‌కి మీ సర్వీసెస్ ఇక అనవసరం అని ఏకగ్రీవంగా నిర్ణయించారు. అసలింత బాధ్యతా రహితంగా ఒక పత్రికకు ఇంటర్వ్యూ ఇచ్చినందుకు మీ మీద చట్టరీత్యా చర్య తీసుకోమన్నారు కూడా, నేనే అడ్డుపడి దాన్ని ఆపుచేసేను. ఐయామ్ సారీ భార్గవా! మిమ్మల్ని ఉద్యోగంనుంచి తొలగిస్తున్నట్టూ ఆర్డరు సంతకం చేయటం నాకు విచారకరంగా వుంది. పోతే నోటీసు ఇవ్వకుండా తీసేస్తున్నందుకు గానూ సర్వీస్ కండిషన్స్ ప్రకారం మీకు రెండునెలల జీతం ఇవ్వబడుతుంది. మీ కూతురి అనారోగ్యం విషయమై యామై సారీ, ఇన్సూరెన్స్ ఇవ్వటానికి బోర్డు ఒప్పుకోలేదు. ఇంకో గంటలో మీకు ఆర్డర్లు ఇవ్వబడతాయి. సాయంత్రం లోపులో డాక్టర్ చక్రవర్తికి మీ పని, యింత కాలం మీరు చేసిన రీసెర్చి తాలూకు పేపర్లూ అందజెయ్యండి. ఆ పేపర్లు మా ఇన్స్టిట్యూట్ తాలూకు ప్రోపర్టీ. పోతే మీకు రావాల్సిన గ్రాట్యుటీ, పి. ఎఫ్‌లు కాక మరో అయిదువేలు అదనంగా ఇవ్వటానికి కష్టపడి బోర్డుని ఒప్పించాను. మిమ్మల్ని తక్షణం తొలగించే షరతుమీద దానికి ఒప్పుకున్నారు వాళ్ళు. భార్గవా! భవిష్యత్‌లో ఎక్కడయినా తన్ని[?] అనుభవజ్ఞులు ఏదయినా సలహా ఇస్తే దాని గురించి వెంటనే నిరాకరించక కాస్త ఆలోచిస్తూ వుండండి. అదే నేనివ్వగల సలహా ఐయామ్ సారీ, నౌ యూ కెన్ గో.... సాయంత్రానికల్లా ఛార్జీ వప్ప చెప్పండి ఐ వాంట్ ఆల్ దిస్ టు బి ఫినిష్డ్ బై ఈవెనింగ్"

"ఇది.... ఇది అన్యాయం" భార్గవ దాదాపు అరిచాడు.

"ఇందులో అన్యాయం ఏమీలేదు భార్గవా! బోర్డు నిర్ణయాన్ని మీకు చెప్తున్నాను అంతే" శంకర్‌లాల్ తాపీగా అన్నాడు.

"తన ఇష్టం వచ్చినట్టూ నిర్ణయాలు తీసుకునే అధికారం బోర్డుకి లేదు."

"కానీ ఒక ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేస్తూ, దాని గురించి రహితంగా మాట్లాడటం మీకు నైతికంగా ధర్మంకాదు. అందుకే ఉద్యోగంలోంచి తొలగించవలసి వస్తూంది"

"నేను మాట్లాడింది పత్రికా విలేఖరితో కాదు- తోటి సైం

"కానీ మీరు మాట్లాడినదంతా న్యూస్‌లో వచ్చేసింది, ప్రజల్లో కలవరం మొదలవుతుంది. పార్లమెంటులో ప్రతిపక్ష కోవు. మినిస్ట్రీ ఆఫ్ కెమికల్స్‌ని ఒక వూపు వూపేస్తాయి. ఈ ఆ మినిష్టర్ తట్టుకోలేక మనమీద విరుచుకు పడవచ్చు. ఇదంతా మీవల్లా, మీ బాధ్యతా రహితమైన మాటలవల్లా వచ్చింది. మీరు బయట వుండి ఈ విమర్శ చేస్తే ఫర్వాలేదు కానీ ఈ ఇన్‌స్టిట్యూ వుండి మరీ కామెంట్ చేసేరు. దాంతో వచ్చింది చిక్కు"

శంకర్‌లాల్ మాటల్లో మునుపటి ఆవేశం లేకపోవటం, తగ్గి మాట్లాడటం గమనించాడు భార్గవ. దాంతో మానసికంగా పుంజుకొని అన్నాడు....

"మినిస్ట్రీ ఆఫ్ కెమికల్స్‌కి జవాబు చెప్పుకోలేనంత బలహీ స్థితిలో మనం వుంటే అది నిజంగా సిగ్గుపడవలసిన విషయం. మన ఇన్‌స్టిట్యూట్‌కి ఆ మినిస్ట్రీని ఎలా 'సమాధానపర్చాలో తెలుసు. అందువల్ల మనం భయపడవలసినదేమీ లేదు"

శంకర్‌లాల్ భార్గవని నమిలి మింగేసేలా చూసేడు. బెదరలేదు. చేతిలో కాగితాలు సర్దుకుని లేచి నిలబడి "మరి వెళ్ళొచ్చా?" అని అడిగాడు.

శంకర్‌లాల్ మాట్లాడలేదు.

భార్గవ కుర్చీ జరిపి, తలుపు దగ్గరకు వచ్చి తెరచి బ నడవబోతూ అక్కడే ఆగి, శంకర్‌లాల్‌తో అన్నాడు- "మన సె టీని కాస్త జాగ్రత్తగా వుండమనండి. అసలు సెక్యూరిటీ వున్న ట్నుంచి లోపలికి ఎవరొస్తున్నారా పరీక్షించటం కోసం. అంతేకా దగ్గర కునికిపాట్లు పడుతూ కూర్చోవటం కాదు" అని వెళ్ళిపోయా

అతడి వెనుకే తలుపు మూసుకుంది.

శంకర్‌లాల్ మొహం ఎర్రగా కందిపోయింది. కొద్దిసేపు కదల్లేక పోయాడు. చివరికి తేరుకుని, పెర్సనల్ ఫోన్ దగ్గరికి లా

వర్ చేసేడు. ఆ సంభాషణ ఆపరేటర్ వినటం ఇష్టంలేక కాదు, అసలా ఎంకి తను ఫోన్ చేస్తున్నట్టు మూడో కంటికి తెలియటం ఇష్టంలేక!

"హల్లో" అని అట్నుంచి వినిపించింది.

"నేను శంకర్‌ని మాట్లాడుతున్నాను"

"చెప్పు"

"భార్గవ విషయం...." అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

"ఇంకా అతడి విషయం ఏముంది? బోర్డులో నిర్ణయం జరిగి యిందిగా"

"అదంత సులభంగా అమలు జరిగేటట్టూ లేదు"

శంకర్‌లాల్ తనకీ- భార్గవకీ జరిగిన సంభాషణ అంతా చెప్పి "ఈ పరిస్థితుల్లో భార్గవ కోర్టుకి వెళితే కష్టమేమో. అతడు అలా మాట్లా డంవల్ల డైరెక్టర్ల సానుభూతి పూర్తిగా కోల్పోయిన మాట నిజమే. లీగల్‌గా అతడిని ఉద్యోగంనుంచి తొలగించటానికి అంత చిన్న రణం సరిపోదేమో"

"మరి ఆ విషయం తెలిసిన వాడివి ఎందుకు అంత తొందరపడి డ్డున బోర్డులో ఈ విషయం ప్రవేశపెట్టేవ్ శంకర్‌లాల్"

"మీ కోసం.... కేవలం మీ కోసం చేసేను. సల్ఫా-3 మందు నుంచి అతడలా నిర్లక్ష్యంగా మాట్లాడినప్పటినుంచీ అతడికి ఎలా గుణ పాఠం చెప్పాలా అని ఆలోచిస్తూనే వచ్చాను. ఇన్నాళ్ళకి అతడు సరైన కి దొరికాడనుకున్నాను. ఈ న్యూస్ పేపర్ బోర్డులో పెట్టేసరికి నుకున్నట్టే బోర్డు మెంబర్లు వెంటనే రియాక్టయి అతడిని ఉద్యోగం చి తొలగిస్తూ ఆర్డరిచ్చారు. కానీ ఇతడు ఇలా ఎదురు తిరుగుతా నుకోలేదు"

"సల్ఫా-3 కాదన్నాడా?"

"పద్మశ్రీ ఆశ పెట్టినా కాదన్నాడు."

"అయితే గొప్పవాడే అయి వుంటాడు. అంత గొప్పవాడు మన దుకు శంకర్‌లాల్."

"నా ఉద్దేశ్యమూ అదే."

"అతడిని ఉద్యోగంలోంచి తొలగిస్తున్నట్టూ ఫైల్ చే
చేతికి ఇచ్చేశావా?"

"ఇంకా లేదు."

"కొంతకాలం దాన్ని అట్టేపెట్టు."

"పెట్టి___"

"తరువాత ఆలోచిద్దాం."

"కాపీ బోర్డు వూరుకోదు, ఏం చేసేవని అడుగుతుంది."

"ఇంకో నెలకి కదా బోర్డు సభ్యులు మళ్ళీ కలిసేది."

"ఈ లోపులో ఏం చెయ్యగలం?"

"తొందర పడకు. అయినా ఈ ఉద్యోగాలు వెయ్యటం, టం పీటిదేముందిలే చాలా చిన్న విషయాలు. అంతకన్నా ము నీతివాక్యాలు రెండు చెప్తాను. చిన్న స్లిప్స్ రెండింటిమీద వ్రాసుక అద్దం క్రింద చెరోవైపునా పెట్టుకో, ముందు రెండు కాగితం క తీసుకో శంకర్‌లాల్. అనుభవం మీద నేను చెప్పే మాటలు అ నీకు పనికివస్తాయి, కాదనకు."

"తీసుకున్నాను."

"గుడ్. వ్రాసుకో.... తెలివైనవాడు ఎప్పుడూ తొంద అవకాశం కోసం ఎదురు చూస్తాడు."

"బావుంది. రెండోది?"

"తెలివైనవాడు ఎప్పుడూ అవకాశం కోసం ఎదురు తనే అవకాశాల్ని సృష్టించుకుంటాడు.... ఇది అద్దానికి రెం పెట్టుకో."

"ఇదేమిటి? రెండూ పరస్పరం విరుద్ధంగా వున్నాయి?"

"ఆ రెంటినీ చెరోవైపునా పెట్టుకుని మధ్యలో కూర్చొని ఎప్పుడు వాడాలో తెలుసుకోగలిగేవాడే అసలు తెలివైనవాడు. మూడోది. దీన్ని వ్రాసుకోనక్కరలేదు శంకర్‌లాల్. దీన్ని మె వుంచుకో."

* * * *

శంకర్‌లాల్ ఛాంబర్‌నుంచి బయటకొచ్చేసేక భార్గవ తన వైపు నడవసాగాడు. అతడి మనసంతా చికాకుగా వుంది. పే

...న వార్త అతడిని బాధపెడుతూంది. అవి అతడి భావాలే అయి ...చ్చు. కానీ ఇప్పుడు అందరికీ తెలిసిపోయాయి. తనని ఉద్యోగం ...తొలగించలేదు. అది వేరే సంగతి. కానీ డైరెక్టర్లందరూ తనకి ...రేకమయ్యారన్నది నిస్సందేహం. ఈ అపోహ పోగొట్టాలంటే ఏదో ...య్యాలి.

"ఐయామ్ సారీ" అన్న మాటలకి నడుస్తున్నవాడల్లా ఆగి, ...చనం నుంచి తేరుకుని తలెత్తి చూసేడు. అకౌంట్స్ డిపార్ట్‌మెంట్ ...మ్మం దగ్గిర శేఖరం నిలబడి వున్నాడు. అతడి మొహం వాడిపోయి ...ంది.

భార్గవ మొహం మీదకి నవ్వు తెచ్చుకుని, "ఏమిటి? అప్పుడే నాకు ...చ్చిన జీతం అరియర్సూ, గ్రాట్యూయిటీ లెక్క కట్టి వుంచారా?" అని ...గాడు. శేఖరం మాట్లాడలేదు. అతడు అకౌంట్స్ విభాగానికి అధికారి ...జే రెండు గంటల క్రితమే ఈ విషయం తెలిసి, అప్పట్నుంచీ ఏం ...య్యాలో, భార్గవకి ఎలా సానుభూతి చెప్పాలో, తెలియక కొట్టుమిట్టాడు ...న్నాడు.

"అదృష్టవశాత్తు నన్ను ఉద్యోగంలోంచి ప్రస్తుతం తీసెయ్యటం ...లే" అన్నాడు. ఆ మాటలకి శేఖరం మొహం విప్పారింది. "ఏం ...గింది? ఏదయినా సంధికి వచ్చారా?" అని అడిగాడు ఉత్సాహంగా.

ఇద్దరూ కాంటీన్‌వైపు నడిచి, అక్కడ కూర్చున్నాక భార్గవ ...గినదంతా చెప్పాడు. చెప్పి అన్నాడు– "ఈ పరిస్థితుల్లో ఇక్కడ ...నిచెయ్యటం కష్టమే! కానీ తప్పదు. ప్రార్థన ఆరోగ్య దృష్ట్యా డబ్బు ...వసరం చాలా వుంటుంది. పట్టుదలా, ఆత్మాభిమానం ఇలాటివేవీ ...డు పనిచెయ్యవు. ఈ ఇన్‌స్టిట్యూట్ ఇస్తూన్న హెల్తు ఇన్సూరెన్సే ...త్రి ఖర్చులకు అడుకుంటూంది. ఇప్పుడిక జీతంకూడా లేకపోతే ...చు కష్టం. ఎవరు నమ్మినా నమ్మకపోయినా కనీసం నువ్వయినా నమ్ము ...ఖరం. ప్రార్థన ట్రీట్‌మెంట్‌కి వేల వేలలో ఖర్చవ్వచ్చు. నా దగ్గిర ...త డబ్బు లేకపోవచ్చు. కానీ నేనీ ట్రీట్‌మెంట్ వద్దంటున్నది డబ్బు ...క్కి భయపడి మాత్రం కాదు, ప్రార్థన జబ్బు నయం చేయటానికి ...ప్పే అడ్డంకి అయితే నా శరీరపు చివరి రక్తపు చుక్క అమ్మి అయినా ...నే తనని రక్షించుకుంటాను."

శేఖరం కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి. "ఛా, అంతమాట నేనూ అనవసరంగా అపోహ పడ్డాను" అన్నాడు.

"ఇప్పుడు నా వాదనలో నీకూ నమ్మకం కుదిరింది. కా సాయం చెయ్యగలవా శేఖరం?"

"తప్పకుండా చేస్తాను. ఏమిటో చెప్పండి"

భార్గవ వెంటనే సమాధానం చెప్పకుండా కొంచెంసే తనే ఆలోచించుకుంటూ చివరికి అన్నాడు.

"కొంతకాలం క్రితం నీకో అనుమానం వచ్చిందన్నావ్ వుందా? కాన్స్-క్యూర్ ఖరీదు మిల్లీగ్రాము రెండొందల రూ ఎందుకు పెట్టారూ అని."

"అవును. సామ్సన్ అండ్ సామ్సన్ కంపెనీ బొలెస్ రాత్రి చదువుతూ వుంటే ఆ అనుమానం వచ్చింది" అన్నాడు శే

"ప్రతి మందుల కంపెనీ, తన మందు సీసామీదా, టాబ్లెట్ మీదా ఆ మందు ఎలా తయారు చేయబడిందీ ప్రింటు చెయ్యాలి. కంపోజిషన్ అంటారు. కానీ అందులో వాడే 'బేసిక్ డ్రగ్' వివరణ ఇవ్వక్కరలేదు. ఈ బేసిక్ డ్రగ్గే మందుననగానీ, మా వెన్నెముక దీన్ని రహస్యంగా పెట్టుకోవచ్చు. కాన్స్-క్యూర్ విష ఆ బేసిక్ డ్రగ్ ఏమిటో తెలుసా శేఖరం?"

"సల్ఫా-2"

"కరెక్టు. ఇది కనుక్కున్నందుకే చంపాలాల్ కి పద్మశ్రీ బడింది" అన్నాడు భార్గవ. ప్రస్తుతం మనదేశంలో ఈ తయారీ ఒక విషవలయంగా తయారయింది. బియ్యం కిలో పాయలకి ఇవ్వాలని నిర్ణయాలు చేసే ప్రభుత్వం, ప్రజలకి మరో వసరమైన ఈ మందుల ధర విషయంలో చూసీ చూడనట్టూ వుం దేశంలోకెల్లా పెద్దవయిన మూడు నాలుగు మల్టీ నేషనల్ కం మొత్తం ఈ వ్యాపారాన్నంతా గుర్తుక తీసుకున్నాయి. సీట్ గా, ముగా వుండే మెడికల్ రిప్రజెంటేటివ్‌లు తమ వాక్ చాతుర్యంతో ర్లకి ఈ మందుల గురించి ఉద్బోధిస్తారు. ఆకర్షణీయమైన కమీ ఇవ్వబడతాయి. చాలామంది డాక్టర్లకి స్వంతంగా మెడికల్ షాప్

...షయం కూడా సర్వజనితమైన విషయమే. ఇదంతా ఒక పెద్ద రాకెట్! ...మందుల తయారీ గురించి ప్రజలకి తెలీదు. కాబట్టి మోసపోవటం సాధా...ణ విషయమే అయినా, డాక్టర్లుకూడా గుడ్డెద్దు చేలో పడ్డట్టూ ఇవే కాస్ట్లీ ...మందులా, టానిక్కులూ వ్రాయటం ఆశ్చర్యకరమైన విషయం. ఇదే ...ప్రస్తావన వచ్చినప్పుడు ఒక డాక్టరు నాతో అన్నాడు. 'పది రూపాయల ...టానిక్ వ్రాస్తేనే రోగి సంతృప్తి పడతాడు. దాని బదులు ప్రశస్తమైన ...ఒక తాగు అంటే పేరే డాక్టర్‌ని వెతుక్కుంటాడు' అని. అది నిజమే ...అనుకోవచ్చు. ఇప్పుడు మన సబ్జెక్టు అదికాదు, కాన్స్-క్యూర్ గురించి. ...ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఈ మందు కాటగిరీ-4లో పెట్ట...బడింది."

"కాటగిరీ-4 అంటే"

"ధరని నిర్ణయించటం కోసం, ప్రభుత్వం మొత్తం మందు ...ల్నింటినీ నాలుగు కేటగిరీలుగా విభజించింది. ఒక మందు తాలూకు ...ఉత్పత్తికయిన ఖర్చు (కాస్ట్ ఆఫ్ ప్రొడక్షన్) ప్రతీ కంపెనీ డ్రగ్ ...ప్రైస్ కంట్రోలర్‌కి పంపాలి. దాన్నిబట్టి మార్కెట్‌లో ఆ మందు ఎంతకి ...అమ్మాలో నిర్ణయింపబడుతుంది. అయితే అసలు కీలకం అంతా అక్కడే ...ఉంది."

"ఏమిటి?"

"కొన్ని మందులకి అడ్వర్‌టైజ్‌మెంట్ అక్కర్లేదు. తలనొప్పి ...మాత్రకి విపరీతమైన అడ్వర్‌టైజ్‌మెంటు ఇవ్వాలి. అందుకని దీన్ని కాట...గిరీ-3లో పెట్టింది ప్రభుత్వం."

"ఈ కేటగిరీలు ఏమిటో చెప్పలేదు మీరు."

"వస్తున్నా. ఇది చెప్పటానికి ముందు 'మార్క్ అప్' అంటే ...ఏమిటో చెప్పాలి. ఉత్పత్తి ఖర్చు (కాస్ట్ ఆఫ్ ప్రొడక్షన్)కి, అమ్మకం ...ధర (ప్రైస్) మధ్య తేడా 'మార్క్ అప్' అంటారు. ఇందులోనే కంపెనీ ...తన లాభాలూ, అమ్మకం ఖర్చులూ, అడ్వర్‌టైజ్‌మెంట్ ఖర్చులూ సరిపెట్టు...కోవాలి. ఒక్కొక్క కేటగిరీకి ఒక్కొక్క మార్క్ అప్ నిర్ణయించింది ప్రభుత్వం. అంతకన్నా ఎక్కువ ధరకి అమ్మటానికి వీల్లేదు,

కేటగిరీ 1 : 10 శాతం
కేటగిరీ 2 : 55 శాతం
కేటగిరీ 3 : 100 శాతం
కేటగిరీ 4 : ఎంత ధరకయినా అమ్ముకోవచ్చు.

ఇదీ గవర్నమెంటు పాలసీ! ఉదాహరణకి ఒక కంపె తయారు చేయటానికి రూపాయి ఖర్చయిందనుకో. అది కే వస్తుంది. కాబట్టి- ఇంకో రూపాయి మార్క్ అప్ (వందశాతం రెండ్రూపాయలకి బజార్లో అమ్ముకోవచ్చు. అంతకన్నా అమ్మటానికి వీల్లేదు. అదే కేటగిరీ-2 తాలూకు మందు అ 1-55 పైసలకన్నా ఎక్కువ అమ్మటానికి వీల్లేదు. మం కంట్రోల్‌లో వుంచటం కోసం ప్రభుత్వం ఎంతో సదుద్దేశ విధానం ఇది."

శేఖరం నవ్వేడు. "నేనేగాని మందుల కంపెనీ పె కేవలం కేటగిరీ-4 మందుల్నే ఉత్పత్తి చేస్తాను" అన్నాడు.

"కేటగిరీ-4 లో లావు తగ్గటానికి, ఎత్తు పెరగటానికి పడే మాత్రలూ, టానిక్కులూ వస్తాయి. డబ్బులున్న వాళ్ల కోసం ఉపయోగపడేవి కాబట్టి వీటి ధర గురించి ప్రభుత్ర పట్టించుకోలేదు. ప్రతీ మందుల కంపెనీ తన వస్తువుల్లో కనీసం కయినా ఈ కేటగిరీ-4 లోకి వెళ్ళేలా చూసుకుంటుంది. కేట గిరీ-1 లో మందుల్ని మాత్రమే తయారుచేసే కంపెనీలన్నీ దాదాపు మూతబడిపోవటమో, డైవర్సిఫై కావటమో జరిగింది. కన్నా ముఖ్యమైన విషయం ఇప్పుడు చెప్తున్నాను విను కొన్ని సంవత్సరాల క్రితం అతి రహస్యంగా జరిగిపోయిందిది. లక్షల రూపాయలు నీళ్ళలా వెదజల్లబడ్డాయి. ఇందులో మినిస్ట్రీ, బ్యూరో ఆఫ్ ఇండస్ట్రియల్, కాస్ట్ అండ్ ప్రైస్ (బి డ్రగ్ కంట్రోలరు ఆఫీసువాళ్ళు మిళితమయ్యారు. మినిస్ట్రీ ఆఫ్ వాళ్ళ చేతులు తడి ఆరని విధంగా తడపబడ్డాయి. మూడో కేటే కుండా కేన్సర్-క్యూర్ మందు, కేటగిరీ-4 లో పెట్టబడింది."

యథాలాపంగా వింటూన్న శేఖరం ఆ చివరి మాటకి సారిగా ఉలిక్కిపడి, "ఏమిటి?" అని అరిచాడు. ఆ షాక్

...పమంది. "అవును శేఖరం, అత్యంత మేధావులు దాని రిపోర్టు ...సేసేరు. కేన్సర్ కేవలం డబ్బున్న వాళ్ళకి వచ్చే రోగం అని ...వాదించబడింది. కాన్స్-క్యూర్ కేవలం బాధని ఉపశమించేలా ...మాత్రమే అని, అది వ్యాధి నిరోధక మందు కాదనీ రిపోర్టులో ...మర్శించింది. ఒక 'లగ్జరీ' మందుగా దాన్ని కేటగిరీ-4 లో పెట్టారు. ...తరువాత దాన్ని గురించే అందరూ మర్చిపోయారు. కానీ కాలం ...డాక్టర్ కేన్సరు పేరు చెప్పేసరికి కేన్స్-క్యూర్ అనివార్యం అయి ...పోయింది. ప్రతి డాక్టరూ దాన్నే ఉపయోగించటం మొదలుపెట్టాడు. ...రికార్డుల్లో ఒకలాగా, నిత్య జీవితంలో ఒకలాగా అది చెలామణీ ...తోంది.

"దీన్ని—దీన్ని ఎలాగయినా ఆపుచెయ్యాలి."

భార్గవ పేలవంగా నవ్వేడు. "కష్టం శేఖరం. పలుకుబడితో ...లోతుగా పాతుకుపోయి వున్నవాళ్ళు వాళ్ళు! కేవలం సల్ఫా-2 ...మాట్లాడినందుకే ఉద్యోగం పోవాల్సిన పరిస్థితి ఏర్పడింది నాకు ...తెలుసు కదా...."

"ప్రతివాడూ 'మనకెందుకులే' అనుకోవటంవల్లే దేశం ఇలా ...జరుగుతోంది. ప్రాక్టికాలిటీని నమ్మేవాణ్ని నేను. ఎలాగయినా ...క్యూర్ లాబుకు ప్రాజెక్టు రిపోర్టు సంపాదిస్తాను. బేసిక్ డ్రగ్ ...సల్ఫా-2 బూటకం బయటపెడ్తాను. అప్పటికీ ప్రజలీ మోసం ...తెలుసుకోలేకపోతే ఇక అది వాళ్ళ ఖర్మ" ఆవేశంగా అన్నాడు శేఖరం.

"కాన్స్-క్యూర్ విషయం నువ్వు చూడు, సల్ఫా-2 విషయం ...చూస్తాను" అన్నాడు భార్గవ.

"మీరా!"

"అవును. ఈ రోజే సామ్సన్ ఫ్యాక్టరీకి వెళ్ళి కాస్త సల్ఫా-2ని ...సంగ్రహిస్తాను. మన లాబ్ లోనే పరీక్షిస్తాను. అసలదేమిటో?"

"ఈ రాత్రే చంపాలాల్ ఇంటికి వెళతాన్నేను. మన ఇన్స్టి...ట్యూట్ లో ఆ రిపోర్టు దొరక్కపోవచ్చు. అందులోనూ ఇన్ని లొసుగు...లున్న రిపోర్టు అంటే మనవాళ్ళు సెక్యూరిటీ విషయంలో చాలా జాగ్రత్తగా ...వుంటారు. అదీగాక మనకి కావల్సింది అసలు రిపోర్టు అది. అది ...చంపాలాల్ ఇంట్లోనే దొరుకుతుందని ఎందుకో నా కనిపిస్తూంది."

"చంపాలాల్ ఊళ్ళో లేడనుకుంటాను."

"అవును. అందుకే ఈ సాయంత్రం అయితేనే మంచిది

"ఇంటికి వెళ్ళటం రిస్కేమో ఆలోచించు శేఖరం."

శేఖరం కుర్చీలోంచి లేస్తూ నవ్వేడు, "ఎక్కడ త్రి
అక్కడ అన్నాబత్తుల సోమశేఖరం వుండును" అన్నాడు.
లేచాడు. ఇద్దరూ ఇన్‌స్టిట్యూట్ వైపు నడుస్తూ ఆ చెట్టుకి
వరికి మళ్ళీ అదే డేగ పెద్ద చప్పుడుతో రెక్కలు కొట్టుకుంది.

"ఇదిక్కడ పిల్లల్ని పెట్టినట్టుంది గురూగారూ,
వచ్చిన ప్రతివాడి తలమీదా కొడ్తూందట" అన్నాడు శేఖరం.
జ్ఞాపకం వచ్చినట్టు "అన్నట్టూ నిశాచరుడు అంటే రాత్రిళ్ళ
అంతేకాని కళ్ళు లేనివాడు కాదు" అన్నాడు.

* * * *

సాయంత్రం మూడున్నరకి శేఖరం చంపాలాల్
చేరుకున్నాడు. మోహన్‌లాల్ ఇన్‌స్టిట్యూట్ కాంపౌండ్‌లోనే
క్వార్టర్సు వున్నాయి. ఫ్లాట్ సిస్టమ్సులో కొన్ని ఇళ్ళున్నాయి.
మూడో అంతస్తులో వున్న ఫ్లాటు.

ఆ ఇళ్ళ ఫోటోగ్రఫీ తెలిసిన వాడవటంచేత, శేఖరానికి
కాలేదు. ఫ్లాట్ ఎదురింటి తలుపు వేసి వుంది. గుమ్మం దగ్గ
రెండునిమిషాలు ప్రయత్నిస్తే తాళం వూడివచ్చింది. చంపాలాల్
రోజులవరకూ రాడని తెలుసు, కాబట్టి ధైర్యంగా లోపలికి ప్ర
తలుపు దగ్గిరగా వేసి తన పని ప్రారంభించాడు.

మార్వాడీ అలంకరణలోనే వున్నాయా ఇంటి గదుల.
రూముకీ, డ్రాయింగ్ రూమ్‌కీ మధ్య తెర వుంది. అత
ఆఫీసు గది వెతకటం మొదలుపెట్టాడు. అన్నీ సైన్సు
జర్నల్సు వున్నాయి. డ్రాయరు తాళాలు గోడకి తగిలించి
వాటి సాయంతో డ్రాయరుతీసి వెతికేడు. నాలుగైదు ఫైల్సు దొరి

గోడలకుగానీ, తివాసీ క్రిందగానీ రహస్యపు అర
వున్నాయేమో అని తడిమి చూసేడు. అలాంటిదేమీ కనబడలేదు.

అతడు ఆఫీసు రూమ్‌లోంచి డ్రాయింగ్ రూమ్‌లోకి
మార్వాడీల ఇల్లు అది. గది గోడలకి రకరకాల ఫోటోలు

అందరినీ తగిలించటం అలవాటు? ఆ ఫోటో వరుసల మధ్యలో ఒక గ్రూపు ఫోటో వుంది. ఇరవై సంవత్సరాల క్రితందయినా అందులో పోలికల్ని అతడి చురుకయిన కళ్ళు వెంటనే పసిగట్టినయ్. అతడు అచేతనుడయ్యాడు. తన కళ్ళనే నమ్మలేనట్టులా అలా వుండిపోయాడు.

అందులో వున్నది ఎస్. కె. నాయుడు.

అతను ఒక్క గెంతులో దాని దగ్గిరకి వెళ్ళి దాన్నీ, దాని పక్క గ్రూపు ఫోటోనీ పరిశీలించి చూసేడు. చంపాలాల్ తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్ళ గ్రూప్ ఫోటో అది. నాయుడు భార్య, చంపాలాల్ అక్క అని నిశ్చయమై పోయింది.

ఎస్. కె. నాయుడు ఎవరో మార్వాడీల అమ్మాయిని చేసుకున్నాడని తెలుసుకానీ, అది చంపాలాల్ అక్కయ్యనే అని తెలీదు. ఇంకెవరికయినా తెలిస్తే తెలుసేమోగానీ, కనీసం తన సర్కిల్‌లో తెలీదు.

ఈ వాస్తవాన్ని జీర్ణించుకోవడానికి అతడికి కొంత సమయం పట్టింది. ఈ విషవృక్షపు వేళ్ళు ఎంత లోతుగా పాతుకుపోయాయో అర్థం కావటానికి ఆలస్యమైంది.

ఆ ఆలోచనలో అతడు బయట అలికిడి గమనించలేదు.

"ఎవరది?" అని వినిపించేసరికి ఉలిక్కిపడ్డాడు.

తను వెతకటానికి ఇంట్లోకి వస్తూ వస్తూ లోపల తలుపు గడియ వేసుకున్నాడు. బయట తాళంలేదు. కానీ వచ్చినవాళ్ళు ఎవరు? వాళ్ళకి తెలుసా చంపాలాల్ ఊర్లోలేడని? వాళ్ళకి అనుమానం వస్తుందా? అతడు తలుపు దగ్గిరకి వెళ్ళి సందుల్లోంచి చూసేడు. అటువైపు చట్టతో నిలబడి వున్నాడు.

ఆ నిలువెత్తు విగ్రహం నాయుడిది.

కో-ఇన్సిడెన్స్ గురించి ఆలోచించేంత టైమ్‌లేదు. ఒక్క గెంతులో వెనక గదిలోకి వచ్చాడు.

బయట అతడికి అనుమానం వచ్చినట్టుంది. తలుపు దబదబా బాదుతున్నాడు. శేఖరానికి ఏం చెయ్యాలో తోచలేదు. వెనక వరండాలోకి వచ్చాడు. అక్కడ బాల్కనీకి నాలుగు అడుగుల ఎత్తున గోడ వుంది.

అతడు మూడో అంతస్తులో వున్నాడు.

గోడపక్కనుంచి నీళ్ళగొట్టం వుంది. కానీ అది బాల్కనీకి ప
అడుగుల దూరంలో ఉంది.

శేఖరం చూపు బాత్‌రూము పక్కనున్న వెదురుకర్రమీద ప
దాని ఆధారంతో నీళ్ళగొట్టం చేరుకోగలిగితే, అక్కణ్నుంచి నెమ
క్రిందికి పాకవచ్చు, ఎవరూ చూడకపోతే అదృష్టమే.

అతడు దాన్ని తీసుకుని బాల్కనీవైపు వస్తుంటే. బయట
గడియ వూడిపోయిన శబ్దమయింది. నాయుడు లోపలికి వస్తున్నా
లోపల ఎవరో వున్నట్టు అతడు పసికట్టినట్టున్నాడు.

శేఖరం బాల్కనీ గోడమీదనుంచి నీళ్ళగొట్టానికి కర్ర
దాన్ని పట్టుకుని, క్రిందికి దిగే సమయానికి నాయుడు అక్కడికి
కున్నాడు. శేఖరం గాలిలో వుండే తలపైకెత్తి చూసేడు. అదే సమయ
నాయుడు క్రిందికి చూసేడు. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

నాయుడు బాల్కనీ గోడమీదకు వంగి, సన్‌షేడ్‌ని ఆ
వున్న కర్రని కొంచెం కదిలించాడు.

దాంతోపాటూ శేఖరమూ గాలిలో వూగేడు.

నీళ్ళగొట్టం ఇంకా ఆరడుగుల దూరంలో వుంది. బా
బేతాళ కథలో లాగా అతడు మధ్యలో కర్రని పట్టుకుని అటు
టానికి ప్రయత్నిస్తున్నాడు. నీళ్ళగొట్టపు సందుల్లో ఇరికించిన క
క్షణమైన బయటకు జారిపోయేలా వుంది. ఈ లోపులో నాయుడు క
మళ్ళీ కదిలించాడు. శేఖరం వళ్ళు జలదరించింది. అక్కణ్నుంచి జారి

ఆ ఆలోచన భయంకరంగా తోచింది. మరికొద్దిగా నీళ్ళ గొ
వైపు వెళ్ళబోయాడు. నాయుడు వంగి కర్రని తన వైపుకి లాక్కున్నా
ఒక క్షణం ఆలస్యమయితే కర్రతోసహా తను నేలమీదకు పడిపో
శేఖరం గ్రహించాడు. ఒక నీళ్ళగొట్టాన్ని చేరటానికి సమయంలేదు. త
సరిగా నాయుడు వున్నవైపే రావల్సి వచ్చింది. కర్రని పట్టుకుని
ఇటుగా వచ్చేసరికి నాయుడు దాన్ని పూర్తిగా లాగెయ్యటమూ. శే
దాన్ని వదిలేసి సన్‌-షేడ్‌ని పట్టుకోవటమూ రెప్పపాటులో జరిగిపోయా
కర్ర క్రిందికి జారి ఎక్కడో అఘాతంలో పడిన చప్పుడు వినిపించి

సన్‌షేడ్‌ని పట్టుకుని శేఖరం గాలిలో వేలాడసాగేడు. మూ
అంతస్తు అది. నాయుడు తనకి చెయ్యి అందిస్తాడేమో అని తల పై

చూసేదు. బాల్కనీలో వున్న నాయుడు అటువంటి ప్రయత్నమేదీ చెయ్యకుండా "చెప్పు, ఎవరు నువ్వు? నువ్వు దొంగతనానికి రాలేదు. ఎందుకొచ్చావ్? చెప్పు" అని అడిగాడు. శేఖరం మాట్లాడలేదు.

నాయుడు అక్కణ్నుంచి కదిలి లోపలికి వెళ్ళి ఫ్రిజ్ తెరిచి ఒక సీసా తీసుకుని వచ్చి బాల్కనీలో కుర్చీ వేసుకుని కూర్చుని తాపీగా తాగటం మొదలుపెట్టాడు.

నవ్వుతూ ప్రాణాలుతీసే హంతకుల్ని, రక్తపాతం జరుగుతూ వుంటే ఆనందించే వాళ్ళనీ చూసేడు గానీ ఇంత శాడిస్టుని ఎక్కడా చూడలేదు. అతడికి అసలు నాయుడి ఉద్దేశ్యం ఏమిటో అర్థంకాలేదు.

ఒకవైపు విసిరేసినట్టున్న ఫ్లాట్ అది. అవతలి ప్రక్క అంతా ఖాళీ ప్రదేశం. ఎవరూ చూడటానికి కూడా అవకాశంలేదు. సన్-షేడ్ పైకి రావటానికి బలం సరిపోవటంలేదు. కానీ ఎంతసేపలా?

చేతులమీద శరీరపు బరువు ఆన్చి, గాలిలో నిలబడి వుండటం క్షణక్షణానికి కష్టం అవుతూంది. చేతులు తిమ్మెర్లు ఎక్కుతున్నాయి. పాము కప్పని మింగుతూంటే దూరంనుంచి చూసేవాడిలా బాల్కనీలో కూర్చుని నాయుడు చిత్రంగా చూస్తూ బీరు తాగుతున్నాడు— చాలా కామ్‌గా.

అంతలో చేతులమీద ఏదో పాకినట్టయి తలెత్తి చూసేడు. చేతులు పైన వుండటంవల్ల ఏం పాకుతున్నదో తెలియలేదు. అతడి వెన్ను ఒక్కసారిగా జలదరించింది. అంతలో ఏదో కుట్టినట్టు చురుక్కుమంది.

చేతులు వదిలేసాడు.

దాంతో గాలి విపరీతమైన వేగంతో రివ్వున చెవుల్లోకి కొడ్తూ వుండగా అతడు భూమివైపు జారిపోయాడు.

మోహన్‌లాల్ కపాడియా ఇన్‌స్టిట్యూట్ విశాలమైన ఆవరణలో విసిరేసినట్టున్న ఇళ్ళ వెనుక పనికిరాని చెత్తనంతా పారవేసే ఆ ప్రదేశంలో ప్రహరీకి కాస్త ఇవతల చిన్న సిమెంట్ కుండీపక్కన, చరిత్రలో ఏ ప్రాముఖ్యత లేకుండా కొన్ని వందల సంవత్సరాలనుంచీ పడివున్న ఒక రాయికి అకస్మాత్తుగా విశిష్టత లభించింది. దాంతోపాటూ ఆ కుండీకి కూడా. ఆ రెండూ అక్కడ లేకపోతే ఏమై వుండేదో తెలీదుగానీ, ముందు ఆ కుండీ అంచు అతని గెడ్డానికి కొట్టుకుంది.

ఆ అదురుకి అతని తల క్షణంపాటు దిమ్మెక్కిపోయిం
మధ్య ఇరుక్కుని తెగిపోయిన నాలుక, విరిపడి అల్లంతదూరాన
దవడ కదిలి, టెంప్రో-మెండిబ్యులర్ జాయింట్స్ విరిగిపోయాయి.
ఈ లోపులో దబ్బున నేలమీద వెల్లకిలా పడ్డాడు.

పదకొండో వెర్టిబ్రా (వెన్నెముక క్రింద) దగ్గిర రా
గుచ్చుకుని కార్డ్ ఇంజురీ అయింది. క్రిందిభాగంలో నరా
పోయింది. అయితే అతడికి స్పృహ తప్పలేదు. స్కల్‌కి దెబ్బ

కొద్దిక్షణాలపాటూ నొప్పికూడా తెలియలేదు.

చెవుల్లో మాత్రం సముద్రపు హోరులా వినిపించసాగి
తరువాత ఒకటి రెండు నిముషాలకి నోటి బాధ తెలియవచ్చింది.

మూడో అంతస్థు మీదనుంచి అతడు అలా జారగానే
బాల్కనీ మీదనుంచి వంగి చూసేడు. శేఖరం నేలమీదకు పడ
పించింది. అతడు వెంటనే చేసిన పని ఏమిటంటే, దీన్ని ఎ
గమనించారా అని చుట్టుప్రక్కలా పరిశీలించటం.

అది ఫెన్సింగ్ దగ్గరున్న ఇల్లు. క్రింది అంతస్తులో వా
ఉన్నా చెత్తాచెదారం పడేసే వెనుకవైపుకి రారు.

అంత ఎత్తుమీదనుంచి పడినవాడు ఇంకా బ్రతికి
అనుకోలేదు. ఏ విధమైన పోలీసు కేసులోనూ అతడు ఇరుక్కో
లేదు. అందుకే అక్కణ్నించి కామ్‌గా వెళ్ళిపోదామనుకున్నా
అనుకుని లేవబోతూండే- క్రింది ఆకారంలో కదలిక కనిపించిం

లేవటానికి ప్రయత్నించిన శేఖరం- కాళ్ళు రెండూ
పోయి తిమ్మిరెక్కటంతో, లేవలేకపోయాడు. అదీగాక ఏ
లినా నడుము దగ్గర విపరీతమైన బాధ మొదలై శరీరాన్ని
తిప్పేస్తూంది.

పైన నాయుడు గ్లాసులో మళ్ళీ బీరు పోసుకుని తాగటం
లెట్టాడు. పూర్వకాలం రోమన్ రాజులు యిద్దరు బానిసలను కత్తు
గోదాలోకి దింపి, వాళ్ళలో ఒకళ్ళు చచ్చేవరకూ పోరాడటం
వినోదాన్ని చూస్తూ సంతృప్తి చెందేవారట. అలానే నాయుడు
నలభై అడుగుల క్రింద నేలమీద నిస్సహాయంగా కొన

గిజుకుంటున్న శేఖరాన్ని చిర్నవ్వుతో గమనిస్తున్నాడు. ఒక రకమైన సాడిస్టిక్ సంతృప్తి వుంది.

పడిపోయినవాడు మోహన్‌లాల్ ఇన్‌స్టిట్యూట్ చీఫ్ అకౌంటెంట్ అని తెలీదు. బావమరిది ఇంట్లో ప్రవేశించాడని తెలుసు. మామూలు దొంగ అని తెలుసు. అంతవరకే తెలుసంతే. తెలియకపోవటమే మంచిదయింది. తన కంపెనీ తయారుచేసే కాన్స్-క్యూర్ మందు తాలూకు రిపోర్టుకోసం వచ్చాడని తెలిస్తే మరెంత క్రూరంగా కసి తీర్చుకొనేవాడో....

క్రింద పడివున్న శేఖరం పరిస్థితి చాలా ఘోరంగా వుంది. తెగిన నాలుక విపరీతంగా మంట పెడుతూంది. నోరంతా ఎర్రగా మారిపోయింది. రక్తం గొంతులో కెళ్ళి క్లాట్ అయి ఊపిరికి అడ్డుపడకుండా తల ప్రక్కకి తిప్పి వంచాడు. పంపులోంచి నీటిధార వచ్చినట్టూ నోటిలోంచి రక్తం నేల మీద జారసాగింది. అదిచూస్తే షాక్ తగులుతుందని కళ్ళు మూసుకున్నాడు. కొంచెంసేపటికి రక్తం గడ్డకట్టింది.

కళ్ళు విప్పి చూసేడు, పైన బాల్కనీలో అతడు కనపడ్డాడు. నెమ్మదిగా గ్లాసు నోటి దగ్గరకు తీసుకుని తాగుతున్నాడు. తన వైపే చూస్తున్నాడు. తను చచ్చిపోయాడనుకున్నాడేమో అతడు! అలా ఆలోచించి, శేఖరం చెయ్యి వూపాడు.

పైనుంచి అతడూ చెయ్యి వూపేడు 'హలో' అన్నట్టూ.

శేఖరానికి అప్పుడర్థమయింది! అతడికి తను బ్రతికి వున్నట్టూ తెలుసని— కేవలం తన మరణాన్ని చూడటానికే అలా తాపీగా వేచి వున్నాడని!! అతడు కాకపోతే ఇంకెవరయినా తనకి సాయం చేస్తారని గట్టిగా 'హెల్ప్' అని అరవబోయాడు. గొంతులోంచి కీచుమని ధ్వని వచ్చింది కానీ మాట రాలేదు.

మళ్ళీ అరవబోయేడు.

నాలుక నుంచి రక్తం తిరిగి స్రవించసాగిందే తప్ప మాటరాలేదు.

గొంతు గాలిని మాటలుగా మార్చే నాలుక అనే సాధనం శరీరం నుంచి తెగి దూరంగా పడటంవల్ల తను స్వరాన్ని కోల్పోయేనని తెల్సుకోటానికి అంతసేపు పట్టింది.

అతడికి ఆ సత్యం అర్థమయ్యేసరికి ప్రపంచమే మూగబోయినట్లనిపించి, చెవిలో ఘోష తగ్గింది.

అంతలో దూరంగా అలికిడి అయింది. దాన్ని అతన
లేదు. మేడమీదున్న నాయుడు గమనించాడు.

పాతగుడ్డలూ, ఇనుపముక్కలూ ఏరుకునే కుర్రవాడ
నుండీ వైపు రావటాన్ని గమనించి కుర్చీలోంచే లేచి 'రేయ్'
చాడు. వాడు ఆగేడు.

నాయుడి ఉద్దేశ్యం గమనించి, శేఖరం వాడి దృష్టి
పడటం కోసం శతవిధాల ప్రయత్నించాడు. కానీ లాభంలే
అరవబోయాడు. కానీ గొంతులోంచి 'ఎక్....ఎక్....' శ
మాత్రం వచ్చింది.

ఈ లోపులో నాయుడు వాడితో "ఎవర్రా నిన్నిట్టు
అని అరిచాడు. వాడు బెదురుతూ చూసి, ఏదో అన్నాడు. శేఖ
వినిపించలేదు.

ఇంతలో నాయుడు "వెళ్ళెళ్ళు, ఇటేపు రాకు" అన్నాడు
వాడు వెళ్ళిపోయాడు. నాయుడు తిరిగి కుర్చీలో కూ
చేతిలోకి తీసుకున్నాడు. తనవైపు చూసి నవ్వినట్టు కూడా అని
శేఖరం నిస్సహాయతా, కోపమూ మిళితమైన ఉక్రోషంగ
బిగించి నేలమీద కొట్టేడు. నిశ్శబ్దం తప్ప మరేమీ లేదు.

నిశ్శబ్దం!

నాయుడు మాట్లాడింది, ఆ కుర్రవాడు జవాబు ఇచ్చిం
వినిపించనంత నిశ్శబ్దం....

ఆ నిశ్శబ్దంలోంచి ఒక అనుమానం స్పార్క్‌లా మెరి
మనసంతా ఆక్రమించింది. చప్పున చెవులు తడుముకొన్నాడు.

రెండు చెవుల దగ్గర జిగటగా తగిలింది.

రక్తం!

అతడికి మనిషి ఫిజియాలజీ గురించి తెలీదు. టంగ్రొ-చె
జాయింట్స్ గురించీ తెలీదు.

కానీ శాశ్వతంగా చెవిటి వాడినయ్యానని మాత్రం తెలిసిం
మీద షాక్.... చుట్టూ రక్తం. అతడికి స్పృహ తప్పింది.

* * * *

తిరిగి అతడికి మెలుకువ వచ్చేసరికి చీకటి పడింది.

ఆకాశంలో నక్షత్రాలు కనపడుతున్నాయి.

ఆ ప్రదేశమంతా నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా వుంది. బాల్కనీలో [illegible] లేదు.

అతడు వాచీ చూసుకున్నాడు. పదిన్నర.... ఇళ్ళు దూరం దూరంగా వున్న కాలనీ అవటంవల్ల జనం అప్పుడే నిద్రలోకి జారుకున్న ట్టున్నారు.

అతడు అలాగే వెల్లకిలా పడుకుని ఆకాశంలో నక్షత్రాల కేసి, చంద్రుడికేసి చూడసాగేడు. అతడి మెదడు ఏ విధంగా ఆలోచించటాని కైనా నిరాకరిస్తూంది. స్తబ్దంగా వుంది. దూరంగా ఓ కీచురాయి ఆగి ఆగి అరుస్తూంది.

ఇంతలో కాళ్ళకి స్పర్శజ్ఞానం తెలిసినట్టయి, కదపటానికి ప్రయ త్నించాడు. నడుము దగ్గర తిరిగి నొప్పి ప్రారంభమయింది. వెన్నెముక విరిగిపోయిందేమో అని భయపడ్డాడు. కానీ కాళ్ళు స్పర్శ పోగొట్టుకో లేదు. కేవలం ఇంజరీ అయి వుంటుంది.

అతడికెందుకో ఆ క్షణాన తన మొహాన్ని అద్దంలో చూసుకోవా లనిపించింది. నాలుక తెగి జాంబవంతుడి మూతిలా మారి వుంటుంది బహుశా! పెదవుల నుంచి కారిన రక్తం చెక్కిలి మీద ఎరుపురంగు అద్ది వుంటుంది. ఇక తను మాట్లాడలేడు. ఇతరులు మాట్లాడింది అర్థం చేసుకో లేడు. సర్కస్‌లో బఫూన్‌లా సంజ్ఞలతో కాలం గడపాలి. దానికి తగ్గట్టు ఎత్తయిన మూతి, ఎర్రటి రంగు. భలే భలే....

సడెన్‌గా- తను పిచ్చివాడిగా మారబోతున్నానని అతడికి అర్థ మయింది. డిలిరియం స్థితి రాబోతూంది. తనని తాను కంట్రోల్ చేసుకోక పోతే ఈ పరిస్థితులు తనను డిప్రెషన్‌లోకి తీసుకెళ్ళి అక్కడ్నించి ఉన్మా దిని చేస్తాయి? నో.... ఇలా జరగటానికి వీలులేదు. తను మరణించినా ఫర్లేదు. కానీ పిచ్చివాడుగా, జీవచ్ఛవంలా మారటానికి వీలులేదు. చని పోయేముందు ఒక్క ఆశయం మాత్రం తీర్చుకోవాలి.

పగ!

బ్రతుక్కీ, చావుకీ మధ్య తను అటూ ఇటూ వూగుతూ వుంటే—

దాన్ని సరదాగా చూస్తూ కూర్చున్న ఆ నాయుడికి బుద్ధి చెప్పగ
చావటానికి వీలులేదు.

అంతవరకూ తన మనసు తన ఆధీనంలో వుందాలి
ఈ రక్తం గురించీ, తన నిస్సహాయ స్థితి గురించీ ఆలోచిం
మరణిస్తే ఫర్వాలేదు. కాని బ్రతికి వుంటే ఈ రాత్రి తెల్లవార్లు
యినా వచ్చి తనకు సాయపడేవరకూ ఇంకేదయినా ఆలోచిం
ఆలోచించాలి?

భవిష్యత్తులో తనెవర్నయినా అమ్మాయిని ప్రేమిస్తే
గుస గుసగా 'ఐ వాంట్ టు స్మాష్ యూ విత్ మై లవ్'
చెప్పగలుగుతాడు. ఆ అమ్మాయి అయినా కూడా ఆ సమయంలో
పోతూ తనకి ఎలా సందేశం అందివ్వగల్గుతుంది? పక్కమీద
వెళ్ళి కాగితం పెన్నూ తీసుకొని వ్రాసి చూపిస్తే తప్ప తన
కష్టాలు తెచ్చి పెట్టేవయ్యా మన్మథుడా! అయినా కొంతల
నయం. చాలా నవలల్లో చదివాడు. ఈ కాలంలో అమ్మాయిల
నాలుకలేని అబ్బాయిల్నే ఎక్కువ ఇష్టపడతారట. కనీసం
కేషన్ మిగిలింది తనకి! ఇది క్రెడిట్టు. పోతే ముందులాగా
క్రికెట్ ఆడటం, దాగుడుమూతలు నేర్పటంలాంటి పనులు చేయలే
డెబిట్టు.

ఇలా క్రెడిట్టూ, డెబిట్టూ వేసుకుంటూ అరగంట గడిపాడు.

తన స్థితి గురించిన భయంకరమైన వాస్తవాన్ని మర్చి
కోసం అతడు ఈ విధంగా ఆలోచిస్తున్నాడు. పైకి చాలా తేలిగ్గా
లుగా కనిపిస్తుంది. కానీ అది చాలా కష్టసాధ్యమయిన విషయం.
లలో వుండి సుఖం గురించి ఆలోచించటం.... మనసును తేలిగ్గా
కోవటం—— అది సాధ్యంకాని పక్షంలో ఆ రక్తపు మడుగు
అతడెప్పుడో ట్రాన్స్‌లోకి వెళ్ళిపోయి వుండేవాడు. తనని తాను
కంగా (షాక్ తగలకుండా) రక్షించుకునే ప్రయత్నం చేయలేక
పోయేవాడు.

అతడికి ముందు శారద జ్ఞాపకం వచ్చింది. ఆ దేహం
ఏమైనా చేతబడి చేయించి, తనకిలా చెవులూ నోరూ పోవటానికి
ఘాతుకాలు అయి వుంటుందా అని ఆలోచించాడు, కాదనిపించింది.

ఎప్పుడయినా మోసం చేసేదా అంటే అదిలేదే. తనేం మాట్లాడినా, ఎవర్నని ఏడిపించినా అదంతా సరదా కోసం అని తన ఫ్రెండ్స్‌కీ, స్నేహితురాళ్ళందరికీ తెలుసు. తన కంపెనీ ఎవరికీ హానికరం కాదని ఆ వాళ్ళకీ తెలుసు. తెలిసీ తననెవర్నీ మోసం చేయలేదు. చాలామంది వాళ్ళలా "పైకి" మంచిగా కనపడి, బాగా మాట్లాడుతూ నెమ్మదిగా చట్టా గొయ్యి తవ్వటం తనకు తెలీదు. స్నేహాన్ని ఫ్రాంక్‌గా చేసేవాడు, ఇచ్చేవాడు, పుచ్చుకునేవాడు. మరెందుకిలా జరిగింది?

సోడాబుడ్డి కళ్ళద్దాల కమల, ఎత్తు పుస్తకాల రాంబాయమ్మగారూ— తనకు తగిలిందా పోనీ అనుకుంటే. పైకి ఎంత కోప్పడ్డా లోలోపల మెచ్చే, తన మాటంటే వాళ్ళకి ఇష్టమేనని నిశ్చయంగా తెలుసుకదా. ఏ వ్యంగ్యం వాళ్ళకు ఇష్టంలేదని తెలిశాక తను మాటల దగ్గిరే ఆగిపోయాడు కదా.

చేసిన పాపాలకు ఫలితం అనుభవించక తప్పదంటారు. మరి నేను చేసిన పాపం ఏమిటి? ఏముంది తనలో కల్మషం? నిష్కల్మషమయిన మనస్సుని నిష్కపటంగా బయట పెట్టడమేనా? అదేనా తప్పు?

మనిషి మంచిగా వుండడం వేరు. మంచిగా కనబడడం వేరు.

ఈ ప్రపంచానికి కావల్సింది రెండోది.

అందుకేనా తగిన శిక్ష?

అదే కారణమయితే తను నమ్మిన సిద్ధాంతం కోసం తను విధితో పోరాడతాడు. ప్రాణం పోయినా సరే! మనసుకు ముసుగు వెయ్యటంకన్నా దౌర్భాగ్యం ఇంకొకటి లేదు. దానికన్నా చావే మంచిది.

అంతలో రాత్రి పన్నెండయినట్టూ సైరన్ మ్రోగింది. అది అతనికి వినపడలేదు.

ఆ స్థితిలో కూడా అతనికి నవ్వొచ్చింది.

ఇదేమిటి? తను కర్మసిద్ధాంతం వేపు వెళుతున్నాడు? తన పాపపుణ్యాల గురించి బేరీజు వేసుకుంటున్నాడు....? సన్‌షేడ్‌ని పట్టుకుని వేలాడుతూ వుండగా చీమలబారు చేతి మీదకు పాకింది. అదేదో విషపురుగు అనుకుని చేతులు వదిలేసి నడుము విరగ్గొట్టుకున్నాడు. అంతే

దీనికీ కర్మకీ సంబంధం ఏమిటి? దీన్ని గురించి ఆలోచించడం మానెయ్యాలి. దీనికన్నా జిడ్డు కృష్ణమూర్తి తత్వశాస్త్రం కార్ల్‌మార్క్స్ థియరీ గురించో ఆలోచిస్తే పుణ్యం- పురుషో చుట్టూ చూసేడు.

ఆ ఆవరణంలో మందంగా పరుచుకున్న చీకటిని సన్న పారద్రోలలేకపోతూంది. ఇంకా ఏడెనిమిది గంటలు.... అప్ప యినా ఇటువేపు వస్తారో- రారో....

అతడు కళ్ళు మూసుకున్నాడు.

చుట్టూ అంతా స్తబ్దంగా వుంది.

ఆ స్తబ్దతలో చిన్న కదలిక.

దాన్ని అతడు గమనించలేదు.

చెత్తాచెదారం, అడుగునుంచి కొద్దిగా కదిలి ముందు బయటకొచ్చింది. అటూ ఇటూ చూసి మరింత బయటపడింది.

తర్వాత పూర్తిగా వెలువడింది.

ఎన్నో సంవత్సరాలనుంచీ అక్కడ స్థిరనివాస పందికొక్కు అది. శరీరం సైజుకి ఏ మాత్రం సంబంధంలేని తల, సన్నటి చీలికలాటి నోరు....

ఆ చీకటిలో దాని కళ్ళు చమక్—చమక్ మని మెరి

బయటకొచ్చి ఒక క్షణం ఆగింది. రెండడుగుల దూరం లంగా వున్న శరీరంకేసి తదేకంగా చూసింది. కాస్త లేటపటాయిం వెళ్ళింది. ఆ శరీరంలో చలనం లేకపోవటంతో మరింత దగ్గర తలప్రక్కనుంచి క్రిందికి కారి గడ్డకట్టిన రక్తాన్ని తవ్వి తీసింది.

దాని గోళ్ళ చప్పుడు అతని చెవులు పనిచేయకపోవడం పించలేదు. రక్తం రుచి చూసి అది మరింత ముందుకెళ్ళింది.

అకస్మాత్తుగా నోటి దగ్గర ఏదో స్పృశించినట్టయి అత విప్పేడు.

జీవితంలో ఎన్నడూ అతడు అంత భయభ్రాంతుడవలేదు. దగ్గర, కళ్ళకి మూడడుగుల దూరంలో దాని కళ్ళు ఉన్నాయి. కుండా అతడివేపే చూస్తూంది. దాని కళ్ళు ఎర్ర మీదకు దూకే

...గా వున్నాయి. వెన్నెల దాని మీసాలమీద ప్రతిఫలిస్తోంది. ...దాని నుంచి వచ్చే దుర్గంధం ముక్కుపుటాలనే బ్రద్దలు ...తోంది.

అతని గుండెల్లోంచి వచ్చిన కేక గొంతుదగ్గర ఆగిపోయింది. ...సిన సంగతి, నాలుక సంగతి మర్చిపోయి, అతడు రెప్పన ... రెండు చేతులతో దాన్ని దూరంగా విసిరేశాడు. చీకట్లో అది ...మైపోయింది. అయితే ఆ అరుపుకి అతడి నోటినుంచి రక్తం తిరిగి ...రాగింది. ఒక్క ఉదుటున కదలటం వలన ఈసారి శరీరమంతా ...క్ అయినట్టయింది.

అతని వణుకు ఇంకా తగ్గలేదు.

భయం కళ్ళలో మెదులుతూనే వుంది.

అతడు జీవితంలో భయపడేది మూడిటికే. దేగకి, పందికొక్కుకి, ...త స్త్రీకి.

అతడు చేతుల్తో రక్తం తుడుచుకున్నాడు. మరో పది నిముషాలు ...డు.

అంతలో ఏదో తగిలినట్టయి చప్పున తలతిప్పి చూసేడు.

దూరంగా అదే పందికొక్కు- తల నిటారుగా పెట్టి అతడినే ...తోంది. అతడికి పిచ్చెక్కినట్టయింది. చేతితో నేలని టప్పమని కొడ్తూ ...సేడు. అది కొద్దిగా కదిలి వెనక్కెళ్ళి మళ్ళీ వచ్చింది.

అతడు అక్కడనుంచి కదల్లేడన్న విషయం అదీ గుర్తించినట్టు ... కొద్దిగా దగ్గరికి వచ్చి మళ్ళీ దూరంగా వెళుతూంది. ఇలా రావటం, ...కదిలించగానే వెళ్ళటం. సముద్రగర్భంలో అగ్ని పర్వతంలా ...బడితే, పొంగే అగ్నిజ్వాలలకి, సముద్ర జలాలకి కొన్ని గంటల ...రోజులపాటు ఘర్షణ జరుగుతుంది. అలాటి ఘర్షణే అతడికీ, దానికీ ...రాత్రి చాలాసేపు జరిగింది.

...తలకి తగిలిన దెబ్బవల్ల, రక్తం చాలా పోవటం వల్ల అతడు ... బలహీనపడసాగాడు. దాన్ని అదిలించే శక్తి కోల్పోయాడు. ...తెల్లవారుతుండగా అతడు పూర్తిగా స్పృహ కోల్పోయాడు.

అది దగ్గరకొచ్చి ఆగింది.

అతనిలో కదలిక లేదు.

అది అతడి భుజంమీదనుంచి మొహం దగ్గరగా మొహంమీద ముఖంపెట్టి నోరు తెరిచింది. సన్నటి గీతలా పై పెదవి విప్పగానే ఎర్రటి కండరం క్రింద కోరల్లాంటి ప

సరిగ్గా అతడి కళ్ళమీద....

పిశాచుడు అంటే అర్థం ఏమిటి? రాత్రిళ్ళు సంచరిం లేనివాడా?

## 3

సోమశేఖరం వెళ్ళిపోయాక, మరికొంతసేపు ఆగి బయలుదేరాడు. కానీ అతడు వెంటనే సామ్సన్ కంపెనీ తన ఇన్‌స్టిట్యూట్‌లోనే స్టోర్స్ డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళి మొహ మాస్క్ ఒకటి ఇండెంట్ చేసి తీసుకున్నాడు. సామ్సన్ అ కంపెనీలో పనిచేసేవారు వాడే ముసుగులాగా వుందది.

దానితోపాటే, ప్లాస్టిక్ లాటి పదార్థంతో తయారుచేసి నొకదానిని తీసుకున్నాడు. గాస్ కలెక్షన్ బ్యాగ్ అది.

ఆ రెండింటితోనూ అతడు సామ్సన్ కంపెనీవైపు

అంతకు ముందొకసారి వెళ్ళిన కారణంగా ఈసారి పించలేదు. కానీ ఇంతకుముందు వెళ్ళినప్పుడు దొంగతనం ననే భావంలేదు కాబట్టి మామూలుగా వెళ్ళగలిగాడు. భయంగా వుంది. అయినా మామూలుగానే గేటులోంచి ఆఫీసు అతడు వెళుతూంటే గేటు దగ్గిర ఎవరూ ఆపుచెయ్యలేదు.

ఆఫీసు మెట్లవరకూ నడిచి, అటూ ఇటూ చూసి, గమనించటంలేదని ధృవపర్చుకుని, చటుక్కున బిల్డింగ్ నడిచాడు. అక్కడ చిన్న చిన్న చెట్లు, పొదలు అస్తవ్యస్త వున్నాయి. ఫ్యాక్టరీని, ఆఫీసుని విడదీస్తున్న ఫెన్సింగ్ వెళుతూంది.

ఫెన్సింగ్ లోపలికి ప్రవేశించాడు.

ఇనుప గొట్టాల వెనుకనుంచి అతడు అవతలివైపుకి బాయిలర్‌కీ వాటర్ పంపుకీ మధ్యలో గుట్టగా వుంది.

అతడు దాన్ని తీసి పొట్లం కట్టుకున్నాడు. జేబులో పట్టిక చేర్తే ... వచ్చింది.

...జంర్ పక్కనుంచి జాగ్రత్తగా మెట్లు ఎక్కి, అంతకుపూర్వం ...కొం క్రితం తను పరుగెత్తిన రేకుల దారి మీదకు చేరుకున్నాడు. ...మంది కార్మికులు పనిచేస్తూ వుండటం కనిపిస్తూంది. దూరంగా ...గేటూ, సెక్యూరిటీ కూడా గోచరమవుతూంది. తమ తమ పనుల్లో ...ర్మికులు అతడిని పట్టించుకోలేదు. రేకులమధ్య సన్నటిదారి.... ఆ దారివెంటే కొంత దూరం నడిచి ఫ్యాక్టరీ గొట్టం పక్కగా చోటు ...చి కూర్చున్నాడు.

సమయం భారంగా గడుస్తూంది.

భార్గవ వాచీ చూసుకున్నాడు.

ఎందుకో తలెత్తి దూరంగా వున్న ఆఫీసువైపు చూసి ఉలిక్కి

ఆఫీసు వరండాలో నాయుడు ఎవరితోనో మాట్లాడుతూ కనిపిం... భార్గవ చప్పున తల తిప్పుకున్నాడు. అంత దూరంనుంచి అతడు ...లేకపోవచ్చు. కానీ భార్గవకి ఏ విధమయిన రిస్కు తీసుకోవటం ...దు. వంగి, అక్కడ ఏదో పని చేస్తున్నవాడిలాగా వేళ్ళతో బోల్టు ...ప్పసాగేడు.

ఇంతలో సైరన్ మ్రోగింది.

వెంటనే అందరు కార్మికుల్లాగే అతడూ చప్పున మాస్కు తీసుకుని ...కి తగిలించుకుని, అందులోని గాలి పీల్చసాగాడు.

సైరన్ మోగిన కొద్ది క్షణాలకి పంపు సందుల్లో నుంచి గాస్ ...క్ అవసాగింది. అతడు అంతకుముందు వచ్చినప్పుడే ఒక సంగతి ...చాడు. ఆ పంపు నుంచి బయల్పడే విషవాయువు ప్రభావము కేవలం ...క్షణాలపాటే వుంటుంది. మామూలు వాతావరణంలోకి ఆ గాస్ ...శించగానే అది తన ప్రభావాన్ని కోల్పోతుంది. బహుశా 'ఆక్సిడేషన్'కి ...వుతుందేమో. ఏ విషయమూ ప్రయోగశాలలోనే తెలియాలి. ...ప్పుడే ఒక నిర్ణయానికి రాదల్చుకోలేదు.

అతడు తనతోపాటూ తెచ్చిన ప్యాకెట్ లో ఆ గాలిని నింపేడు.

గాస్ లీకేజి ఆగిపోగానే, మాస్క్ తీసేసి మామూలుగా బయటకు రాబోయేడు.

ఫ్యాక్టరీ ముందే సెక్యూరిటీ ద్వారం నుంచి బయట పీలులేదు. మామూలు పరిస్థితుల్లో అయితే కుదురునేమోగానీ, చొక్కా చిరిగిపోయి వుంది. బురదకూడా అంటింది. అందు వచ్చిన మార్గాన్నే తిరిగి వెళ్ళటానికి నిర్ణయించుకున్నాడు.

మళ్ళీ బాయిలర్ వెనక్కి చేరుకుని, అక్కణ్నుంచి నడిచాడు. ఇక వెళ్ళిపోతున్నాను కదా అన్న నిర్లక్ష్యంతో నప్పుడున్నంత జాగ్రత్తగా లేడు. దురదృష్టం అతడిని వె ఫెన్సింగ్ ఇంకో అయిదడుగుల దూరంలో వుండగా అతని విజిల్ వినిపించింది. ఆ తరువాత 'ఆగు' అన్న కేక.

భార్గవ వెనక్కి తిరిగి చూసేడు.

సెంట్రీ తనవైపే రావటం కనిపించింది.

చప్పున తిరిగి ఫెన్సింగ్‌వైపు పరుగెత్తాడు. వెనుక వ కూడా పరుగెడుతున్నట్టూ అడుగుల చప్పుడు దగ్గిరయింది. ఆఫీసు కాంపౌండ్‌లోకి వెళ్ళిపోగలిగితే చాలు, అక్కణ్నుంచి తప్పించుకోవచ్చు.

ఆ ఆలోచన రాగానే వేగం మరింత హెచ్చించాడు.

రెండు క్షణాల్లో అతడు ఫెన్సింగ్ చేరుకున్నాడు. కోవటమే తరువాయి, వంచి తీగల మధ్య తలదూర్చి అటు

అతడి షర్టు ఆ తీగల మధ్యే చిక్కుబడిపోయింది.

ఎంత గట్టిగా ప్రయత్నం చేసినా రాలేదు. అతడా వుండగానే సెంట్రీ దగ్గిర కొచ్చేశాడు.

* * * *

"చెప్పరా, ఎవరు నువ్వు?"

భార్గవ మాట్లాడలేదు. తన ఆకారం ఒక దొంగ అతడికి తెలుసు. అందుకు సంతోషించాడు కూడా. తనెవరో తెలియక పోవటమే మంచిది.

సెక్యూరిటీ పేరు హర్నామ్‌సింగ్, అతడు పెద్దగా పట్టించుకోడు. ఫ్యాక్టరీ ఆవరణలో విలువైనవేమీ లే

డు. అతడు భార్గవ దగ్గిరకొచ్చి చేతిలోంచి ప్యాకెట్ లాక్కొని విప్పదీసేడు. అందులోని తెల్లటి పొడిని చూడగానే "ఇది చోరీ చెయ్యటానికి ఇంతదూరం వచ్చావా దొంగనాయాలా" అంటూ లాగి చెంపమీద కొట్టాడు. భార్గవ పెదవి చిట్లింది.

అతడితో పాటూ మరిద్దరు సెంట్రీలు మిలటరీ దుస్తుల్లాంటి దుస్తుల్లో వున్నారు. వారిలో ఒకడు భార్గవని ఫెన్సింగ్ దగ్గిర పట్టుకున్నవాడు. అతను తప్ప మిగతా జేబులు వెతికాడు, పర్సు దొరికింది.

విప్పి చూస్తే అందులో నాలుగు వేలదాకా వున్నాయి.

"ఓహో వీడెవడో డబ్బులున్న దొంగే. ఎక్కడ కొట్టేసేవురా న్నా!" అన్నాడు. మిగతా ఇద్దరూ నవ్వేరు. భార్గవ మాట్లాడలేదు. డబ్బు వాళ్ళంచేసుకుని, ఖాళీ పర్సు తిరిగి జేబులో పెట్టేశాడు.

వచ్చిన వారి దగ్గర ఇంకేమీ కనిపించకపోయేసరికి, ఇంత చిన్న విషయాన్ని మెయిన్ ఆఫీసువరకు తీసుకువెళ్ళటం ఇష్టం లేకపోయింది. పైగా నాలుగువేలు చిన్న మొత్తం కాదు.

మూడో సెంట్రీ భార్గవ కాలరు పట్టుకుని దగ్గరకు లాగి, "ఇంకెప్పుడయినా ఇటువైపు కనిపించావంటే ఎముకలు విరగ్గొడతాను. పో..." అంటూ తోసేడు.

భార్గవ రూమ్‌నుంచి బయటకు విసురుగా వచ్చి పడ్డాడు. చిట్లిన పెదవి నుంచి రక్తం కారసాగింది. అయినా ఇంతలో బయటపడ్డందుకు అతడికి సంతోషంగానే వుంది. ముఖ్య విషయం- తను సేకరించిన 'గాస్' వారి కంట బడకపోవటం.

"అయితే అతడిని దురదృష్టం వదిలి పెట్టలేదు."

అతడు లేచి బట్టలు దులుపుకుని రెండడుగులు వేసేడో లేదో, లోపల్నుంచి నాయుడు కారు వస్తూ గేటు దగ్గిర ఆగింది. పెద్దగేటు తలుపులు తీసి సెంట్రీ సెల్యూట్ చేసి నిలబడ్డాడు. కారు గేటు దాటుతుంటే నాయుడు అద్దాల్లోంచి భార్గవని చూసేడు. అతడు అక్కడెందుకున్నాడా అని అనుమానం వచ్చి, కారు ఆపమని డ్రైవరికి చెప్పి, సెంట్రీని అడిగాడు.

మేనేజింగ్ డైరెక్టర్ అడుగుతూవుండేసరికి, సెంట్రీ తబ్బిబ్బై జరిగిందంతా చెప్పేశాడు. నాయుడు అతడితో మరో రెండు నిమిషాలు

మాట్లాడి, కారు పోనిమ్మన్నాడు. భార్గవ పక్కనుంచే కా
పోయింది.

భార్గవ నాలుగు అడుగులు వేసేసరికి వెనకనుంచి
చెయ్యి పడింది. తిరిగి చూస్తే సెంట్రీ "నువ్వొకసారి
అంటున్నాడు.

భార్గవకి అర్థంకాలేదు. అంతా అయిపోయిందనుకున్నా
ఇదేమిటో అర్థంకాలేదు. తిరస్కరిద్దామనుకున్నాడు. కానీ
గొడవ బావోలేదని తిరిగి వెనక్కి వెళ్ళాడు.

అతడు ఆ గదిలో ప్రవేశించేసరికి అక్కడ వాతావరణ
మారిపోయింది. హర్నామ్‌సింగ్ చీవాట్లు తిన్నవాడిలా మొహ
కొని వున్నాడు. భార్గవని చూసి "ఇలా కూర్చో" అంటూ స్థ
చాడు. భార్గవకి అర్థంకాలేదు. "దేనికి" అని అడిగాడు. ఎవ
ధానం చెప్పలేదు.

భార్గవ రెట్టించి అడిగాడు. హర్నామ్‌సింగ్ విసుక్కుంటూ
"కూర్చో, కూర్చో. ఎదురుప్రశ్నలు వెయ్యకు" అన్నాడు.
ఇదంతా అయోమయంగా వుంది. సెంట్రీలందరూ ఎవరికోస
చూస్తున్నట్టూ వేచి వున్నారు. గోడ గడియారం శబ్దం
నిశ్శబ్దంగా వుంది.

అంతలో మోటార్‌సైకిల్ చప్పుడయింది. కొద్ది క్ష
వచ్చి గుమ్మంముందు ఆగటమూ, యూనిఫారంలో వున్న
ఒకరు లోపలికి రావటమూ జరిగింది.

* * * *

ఇన్‌స్పెక్టర్ రవూఫ్.

పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో కర్కోటకాలు, నిర్దాక్షిణ్యం
వించిన వాళ్ళు వుంటారని ఎవరయినా ఉదాహరణ ఇవ్వద
ఇన్‌స్పెక్టర్ రవూఫ్‌ని అందుకు తార్కాణంగా పేర్కొనవచ్చు.
గుల ఎత్తు, ఎర్రటి కళ్ళు, లావాటి మీసాలూ- కేవలం డ్రస్‌లోనే
ఇన్‌స్పెక్టర్‌లా వుంటాడు, డ్రెస్ లేకపోతే రౌడీలా వుంటాడు.

టకటకా బూట్లు చప్పుడు చేసుకుంటూ అతడు లోపలి
భార్గవని చూసి, "ఇతనేనా" అని అడిగాడు. సెక్యూరిటీ చీఫ్ తల

ఇన్స్పెక్టర్ అతడివేపు వస్తూ వుండగా భార్గవ చటుక్కున లేచి నిలుచున్నాడు. అతడికి జరిగింది అర్థమయింది. వెళ్ళిపోతున్న వాడిని ఏదో వచ్చినట్టుగా తిరిగి పిలిచింది ఇందుకన్నమాట. తన కళ్ళముందే జరిగే మోసం చూస్తుంటే అతడికి వళ్ళు మండిపోయింది.

"ఇది అన్యాయం?" అన్నాడు.

"ఏది?"

"నన్ను రోడ్డుమీదనుంచి పిల్చి వెనక్కి పిల్చుకొచ్చారు ఇన్స్పెక్టర్."

"అంతకుముందు దొంగతనంగా ఫ్యాక్టరీలో ప్రవేశించలేదా నువ్వు?"

"దానికి సరిపడా నా జేబులో డబ్బు తీసుకొని నన్ను వదిలేసేరు, కావాలంటే వాళ్ళ జేబులు వెతకండి నా డబ్బు దొరుకుతుంది."

ఈ మాటలకి సెంట్రీ భార్గవ వెనుకనుంచి భుజం పట్టుకుని వెనక్కి తిప్పి మళ్ళీ ఫెడేలునకొట్టి- "వీడెవడో సామాన్యుడిలా లేడు ఇన్స్పెక్టర్. మా ఫ్యాక్టరీకొచ్చి మామీదే దొంగతనం మోపుతున్నాడు" అంటూ మరోసారి కొట్టాడు.

భార్గవ వెనక్కి తూలి ఇన్స్పెక్టర్మీద పడ్డాడు. ఈ దౌర్జన్యం అతడిని దాదాపు పిచ్చివాడ్ని చేసింది. మామూలుగా పోలీసుల్ని పిలిపిస్తే అతడంత ఇరిటేట్ అయ్యేవాడు కాదు. తన డబ్బు తీసుకొని తనని వదిలేసి, తిరిగి మళ్ళీ వెనక్కి పిలిచి, అరెస్టు చేయించటం అతడి సహనాన్ని నశించేలా చేసింది. ఒక్క ఉదుటున సెంట్రీమీదకు వెళ్ళబోయాడు. కానీ వెనుకనుంచి ఇన్స్పెక్టర్ బలంగా పట్టుకున్నాడు. అయినా సెంట్రీ ఇదిచూసి నవ్వేసరికి అగ్నిమీద ఆజ్యం జల్లినట్టయింది. మోచేయి వెనక్కి విదిలించేసరికి అది వెళ్ళి ఇన్స్పెక్టర్ డొక్కలో తగిలింది. అతడు పట్టు వదిలేశాడు. భార్గవ గాలిలా దూసుకు వెళ్ళి సెంట్రీ చొక్కా పట్టుకున్నాడు. అతడి ఉద్దేశ్యం సెంట్రీ జేబులోంచి డబ్బుతీసి చూపించి తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకుందామని....

తనమీదకొస్తున్న భార్గవని చూసి సెంట్రీ ఇంకోలా అనుకున్నాడు. భార్గవ మొహం భయంకరంగా వుంది. కోపంతో ప్రజ్వరిల్లుతోంది. తలుపులన్నీ మూసి కొడితే పిల్లైనా తిరగబడుతుంది అనేలా వున్నాడు. అతడి ఆకారం చూసి సెంట్రీ అప్రయత్నంగా వెనక్కి

అడుగు వేసేడు. హర్నామ్‌సింగ్ చెప్పిన లాకీకోపం గదిలో మరో
వెళ్ళాడు. వెనుక ఇన్‌స్పెక్టర్ కడుపులో తగిలిన దెబ్బతో ఇంకా
అకస్మాత్తుగా తనకి దారి దొరికినట్టనిపించింది భార్గవకి.
గుమ్మం కనిపించింది. ఒక్కసారి ఈ పురిటోమలోంచి
వెళ్ళిపోతే తనకి జరుగుతున్న ఈ అన్యాయం నుంచి రక్షణ
ఎందుకో అనిపించింది. అందులో యుక్తాయుక్తాలు ఆలోచించలే
లేదు. అతడు చెప్పిన అటు పరుగెత్తాడు. వెనుకనుంచి "ఆ
వినిపించింది ఇన్‌స్పెక్టర్ కంఠం. అతడు ఆగలేదు. గు
మరో నాలుగు అడుగులు వేసేడు.

"ధాం"

చెవులు చిల్లులుపడేలా శబ్దం వినిపించింది.

మండుతున్న ఇనుప ఊచని బలంగా కాలిలోకి
ఒక్కసారి భగ్గున మండింది. ఒక కేక బిగ్గరగా గొంతులోంచి
ఆగిపోయింది. కాలు పట్టుకుని నిస్సహాయంగా క్రిందికి వాలిపో
వెచ్చటి రక్తం కాలిమీదుగా ప్రవహించసాగింది. ఇంతలో ఎదురు
అయి కళ్ళు విప్పి చూసేడు.

ఎదురుగా రవూఫ్ నిలబడి వున్నాడు.

క్రూరమైన స్వరంతో అతనన్నాడు, "ఈ రవూఫ్ నే
తప్పించుకు పారిపోవటం అంత సులభంకాదు మిస్టర్! నువ్వెవరో
ఈ లైన్‌లోకి దిగినట్టున్నావ్. నన్ను కొట్టినవాడు ఇంతవ
మొట్టమొదటి వాడివి నువ్వే. నిన్ను తగినవిధంగా అభినంది
విధి. అప్పుడే ఏమైంది పద, లాకప్‌లో చూపిస్తాను" అంటూ అత
మీద బూటుతో కొట్టాడు. భార్గవ పంచప్రాణాలూ తోడేసినట్టయి
గట్టిగా కరచి బాధని దిగమింగేడు.

రవూఫ్ అతడి రెక్కపట్టుకుని, మరో సెంట్రీసాయంతో
యీడ్చుకెళ్ళాడు. అనుమతి లేకుండా పరాయిచోట ప్రవేశ
క్రిమినల్ ట్రెస్‌పాస్ సెక్షన్ 448 క్రిందా- విధి నిర్వహ
ప్రభుత్వాధికారికి అడ్డు తగిలినందుకు సెక్షన్ 353, 322ల క్రింద
అరెస్టు చెయ్యబడ్డాడు.

* * * *

ఆ రాత్రి అనుభవించిన నరకయాతన అతడు జీవితంలో ఎప్పుడూ అనుభవించలేదు. అతడిపట్ల అది కాళరాత్రే అయింది. సాయంత్రం ఎప్పుడో పోలీసు డాక్టరువచ్చి కాస్త పౌడరు జల్లి కట్టు కట్టేసు. అదృష్టవశాత్తు గుండు కాలికి పక్కగా చీల్చుకుపోయిందంతే! బుల్లెట్ తగిలినప్పుడు అంతగా బాధ వెయ్యలేదు గానీ- ఆ రాత్రి సెల్‌లో గరుకు గచ్చుమీద పడుకున్నాక, ఒకవేపు దోమలకాటు, మరోవేపు ఖైదీల బూతుజోకుల నవ్వులతో మెలకువ వచ్చింది. సన్నగా సలపరం పెరిగి నిముషాలమీద ఉధృతమైంది. అతడి బాధ పట్టించుకున్నవాడే లేడు.

అరెస్టు చేసిన ఇరవైనాలుగు గంటల్లోగా మేజిస్ట్రేటు ముందు హాజరుపర్చాలి. మరుసటిరోజు ప్రొద్దునవరకూ ఆ నరకం తప్పదు.

అతడు మోకాళ్ళమీద కూర్చుని బాధను ఓర్చుకుంటూ జైలు ఊచలగుండా బయట వెలుతురుని చూస్తూ ఆ రాత్రంతా గడిపాడు. సాంద్రతలేని ఆ ఆలోచనల నడుమ నిస్తేజమైన మనసు మూగగా నిద్రపోయింది. అతడు మాత్రం మెలకువగానే వున్నాడు. ప్రొద్దున ఎనిమిది అవుతూ వుండగా బయట అలికిడి వినిపించి బయటకు చూసాడు. దూరంగా ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడుతున్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు.

అతడు శంకర్‌లాల్!

భార్గవ మనస్సులో ఎక్కడో మారుమూల ఆశారేఖ తళుక్కుమంది.

అంతకుముందు ఒకటి రెండురోజుల క్రితమే తామిద్దరికీ ఘర్షణ జరిగింది! తనని ఉద్యోగంలోంచి తీసేసే హక్కు వాళ్ళకు లేదని వాదించి తను గెల్చాడు!! అయినా తను ఇక్కడ వున్నాడని తెలిసి ప్రొద్దున్నే అతడు వచ్చాడు. తన గురించి చెప్పి- ఇక్కడ్నుంచి విడుదల చేస్తాడు!!!

ఎంతయినా అతడు తన అధికారి!

భార్గవ మనసంతా కృతజ్ఞతతో నిండిపోయింది.

ఈ లోపులో సెంట్రీ వచ్చి తలుపు తీసి అతడిని వెలుపలికి తీసుకెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడి శంకర్‌లాల్, భార్గవ కూర్చున్న గదిలోకి వచ్చాడు. ఇద్దరిమధ్యా టేబుల్ వుంది. శంకర్‌లాల్ తన జేబులోంచి కాగితాలు టేబుల్‌మీద పెట్టి భార్గవ వైపు చూసాడు. భార్గవ

అతడి వైపు అర్థంకానట్టూ దృష్టి సారించాడు. శంకర్‌లాల్ సవరించుకుని అన్నాడు.

"సూటిగా అసలు విషయానికొస్తాను డాక్టర్ భార్గవా! ఓ లొద్దు" అని ఆగి తిరిగి అన్నాడు.

"మోహన్‌లాల్-శంకర్‌లాల్ వంశం దానధర్మాలకు ఎం న్నికగన్నదో, వంశానికీ, పట్టుదలకీ కూడా అంతే పేరు పొందింది వంశంలో పుట్టినవాడిని నేను! అటువంటి నేను సల్ఫా-3 గురిం చిన్న కోర్కె కోరితే, ఏదో నియమాలున్న వాడిలా దాన్ని తిరస్క డమే కాకుండా పత్రికలవాళ్ళ దగ్గర నీ ఇష్టం వచ్చినట్టూ మాట్లాడి పరువు పోగొట్టావు"

అతడు చెప్పటం ఆపాడు. భార్గవ అతడివేపు దిగ్భ్రాంతుడై న్నాడు.

"—కానీ నీ మీద మాకు అంత ద్వేషం లేదు. నిన్ను పంపించాలన్నది మా ఆశయం కాదు. బోర్డులో పరువు నిలపాలన్న ఆకాంక్ష! భార్గవా! సూటిగా అసలు ప్రపోజల్ చెప్తాను విను. సా అండ్ సామ్సన్ కంపెనీ నీ మీద కేసు ఉపసంహరించుకుంటుంది స్పెక్టర్ రవూఫ్‌ని కూడా నేను ఒప్పిస్తాను. నీ మీద కేసు వుండదు. ప్రతీకగా, నీ అంతట నువ్వు నీ రాజీనామా పత్రాన్ని సమర్పించాలి వంతం నెరవేరినట్టూ వుంటుంది. నీకు జైలు తప్పిపోతుంది. ఎలా నా ప్రపోజల్?"

భార్గవ అవాక్కయి అతడివేపే చూస్తుండిపోయాడు. గు మేదో హోరు ప్రారంభమై ఒళ్ళంతా వ్యాపించింది.

ఎదురుగా టేబుల్‌మీద వున్న పేపర్లు అతడిని పరిహసిస్తు

ఎంత నాజూగ్గా వీళ్ళు తనమీద పగ తీర్చుకున్నారు? ఎం ఉన్నది వీళ్ళలో.... అందుకేనేమో వెళ్ళిపోతున్న వాడిని వెనక్కి అరెస్టు చేయించారు.

భార్గవ మౌనాన్ని ఇంకోలా అర్థం చేసుకున్నాడు శంకర్‌లా

"నీకింకో మార్గంలేదు. దీంట్లోంచి ఎలా తప్పించుకోగలవ ఆలోచించకు, నీకు ఈ ఛాన్స్ పోయిందంటే రెండు సంవ

ఏళ్ళ కారాగార శిక్ష తప్పదు. క్రిమినల్ ట్రెస్‌పాస్‌కి ఒక సంవత్సరం, అబ్‌స్ట్రక్టింగ్ పబ్లిక్ సర్వెంట్‌కి ఒక సంవత్సరం, మొత్తం రెండు సంవత్సరాలు. నువ్వు కన్విక్ట్ అయిన మరుక్షణం నీ ఉద్యోగం పోతుంది. ఎలాగూ ఉద్యోగం పోవటం ఖాయమైనప్పుడు ముందే దానికి రాజీనామా ఇస్తే కనీసం జైలు శిక్ష తప్పించుకుని బయటపడతావు. నిజానికి నిన్ను ఇలాగా అడిగే అవసరం మాకు లేదు.

నీ మీద ఏ మాత్రమో అభిమానం వుండబట్టి ఈ వ్యవహారం కోర్టు వరకూ వెళ్ళకుండా ఆపాలని మా ప్రయత్నం. ఏ విషయమూ తొందరగా చెప్పు!"

ఇంక చెప్పటానికేముంది? ఏమీలేదు.

నాలుగువేపులనుంచీ ఉచ్చులు బిగిసిపోయాయి.

భార్గవ కాగితాలు దగ్గరికి లాక్కున్నాడు. నీట్‌గా టైపుచేసి వున్న తన రాజీనామా పత్రం అది.

దాన్ని అందుకుంటూ ఒకే మాట అన్నాడు.

"కంగ్రాట్స్"

శంకర్‌లాల్ చిరునవ్వుతో కలం అందించాడు. భార్గవ సంతకం పెడుతూ ఒక్కసారి అటుచూసేడు. ఇన్‌స్పెక్టరూ, హెడ్‌కానిస్టేబుల్, పోలీసులూ- అందరూ నాటకంలో పాత్రధారుల్లా ఇటే చూస్తున్నారు. జరుగుతున్న అన్యాయాన్ని అలవాటైన పోలీసుస్టేషన్ అతి సాధారణంగా గమనిస్తోంది. అతడు తలవంచి నెమ్మదిగా సంతకం పెట్టి కాగితాన్ని ముందుకు తోసేడు. ఆ మసక చీకటిలో అతడి మొహంలో భావాలు సరిగ్గా కనపడటం లేదు.

"గుడ్" అంటూ శంకర్‌లాల్ లేచి, ఆ కాగితాన్ని మడిచి జేబులో పెట్టుకొని ...

"ఈ క్షణమే మీ రాజీనామాని అంగీకరిస్తున్నాను. ఈ రోజునించి మీరు మా ఉద్యోగి కాదు. పోతే మూడునెలల నోటీసివ్వకుండా మీరు రాజీనామా కోరుతున్నారు కాబట్టి, మీకు రావల్సిన పి. ఎఫ్. నుంచి అంత డబ్బు తగ్గించుకోబడుతుంది. మీ అంతట మీరే రాజీనామా చేస్తున్నారు కాబట్టి. మీ కూతురి వైద్యానికి రావల్సిన ఇన్సూరెన్స్ ఈ క్షణం

నుంచే ఆగిపోయింది. పదకొండింటి లోపులో మీరూ మీ సామా
తీసుకుని లాడ్జ్ ఖాళీచేసి నా కప్పగించాలి, గుడ్ బై—" అం
పోయాడు.

భార్గవ చిత్తరువులా నిలబడిపోయాడు. అంతలో అతని
చెయ్యిపడింది. తలతిప్పి చూసేడు రవూఫ్.

"అదృష్టవంతుడివి, తప్పించుకున్నావు. కానీ అప్పుడే
పడకు. రవూఫ్‌మీద చెయ్యి చేసుకున్న వాడెవడూ భూమ్మీద బ్ర
కట్టలేదు. ఎప్పటికయినా 'నా బదులు కూడా' నేనే తీర్చుకుంటాను
గుర్తుంచుకో.... ఇప్పటికి బ్రతికిపోయావు వెళ్ళు...." కేసపీట్
బయటికి తోసేడు. భార్గవ స్టేషన్ బయటకొచ్చి పడ్డాడు. కాలిమ
రక్తం స్రవించసాగింది.

ఉద్యోగం పోయి, ప్రతిష్ట పోయి, సర్వం కోల్పోయి
స్టేజిలోకి వెళ్ళిన అతని మెదడు దేన్ని ఆలోచించటానికయినా
రిస్తూంది.

రాత్రంతా నిద్రలేక, ఆహారంలేక వళ్ళు తూలుతూంది.

బట్టలు చినిగిపోయి, జుట్టు పెరిగిపోయి సభ్యప్రపంచంలో
డిగా గుర్తింపు కోల్పోయి అతడు భారంగా అడుగులు వేయ
కనీసం రిక్షాలకి కూడా డబ్బులు లేవు. ఎవరు ఇంటి దగ్గ
ఎవరు ఆస్పత్రిలో వున్నారో కూడా తెలీదు. అడుగులేసి అడుగే
గాయంతాలూకు నొప్పి ప్రాణాల్ని తోడేస్తూంది.

అలాగే కాళ్ళీడ్చుకుంటూ అతడు నెమ్మదిగా సాగేడు.

పోలీసుల కళ్ళపడకుండా అతడు తనతో దాచుకున్న
తాలూకు గాస్ ప్యాకెట్ మాత్రం ఛాతీ దగ్గర భద్రంగా వుంది.

# 4

**అతడు** ఇంటికి వచ్చేసరికి పిల్లలిద్దరూ కంగారు పడుతు
రాత్రంతా ఇంటికి రాకుండా, ప్రొద్దున్నే.... పెరిగిన జుట్టుతో,
మరకలున్న బట్టలతో కుంటుకుంటూ వస్తున్న తండ్రిని చూ
బెదిరిపోయింది.

పిల్లలిద్దరూ అతడి దగ్గరికి పరిగెత్తుకొచ్చారు.

బాధని ఏమాత్రం పైకి ప్రకటించినా పిల్లలు మరింత బెదిరిపోతా రని కళ్ళు మొహానికి పులుముకుని, వాళ్ళని దగ్గరికి తీసుకుని "అమ్మేది" అడిగాడు.

"నిన్న ప్రొద్దున్నుంచీ తనుకూడా ఇంటికి రాలేదు నాన్నా!" అంది చిన్నది. అతడికి బాధేసింది. భార్యమీద జాలితో కూడిన వన్నాటి అనురాగపు జ్ఞాపకాలు... ఈ పెళ్ళి ద్వారా ఆమెని అనవసరమయిన జంజాటంలోకి లాగానేమోనన్న బాధ.... తనని చేసుకోవటం ద్వారా ఏం సుఖపడింది? మొదటి రోజునుంచే అపశ్రుతులూ— రోగాలూ.

ఆ క్షణమే ఆమె దగ్గరకు వెళ్ళి ఒక ఓదార్పు మాట— ఓ సానుభూతి వాక్యం ఆమెతో పంచుకోవాలని మనసు ఆరాటపడింది. నాకు నువ్వు, నీకు నేను. సుఖాలెలాగూ లేవు. ఉన్న కష్టాల్నే చెరిసగం పంచుకుందాం అని.

అంతలో జెస్సీ దగ్గిరకొచ్చి "నిన్న సాయంత్రం ఎవరో వచ్చి ఈ కవరు ఇచ్చారు నాన్నా" అంటూ అందించింది. చింపి చూసేడు. సైకియాట్రిస్టు దగ్గర్నుంచి రిపోర్ట్. ఆయన తెలిసినవాడు కాబట్టి లేఖ క్లుప్తంగా వుంది ఇంగ్లీషులో.

"డియర్ భార్గవా!

మీ పిల్లలిద్దరి కేసులూ పరిశీలించాను. వాళ్ళ సంభాషణ వారానికి రెండ్రోజులు, అలా విచిత్రంగా, వినేవాళ్ళకి అగమ్యగోచరంగా వుండటానికి కారణం ఏమిటా అని ఆలోచిస్తూ వచ్చాను. మొన్న రాత్రి టెలివిజన్ చూస్తూ వుంటే అకస్మాత్తుగా స్ఫురించింది. మీ వాళ్ళిద్దరూ శనివారాలు, ఆదివారాలు అది చూస్తున్నారేమో. వాళ్ళు 'మెలోడ్రమటిక్'గా మాట్లాడేది ఆది, సోమవారాలైతే, నిశ్చయంగా అది క్రితం రాత్రి చూసిన సినిమా ప్రభావమే అయివుంటుంది. మీరీ విషయం, ఇంకోసారి కలిసినప్పుడు ధృవపర్చగలను. అలాగే, వాళ్ళకి సినిమాలు వీలైనంత తక్కువ చూపించకుండా వుండటానికి ప్రయత్నించండి. ముఖ్యంగా మెలోడ్రామా మీసాల హీరోలూ, పైట వేసుకునే వయసురాని తల్లి పాత్రల హీరోయిన్లూ వున్న సినిమాలు చూపించకండి. అందులో వాళ్ళు మాట్లాడుకునే ఆదుపైన మాటలు మీ పిల్లల సబ్‌కాన్షస్ మైండ్‌మీద ప్రభావం చూపించి ఒక రకమైన న్యూరోసిస్‌కి దారి తీస్తున్నాయని

నా అనుమానం. పిల్లలకి పిచ్చెక్కేది అది, పోసవారాలైతే ఇ
ట్రీట్ మెంట్ అనవసరం. కేవలం మీ టీ.పి. వి మూత వెయ్య
(సంతకం)"

ఉత్తరం మూసేస్తూ చాలాకాలం తర్వాత నిగ్గరగా
భార్గవ. ఇంతకాలం తల బ్రద్దలు కొట్టుకున్నది ఇంత చి
గానా.... మళ్ళీ నవ్వొచ్చింది. పిల్లలిద్దరూ తండ్రినే విచిత్ర
న్నారు.

"ఏమిటి నాన్నా?" అని అడిగింది జిన్నీ.

"ఏం లేదమ్మా" నవ్వాపుకుంటూ మాట మార్చి, "అ
స్కూలుకి వెళ్ళలేదేం?" అని అడిగాడు. ప్రార్థనకి అంత
వుందన్న విషయం సాధ్యమైనంత వరకూ పిల్లలకి తెలియకుం
కోసం వాళ్ళని స్కూల్ కి పంపుతూనే వున్నాడు.

"ఈ రోజు స్కూల్ కి శలవిచ్చారు."

"ఎందుకు?"

"ఏసుపాదం చచ్చిపోయాడుగా!"

నట్టడవిలో హఠాత్తుగా దావానలం చుట్టుముట్టినట్టు
గాలి అల- అతడిని వణికించి భయభ్రాంతుడ్ని చేసింది.
బోయే సంఘటనకి ఇది తొలి సూచనగా అతడు కంపించి
ఎన్నో రోజులు కూడా కాలేదు. తను ఆస్పత్రికి ఫోన్ చేసి
వటం— వాళ్ళు ఆ కుర్రవాడికి 'అడ్వాన్స్ స్టేజి ఆఫ్ లింఫో
మియా' అని చెప్పటం.... తనకి ఆ కుర్రవాడి తల్లి- ఆ
వణుకుతున్న చేతుల్లో దణ్ణం పెట్టి "ప్రభువు నిన్ను రక్షిస్తా
అనటం అంతా కళ్ళముందు కదలాడింది.

'ఓ ప్రభువా!

చిన్నారి పాపల్ని నిర్దాక్షిణ్యంగా వలిపేసే కేన్సర్ ని
నీ కరుణా కటాక్షాలు మా కళ్ళల్లోదోయా, మా బాధలు
కేన్సర్ కి వ్యతిరేకంగా మేమే మా శాయశక్తులా పోరాడతాం.'

....స్కూల్లో ఎవరో స్టూడెంటు చచ్చిపోయాడనగా
కూలబడి కళ్ళు మూసుకున్న తండ్రిని చూసి, పిల్లలిద్దరూ మొహ
చూసుకున్నారు.

"కొంచెంసేపు మీ ఇద్దరూ అల్లరి చేయకుండా బైట

"అలాగే నాన్నా"

"కిటికీ తెరలు దగ్గరికి లాగెయ్యండి."

వాళ్ళు నిశ్శబ్దంగా ఆ పనిచేసి గదిలోంచి ని గదిలో చీకటి అలుముకుంది అతడి మనసులోలాగే. అత కళ్ళు మూసుకున్నాడు. అకస్మాత్తుగా అతడికి సోమశేఖ చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి.

"—అతి కొద్దికాలంలోనే మీరు గొప్ప ధిక్క న్నారు. ప్రపంచం అంతా మీకు ఎదురు తిరుగుతుంది. మీ ఎక్కుతారు. వృత్తిరీత్యా కార్యకలాపాల్లోనూ, గృహ విషయాల్లోనూ, మొత్తం అన్ని వైపుల్నుంచీ ఒక్కసారిగా కత కానవస్తుంది— దాంతో మీరు కాలిన పెనంమీద ల్లాడిపోతారు."

అతడికి శేఖరం గుర్తొచ్చాడు. 'ఎక్కడున్నారో' తన స్నేహితుడు తనకి సాయం చెయ్యబోయి, ఒక చోట, చెత్తకుండీ పక్కన, కళ్ళుపోయి, ఆ స్థానే రక్త నాలుక తెగి మూగవాడై, చెవి ఎముకలు బద్దలై జీవచ్ఛవ చావుకీ మధ్య వేలాడుతున్నాడని అతడికి తెలీదు.

ఆ గది నిశ్శబ్దాన్ని చెదురుస్తూ తలుపు దగ్గర అలి అతడు కళ్ళు విప్పి చూసేడు.

గుమ్మం దగ్గర వసుమతి నిలబడి వుంది. ఇద్దరూ చూసుకుంటూ అలానే నిశ్శబ్దంగా వుండిపోయారు.

ఎంత దగ్గర— కానీ ఎంత దూరం!

ఆమె ముందుకొచ్చి కిటికీ తెర తీయబోయింది.

"అలాగే వుంచు వసుమతీ, నేనే వెయ్యమన్నా ఆమె ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది.

"ఎలా వుంది వస్నాకి?"

ఆమె తటపటాయించి, "అలాగే వుంది" అన్నది.

"ఎంత కొంటు?"

"92,000"

అతడు పజికిపోయి "ఎంతా?" అడిగాడు.

"తొంభై రెండు వేలు" అంది. ఆమె కంఠంలో, రాబోయే ఉప ...ద్రవం ముందునుంచీ వూహించుకుంటూ ఉండటంవల్ల వచ్చిన నిశ్చలత ...

"...అయిపోయింది.... దగ్గరకొచ్చేసింది...." తనలో తనే గొణుక్కున్నట్టు అన్నాడు. ఆమె అతడి దగ్గరికి వెళ్ళి భుజంమీద చెయ్యి ...యాలనుకుంది. కానీ ఆ చనువు లేదు. ఈ పరిస్థితుల్లో కావల్సింది ...నే... కాదేమో! మనసు పొరల్లో గిల్టీ కాన్షస్‌నెస్. ఆమె చెప్పా...లనుకుంటూంది.... చెప్పలేకపోతూంది.

—నాకేమీ తెలీదండీ. ముందు తెల్ల కాగితంమీద వ్రాసివ్వటమే ... అనుకున్నాను. అలా వ్రాసిస్తే కానీ ప్రార్థనకి ట్రీట్ చెయ్యనన్నాడు ... ఇంతలో లాయరొచ్చాడు. అతడిని చూసి చట్టబద్ధ ఉత్తరాన్ని ... తయారు చేస్తాడనుకున్నాను. ఇక్కడ కాదు, కోర్టుకి వెళ్ళాలన్నారు. ...స్ట్రేట్ సమక్షంలో అంతా చెయ్యాలన్నారు. అప్పటికే కాలు వెనక్కి ...లేనంత ముందుకు వెళ్ళిపోయాను. ఏం చెయ్యను? నేను చూస్తూ...గానే అంతా జరిగిపోయింది. నన్నొక బొమ్మలా బోనులో నిలబెట్టారు. ... కోర్టు ఆర్డరిచ్చింది. నిస్సహాయంగా- నిశ్శబ్దంగా అంతా చూస్తూ ...ల్సి వచ్చింది. ప్రార్థన మీ కూతురేనండీ, నాకేమీ అధికారం లేదు. ... ఆ ఆస్పత్రి అధికారులకి ఏమీ చెప్పలేను. కాలిన ఈ చేతుల్తో ...దాన్నే అక్కున్చి పట్టుకుని ప్రార్థించలేను. కానీ నన్ను మీరు అర్థం ...వటం కోసం నా గుండెకోసి ఇవ్వాలని ఎవరయినా శాసిస్తే దానికి ...గా సిద్ధపడతాను, అయ్యో— మీకెలా చెప్పనండీ ఇదంతా.

ఆమె చివరికి ఏమీ చెప్పలేదు, చెప్పే ధైర్యం లేదు. ప్రపంచంలో ...గా ఆ భార్యాభర్తల మధ్య వచ్చిన కమ్యూనికేషన్ గ్యాప్‌ని ...లేదు.

అతడు ఆమె ఇంకా అక్కడే నిలబడి వుండటం చూసి, ఆమె ... ప్రశ్నార్థకంగా చూసేడు. ఆమె ఏదో చెప్పబోయి, తటపటాయించి ...లే' అని వెనుదిరిగింది.

ఆమె గుమ్మం దగ్గరికి చేరుకుంటూ వుండగా వెను
దిగా వినపడింది- 'వసుమతీ' అని!

ఆమె ఆగింది.

"నా ఉద్యోగం పోయింది వసుమతీ!"

ఒక పన్నాటి గాలి తెమ్మెరవచ్చి కిటికీ తెరల్ని కది
వణుకు ఆమె శరీరాన్ని కదిల్చింది. స్తబ్దతనుంచి తేరుకుని
అర్థం చేసుకోవటానికి రెండు నిముషాలు పట్టింది. నెమ
నెమ్మదిగా ఆమె వెనుదిరిగింది. తెరల సందుల్లోంచి వచ్చే
ఆమె మొహంమీద చీకటిని వెలుగుతో మిశ్రమం చేస్తోంది.

"నిజం. నా ఉద్యోగం పోయింది. పోవటమేమిటి! నే
ఇచ్చాను. ఇలా చెప్పుకుంటే కొంచెం గౌరవంగా వుంటుంది

ఆమె మాట్లాడలేదు. ఇంకా షాక్‌నుంచి తేరుకోలే
మౌనాన్ని అతడు ఇంకోలా అర్థం చేసుకున్నాడు- నవ్వేడు.

నవ్వుతూనే, "తప్పదు వసుమతీ! నన్ను పెళ్ళి చేసు
నాతోపాటూ నా పిల్లల్ని కూడా ఇకనుంచి నువ్వే పోషించా

ఆమె గాలిలా అతడి దగ్గిరకి దూసుకువెళ్ళలేదు.
అనకండీ" అంటూ అతడి కాళ్ళదగ్గిర వాలిపోలేదు. ఉ
బడింది. పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అధరేపులు చెమట
అన్ని రోజుల్నుంచీ ఆమె పడుతున్న శ్రమా, నిద్రలేని
గించిన అలసటా, అన్నత్రి పెట్టిన కష్టం— అన్నీ ఒక్కసా
నలువైపులనుంచీ చుట్టుముట్టి ఉక్కిరి బిక్కిరి చేసేయి. తనా
"ఏ....ఏమిటండీ మీరంటున్నది?" అని మాత్రం అనగలిగిం
వరకూ పళ్ళ బిగువున అదిమి పెట్టిన అలసట, నెమ్మది నెమ
ఆక్రమించుకుంటూంది.

అతడు లేచాడు. నడుస్తూ వుంటే కాలు బాధ పెట
వద్దకు వెళ్ళి తెర పక్కకి లాగేడు. లాగుతూ తనలో తను
న్నట్టూ నెమ్మదిగా అన్నాడు. "....ఇమ్మారెమ్స్ కూడా రా
వరకూ అయిన ఖర్చుకి వచ్చే గ్రాట్యుయిటీ అకీ సరిపోతుం

దీనికి ఆమె మాట్లాడలేకపోయింది. అతడు ఆమె
"చెప్పు, ఎక్కణ్ణుంచి తెస్తాం? కార్లో ఆస్పత్రికి వెళ్ళ
డబ్బులయిపోయినయ్. ఇంతవరకూ చేసిన ట్రీట్మెం
అందామా?" అన్నాడు.

అతడి మాటల్లో వ్యంగ్యం వున్నా అది ఆమెని సం
ప్రార్థనకి ట్రీట్మెంట్ కొనసాగించటానికి అతడు ప
పరోక్షంగా తన అంగీకారం తెలుపుతున్నాడు. ఆమెకెంద
సూచకంగా కనిపించింది. పీటికన్నా ముఖ్య విషయం– కో
ఇక అది అతడికి తెలియవలసిన అవసరంలేదు. అతడు ట్రీ
మెంట్ నిరోధించకపోతే. ఆ కోర్టు కాగితం కేవలం ఆస్పత్ర
వుండిపోతుంది. అంత వత్తిడిలోనూ ఆమె కాస్త
ఫీలయింది.

"మనకే ఇలావుంటే ఈ కేన్సర్ అనే మహమ్మ
తరగతి కుటుంబంలో వస్తే ఎలా వుంటుంది?"

ఆమె తలెత్తి చూసింది.

"ఎవరయినా ఒక కథ వ్రాస్తే బావుణ్ను! ఒక వ
తన కూతురి పెళ్ళికోసం జీవితాంతం కష్టపడి. ఓ వ
సంపాదిస్తాడు. సంబంధాలు చూస్తూ వుండగా తండ్రికి
స్తుంది. ఇప్పుడతడు ఏం చేస్తాడు? ముసలి తండ్రిని
పాటూ బ్రతికించుకోవడానికి ఆ డబ్బంతా ఖర్చుచేస్తాడా
దాచిపెట్టి చాక మందులువాడి. చూస్తూ చూస్తూ తండ్రి
అర్పిస్తాడా?— కూతురు పెళ్ళి ముఖ్యమా?.... తాటికి కాళ్ళ
జీవితం ముఖ్యమా? ఏది ముఖ్యం....? బావుందికదూ...
మెంటుమీద దేముడు ఆడిన, మెలోడ్రామా.... ఎలా వుంది
టైటిల్ పెద్దదయి పోతుందేమో.... 'దేముడూ.... ది సాక్ష
బావుంటుంది, హాహా...."

బిగ్గరగా నవ్వుతున్న అతడివైపు ఆమె భయ
చూసింది. విపరీతమైన వత్తిడితో కూడిన డిప్రెషన్
హిస్టీరిక్గా మారుస్తూంది. ఆమె చప్పున అతడి దగ్గరకు
చేతిమీద చెయ్యివేసి "అలా అనకండి, దేముడు మనల్ని

క్షణాన్ని కౌగిలిపోవటం ఎంత పాపం" అంది. అతడు చప్పున నవ్వు ఆమెవైపు చిత్రంగా చూశాడు.

"దేవుడు గురించి మాట్లాడుతున్నావా వసుమతీ నువ్వు! ఆ దేవుడి గురించి నాకు బాగా తెలుసు. నా మొదటి భార్య తన దర్శనానికి వెళ్తూండే ఆ కొండలమీదే ప్రాణాలు బలితీసుకున్నాడు. నీవు చూసే ఆ దేవుడు మనుష్యుల మూర్ఖత్వాన్ని తన చిద్విలాసాలకి బాగా వాడుకునే ఆటగాడు ఆ దేవుడు. ఆ దేవుడి గురించి నువ్వు చెప్తున్నావా నాకు?"

"వద్దండి.... ఆ భావమే రానివ్వకండి.... ప్లీజ్.... మన పాపకు నయం అవుతే వస్తామని ఒక్కసారి మొక్కుకోండి. కనీసం మా తృప్తి కోసమన్నా అలా చెయ్యండి."

ఓ పిచ్చాని.. మూర్తీభవించిన మూర్ఖత్వంవైపు చూసినట్టు ఆమె జాలిగా చూసేడు. అంతలో గుమ్మం చప్పుడయింది. జిన్నీ.... పిల్లలిద్దరూ నిలబడి తనవైపే చూస్తున్నారు. పినతల్లి కళ్ళలో దాసి బెదిరిపోయారో ఏమోగానీ, తండ్రివైపు ఆర్ద్రంగా చూస్తు వాళ్ళు కూడా.

ఇంతమందిని అతడు కాదనలేకపోయాడు.

దేవుని ఫోటో ముందు నిలుచున్నాడు.

దేవుడు ఎందుకో చిలిపిగా నవ్వినట్టు అనిపించింది.

అతని మొహంలో ఎన్నడూలేని సీరియస్‌నెస్ చోటుచేసుకుంది. చూస్తున్నాడు. మనసులో అనుకున్నాడు.

"నేనో సైంటిస్టుని! జీవితంలో ఓడిపోయిన సైంటిస్టుని!! దేవుణ్ణి నమ్మని సైంటిస్టుని!!! నీ ఆటలు చాలాకాలం నుంచీ గమనిస్తున్నాను. కోర్కె తీరితే మేము నీకు కానుకలు అర్పించుకోవాలా.... తీరకపోతే అది మా ఖర్మ అనుకోవాలా.... ఇదేం రూలు?

నా భార్యని బలి తీసుకున్న ఓ దేవుడా!

నా ప్రియాతి ప్రియమైన కూతుర్ని తీసుకోబోతున్న దానవుడా....!

నేను నిన్ను ప్రార్థించను.

నీతో ఒక పందెం కాస్తాను.

నీకు మూడు గంటల టైమిస్తున్నాను. ఈ మూ
ప్రార్థన కౌంట్ లో 'డెమిషన్' ప్రారంభమయితే సరే
నేను నీ అస్థిత్వాన్ని వప్పుకుంటాను. అలా జరక్కపోం
వున్నచోటికి వస్తాను!!! కానీ అప్పుడు బాంబులతో
వస్తా- నీ గ్రహాన్ని వేయి ముక్కలు చేయటానికి వస్తా
మంది జనాన్ని నీ నుంచి తప్పించిన సంతృప్తితో మ
నిస్తాను. ఎలా వుంది నా ప్రార్థన.

నా ప్రార్థన కోసం- ఈ ప్రార్థన-"

# 5

**అతడు** తన ప్రార్థన ఎలా పూర్తవుతుందో నిర్ధా
ఇంకా మూడుగంటల టైమ్ వుంది.

ఈ లోపులో చెయ్యవలసిన పని మరొకటి మిగిలిపో
పనిమీదే వెళుతున్నాడు.

కారు లేదు. లాబ్ దగ్గరే వుండిపోయింది. నడుస్తూ
నొప్పి పెడుతూ వుంది. అయినా దాన్ని లెక్క చేయకు
న్నాడు.

అతడు తన ఇన్‌స్టిట్యూట్ లోకి ప్రవేశిస్తూ వుండ
బయట ఆవరణమంతా కోలాహలంగా కనిపించింది.
పట్టించుకోలేదు. ఆ లొకాలిటీ వెల్ఫేర్ అసోసియేషన్
ప్రారంభోత్సవానికి మంత్రిగారెవరో వస్తున్నారు. అదీ కలక

ఆ రష్‌ని తప్పించుకొని అతడు ఇన్‌స్టిట్యూట్‌లోకి

కానీ వరండా ముందునుంచి లోపలికి వెళ్ళలేదు. త
న్నుంచి తొలగిపోయిన సంగతి ఈపాటికే అందరికీ
వుంటుంది. వాళ్ళ సానుభూతి వాక్యాల్ని ఈ పరిస్థితుల్లో భరి

వెనకనుంచి లాబ్‌పై వుకు వెళ్ళాడు.

లాబ్ ఇన్‌ఛార్జి రమణమూర్తికి తన ప్రపంచమే త
విషయాలు పట్టవు. భార్గవని చూసి మామూలుగా విష్ చే
ఆకారాన్ని చూసి ఆశ్చర్యపడలేదు. భార్గవ తేలిగ్గా శ్వాస పీ

...టికీ తెలియదన్న మాట. 'నాకో చిన్న సాయం చేయాలి. ఈ గాస్ ...చెక్ చేసి ఏముందో చెప్పాలి.'

కెమికల్ పరీక్షలకి ఆ పాకెట్ ఇచ్చాడన్న మాటేగానీ అతడికి ...దాని ఆసక్తి లేదు. అతడి మనసంతా భవిష్యత్తుమీదే ఉంది. కూతురు ...క్ గంట్ లక్ష సమీపిస్తుంది. అది దాటితే ప్రతిక్షణమూ ప్రమాదమే. ...పోతే తన ఉద్యోగం. చేతకాని డిటెక్టివ్ పనిని చేపట్టి ఉద్యోగం ...గొట్టుకున్నాడు.

"కాన్స్-క్యూర్" మందు బోగస్ అనీ, అది కేన్సర్ని ఏ మాత్రం ...గ్గించదనీ నిరూపించితే వచ్చే లాభం ఏమీలేదు. మహా అయితే పార్ల...మెంట్లో దీనిమీద ఒక గంట చర్చ జరుగుతుందంతే.

మరెందుకింత రిస్క్ తీసుకుని ఈ పని చేసినా అది ఒక క్షణం ...భవద్దారు. అంతలోనే తనను తను సమర్థించుకున్నాడు. వాళ్ళు ...ద్యోగంలోంచి తీసెయ్యాలీ అనుకుంటే ఏ నెపం పెట్టుకుని అయినా తియ్యగలరు. కేవలం అరెస్టు కాబడటం, కోర్టుకేసు ఇవేం అక్కర్లేదు.

అతడు తన రూమ్కి వెళ్ళి కాగితాలు, తన పెర్సనల్ వస్తువులు ...సుకున్నాడు. పెర్సనల్ అంటూ పెద్దగా ఏమీలేవు. కొన్ని సైన్స్ పుస్తకాలు, పేపర్లు— అంతే సైంటిస్టులకి అంతకన్నా ఎక్కువ ఏముం...టాయి? రాబోయే వ్యక్తికి ఛార్జి అప్పజెప్పటంలాంటివేమీ ఉండవు.

మొహంలో వ్యథనీ, కళ్ళలో బాధనీ కనబడనీయకుండా ఉంచ...టం కోసం అతడు చాలా కష్టపడవలసి వస్తోంది. అదృష్టవశాత్తు గదిలో గానీ చుట్టుప్రక్కలగానీ ఎవరూ లేరు.

"టెర్మినేట్' చేయబడటం అనేది ఆ ఇన్స్టిట్యూట్ చరిత్రలో లేదు. ...ి ఇదోరకంగా అటువంటి చర్యే. ఎవరయినా రాజీనామా ఇచ్చినా, రిటైరయినా వున్న కొద్దిమంది కలిసి పార్టీ ఏర్పాటు చేసుకోవటం ...అలవాటు.

వెళ్ళిపోయేవారికి హృదయపూర్వకంగా వీడ్కోలు చెప్పటం ఆచారం. ఈ రోజు అలాంటిదేమీ లేదు. నిశ్శబ్దంగా వీలయినంతవరకూ ...వరికీ తెలియకుండా నిష్క్రమణ జరగాలి.

అతడు బ్రీఫ్కేసు పట్టుకుని గది మధ్యలో నిలబడ్డాడు.

అద్దాల అవతల్నుంచి లాబ్ కనిపిస్తుంది.

ఆ గదిలోనే తను కొన్ని సంవత్సరాలుగా తపస్సు చేసేడు

మనిషిని మహమ్మారిలా చంపేస్తూన్న కేన్సర్‌కి మం
కోవాలని దివారాత్రులూ శ్రమించాడు. ఫలితంగా కూస్తం
అంతేకాదు, ఏ రోగానికయితే మందు కనుక్కోవాలని తను ఇం
కష్టపడ్డాడో ఆ రోగమే తను ప్రాణాధికంగా ప్రేమించే కూతుర్ని
వేస్తోంది. తను ఏమీ చేయలేని స్థితిలో నిస్సహాయంగా చూస్తు
పోవాల్సి వస్తోంది.

ఈ క్షణంవరకూ కొద్దిగా ఆశ అయినా వుండేది— ఈ ప
లయంనుంచి ఏదయినా ఒక మహత్తరమైన క్షణం ఒక జీవ
బయల్పడి తన కూతుర్ని రక్షిస్తుందేమో అని.

ఇప్పుడదీ లేదు.

ఈ ఆశలన్నీ సజీవంగా పూడ్చిపెట్టబడ్డాయి.

అతడు అద్దాల వెనక వున్న కుందేళ్ళనీ అరల్లో తిరిగే
చూసేడు. ఆశయసిద్ధికోసం ఈ అమాయకమైన జీవుల్ని
చంపేడు. ఇంకా ఎన్ని మరణాలు— ఎన్ని త్యాగాలు జరగాలో, ఆ
మందు కనుక్కోబడాలంటే— ఇంకా ఎంతమంది రోగులమీద ప్రయో
జరగాలో, ఎంతమంది సమిధలవ్వాలో— అయినా ఫర్వాలేదు.

ఒక ఔషధం కనుక్కోబడుతుందంటే, ఒక రహస్యం
బడుతుందంటే దానికి ఎంతయినా బలి ఇవ్వవచ్చు.

కానీ భవిష్యత్ చరిత్రలో తానుండడు. మిగతా అందరు
ల్లాగే తనూ ఈ విషయాన్ని పేపర్‌లో చదువుతాడు. ఎక్క
ఎప్పుడో... అప్పటికి తను వుండకపోవచ్చు కూడా. ఎంత ద
మైన స్థితి ఇది. ఇంతకాలం సాగరమథనంచేసి, సుర ఉద్భవించే
యానికి వెళ్ళిపోవలసి రావటం.

ఎంతో కాలంగా తనకు పరిచయమైన ఆ గదిలో
అతడు ఆఖరుసారి ఆప్యాయంగా చూసుకున్నాడు. ఆ
"వెళ్ళొస్తాను మిత్రులారా" అన్న వీడ్కోలు వుంది.

ఆ తరువాత అతడు ఆ గదిలోంచి బయటకి వచ్చాడు.

...వెళ్ళాడు. అకౌంట్స్ డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళటం ఇష్టంలేదు. ...రావాల్సిన డబ్బు శేఖరంద్వారా తీసుకోవచ్చు. అలా అనుకుని కారు ...వెళుతూ వెళుతూ అతడు మెట్ల సమీపానికి వచ్చాడు. అప్పుడే ...మూర్తి లోపల్నుంచి బయటకు వస్తున్నాడు.

"ఏమిటి, ఏమన్నా తెలిసిందా?" యథాలాపంగా అడిగాడు భార్గవ. ...కే తొందరగా పరీక్ష పూర్తవుతుందనుకోలేదు. కానీ రమణమూర్తి— ..."ంటేషన్‌లో మొదటి రెండు గానెస్ సులభంగానే కనుక్కున్నాను. ...మూడోదే కాస్త ఇబ్బంది పెట్టింది" అన్నాడు.

"చివరికైనా దొరికిందా?"

"నేను స్వయంగా టేబిల్ దగ్గిర కూర్చుంటే దొరక్కుండా ...ఉంటుందా భార్గవా?" కాస్త ఆత్మస్థయిర్యంతో గర్వంగా అన్నాడు.

"ఏమిటా మూడోది?"

"మెథైల్ కోరిన్ థెరీన్"

భార్గవ కాళ్ళక్రింద భూమి కదిలినట్టు అనిపించింది. తూలి పడబోయి ...నిలదొక్కుకున్నాడు. 'వ్వాట్' అని అరిచాడు కీచుగా.

"మెథైల్ కోరిన్ థెరీన్ భార్గవా.... అదేమిటి మీరు అలా అయి ...పోయారు?"

భార్గవ మాట్లాడలేదు. అతడు చెప్పిన వార్త భార్గవని స్థాణువుని ...చేసింది. మెథైల్....కోరి... న్....థె....రీ....న్! కేన్సర్ కలుగ జేసే ...అత్యంత ప్రమాదకరమైన హైడ్రో కార్బన్‌లలో అన్నిటికన్నా ప్రమాదకరమైన కార్సి ...నోజెన్. సామ్సన్ కంపెనీ ఫ్యాక్టరీ గొట్టంలోంచి అదెందుకు వెలువడు ...తుంది? భార్గవకి వెంటనే సమాధానం దొరికింది.

మెథైల్ కోరిన్ థెరీన్ ఒక స్టెరాయిడ్ తాలూకు 4-రింగ్ ...స్ట్రక్చర్. చిత్రమేమిటంటే, సెక్స్ హార్మోన్లన్నీ స్టెరాయిడ్సే!! కేన్సర్‌కి ...కారణం పాడయిపోయిన సెక్స్ హార్మోన్లనుకున్నాం కాబట్టి....

ఈ ఆలోచన స్ఫురించేసరికి అతడి మొహంలో రక్తం ఇంకి ...పోయింది.

సామ్సన్ కంపెనీ తయారుచేసే కాన్స్-క్యూర్ మందు శరీరంలో ...ఉండే కేన్సర్ కణాల్ని తగ్గించటానికి ప్రయత్నం చేస్తుంది. ఆ మందు

తయారుచేస్తూ వుండగా ఉత్పత్తి అయ్యే మెథైల్ కోరిన్ థెరిన్
కణాల్ని అభివృద్ధి చేయడానికి తోడ్పడుతుంది.

మొత్తానికి వలయం పూర్తయింది.

కేన్సర్‌ని తయారుచేసే పదార్థానికీ, దాన్ని నిరోధించే
ఇంత దగ్గర సంబంధం వుందన్నమాట. అవును.... అందులో
లేదు. పెరిగే మామూలు జీవకణం అస్తవ్యస్తం అవుతేనే కదా అ
కణమై 'తిరిగి పెరగటం' ప్రారంభమవుతుంది. అదీ వలయమే.

కేన్సర్ కణాల్ని చంపటానికి ఒక మందు తయా
అంటే, అందులోంచి మామూలు కణాల్ని కేన్సర్ కణాలుగా
మెథైల్ కోరిన్ థెరిన్ తీసెయ్యాలి. పాయిజన్ కంపెనీ చేస్తు
పోతే, ఆ గాలిని శుభ్రపరచకుండా ఊరు మీదకు వదిలేస్తోంది.

భార్గవలో ఒక్కసారిగా ఆవేశం పెల్లుబికింది.

దీన్ని ఎలాగైనా అరికట్టాలి.

తను కేన్సర్‌కి మందు కనుక్కోలేకపోవచ్చు. కానీ క
ఇన్‌స్టిట్యూట్ ప్రాంతాల్లోనూ, ఆ చుట్టుప్రక్కలా కేన్సర్
ఎక్కువగా వ్యాపిస్తోందో కనుక్కున్నాడు.

చాలు!

అప్పుడు చప్పున స్పృహలోకి వచ్చినట్టు తలెత్తి రమ
వైపు చూసి 'థాంక్స్, చాలా సాయం చేశారు' అని చెప్పి అక్క
కదిలాడు. కుంటుకుంటూ వడివడిగా వెళ్ళిపోతున్న భార్గవకేస
మూర్తి ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు.

## 6

"నా ప్రియమైన ప్రజలారా! నేడెంతో సుదినం.
మీ మధ్య- మీ కోసం ఒక హాలు ప్రారంభమవుతుంది. నాటకా
టానికీ, మిగతా సాంస్కృతిక కార్యక్రమాలు చేసుకోవటానికీ
ఓపెన్ థియేటర్ల ఆవశ్యకత ఎంతో వుంది. ఇక్కడ ఈ హా
ముఖ్యం, ఈ లొకాలిటీ ప్రజల్లో పెరుగుతున్న ఐకమత్యాని
నిదర్శనం. మీరందరూ చందాలు వేసుకుని పర్మినెంటు స్టేజీని
నారంటే కళల పట్లా కలుసుకోవటం పట్లా మీకెంత అభిరుచి వుం

ఉంటోంది. మీలాంటి అభిరుచులు వున్న ప్రజలకు సేవ చెయ్యటం మా అదృష్టం...." ఇలా నాన్‌స్టాప్‌గా సాగుతూంది మంత్రిగారి ఉపన్యాసం.

పక్క కుర్చీలో వున్నాయన లేచి మంత్రిగారి చెవిలో ఏదో చెప్పాడు.

"ప్రజలారా! ఇంకో శుభవార్త. నా పక్కన కూర్చున్న సామ్సన్ అండ్ సామ్సన్ కంపెనీ పి.ఆర్.ఓ. (పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్) ఇప్పుడే ఈ వార్త వెల్లడి చేశారు. మీ సంస్థకి, తమ కంపెనీ తరపునుండి కేరమ్స్-బోర్డ్ చెస్బోర్డ్‌తో సహా వివిధ రకాలైన ఆటసామాగ్రి బహుమతిగా ఇస్తున్నారు. అంతేకాదు, ఈ సంస్థకి ప్రతి సంవత్సరమూ అయిదు వేలు చొప్పున తమ కంపెనీ ఇస్తుందని వెల్లడి చేస్తున్నారు."

ప్రజల్లో ఆగకుండా చప్పట్లు.

"కేవలం లాభాపేక్షతో కాకుండా తమ కంపెనీలో పనిచేసే కార్మికుల సంక్షేమం కోసం, తమ లొకాలిటీలో వుండే ప్రజలకోసం ఇలా సహాయం చేస్తున్న ఈ కంపెనీ యాజమాన్యాన్ని నేను అభినందిస్తున్నాను. ఇలా విశాలమైన కాలనీ ఇది. ఇంతటి కాలనీకి కేవలం ఓపెన్ ఎయిర్ స్టేజీ ఉండటం ఏమీ బావోలేదు. వర్షాకాలం మరీ కష్టం. అందుకే దీన్ని ఒక థియేటర్‌గా మారిస్తే బావుంటుంది. అప్పుడే దీన్ని కళ్యాణమండపంగా కూడా చేసుకోవచ్చు. ఇంత నవీనమైన లొకాలిటీకి ఒక మంచి థియేటర్ లేకపోవడం మనం విచారించవలసిన విషయం. (గట్టిగా) దీనికి మనం శ్రమించాలి."

ఎందుకో తెలియకపోయినా చప్పట్లు కొట్టారు జనం.

"ప్రజలారా! వచ్చేనెలలో ఎలక్షన్లు. మళ్ళీ ఈ లొకాలిటీనుంచి నన్నే మీ అభ్యర్థిగా ఎన్నుకుంటే, ఈ కళ్యాణమండపం కట్టించడానికి అయ్యే ఖర్చులో సగం ప్రభుత్వం తరఫునుంచి గ్రాంటుగా ఇప్పిస్తానని వాగ్దానం చేస్తున్నాను."

సభ ఆనందాతిరేకంతో మళ్ళీ చప్పట్లు కొట్టింది. దూరంగా గడ్డి కోస్తున్న ముసలిపోతు తలెత్తి చూసి, మళ్ళీ తన పనిలో నిమగ్నమైంది. మంత్రిగారు ఆహ్లాదంగా ప్రజలకేసి చూసేరు. ఇంతటి మిట్ట మధ్యాహ్నం పూట తన సభకి ఇంతమంది వచ్చారంటే ఆనందించవలసిన విషయమే.

వచ్చే ఎన్నికలలో తన గెలుపు తథ్యం.... ఈ సభలోనే మండలి విభాగం గురించి కూడా మాట్లాడాలి. ఆయన తిరిగి సర్దుకోబోతూ వుండగా స్టేజీ క్రింద అలికిడి వినిపించి చూసేడు.

భార్గవ మెట్లు ఎక్కుతున్నాడు.

పిచ్చివాడిలా వున్న అతడిని చూసి ఆయన ముఖం ప్రక్కనున్న పి.ఆర్.ఓ మాత్రం భార్గవని గుర్తుపట్టేడు. గారితో, "ఇతడీ లొకాలిటీవాడే. సైంటిస్టు. ఈ ఇన్‌స్టిట్యూట్ చేస్తున్నాడు" అన్నాడు. ఈ లోపులో భార్గవ దగ్గరకొచ్చి "నేను ఒక క్షణం మాట్లాడవచ్చా" అని అడిగాడు.

"దేని గురించి?"

"ఈ లొకాలిటీ వెల్‌ఫేర్ గురించి"

"అవశ్యం.... అవశ్యం...." అంటూ మైకు పట్టుకుని "ప్ర ఇప్పుడు ఈ కంపెనీలోనే వుండే డాక్టరుగారు మాట్లాడతారు" అని భార్గవకి అందించాడు.

ఒక క్షణం తన ముందున్న జనంకేసి కన్నార్పకుండా భార్గవ మైకులో "ఫ్రెండ్స్" అని ఆగేడు.

ఆగి మళ్ళీ అన్నాడు.

"మనం ఇంకా మూర్ఖులం"

ఒక శీతల వాయువు మీదనుంచి వెళ్ళిపోయినట్టూ సభ యింది. ఒక అల్లరి కుర్రాడెవరో సన్నగా విజిల్ వేసేడు. భార్గవ సాగించాడు.

"మనం ఇంతకాలం మన మధ్యే వున్న ఈ ప్రమాదాన్ని క్కలేక పోయాం.... మన లొకాలిటీలో ఇంకా ఎక్కువ రేట్‌లో లక్షణాలూ, మిగతా అనారోగ్యాలూ కనబడటానికి కారణం కనుక్కున్నాను. ప్రజలారా! ఆ కారణం మరేదో మరేదో కాదు, అండ్ సామ్సన్ కంపెనీ ఫ్యాక్టరీ గొట్టంలోంచి వచ్చే మెథైల్ ఛరీన్ శాలూకు వాయువు."

అప్పటివరకూ నవ్వుతూన్న పి.ఆర్.ఓ ఉలిక్కిపడ్డాడు. పక్క

క్క ఒదులవలేచి 'ఎస్' అన్నాడు. భార్గవ అతడిని పట్టించుకోలేదు, చెప్పుకుపోతున్నాడు.

"ఆ వాయువు బయటికి వచ్చేటప్పుడు చాలా విషపూరితంగా ఉంటుంది. అందుకే ఆ ఫ్యాక్టరీలో కార్మికులు— అంటే మీలో చాలా మంది ఆ సమయానికి మొహానికి మాస్క్ వేసుకుంటారు. వెలువడిన గాలి కొన్నేపటికి దాని ప్రభావపు ఉధృతం తగ్గినా ఇంకా విషపూరితమే. ఇది మన లోకాలిటీలో ఇప్పి...." సడెన్‌గా ప్రక్కనుంచి ఒక చెయ్యి వచ్చి అతడిని తోసింది. అయినా భార్గవ మైకు వదలలేదు.

పి.ఆర్.ఓ. ముఖం కందిపోయింది. అతడు ఈ పరిణామాన్ని ఊహించలేదు. తన కంపెనీ మీదే ఈ అటాక్ వస్తుందని కలలో కూడా అనుకోలేదు. అలా వూహించివుంటే మైక్ ఇచ్చేవాడే కాదు. అందుకే మైక్ లాగేసుకోవడానికి ప్రయత్నించాడు. భార్గవ ప్రజల నుద్దేశించి పెద్ద గొంతుతో దిగ్గరగా, "మీకు తెలుసా?" అని అరిచాడు.

"...ఈ రోజు ప్రొద్దున్న ఏసుపాదం అనే కుర్రవాడు చచ్చిపోయాడు! నా కూతురు నేడో- రేపో అదే స్థితిలో వుంది! ఈ మరణాల వెనుక వున్న అదృశ్యహస్తం సాహ్నస్ కంపెనీ! ఈ కంపెనీ తయారుచేసే మందులన్నీ బోగస్‌వి! వాయువుని శుభ్రపర్చకుండా బయటికి వదులుతున్న ఈ ఫ్యాక్టరీకి మనమందరం కలిసి అల్టిమేటమ్ ఇవ్వాలి. ఈ మార్పు అసలు జరిగేవరకూ ఫ్యాక్టరీ మూసెయ్యాలని చెప్పి మనం అలజడి చెయ్యాలి, ఒక యుద్ధ ప్రాతిపదికమీద ఇదంతా జరగాలి."

అతడు చెప్పుకుపోతున్నాడు.

ఈ లోపులో ఎవరో వచ్చి మంత్రిగారి చెవిలో ఏదో ఊదారు.

పి.ఆర్.ఓ. అయితే భార్గవని బలవంతంగా తోసేశాడు. ఆ ఊపుకి భార్గవ స్టేజీ చివరకు వెళ్ళి అక్కడ నిలదొక్కుకోలేక క్రిందకి పడ్డాడు. స్టేజీ అంచు తలకి తగిలి రక్తం స్రవించసాగింది. కాలి దగ్గర కూడా చర్మం ఎరుపు అయింది. అయినా అతడు అతికష్టంమీద లేచి నిలబడ్డాడు. "నేను చెప్పేది అర్థంచేసుకోండి. కావాలంటే నేను నిరూపించగలను కూడా. ఈ ఇన్‌స్టిట్యూట్ రిసెర్చి- ఆ కంపెనీ పేటెంట్లూ అంతా

అమాయకమైన ప్రజల్ని చేస్తున్న మోసం ప్రభుత్వం దీనికి అం
టం మన దౌర్భాగ్యం. ఈ లొకాలిటీ వాతావరణం కాలుష్యంతో
పఉగా మారకముందే మనం మేల్కొనాలి. సమ్మె చెయ్యాలి. నిరా
చెయ్యాలి. ఎలాగయినా ఫ్యాక్టరీని మూసేయించాలి. అదే ఈ క
టీకి వెల్‌ఫేర్!.... అదే" నోటికి ఉప్పటి రక్తం తగలటం
చేసేదు.

మైకు లేకపోవటంతో అతడి మాటలు ప్రజలకి విని
లేదు. ఈ లోపులో మంత్రిగారు మైకు పట్టుకుని సానుభూతిగా
ప్రారంభించారు.

"ఇంత నిండుగా కళకళలాడుతున్న ఈ సభలో ఈ చిన్న అ
ఇలా పలకటం నాకు విచారంగా వుంది. ఈ వ్యక్తిమీద కూడా నా
రావటంలేదు. అతడో గొప్ప సైంటిస్టట. ఇక్కడే ఇన్‌స్టిట్యూట్‌లో
చేసేవాడట, పాపం మతిస్థిమితం లేకపోవటంవల్ల ఈ మధ్యనే
ఉద్యోగంలోంచి తొలగించారట. అందుకే ఇలా ఈ ఇన్‌స్టిట్యూట్
కంపెనీ మీదా కక్షకట్టి ఆ వ్యథలో మరింత పిచ్చివాడయ్యాడు. అ
మేధావి ఇలాంటి పిచ్చివాడుగా మారటం మనం చేసుకున్న దురదృ

"కాదు...." అరిచాడు భార్గవ. అతడి కంఠం బొంగురుపో
"ఫ్యాక్టరీ విషపూరితమైంది. నన్ను నమ్మండి. నన్ను నమ్మండి"

సభని పాడుచెయ్యటానికి ప్రతిపక్షంవాళ్ళు ప్రయోగించిన నా
అని మంత్రిగారు ఓ క్షణం ఆలోచించారు.

"ఈ లొకాలిటీలో వుండే మీలో చాలామంది ఆ ఫ్యాక్టరీలో
చేసేవాళ్ళే. ఇప్పుడు ఇతగాడు చెప్పిన విధంగా ఫ్యాక్టరీని మూ
మీరందరూ ఏమవుతారు! అసలు ఫ్యాక్టరీ అంటే ఏమిటి? అ
లాంటిది. తల్లిమీదే అనుమానం పెంచుకోవటం ఆత్మద్రోహం. ఈ
వాడు ఆ పనే చేస్తున్నాడు. అయినా మీరందరూ కావాలంటే
ఫ్యాక్టరీ మూయించేసి, ఒక ఎంక్వయిరీ కమిటీ వేయిస్తాను. కానీ అ
మీకు ఉద్యోగాలు ఉండవు, మీ శ్రేయస్సే నా శ్రేయస్సు. చెప్పండి
చేయించనా"

"వద్దు వద్దు" అని అరుపులు సభలోంచి వినబడ్డాయి. ఒక అ

...త్తైన యువకుడు లేచి, "ఆ పిచ్చోడిని తన్ని తగలెయ్యక ఎందు ...కిక పేస్తు" అన్నాడు.

"మూర్ఖులారా?" అంటూ అరిచాడు.

"నేనుకాదు పిచ్చోడిని మీరు, మీరందరూ పిచ్చోళ్ళు. పొంచివున్న ...దాన్ని పసిగట్టలేకపోతున్నారు. నేనెంతో కష్టపడి కనుక్కున్నాను ...సత్యాన్ని. దీన్ని సేకరించటంలోనే ఉద్యోగం కోల్పోయాను. ఈ ...దా మీ కోసం, మీ సంక్షేమం కోసం. మెథైల్ కోరి...." ఒక ...ప్పన వచ్చి అతడి మొహానికి తగిలి ఆవేశానికి ఆనకట్ట వేసింది.

'అమ్మా' అంటూ మొహాన్ని చేతుల్తో కప్పుకుని అతడు కుప్ప ...కూలా వుండగా, ఒక చెప్పు గాలిలోకి ఎగిరింది.

అప్పుడేతు ఈ గొడవకి దూరంగా వెళ్ళిపోయింది.

ఆ సభలో కొందరు ప్రతిపక్షం వాళ్ళుకూడా వున్నారు. అదే ...ఆసుకుని మంత్రిమీద కుళ్ళిన కోడిగుడ్లు విసరటం ప్రారంభించారు. ...ఇలా సభ పాడవటం కోసమే చూస్తున్నారు. క్షణంలో దూరంగా ...పోలీసులు రంగంలోకి దిగారు. లాఠీఛార్జి మొదలైంది. టమాటాలూ, ...చెప్పులూ గాలిలోకి ఎగిరి స్టేజివేపుకి వస్తున్నాయి. పైకి రానివి ...క్కవకి తగులుతున్నాయి. జనం పరుగెడుతున్నారు. ఎవరో ...దే అదనుగా భావించి భార్గవ చేతిలోంచి బ్రీఫ్‌కేస్ లాక్కుని ...పారు. అతడి వస్తువులూ, జీవితాంతం కష్టపడి తయారుచేసుకున్న ...పేపర్లూ అన్నీ పోయాయి. వెళుతున్న వాడిని నిరోధించటం ...అతడు లేవబోయాడు. ఒక లాఠీ వచ్చి బలంగా మొహంమీద ...ంది.

అతడికి స్పృహ తప్పింది.

# 7

తిరిగి అతడికి స్పృహ వచ్చేసరికి దాదాపు సాయంత్రం కావొ ...స్తుంది. బల్లలమధ్య పడి వుండటంతో అతడినెవరూ గమనించలేదు. సభ ...సందడ అయినట్టూ అక్కడ విరిగిన వస్తువులే చెపుతున్నాయి.

అతడు కళ్ళు విప్పగానే, అతడిపక్కన తోకారించుకు
పక్క పక్కకి వెళ్ళిపోయింది. మొహానికి రంగులు మసు
అతడు లేవబోయాడు. వళ్ళంతా పచ్చిపిసట్లా బాధ కలిగింది.
మీద లేచి నిల్చున్నాడు.

దూరంగా ఇద్దరు పనివాళ్ళు సామానులు సర్దుతున్నా
పట్టించుకోలేదు.

భార్గవకి అకస్మాత్తుగా రూమరు జ్ఞాపకం వచ్చింది.
రెండ్రోజులైంది ప్రార్థనని చూసి. ఆ ఆలోచన రాగానే
కన్నా మానసిక వ్యథ ఎక్కువైంది. ఇక్కడ తనేమో తన
పరిశోధనలలోనూ నిమగ్నమై వున్నాడు. అక్కడ
అసలు పట్టించుకోలేదు. ఆ ఆలోచన రాగానే అతడి
పెరిగింది.

ఎలా చేరుకున్నాడో తెలీదు. ఆస్పత్రి చేరుకున్నాడు.
పశాత్తు గూర్ఖా లేదు. అతడు లోపలికి ప్రవేశించి మెట్లెక్కి
వున్న వార్డులోకి ప్రవేశించాడు. ఒక్కసారిగా అతని
శంకించింది.

వరండా నిర్మానుష్యంగా వుంది.

అంతలో లోపల్నుంచి ఒక నర్సు బయటకు వచ్చింది.

"ప్రార్థనకెలా వుంది?" అని అడిగాడు. ప్రార్థన ప్ర
సరికి ఆమె మొహంలో సడెన్‌గా మార్పు వచ్చింది.
'ప్రార్థనకి నువ్వేమవుతావు' అని అడిగింది.

"తండ్రిని."

"మైగాడ్! తండ్రివై వుండి ఇప్పుడా రావటం."

ఒక్కసారిగా భార్గవ గుండె కొట్టుకోవటం ఆగిపోయింది.
గొంతుకతో "ప్రార్థనకి.... నా ప్రార్థనకి ఏమైంది" అన్నాడు.

"పేషెంట్ నెం. 226 గురించే కదా మీరు చెప్తున్న
అడిగింది నర్సు.

"అవును."

"మధ్యాహ్నం వరుసగా నాలుగు వాంతులు అయ్యాయి. అండ్ దేర్ వజ్ బ్లడ్ ఇన్ ఇట్."

"బ్లి....డ్....??"

"అవును, నేను డ్యూటీలో లేనప్పుడు. కానీ డాక్టర్ మహేంద్ర చెప్తూ వుండగా విన్నాను? సమ్ ట్రబుల్ విత్ స్ప్లీన్ ఐ థింక్...."

"ప్రార్థన ఎక్కడుంది?"

"ఇంటెన్సివ్ కేర్ లో."

అతడు అక్కడకు చేరుకుని ఆత్రంగా లోపలికి అడుగు పెట్టబోయి హఠాత్తుగా ఆగిపోయాడు.

తన కూతురేనా?.... ప్రార్థనేనా?.... కళ్ళనే నమ్మబుద్ధి కావటం లేదు. సరిగ్గా పదిరోజుల క్రితం ఎంతో ఆరోగ్యంగా స్కిప్పింగ్ చేసిన కాళ్ళు ఇప్పుడు వడలిపోయిన తామర తూడుల్లా వ్రేలాడుతున్నాయి. విపరీతంగా మందులు వాడటంవల్ల జుట్టు వూడిపోయి నుదురు మరింత విశాలంగా కనిపిస్తూంది. అన్నిటికన్నా ముఖ్యంగా కెమికల్ రియాక్షన్ వల్ల చర్మమంతా రింగులుగా మచ్చలు ఏర్పడ్డాయి.

అతడు స్థబ్దుడై నిర్వీర్యుడై కూతురి ఆకారంవైపు చూసేడు. తన మీద దొంగతనం మోపబడ్డప్పుడు దుఃఖం రాలేదు. బలవంతంగా రాజీనామా చేయవలసి వచ్చినప్పుడు దుఃఖం రాలేదు. ప్రజలు వెలివేసి కొట్టినప్పుడు దుఃఖం రాలేదు. ఇప్పుడు వచ్చింది. తననుంచి తనను ఎవరో బలవంతంగా విడదీస్తున్న భావనతో- దుఃఖం.

ఆమె ఛాతి ఎగిరెగిరి పడుతూంది. ఊపిరి బలంగా తీస్తుంది. అతను కూతురు దగ్గరకు వెళ్ళి మొహంలోకి చూశాడు. ఆమె శరీరం నుంచి ఎలక్ట్రోకార్డియో గ్రాఫిక్ జతచేయబడి వున్న వైర్లు, ఆమె శరీరం నుంచి బయటికి లాగిన రక్తనాళాల్లా వున్నాయి. గ్రాఫ్‌లో చిన్న వెలుతురు చుక్క ఓ చివరన మొదలై కెరటంలా పయనిస్తూ అవతలి అంచుకు చేరుకుంటూంది. రోగి అలా వుంటే అక్కడ ఎవరూ లేకపోవటం ఆశ్చర్యంగా వుంది.

నాసికా రంధ్రంలోకి వెళ్ళిన ట్యూబ్ మెలికపడి వుండటం చూసి దాన్ని మెల్లిగా లాగేడు. చేతికి ఐ. వి. అలాగే వుంది. ఆ అలికిడికి

ప్రార్థన కళ్ళు విప్పింది. తండ్రిని చూడగానే ఒక్కసారి ఆ
మొహంలో వెయ్యికాంతులు ప్రజ్వరిల్లాయి. ఉద్వేగంతో "నాన్నా
కూతురు కదిలేసరికి అతడు దూరం జరగబోయాడు. గా
అతడి మెడచుట్టూ చెయ్యివేసి అతడిని కదలనివ్వకుండా, "వే
నాన్నా. నన్ను తీసుకెళ్ళిపో నాన్నా.... ప్లీజ్" అంది దాదాపు రో
అతడు అప్రతిభుడై "అమ్మా— వస్తూ" అన్నాడు.
"వీళ్ళు నన్ను చంపేస్తున్నారు నాన్నా, బాధపెట్టి చంపే
నేనిక్కడ అసలు వుండలేను."
కెమోథెరపీవల్ల ఎంత బాధపడుతుందో ఆ శరీరమే చె
ఇంకేమీ ప్రశ్నలడగలేదు. అతడు "అలాగేనమ్మా వెళ్ళిపోదాం
అన్నాడు లేవబోతూ అనునయంగా నచ్చచెపుతున్నట్టూ.
ప్రార్థన అతడిని లేవనివ్వలేదు. లేస్తే ఎక్కడ వెళ్ళిపో
భయంతో అలానే చేతులువేసి వుంచింది. ఆ తండ్రీకూతు
చేతుల్తో ఒకరు నిశ్శబ్దాన్ని పంచుకుంటూ వుండిపోయారు.
అంతలో వెనుక కెవ్వున కేక వినిపించింది. ఆ కేక పెట్టి
యధాలాపంగా లోపలికి రాబోతూ బెడ్ పక్కనే మోకాళ్ళమీద
ఆకారాన్ని చూసి, ఎవరో పిచ్చివాడనుకుని కేకపెట్టింది. ప
పెడుతూనే వుంది. ఇంటెన్సివ్ కేర్ లో ఖరీదైన పరికరాల మధ్య
లాటి మనిషిని చూసి బెదిరిపోయింది.
ముందో ఇద్దరు హౌస్ సర్జెన్లు పరుగెత్తుకు వచ్చారు. వె
ఇద్దరు నర్సులు అందరికన్నా చివర డాక్టర్ మహేంద్రజైన్.
అతడు లోపలికి ప్రవేశిస్తూనే భార్గవని గుర్తించారు.
వినిపించగానే తలతిప్పి చూసేడు. నర్సుని చూసి లేవబోయా
ప్రార్థన వదల్లేదు. ఈ లోపులో మహేంద్ర దగ్గిర కొచ్చారు.
శరీరంనుంచి పెరికివేయబడ్డ ట్యూబ్స్‌ని చూడగానే కోపం
భృకుటి ముడిపడింది.
"మిస్టర్ భార్గవా! ఇలా ఇంటెన్సివ్ కేర్ లోకి వచ్చే అ
కెవరిచ్చారు" అని గద్దించాడు.
"ఇంటెన్సివ్ కేర్ అంటే పేషెంట్‌ని గాలికి వదిలేసి
టమా?" అంతే కోపంగా భార్గవ కూడా అడిగాడు. పక్కనవ

…గొప్ప ఏదో చెప్పబోయింది. మహేంద్ర ఆమెని ఆగమని చేత్తో … భార్గవతో, "థాంక్స్ ఫర్ యువర్ కామెంట్స్. విల్ యు నౌ … ఫ్రం హియర్" అన్నాడు.

"ఎందుకు? నా కూతురిమీద మరిన్ని ప్రయోగాలు చేయటానికా?"

అతని జవాబు చూసి డాక్టరు మరింత మండిపడతాడనుకున్నారు …వాళ్ళు. కానీ మహేంద్ర మొహం అనూహ్యమైన నెమ్మదితనం …పింది. తాపీగా పక్కకి తిరిగి, "పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చెయ్యండి. …వీ గెట్ దిస్ ఫెలో అరెస్టెడ్" అన్నాడు.

భార్గవ ఒక్క ఉదుటున లేచి "దిసీజ్ ఇడియాటిక్" అన్నాడు. "… డాక్టర్స్. నా కూతురికి ఎలాంటి ట్రీట్‌మెంట్ ఇస్తున్నారో చూసుకునే …్కు నాకు ఎప్పుడూ వుంది."

మహేంద్ర మొహంలో అకస్మాత్తుగా విస్మయం కనబడింది. "మీ …? మీ కూతురేమిటి? మీరింకా కోర్టు ఆర్డరు చూడలేదా?"

భార్గవ వెన్ను చలితో ఒక్కసారిగా వణికింది. తనకి తెలియ…లోనే తన వెనుక దారుణం ఏదో జరిగిపోయిందని మనసు చెప్పింది. "…కోర్టు ఆర్డరా" అన్నాడు తడబడుతూ. అతడి మొహం చూస్తుంటే …షయం ఇంకా అతడికి తెలీదని తెలిసిపోయింది.

మహేంద్ర తన కోటు జేబులోంచి కోర్టు ఆర్డరు తీస్తూ "ఇలా …కొస్తే చూపిస్తా" అన్నాడు. భార్గవ ఇంకా అయోమయంలోనే … నిద్రలో నడుస్తున్నవాడిలా అతడితోపాటు నడిచాడు. బయటికి …కే మహేంద్ర ఆ కాగితాన్ని భార్గవకి అందించాడు.

అతడు దాన్ని అందుకుని చదవటం ప్రారంభించాడు. మొదటిది … ఆర్డరు. రెండోది వసుమతి ఆస్పత్రి అధికారులకిచ్చిన ఇర్రివోకబుల్ … ఆఫ్ ఆథరైజేషన్.

భార్గవ అనబడే తండ్రి- కూతురుయొక్క ఆరోగ్య విషయంలో … శ్రద్ధ చూపించటంలేదు. కాబట్టి తల్లి అయిన వసుమతిని …గా నియమిస్తూ టెంపరరీ ఆర్డరు.

అతని కళ్ళు మసకలు కమ్మాయి. సంవత్సరాల తరబడి పెంచు… …తోటని ఎవరో నిర్దాక్షిణ్యంగా నాశనం చేసినట్టూ కంపించి …యాడు.

"ఇది అన్యాయం" దిక్కులు కదిలిపోయేలా అరవాలను భార్గవ. కానీ గుండెని ఎవరో నొక్కిపట్టినట్టు గొంతు ఆ అక్షరాలు అలుక్కుపోయి కనబడ్డాయి. "అన్యాయం....అ అంటూ గొణిగాడు.

"ఏది అన్యాయం డాక్టర్ భార్గవా!"

"నా వాదన వినకుండా కోర్టు ఇలా ఆర్డర్ ఇవ్వటం."

"విషయం అర్జెంట్ కాబట్టి పరోక్షంగా తీసుకోవలసి మీకూ నాల్గయిదురోజుల్లో కోర్టు సమన్లు వస్తాయి, మీ వాదన కూ వింటారు. అప్పుడు వాళ్ళకి ఏది సరి అయినదని తోస్తే ఆ పర్మనెంట్ ఆర్డరు ఇస్తారు."

"దానంతటికీ పది పదిహేను రోజులు పడుతుంది."

"అవును. అంతవరకూ ఈ ఛాయలకి వస్తే కోర్టు ధిక్కా క్రింద మీ మీద చర్య తీసుకోబడుతుంది" నిర్లక్ష్యంగా చెప్తున్న సమాధానాలకి భార్గవ మొహం కందిపోయింది. ఏదో స్ఫురించినట్లు "కానీ వసుమతి, ప్రార్థనకి సవతి తల్లి. తల్లికి న్యాచురల్ గార్డియన్ అయ్యే హక్కు లేదు" అన్నాడు.

"అవన్నీ మీరు కోర్టులో తేల్చుకోవలసిన విషయాలు"

"ఎప్పుడు....? ఎప్పటికి?? ఎప్పటికి ఇవన్నీ తేలేది???" భార్గవ. దుఃఖం, నిస్సహాయతా కలిసి అతడి గొంతు బొంగు

"అదృష్టం బాగుంటే మొదటి హియరింగ్‌లో.... పదిహేను రోజుల్లో....."

"అప్పటివరకూ నేనిక్కడికి రాకూడదు"

"అది 'కాంటెంప్ట్ ఆఫ్ కోర్టు' అవుతుంది."

"దూరంనుంచి కూడా చూడకూడదు."

"దానికి రూల్స్ ఒప్పుకోవు."

"ఇది అన్యాయం."

"మా ట్రీట్‌మెంట్‌మీద నమ్మకంలేనివాళ్ళ సామీప్యాన్ని హర్షించము డాక్టర్ భార్గవా! అందుకే ఈ కోర్టు ఆర్డర్‌లా మీరేగానీ మీ తరఫునుంచి మరో కోర్టు ఆర్డరు తెచ్చి చూపిస్తే మీ పువ్వుల్లో పెట్టి మీ కర్పించటానికి మాకేమీ అభ్యంతరం లేదు."

"క్షమ, అర్పిస్తాను...." కళ్ళనిండా నీళ్ళతో పిచ్చివాడిలా ర్గవ. పదిరోజుల తరువాత నేను వస్తే ఏం అర్పిస్తారు మీరు? బాడీని ప్యాక్‌చేసి అర్పిస్తారా? లేకపోతే మాట నిలబెట్టు కోసం అప్పటివరకూ మార్చురీలో పెట్టి నేనొచ్చాక పాడె ఇల్లి శవాన్ని పూలలో పెట్టి అర్పిస్తారా? నే వచ్చేసరికి ఏమీ ! నాకు తెలుసు.... నాకు తెలుసు...." అతడికి లోపలనుంచి కోసుకువచ్చింది. కిటికీవైపు తిరిగి ముఖం చేతుల్లో దాచుకుని పోసేడు. అంత పెద్దమనిషి చిన్నపిల్లాడిలా రోదించటం చూస్తే ఆశ్చర్యంగా కనిపించవచ్చు. కానీ అతడికి ప్రార్థన ఎంత ప్రియాతి ైనో తెలిసినవారికి మాత్రం అది విస్మయం కలిగించదు. ఈ అంతా కలిపికట్టుగా ఒక తాటిమీద నిలబడి అతడినించి కూతుర్ని యింది. చివరకు కట్టుకున్న భార్యకూడా వారితో కలిసిపోయింది.

కేమి మిగిలింది.... దుఃఖం తప్ప. చాలాసేపటికి అతడు తేరు డు. డాక్టర్‌వైపు చూసి. "నేనొకసారి నా కూతుర్ని చూసుకో బ్రతికివుండగా ఆఖరిసారి...." అని అభ్యర్థించాడు. అందులో లేదు, బాధే వుంది.

మహేంద్ర ఏదో అనబోయి, మనసు మార్చుకుని సరే అన్నట్టు డు.

ఇద్దరూ లోపలికి ప్రవేశించారు. భార్గవ మంచం దగ్గరికి వెళ్ళి ర్చున కూర్చుని కూతురి తలమీద చెయ్యివేసి "వెళ్ళొస్తానమ్మా" డు.

ఆకృతి గొంతు రుద్ధమైంది.

"వద్దు నాన్నా- నువ్వు వెళ్ళొద్దు" వదిలేస్తే ఎక్కడ వెళ్ళిపోతాడో ద్ద చేతిని గట్టిగా పట్టుకుంది.

"లేదమ్మా, వెళ్ళాలి. మళ్ళీ వస్తానుగా"

"ఊహూ, రావు"

"ఏం, ఎందుకు రాను? కొన్ని మందులు కొనాలట. అవి కొని స్తాను."

"ఊహూ. నాకు మందులొద్దు, నేను ఇంటికి వస్తాను."

"ఇంకెంతమ్మా—నాల్గయిదు రోజుల్లో నేనే స్వయంగా తీసు

'ఇక వెళతారా' అన్నట్టు మహేంద్ర దగ్గాడు. నర్సు మ

అమర్చటానికి దగ్గిరకొచ్చింది. భార్గవ లేచి నిలబడ్డాడు.

"డాడీ"

అతను ఆగేడు.

"నిన్ను అరెస్టు చేస్తున్నారెందుకు?"

ఉలిక్కిపడ్డాడు. ప్రార్థన చిన్నపిల్లకాదు, ఇంగ్లీషు

చేసుకోగలదు. పెదవులమీద బలవంతంగా నవ్వు తెచ్చు

"అదా.... అది ఇంటెన్సివ్ కేర్ లోకి ఇలా ఎవరూ రాకూడదు,

మరి నే వెళ్ళిరానా...."

ప్రార్థన మాట్లాడలేదు.

భార్గవ వంగి, ఆమె నుదుటిమీద ఆప్యాయంగా

కున్నాడు. ఎవరివైపూ చూడకుండా తల వంచుకుని గు

సాగిపోయాడు. అక్కడ మాత్రం కాళ్ళు నిరాకరించాయి. అ

చూసేడు. ప్రార్థన కూడా ఇటే చూస్తూంది. ఇద్దరి కళ్ళు కలు

అతడు చటుక్కున కళ్ళు తిప్పుకున్నాడు.

ప్రత్యర్థులు గెలిస్తే అదే ఆఖరి చూపు అని అతడికి

కూతురు బ్రతికి వుండగా!!!

* * * *

శంకర్ లాల్ తన పెర్సనల్ ఫోన్ ఎత్తి నంబర్ డయల్

"హల్లో"

"చెప్పు శంకర్ లాల్! నేనే"

"థాంక్స్"

"దేనికి?"

"మీరు చెప్పిన రెండు సూత్రాలూ టేబిల్ కి చెరోవైపు

కోవటమే కాదు, ఆచరించాను కూడా"

"గుడ్!"

"భార్గవ దగ్గర్నుంచి రాజీనామా తీసుకున్నాను"

"పాపం పూర్ ఫెలో! సల్ఫా-3 కనుక్కుంటే ఇవ

రాకపోవును కదా!"

"మీకు థాంక్స్ చెప్పదామని ఫోన్ చేశాను"

"దేనికి శంకర్‌లాల్?"

"నాకు సలహా ఇచ్చినందుకు, బోర్డు మెంబర్ల దగ్గర నా పరువు ...కుమిను. అన్నిటికన్నా ముఖ్యంగా అతడిని మీ ఫ్యాక్టరీలో రెడ్ ...డెడ్‌గా పట్టుకున్నందుకు."

"అది యాదృచ్ఛికంగా జరిగింది. నేను కారులో వస్తూంటే సెంట్రీ ...నుంచి బయటకొస్తూ కనపడ్డాడు. మీకు అతనో సలహా ఇచ్చాడు ...మందా. న్యూస్ పేపర్‌వాళ్ళు లోపలికి వచ్చి ఇంటర్వ్యూ తీసు... ఇన్‌స్టిట్యూట్ తాలూకు సెక్యూరిటీవాళ్ళు ఏం చేస్తున్నారు? ... అతగాడికి నా సెక్యూరిటీతో ఏం పని అని ఎంక్వయిరీ చేశాను. ...కనాడికి వచ్చాడని తెలిసింది. దొరికిందిరా పిట్ట అనుకున్నాను. ... నాటకం అంతా నువ్వే ఆడిందేగా శంకర్‌లాల్?"

"ఏది ఏమైనా థాంక్స్"

"తొందరగా నాకో కొత్త మందుకి ఫార్ములా ఇవ్వు. కాన్స్ంట్యూటర్ ...తో సరిపోతుంది"

"అలాగే— వుంటాను మరి"

"మంచిది" అటువేపు ఫోన్ పెట్టేశాడు.

* * * *

ఆస్పత్రి గేటు దగ్గిర నిలబడి అతడు వెనక్కి తిరిగి చూసేడు. ...ఐదంతస్తుల భవనం ఎత్తుగా, చేతులు సాచుకున్న బ్రహ్మరాక్షసుడిలా ...పించింది.

తను అన్నిటినీ కోల్పోయాడని అతడు తెలుసుకున్నాడు. ఇప్పు... పోయేడు. సమాజంలో గౌరవం, ఉద్యోగం, ప్రతిష్ఠ అన్నిటికన్నా ...ఖ్యంగా.... ప్రార్థన.

అతడికి ప్రపంచంమీదే విరక్తి జనించింది. ఏమిటీ ప్రపంచం? ...మందులతో సామాన్యుల్ని మోసంచేసే కాపిటలిస్టుల ప్రపంచం.... ... పేరుతో ప్రభుత్వంనుంచి లక్షల లక్షల గ్రాంటులు సంపాదించి ... ఇన్‌స్టిట్యూట్‌ల ప్రపంచం.... ఇక మనుష్యుల సంగతికి వస్తే ... మనుష్యులు? 'మీ ఆరోగ్యానికి కారణం ఇదిరా' అని చెప్పినా ... తనమీదకు రాళ్ళు రువ్విన మనుష్యులు.... దొంగతనానికి

వచ్చినట్టు తనమీద నేరం మోపి, తన దగ్గరున్న నాలుగువేలా
తనం చేసిన మనుష్యులు నిజాయితీకోసం నిలబడ్డ ఒక వ్యక్తిని
తన మాట వినలేదన్న పగతో, ద్వేషంతో పాతాళానికి తొక్కెయ్య
ఎన్ని అడ్డదార్లయినా తొక్కటానికి సిద్ధపడే మనుష్యులు....

ఈ మనుషులూ, ఈ ప్రపంచం అన్నిటికన్నా ముఖ్య
భార్య....

అతడికి వసుమతిమీద కోపం రాలేదు. తన జీవితంలో
అనామకురాలిగా ప్రవేశించి భార్యగా మారిన ఆమె, తనకింత ద్రో
చేస్తుందని కలలో కూడా అనుకోలేదు. ప్రార్థనంటే తనకెంత ప్రే
ఎంత గాఢంగా ప్రార్థనని తను ప్రేమిస్తాడో తెలిసి కూడా తన
పాపని కోర్టుద్వారా వేరుచేయగలిగిందంటే- ఆమె స్త్రీ అయి
రాక్షసి అయి వుంటుంది. అయినా అతడికి ఆమెమీద కోపం రాలేదు

తను మాత్రం చేసినదేముంది? ఈ మనుష్యుల్లో బాగు
ఇంతకాలం ఇన్‌స్టిట్యూట్‌లో జీతం తీసుకుంటూ కూడా ఏమీ చే
లేకపోయాడు. ఈ రోజు బాధపడే హక్కు తనకి లేదు. ఇన్ని
యేక, ఇందరితో 'ఛీ' అనిపించుకున్నాక ఇక ఈ ప్రపంచంనుంచి
మించటమే మంచిది.

ఈ ఆలోచన వచ్చేసరికి అంతా మంచు విడిపోయి
పోయింది. మరణం సమస్యకి ఇంత సులభంగా పరిష్కారం
తుందని అతడు అనుకోలేదు. అసలా వూహే ఎంతో ఆనందాన్ని
అవును. చావే తన నిర్ణయమైతే తన కూతురికన్నా తనే ముంద
పోవటం మంచిది.

అతడికి ఒకందుకు సంతోషం వేసింది. తనూ లేకపోతే
పిల్లలిద్దరూ అనాథలవరు. కనీసం ఈ విషయంలో వసుమతి
మాడటం ద్వారా మంచిపని చేసేదు.

అతనిక ఆలస్యం చేయదల్చుకోలేదు. తిరిగి ఇంటికి వెళ్తే
బంధాలు వెనక్కి లాగవచ్చు.

అతడు ఇన్‌స్టిట్యూట్‌కి బయల్దేరాడు.

ఎప్పుడూ లేనంత హుషారుగా వున్నాడు అతడు. సరాస
రూమ్‌కి వెళ్ళి సోడియం సైనేడ్ ఇండెంట్ చేసేడు.

"ఆయన రాజీనామా చేసాడు కదా! ఇంకా ప్రయోగాలు చేస్తు
స్టోర్ కీపరు అసిస్టెంట్‌ని అడిగాడు లోపలికి వెళ్ళాక.

"ఇంకా రిలీవ్ చేస్తున్న ఆర్డరు రాలేదుగా" అసిస్టెంట్ సైనేడ్‌ని
గా బాటిల్‌లోకి తీస్తూ అన్నాడు.

"అయినా పనకెందుకులే" బాటిల్‌ని ప్యాక్ చేస్తూ అన్నాడు స్టోర్
అనుకున్నట్టు కాగితంమీద సంతకం పెట్టిన భార్గవ దాన్ని తీసు
కు లాబ్‌కి వెళ్ళాడు. లాబ్ నిర్మానుష్యంగా వుంది. లోపల గడియ
న్నాడు.

సైనేడ్ చేతిలోకి తీసుకున్నాడు. ఇంజెక్షన్ సూది లోపలికి గుచ్చి
లోకి మందును లాగేడు.

"ఐ...మై...స్టోరొన్" అని అనుకున్నాడు. కళ్ళు మూసుకుని
రంలోకి గుచ్చుకోవటానికి సిద్ధపడ్డాడు.

# 8

శేఖరం కళ్ళు విప్పేడు.

కనురెప్పలు తెరుచుకుంటేనే కళ్ళు విప్పటం కాదు. నిద్రలోంచి
బయటకటానికి చేసిన ప్రయత్నం అది. కానీ ఎంత ప్రయత్నించినా
కళ్ళ విడిపోలేదు, బయట అలికిడికి నిద్రనుంచి వచ్చిన మెలకువ
పొరలు పొరలుగా అలుముకున్న మత్తు తెరలు నెమ్మది నెమ్మదిగా
లుదలోంచి వచ్చిన మెలకువ అది. పోతే— నిద్రలేస్తూ కనులు
గే ప్రపంచపు వెలుగు ఆహ్వానించినట్టూ.... ఏ వెలుగురేఖా గోచ
లేదు. చెవులు కూడా తమ ధర్మం నిర్వర్తించటం మానివేయటంతో
వాణాను పక్షుల కిలకిల రావాలు కాదుకదా కనీసం పక్కనున్న
మనుష్యుల ఉనికి కూడా తెలియటం లేదు.

అంతా శూన్యమే. అంతా నిశ్శబ్దమే. అంతా చీకటే.

చాలా భయంకరమైన— అయోమయ స్థితి!

తను గుడ్డివాడుగా మారేడని తెలుసుకున్నాక నిద్రనుంచి
వచ్చిన మొట్టమొదటి రోజది. నిద్రలోంచి బయటపడదామని ఎంత
న్నా ఆ చీకటిలోంచి బయటకు రాలేకపోవటంతో, అదంతా

కలేమో అనుకున్నాడు. దానికితోడు చుట్టూ పేరుకున్న చీ
చీకటి, నిశ్శబ్దాన్నుంచి బయటపడడం కోసం అరవాలనుకున్నా
శబ్దం కూడా రాలేదు. ఒకటి రెండు నిముషాలకి అర్థమయింది
నిద్రావస్థ కాదనీ- చెప్పుకోలేని అశక్తత అనీ.

ఆ నిజాన్ని జీర్ణించుకోవటానికి కొంచెంసేపు పట్టిం
నుంచి బయటపడలేక పోవటానికి కారణం వినలేకపోవటం
పోవటం అని అర్థమయ్యాక అలాగే అచేతనావస్థలో చాలాసే
పోయేడు.

ఎన్నాళ్ళనుంచీ తనలా స్పృహ లేకుండా వుండిపోయా
తెచ్చుకోవటానికి ప్రయత్నించాడు, కానీ లాభం లేకపోయింది.
అకస్మాత్తుగా అతడు తన చుట్టూ ఒక కొత్త వాతావరణాన్ని ప

కళ్ళు, నోరు, చెవులూ పని చెయ్యకపోయినా మిగిలి
నాసికా అతడికి తన ఉనికిని పట్టించింది.

ఆస్పత్రి వాసన!

తను ఆస్పత్రిలో వున్నాడన్న విషయం తెలుసుకోవటానికి
అది సాయపడింది. ఆ గదిలో ఇంకా ఎవరున్నారో తెలుసు
అడుగుదామంటే ఎలా అడగాలో తెలియలేదు.

ఆ క్షణమే అతడికి తన భవిష్యత్ అద్దం ముందు పెట్టినట్ట
మైంది. ఇక ఈ నిముషం నుంచీ తనిలాగే బ్రతకాలి. తన చు
మనుష్యుల్తోనూ, తోటి జీవాల్తోనూ, 'కమ్యూనికేషన్' ఏర్పర
అసాధ్యమైన పని!

ఈ స్థితిలో తనకి పిచ్చెక్కటానికి ఎంతసేపు పట్టద
గ్రహించాడు. చెవుల చుట్టూ నిశ్శబ్దం, నోటి చుట్టూ మౌనం, క
చీకటి కలిసి తనని అతి తొందరలోనే ఏ న్యూరోసిస్‌లోకో దిగ్ర
దింపుతుందని తెలుసుకున్నాడు. 'మూగ', 'చెవుడు' అయితే
ప్రపంచాన్ని చూడొచ్చు. గుడ్డి అయితే ప్రపంచాన్ని వినొచ్చు. ఈ
కలిస్తే.... దుర్భరం!

ఈ వ్యథాభరితమైన వాస్తవాన్ని జీర్ణించలేక పక్కమీ
దిగా కదిలేడు.

తడు కదలటం చూసి నర్సు దగ్గరకొచ్చి 'ఎలా వుంది' అని డి, వాలిక్కడ్చుకుని, అతడి చేతిమీద చెయ్యి వేసింది. అతడు కదిలి, వచ్చిన ఆ చెయ్యి పట్టుకుని- వదిలేస్తే ఈ కల కరిగి హ అన్నట్టు బిగించాడు. అతడి ఆర్తిని వేరే విధంగా అర్థం ఆ నర్సు చటుక్కున చేతిని విడిలించుకుంది.

దే సమయానికి ప్రవేశించాడు డాక్టర్ రవి!

* * * *

దాపు పదహారు గంటలపైగా ఒక చెత్తకుండీ పక్కన శవా పడివున్న అతడిని ఎవరో చూసి ఆస్పత్రిలో చేర్పించారు. వేర్వేరు విశిష్టులయిన ముగ్గురు డాక్టర్లు అతడిని మూడుచోట్ల ఆపరేట్ అదృష్టవశాత్తు కార్డు ఇంజురీ లేదు. డాక్టర్ రవి క్రింద జనరల్ వార్డ్‌లో వుంచబడ్డాడు.

నికి కొన్ని గంటలముందే నలుగురైదుగురు డాక్టర్ల మధ్య సమా జరిగింది. టెంప్రో-మెండిబ్యులర్ జాయింట్ విరిగిపోయిన సంగతి క్టర్ ధృవీకరించాడు. కళ్ళ సంగతి సరే సరి. అన్నిటికన్నా కరమైన విషయాన్ని వెల్లడి చేసినాడు ఆ సమావేశంలో వున్న ట్రిస్టు. రోగికి స్పృహరాగానే కలిగే షాక్‌నుంచి అతడిని 'వెంటనే' చేయకపోతే వచ్చే సైకలాజికల్ డిప్రెషన్ గురించి గట్టిగా హెచ్చ డు. ఆ బాధ్యత రవి తీసుకున్నాడు.

ఒక మామూలు పేషెంటు గురించి జనరల్ ఆస్పత్రి ఇంత శ్రద్ధ తీసుకోవటం జరగనిపని. కానీ ఈ కేసు విచిత్రంగా వుండ తో డాక్టర్లు సమావేశం కావల్సి వచ్చింది. ఈ అనుమాన పరిస్థితుల పోలీసులకి తెలియకపోవటం అదృష్టం. డాక్టర్ రవి ఈ కేసుని గా తన పర్యవేక్షణలోకి తీసుకున్నాడు. ఈ పేషెంటు పరిస్థితి రియాక్షన్స్‌మీదా ఒక మనో విశ్లేషణాత్మక రచన చేయవచ్చు న్నాడు. అతడికి తెలియనిదల్లా ఒకటే- తనకన్నా తన పేషెంటు వాడనీ, జీవితంమీద కమాండ్ వున్నవాడనీ....

అప్పటికే ఇద్దరిలోకి ముందు తేరుకున్నవాడు శేఖరం.

చేత్తో.... 'పెన్ను' అని సైగచేసేడు. రవి వద్దున్న
నర్సు కాగితమూ, కలమూ తీసుకొని యిచ్చింది. శేఖరం
వ్రాసేడు ఇలా—

[illegible]

—వ్రాసి కాగితాన్ని రవి ముందుకు తోసేడు. రవికి
కనులు లేకపోవటంచేత, వ్రాసిన లైనుమీదే పేపెంటు
వ్రాసేడు— అని గ్రహించాడు. అదేమిటో తెలుసుకో
ఒక్కొక్క అక్షరమూ వ్రాస్తూండగా చూడాలి. అతడు వ్ర
తనకి అర్థం కాలేదనీ; మళ్ళీ ఇంకోసారి వ్రాయమని అతనికి
కమ్యూనికేషన్ గాప్ అంటే ఇదే. శేఖరంవేపు అతడు జాలి
ఇక జీవితాంతం ఇతడు ఇలాగే బాధపడాలి.

డాక్టర్ మౌనాన్ని శేఖరం మరో విధంగా అర్థం చే
మళ్ళీ కాగితంమీద వ్రాసేడు.

[illegible]
నాకు ఏ విషయమూ వివరంగా చెప్పలేరా
[illegible]

అతడు కాగితంమీద వ్రాసింది రవికి అర్థంకాలేదు కానీ- వ్రాస్తూ న్నా ఒక్కో అక్షరమే వెనుక నిలబడి చదివాడు కాబట్టి తెలిసింది. అతను వ్రాసింది ఇది- "అన్నీ నేనే చెప్తాను. నేను చెప్పేది అబద్ధమైతే నా చేతిని ఒకసారి కొట్టండి మీ చేతితో. నేను వ్రాసింది నిజమైతే రెండు సార్లు కొట్టండి. మీరు నాకు ఏ విషయమూ వివరంగా చెప్పలేరు. కాబట్టి ప్రశ్నలు అడగటంద్వారా మీనుంచి సమాధానాలు వివరంగా ఒక్కొక్కటే తెలుసుకుంటాను. నేను చెపుతున్నది మీకు అర్థమవుతుందా?"

డాక్టరు అతడి చేతిమీద రెండుసార్లు తట్టాడు.

ఆ తరువాత శేఖరం తను అడిగిన మొట్టమొదటి ప్రశ్న తిరిగి వ్రాశాడు. "ప్రస్తుతం నే నెక్కడున్నాను? ఆస్పత్రిలోనేనా?"

డాక్టర్ అవునన్నట్టూ రెండుసార్లు తట్టాడు.

"ఎంతకాలం నుంచి? ఎన్ని రోజులయితే అన్నిసార్లు కొట్టండి"

...కొట్టాడు.

కొద్దిగా వంగి వ్రాయటంవల్ల వెన్నులో తిరిగి అమితమైన బాధ మొదలయింది. ఒక్కో అక్షరం వ్రాయటానికి చాలా శ్రమ తీసుకోవలసి వస్తుంది. అక్షరాలు మరింత అలుక్కుపోతున్నాయి. డాక్టర్ ఊపిరి పెనెపుర తగులుతూంది. అందే వాక్యం పూర్తయ్యేసరికి అది అలుక్కుపోతూ వుండన్నమాట. ఈ విధంగా ఎంతకాలం కొనసాగుతుంది? వేరే మార్గం ఆలోచించాలి. అతడు తిరిగి వ్రాయబోతూంటే వెన్నులో కలుక్కుమంది. సన్నగా బాధతో మూలిగాడు. ఇక ప్రశ్నలు చాలు అన్నట్టు డాక్టరు కాగితం తీసేసుకోబోయేడు.

"మూడే ప్రశ్నలు డాక్టర్ ఆఖరివి....ప్లీజ్"

డాక్టర్ కాగితం తిరిగి వదిలేసేడు.

"నాకు వెన్నెముక సరి అవుతుందా?"

'అవుతుంది' అన్నట్టు రెండుసార్లు తట్టాడు.

"నాకు శాశ్వతంగా అంధత్వం వచ్చినట్టేనా?"

డాక్టర్ మౌనంగా వుండిపోయాడు. శేఖరం కాగితంమీద 'ప్లీజ్ .... ప్లీజ్....' అని వ్రాసేడు.

వచ్చినట్టే.

ఆ వాస్తవాన్ని జీర్ణించుకోవటానికి శేఖరం కొంచెం సంగా వుండిపోయాడు. తరువాత ఒక నిర్ణయానికి వచ్చినట్ల ఆఖరిదీ అయిన వాక్యాన్ని వ్రాసేడు.

"నాకు బ్రెయిలీ లిపి నేర్పే మాస్టారు ఒక గంటల తెప్పించగలరా?"

డాక్టర్ రవి నమ్మలేని విస్మయంతో శేఖరంవేప మూర్తీభవించిన వ్యక్తిత్వం- పట్టుదలా అతడిలో కనబడ్డాయి. పరయినా పేషెంట్ అయితే ఏడ్చి, గోలగోలగా అల్లరిచేసి ఇంత ప్రాక్టికల్, మెటీరియలిస్టిక్ మనిషిని అతడు జీవితం మొదటిసారి చూడటం. ఎంత లోతుగా ఆలోచిస్తున్నాడు... బింతంగా ప్రవర్తిస్తున్నాడు.... అతడిమీద ఒక్కసారిగా గ గింది. బ్రెయిలీ గురించి అంత తొందరెందుకు? అని అడుగ కానీ ప్రపంచంలో ఆ పేషెంట్ ఏర్పర్చుకోవాలన్న కమూ గురించిన ఆతృత అర్థమైంది. ఈ లోపులో శేఖరం తిరిగి "చెప్పండి డాక్టర్! తెప్పించగలరా?"

'తెప్పించగలను' అన్నట్టూ డాక్టర్ అతడి భుజంమీద తట్టాడు.

ఆ తరువాత కాలం చాలా వేగంగా పరుగెత్తింది.

డాక్టర్ రవికి అదో మహత్తరమైన అనుభవం.... శేఖర నిస్తూ వుండటం!! డాక్టరుగా అతడు చాలామందిని చూసేడు. యితగా అంతకన్నా ఎక్కువమందిని పరిశీలించాడు. శే రాగానే- ఒక ప్రత్యేకమైన కొత్త తరహా పాత్ర రచనకి కున్నాడు. అతడి స్థితిని గమ్మత్తుగా- సానుభూతి పొందేలా వ్ర సనుకున్నాడు.

కానీ అతడి అంచనాలన్నీ ఇప్పుడు తారుమారయ్యాయి. సానుభూతికి చోటు ఇవ్వనేలేదు. ఒక సాధారణమైన వ్ర నెలలు పట్టే బ్రెయిలీ లిపిని శేఖరం చాలా కొద్దిగంటల్లో నేర్చు రెండ్రోజులు తిరిగే సరికల్లా బ్రెయిలీ నేర్పటానికి వచ్చిన మ చాలా మామూలుగా లోకాభిరామాయణం కొనసాగించాడు.

మరిరోజు సాయంత్రమే తన బ్యాంకు బాలెన్సు రావలసిన
బ్ చెక్కకట్టి తెప్పించుకున్నాడు. ఆ మరుసటిరోజు ప్రొద్దున్న
ఫంలానికి వచ్చిన శంకర్‌లాల్‌తో తన ఉద్యోగం విషయం
డు.

తను బ్రెయిలీలో వ్రాసిస్తే— దాన్ని ఇంగ్లీషులోకి తర్జుమాచేసి
య్యటానికి పార్టుటైమ్‌మీద ఒక అసిస్టెంటుని కుదుర్చుకున్నాడు.
స్టెంటు పేరు ప్రియ. చక్కని అమ్మాయి. వయసు కూడా ఎక్కు
గదు. పదిహేడో— పద్దెనిమిదో వుంటుంది. ఆ అమ్మాయి తండ్రి
క్రితం, విమాన ప్రమాదంలో చచ్చిపోయాడు. ఓడలు బండ్లు
వ. పన్నెండు సంవత్సరాల వయసులో కుటుంబ భారం మీద
టైపు. షార్టుహాండు నేర్చుకుని ఉద్యోగంలో ప్రవేశించింది. ఆ
యిలో ప్రత్యేకత ఏమిటంటే- మొహంమీద చక్కటి చిరునవ్వు
గా చెదరకుండా వుండటం! ఆమెని చూసిన వారెవరూ అంత
వయసులో ఒక కుటుంబం మొత్తాన్నీ పోషిస్తూ వుందని అనుకోరు.

క పార్టుటైం ఉద్యోగం వుందని చెప్పగానే వేణ్నీళ్ళకు చన్నీళ్లు
వుతాయి కదా అని ఒప్పుకుంది. ఉద్యోగం వివరాలు తెలిసాక ఆశ్చర్య
ది. మొదట్లో కాస్త కష్టంగా వుండేది. అతడు వ్రాసిన రికెనర్
ట్కో అక్షరమే ఇంగ్లీషులోకి తర్జుమా చేసుకుని టైపు చెయ్య
కాని తొందరలోనే అలవాటయిపోయింది.

అంధులు మిగతా ప్రపంచంతో ఏర్పర్చుకునే కమ
'బ్రెయిలీ' అంటారు. ఒక కాగితంమీద గుండుసూదితో
చిన్న రంధ్రం ఏర్పడుతుంది. అలాటి చుక్కల్ని చూ
న్పృశిస్తే ఎన్ని చుక్కలు వున్నదీ, ఏ పొజిషన్‌లో వున్నదీ
మొత్తం ఆరుచుక్కలు.



ఈ ఆరు చుక్కల్లోనూ ఇంగ్లీష్ భాషలోని ఇరవై ఆరు
వ్రాయొచ్చు.

A B C D E F G H I

J K L M N O P Q R

S T U V W X Y Z

కాగితం మీద సూదితో గుచ్చుకుంటూ వెళ్ళిన చుక్కల్ని
కుంటూ చదవటం ఊహించటానికి కష్టంగా వుంటుంది. కానీ
యితే మనం చదివినంత వేగంగా వాళ్ళూ చదువుతారు. బ్రెయి
చందమామ లాంటి పుస్తకం నుంచి సైన్సు పుస్తకాలదాకా
మన టైప్ మిషన్లలాగే, బ్రెయిలీలో కూడా టైపు వుంది.
పొడుచుకుంటూ సాగిపోతుంది.

ఆపరేషన్ జరిగిన నాలుగు గంటలకి అతడు లేచి కూర్చొ అదృష్టవశాత్తు నాలిక తెగినచోట ఇన్ఫెక్షన్ రాలేదు.

పరీక్షించిన డాక్టరు, అతడికి దృష్టి రావటం అసాధ్యం మాట ఎలాగూరాదు.... పోతే చెవుల విషయమే డాక్టర్ ఆశాభావం వ్యక్తం చేశాడు. ఒకటి రెండు సంవత్సరాలు పోయాక ఆపరేషన్ చేస్తే అవి పనిచేసే వీలున్నదని అతడు అభిప్రాయ కానీ శరీరం ఈ క్రొత్త జీవితానికి అప్పటికే అలవాటు పోయాడు. ఒక రకంగా ఈ జీవితమే బావుంది కూడా. ప్రపంచపు సంకీర్ణ వంటి దేవంజాతి వ్యక్తుల మాటల్నుంచీ దూరంగా వుండొచ్చు. వినక్కరలేదు. చూడక్కరలేదు. మాట్లాడనవసరంలేదు.

కొంచెం ఓపిక రాగానే అతడు డబ్ల్యు. బి. ఓ. (వరల్డ్ బ్లయిండ్ ఆర్గనైజేషన్)తో ఉత్తర ప్రత్యుత్తరాలు మొదలుపెట్టాడు. మొదటి ఇంకా జవాబు రాలేదు. కానీ వస్తుందని నమ్మకంగా వున్నాడు.

అతడు చేసిన మరో పని ఏమిటంటే.... తన ఆక్సిడెంటు సంగతి తెలియనివ్వక పోవటం!

సానుభూతి అతడికిష్టంలేదు.

మామూలు మనుష్యులతో సమాన స్థాయికి వచ్చేక అతడు తన లోకానికి వెల్లడించటానికి ఇష్టపడ్డాడు. ఆ స్థితికి చేరుకున్నాక మొదటి పనిగా శంకర్‌లాల్‌కి కబురు పంపాడు. లాల్ వచ్చాక నిముషాల్లో ఆఫీసుతో ఋణం తీరిపోయింది. శంకర్‌లాల్ చూసించి వెళ్ళిపోయాక రెండో పని మొదలుపెట్టాడు. కలవదల్చుకున్న రెండో వ్యక్తి భార్గవ. భార్గవకి కనుక్కున్న తెలియపర్చటం అతడు అనుకున్న "రెండోపని".

ఆ తర్వాత "మూడోపని!" అదే అతడు జీవితంలో చేయదల్చు అతి ముఖ్యమైనదే!! ఆ ఒక్కటీ మిగిలిపోతుంది. అయితే అది టానికి కొంచెం టైమ్ కావాలి.

* * * *

చుట్టూ పరిసరాలన్నీ నిశ్శబ్దంగా వున్నాయి.

గదిలో ఒక మూల స్టాండులో వున్న కుందేలు పిల్ల
కుండా చూస్తోంది.

బయట ఎక్కడా అలికిడి లేదు.

భార్గవ గదంతా కలియజూసేడు. ఎన్నో సంవత్స
రహస్యాన్ని విచ్ఛిన్నం చేయటానికి తనతోపాటూ తో
కరాల్ని— తన ఓటమి వెక్కిరిస్తున్నట్టూ పిడోళ్ళు అరిగా
కళ్ళు మూసుకున్నాడు.

కానీ అంతలో బయట దూరంగా అడుగుల చప్పుడు
ఎవరో వస్తున్న ధ్వని. సిరెంజి గుచ్చేసుకోవచ్చు. కా
గురించి- అది ఫెయిలయితే దాని ప్రయత్నం గురించి- అం
బయటకి తెలియటం యిష్టంలేకపోయింది.

చప్పున ఇంజెక్షన్ని డ్రాయర్ సొరుగులోకి తోసేసేడు
జేబులో పెట్టుకున్నాడు. చెదిరిన క్రాఫ్ సర్దుకుని మామూ
రవుతూ వుండే బయట తలుపు కొట్టిన ధ్వని వినిపించింది.
ఈ సమయంలో వచ్చిన వాళ్ళెవరూ అని ఆశ్చర్యపడ్డాడు.
విఫలమై ఆలస్యం అయినందుకు చిరుకోపం, కొత్త విసుగూ
వెళ్ళి తలుపు తీశాడు.

బయట ఓ పద్దెనిమిదేళ్ళ అమ్మాయి నిలబడి వుంది
మొహంలో అలసట కనపడుతూంది. ముంగురులు చెమట
అతుక్కుపోయి వున్నాయి. ముఖంమీద మాత్రం చక్కటి
వుంది. ఆ నవ్వులో ఒక అమాయకమైన ఆహ్లాదకత్వం వుంది.

"మీరేనా భార్గవ! అబ్బ చచ్చానుబాబూ మీ గది కను
అంది చనువుగా.

ఆమెని చూడగానే అతడికి తన కూతురు ప్రార్థన గు
అదే నవ్వు. పెద్దయితే ఇలాగే వుండేదేమో.

"ఎవరు నువ్వు" అని అడిగాడు.

"నేను.... ఐ మీన్.... నా పేరు ప్రియ. శేఖరంగారి అ
అంది.

అతడికి అర్థంకాలేదు. "శేఖరం అసిస్టెంటా?"

ఆమె వచ్చి "మీకో కవరు ఇమ్మని పంపారు" అంటూ అందిం చ్చి గులాబీ పువ్వు ముద్రించిన నీలంరంగు కవరు. అతడు ముగానే దాన్ని అందుకున్నాడు. చించి, లోపల్నుంచి రోజ్ క్తరాన్ని బయటకి తీసేడు. అయితే అతను అనుకున్నట్టు ఉత్తరమేమీ లేదు. కొన్ని చుక్కలు మాత్రం వున్నాయి.



అతడికి అర్థంకాలేదు. "ఏమిటిది?" అని అడిగాడు.

"బ్రెయిలీ" అంది.

అతడికి బ్రెయిలీ అంటే తెలుసు. కానీ శేఖరం ఇలా ఎందుకు లో తెలియలేదు. కొత్తగా వచ్చిన ఈ సెక్రటరీ ఎవరో కూడా లేదు.

"ఈ అక్షరాల అర్థం ఏమిటి?"

ఆమె అతడి దగ్గర్నుంచి కాగితాన్ని అందుకుని చూసి, "ఐ ఫౌండ్ అంటూ అక్షరాల్ని చదివింది.

భార్గవకి వెంటనే నాల్గురోజుల క్రితం తమ మధ్య జరిగిన సంభా గుర్తొచ్చింది. శేఖరం చంపాలాల్ యింటికి రహస్యంగా వెళ్ళిన తాను కలుసుకోలేదన్న విషయం కూడా జ్ఞాపకం వచ్చింది. త్తరం ఎవరిచేతిలోనైనా పడితే ప్రమాదమని యిలా వ్రాసేడా న్నాడు. అదే అడిగాడు.

"ఊహూ, కాదు. ఆయన కళ్ళకి దెబ్బ తగిలింది. అందుకే బ్రెయిలీ న్నారు."

భార్గవ అదిరిపడి, "కళ్ళకి దెబ్బ తగిలిందా" అన్నాడు.

"అవును. తాత్కాలికంగా అంధత్వం వచ్చింది."

"గాడ్... అతడు ఎక్కడ.... ఎక్కడ వున్నాడు?"

"ఆస్పత్రిలో.... కానీ ఒకటి రెండు రోజుల్లో వచ్చేస్తారు."

అతడు ఆమె మాటలు వినిపించుకోలేదు. మెదడు నిండా పోరు లోచనలు. శేఖరం గుడ్డివాడయ్యాడంటే అతడు నమ్మలేకపోతు అసలా వూహే భయంకరంగా వుంది. మొన్న మొన్నటివరకూ

నవ్వుతూ హాయిగా ఆడుతూ పాడుతూ తిరిగిన ఆ యువకు
గోడల్నీ, తలుపుల్నీ తడుముకుంటూ తిరగడం అనే దృశ్యాన్ని
కుంటూంటేనే పళ్ళు గగుర్పొడుస్తూంది.

"అసలు ఎలా.... ఎలా.... జరిగింది యిది" అడి
గాడు.

"చిన్న ఆక్సిడెంట్ జరిగింది, మీరేమీ కంగారు పడ
డాయన బాగానే వున్నారు."

"వెంటనే నాకు ఎందుకు చెప్పలేదు?"

"ఎవరూ! ఆయనా?"

"అవును తనే."

"తను ఫోనులో చెప్పలేదు భార్గవగారూ!"

"ఎవరితోనైనా చెప్పించవచ్చుగా"

"అదీ చేయలేదు. ఆయన నాలిక తెగిపోయింది.
కష్టం."

భార్గవ గొంతులో ఏదో అడ్డుపడ్డట్టయింది. "ఏమి
అరవబోయాడు. మాట రాలేదు. కళ్ళప్పగించి ఆ అమ
శిలలా చూస్తూ వుండిపోయాడు. ఆ అమ్మాయి అతడిని మా
ఈ షాక్‌ని తట్టుకోవటానికి అతడికి కొంత సమయం
తెలుసు. ఆమె అంచనా నిజమయింది. అతడు తేరుకుని
అన్నాడు కదులుతూ.

పది నిముషాలు అయ్యేసరికి యిద్దరూ ఆస్పత్రిలో
శేఖరం గదిలోకి ప్రవేశిస్తూనే భార్గవ అతడి ఆకారాన్నీ,
కట్టును చూస్తూ "మైగాడ్ ఇది....ఇదంతా ఎలా జరిగింది?"
కంగారుగా.

వెనుకనుంచి ప్రియ నెమ్మదిగా "మీరు మాట్లాడేది
పించదు భార్గవగారూ! చెవి ఎముకలు విరిగిపోయాయి" అంది

అన్ని విషయాలూ ఒక్కసారే కాకుండా, ఒక్కొ
మని వెళ్ళబోయేముందు శేఖరం ఆమెని హెచ్చరించాడు.
యుతమయిన ఉద్యోగిగా యజమాని సూచనని అక్షరా
జరిపిందామె.

# 9

మొత్తం జీవరాసు లన్నిటిలోకీ అత్యంత అసమర్థమైన, బలహీన నది "మనిషి". అతడి ఆకారంతో సమానమైన ఆకారం వున్న జంతువులతో పోల్చుకుంటే బలంలో వాటి సమానవుజ్జీ కాదు. తన న్న జంతువైన లేడితోగానీ, పెద్ద జంతువైన జీబ్రాతోకానీ గా పరుగెత్తలేదు. గబ్బిలంలా శబ్దగ్రహణం చేయలేదు. గద్దలాగా నుంచి చూడలేదు. కప్పలాగా ఉభయచరంకాదు. పురుగులకుండే శక్తి లేదు. చీమలా దూరంనుంచి వాసన పసిగట్టగలిగే నేర్పులేదు. అంతెందుకు? ఎముకల పొందిక కూడా సరిగ్గా లేనిది ఒక్క డే. అందుకే రెండు కాళ్ళమీద నిలబడి ఎక్కువసేపు పనిచేస్తే నొప్పి వచ్చేది కేవలం మనిషికే. తన శత్రువుల్ని చంపటంలో న్న ప్రజ్ఞ కూడా కనీసం మనిషికి లేదు. ప్రోటోజోవా నుంచి జీబ్రా వరకూ ఏ ప్రాణితో పోల్చుకున్నా మనిషి అధముడే. అయినా ఈ జలచర ప్రపంచాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకుని ఏలుతున్నా కి కారణం అతడి మెదడు. ఒక జంతువుకి వేగం, ఒక ప్రాణికి , ఒక పక్షికి రెక్కలు, ఒక చేపకి మొప్పలు ఇచ్చిన దేవుడు, కి అతడి వంతుగా "మెదడు"ని ఇచ్చాడు. అదే చాలని నిరూపిం చాడు. ఐజాక్ అసిమోవ్ ఇచ్చిన ఈ సిద్ధాంతం నా మీద గొప్ప వాన్ని చూపించింది.

మనిషికి కావల్సిన మూడు ఇంద్రియాల్ని నేను కోల్పోయానని న క్షణం నా ఆలోచన ఆత్మహత్యవైపు వెళ్ళింది. కానీ గా ఒక్కక్షణం ఆలోచిస్తే దానంత వెధవ ఆలోచన మరొకటి దని అనిపించింది. తన మానసిక బలహీనతల్ని అధిగమించలేని మాత్రమే ఆత్మహత్యల అవసరం కలుగుతూ వుంటుంది. అన్నీ నా నాకు మెదడుంది. చాలు అనుకున్నాను. ఎప్పుడో జరిగిన న గుర్తువచ్చింది. అప్పుడే కాలేజీ చదువు పూర్తిచేసి పై చదువుల్లో పెట్టాను.

కాలేజీలో నాతోపాటూ ఒకతను చదివేవాడు. పెద్ద తెలివైనవాడు కాడు. బొటాబొటి మార్కులతో పాసయ్యేవాడు. మనిషే అదోలా

పోయినా అప్పుడే కపాడియా కేన్సర్ ఇన్‌స్టిట్యూట్‌ని ఇప్పుడొస్తున్న నష్టాలనుంచి రక్షించే మార్గాన్ని ఒక అకౌంటెంట్‌గా కనుక్కున్నాన తెలుసా?"

"ఏం కనుక్కున్నావు?"

"మొన్నరాత్రి నిద్రపట్టక సెక్సు పుస్తకం చదివినట్టూ సామ్ కంపెనీ బ్యాలెన్సు షీటు బోర్లాపడుకుని చదవసాగాను. మనం పేటెం ఇచ్చిన కాన్స్-క్యూర్ మందుని వాళ్ళు ఎంతకు అమ్ముతున్నారో తెలు గురూగురూ- మిల్లీగ్రాము రెండొందలకి.... భారతదేశంలోకెల్లా అ ఖరీదైన మందు."

"అవును. ఖరీదైన వ్యాధికి ఖరీదైన మందు"

"మిల్లీగ్రాము రెండొందలు ఖరీదుచేసే ఈ మందులో వాడ ముఖ్యమైన పదార్థం నల్ఫా-2. దీని ఖరీదు నూట అరవై రూపాయ మీరు మొన్న సంభాషణలో ఒక మాట వాడారు.... మెరాప్టోప్యూరిన్ మెథొట్రెక్సేట్ గాని తొందర తొందరగా విడిపోయే రక్తకణాల వేగా అవుతాయని.... అదే యీ నల్ఫా-2 నా? దీనికి బదులు ఇంకో చ అయిన పదార్థాన్ని వాడలేమా? ఇది కనుక్కున్నాం అనుకోండి. కాన్ క్యూర్ ధర రెండొందల్నుంచీ రెండ్రూపాయలకి పడిపోతుంది. నో బహూమతి మనకే వస్తుంది. ఏ నిష్పత్తిలో పంచుకునేది తరువాత ఆ చిద్దాం. నాకు మాత్రం ఈ ఆలోచన వచ్చిన దగ్గర్నుంచీ మరి ని పట్టటంలేదు. ఏ హేమమాలినినో ఊహించుకుంటూ గడపాల్సిన చలిరాత్రి...."

భార్గవ మాట్లాడలేదు. ఆ యువకుడినే కన్నార్పకుండా చూ న్నాడు.

"ఏమిటి గురూగురూ— ఆలోచిస్తున్నారు?"

"ఇంత విషయ పరిజ్ఞానం వున్నవాడివి ఎప్పుడూ అమ్మాయి గురించి మాట్లాడవేం?" అన్నాడు భార్గవ నవ్వుతూ.

" 'శరీరం అనే రెఫ్రిజిరేటర్‌లో మెదడు అనే భాగం వేడెక్క కుండా కాపాడే కంప్రెషరు స్త్రీ తాలూకు ఆలోచన' అన్నాడు ఆచా రజనీష్. మగువా- మద్యమూ- మాంసమూ ఈ మూడు—దైదిబై మాం

వుండేవాడు. రోజుల తరబడి గడ్డం పెంచేవాడు. మునిగిపో సానుభూతి చూపేవాడిలా ఈ ప్రపంచాన్నీ, మనుషుల్నీ "నేనో బ్రద్దలవబోయే అగ్నిపర్వతాన్ని...." లాటి అ వాక్యాల్ని పుస్తకాల్నిండా వ్రాసుకునేవాడు. చదువు పూర్తయ్యా మూడు సంవత్సరాల వరకూ అతడికి ఉద్యోగం రాలేదు. ఉద్యోగం రాకపోవటానికి కారణం కంప్యూచియా అనీ, తన కాకపోవటానికి కారణం రష్యా సామ్రాజ్యవాదం అనీ నమ్మేవా లాటి ఎందరో నిర్భాగ్యుల జీవితాలు మారాలంటే మొత్తం వ్య అనీ, అసలు లొసుగు అంతా ఈ వ్యవస్థలోనే వుంది అనీ 'అంతంత పెద్ద పెద్ద పదాలెందుకు. నీ వరకూ నీ పేదైనా మేలు చేయరాదా' అనేవాడిని. 'ఏం చెయ్యను' అని అడిగాడు. అ ఆ మాత్రం ఆసక్తి చూపించాడు కదా అని సంతోషించి ఇచ్చాను.

మన వూరు మెయిన్‌రోడ్డు మధ్యలో ఓ సమాధి వుం వందల సంవత్సరాల క్రితం ఎవడో అనామకుడయిన సన్యాసి మత సంబంధమైన గొడవ లొస్తాయని రోడ్డు మధ్యలో దాని వదిలేసింది ప్రభుత్వం. అక్కడికొచ్చేసరికి రోడ్డు ఇరుకై ప్రతి వా వేగం తగ్గించాలి. అలా తగ్గించి తిరిగి వేగం పెంచటానికయ్యే ఖర్చు లీటర్‌లో వందో వంతు— అంటే ఆరు పైసలు అ కుందాం. మెయిన్‌రోడ్డు మీద సగటున రోజుకి అయిదువేల వా వెళతాయి— అనుకుంటే, మన నేషనల్ ఇన్‌కమ్ సంవత్సరానికి లక్ష పదివేలు ఆ రూపేణా వృథా అవుతుందన్నమాట.

ఏ ప్రాముఖ్యతాలేని ఒక సమాధి గురించి ఇంత వేస్ట్ రాత్రికి వెళ్ళి ఆ సమాధిని అక్కణ్నుంచి తవ్వెయ్యకూడదూ బడితే ప్రాణాలు పోతాయి. కానీ దేశం కోసం ఆ మాత్రం చెయ్యటంలో తప్పులేదుగా.... అన్నాను. అతడు వెంటనే జవా లేదు. గాఢంగా ఆలోచించి, 'అసలు వాహనాలే బూర్జువా వ్య ర్శనాలు. అవి ఎవరికీ వుండకూడదు' అన్నాడు. నా తల తిరి తిరిగి అతనే 'అయినా మా ఆశయం చాలా పెద్దది. దాని బ్రద్దలు కొట్టటాలూ అవీ చిన్న విషయాలు' అన్నాడు. సరే ఆ

ను. ఈ వ్యవస్థని పూర్తిగా మార్చటం కోసం నువ్వేం చేస్తున్నావ్ అని టాను. నన్నో పురుగును చూసినట్టూ చూశాడు. 'నేను పేలి, ఆ ప్రేలనం లోంచి లక్ష నేనులు ఉద్భవిస్తాను' అన్నాడు. నిశ్చయంగా ఇద్దరిలో ఒకరికి మతిపోయి వుంటుందనుకున్నాను. 'చూడు మిత్రమా! వివాదాలు. శ్రమ శక్తిని నమ్మేవాడిని కాబట్టి ఏదయినా పని కోకూడదూ' అన్నాను.

నా అమాయకత్వాన్ని చూసి జాలిగా నవ్వి, 'నా ఆర్తగీతం అడ లో ఏ గడ్డి పువ్వునో స్పృశించి దాన్నో ఎర్రమందారం చేస్తుంది' న్నాడు కీమాగా. లేచి నిలబడ్డాను. విసుగేసింది. "నీకన్నా సిద్ధాంతం న నేనే శాస్త్ర చదువుకున్నాను అన్న విషయం నాకు తెలుసు. అది నా నువ్వు నమ్మవ్. వ్యక్తిగత ఆస్తి, వారసత్వపు హక్కు పోతా టి దాన్ని మనస్ఫూర్తిగా ఆహ్వానించేవారిలో నే నొకడిని. నువ్వు గే నవ సమాజం నిజంగా వస్తే, అందులో కూడా నేను మొదటి వరుస లో వుంటాను. కష్టపడటం నా కెప్పుడూ అలవాటే! కానీ నీ సంగతి రాకే. నీ చేతకాని తనానికీ బద్ధకానికీ తప్పంతా వ్యవస్థమీద తోసేసి వాదం ముసుగు వేసుకుంటున్నావు! మొత్తం వ్యవస్థే మారాలి అన్నది శయం అయితే అవ్వొచ్చు. కానీ దానికి నువ్వేం చేస్తున్నావో లోచించు."

సిద్ధాంతం పట్ల నీకింత నమ్మకం వుంటే జనంలోకి వెళ్ళి దోపిడీ జరుగుతుందో వివరించు! అంతేకానీ 'పని' చెయ్యటం మానేసి లో అగ్నిపర్వతం వుంది. నా నెత్తిమీద సూర్యుడున్నాడు. వగైరా నా. హెలూసినేషన్స్‌లో పడి కొట్టుకుపోకు. చీకటికన్నా చిరుదీపం నిది మేలే అన్నావుగా. మరి నీ చేతనయినంతలో దారికడ్డంగా న్న నమూనిని తవ్వొచ్చుగా! తప్పవు. కారణం పనిచెయ్యటం కంటే, న్న తీసుకోవటం కంటే, వ్యవస్థ మారాలనే భ్రాంతిలో వుండటం సుఖం కాబట్టి! నీ నినాదాలకి ఎవరో ఎక్కడో మారి ఓ సీతారామరాజో, సింగో పుడతాడనుకుంటున్నావ్ కదూ.

"నేను చెప్తాను విను! ఏ మాత్రం లాజిక్ వున్న వాడయినా విన్న నే నవ్వుకుంటాడు. జాలిపడ్తాడు. ఒక గడ్డిపువ్వు ఎర్రమందారంగా మారుతున్నా కూడా, నీలాంటివాళ్ళని చూసి మనసు మార్చు

కుంటుంది" అన్నాను. అతడో క్షణం విస్తుబోయాడు. వెంటనే
ముఖం కందగడ్డలా మారింది. విసురుగా లేచి నిలబడ్డాడు. "నీ
అయిదు వేళ్ళు వెళుతున్నాయి కాబట్టి, నీకు చదువు, డబ్బు
కాబట్టి ఈజీఛైర్లో కూర్చుని ఎన్ని కబుర్లు అయినా చెపుతావు. నీ
ఎన్ని మాటలతోనయినా సమర్థించుకుంటావు. మాలాగా నిస్సహా
వుంటే నీకూ తెలిసొస్తుంది." అనేసి విసురుగా వెళ్ళిపోయాడు.

ఇదిగో ఈ మాటకోసమే ఇదంతా చెప్పవలసి వచ్చింది.
ప్పుడు ఎక్కడున్నాడో కూడా తెలీదు. ఈ మాట అన్న సంగ
అతడు మర్చిపోయి వుండవచ్చు. కానీ అతడన్న ఈ చివరి మా
కాలం నన్ను వెంటాడుతూ వచ్చింది. ఇంతకాలం నాలో నే
విమర్శ చేసుకుంటూ వచ్చాను. నా జీవితం హాయిగా సాగి
కాబట్టి నేనింత ధీమాగా ఈ విషయాల గురించి సిద్ధాంతీకర
గల్గుతున్నానా? అతడన్న మాట నిజమేనా? నా వెనుక ఇవేవీ
నేనూ సినిక్‌వి అవుతానా? ఇలా మధనపడుతూ వచ్చాను.
ముహూర్తాన ఈ మాట అన్నాడోగానీ అది నా మనసు
సాగింది.

ఒక రాత్రికి రాత్రి ఏదయినా విపరీతం జరిగి ఒక్కసారి
వీధిన పడితే?....పరువుపోతే....ఉద్యోగంపోతే.... ఇలా సాగేవి
చన్లు. విధి నా ఆలోచన్లు పసిగట్టింది కాబోలు, చాలా సరదాగా
కసి తీర్చుకుంది. నాకు కలిగిన మొట్టమొదటి ఆలోచన– ఆత్మ
కానీ ఆలోచిస్తే నాకే నవ్వొచ్చింది. నా సిద్ధాంతీకరణ, నా వాద
వచ్చాయి.... ఎండిన బీడులోంచి చిన్న మొక్క మొలకెత్తినట్టు,
అంధకార బంధురమైన జీవితంలోంచి ఒక కొత్త మలుపుని
నిర్మించుకోవాలనుకున్నాను. నేను అనుకున్నట్టే శంకర్‌లాల్

గుడ్డి, చెవిటి, మూగా చీఫ్ అకౌంటెంట్ తనకి అక్క
అతడు అనకముందే రాజీనామా ఇచ్చేసేను. మనిషి బ్రతు
కమ్యూనికేషన్ ముఖ్యమని, బ్రెయిలీ నేర్చుకున్నాను. చిన్నకి
ఆర్నెల్లు పట్టే లిపి, నాలాంటి అర్థాంతరపు అంధులకి ఒక్క
ఎందుకు రాదో అని ప్రయోగం చేసేను. అది నేర్చుకోగానే

! ఉత్తరం వ్రాసేను. ఇప్పటివరకూ అంధులకి మామూలు చదువూ, సమూ ఇవే వున్నాయి. అకౌంటింగ్ లేదు. అది నేర్పితే చిన్న ల్లు వాళ్ళుకూడా చేసుకోవచ్చు కదా అనే సూచించాను. డెబిట్లూ కూడా ఒక క్రొత్త పద్ధతిలో బ్రెయిలీలో వ్రాయవచ్చని నాకో చన వచ్చింది. అది వివరించాను.

డబ్ల్యు. బి. ఓ. నా సూచనని అంగీకరిస్తే ఇంకా నా పరిశోధన సాగిస్తాను. వాళ్ళు వప్పుకోకపోతే, ఇదిగో ఈ వూళ్ళోనే బ్లయిండ్ రీకి టీచరుగా అప్లయి చేశాను. బాగా చదువుకున్నాను కాబట్టి, కాబట్టి నాకు ఉద్యోగం వచ్చే ఛాన్సులున్నాయి. ఈ ఉద్యోగం రాకపోతే ఇదిగో నా అసిస్టెంటు— ఈ అమ్మాయి ద్వారా ఓ స్తకం వ్రాయిస్తాను. 'నిశ్శబ్దపు చీకటిలో మౌనంగా నా భావాలు– THE DUMB IDEAS OF MINE IN SILENCE AND DARKNESS' అన్న పుస్తకాన్ని బ్రెయిలీలో వ్రాసి, ఇంగ్లీషులో ప్రహ చేయిస్తాను. నా రచన అంత బావుండకపోవచ్చు. కానీ ప్రపంచపు మొదటి మూగ-చెవిటి-గుడ్డి రచయితగా నాకు పేరు వస్తుంది. కాని. ఒకవేళ ఇదికూడా ఫెయిలయితే అప్పుడు మరో మార్గం ఆలో స్తాను.... ఇవీ ఈ కొద్దిరోజుల్లో నేను ఎన్నుకున్న జీవితపంథాలో వచ్చిన కొత్త మార్గాల ఆలోచన్లు. ఇంతకీ నేను చెప్పొచ్చేదేమి టే. ఓటమి వప్పుకోవటం చాలా సులభం, పోరాటం కష్టం. నేను పోరాట్నే ఎన్నుకున్నాను."

చదవటం పూర్తిచేసి భార్గవ అలాగే అచేతనంగా వుండిపోయాడు. మంతా అదోలా అయిపోయింది. ఏదో దీప్తి. నల్లటి ఆకాశంలో చిన్న చుక్కగా ప్రారంభమయి, దగ్గరకొచ్చేకొద్దీ అఖండజ్యోతిగా మారుతుంది. స్త్రి శేఖరంవైపు చూశాడు. అతడి ముఖం నిర్మలంగా చిన్నపాపలా ది. కానీ అందులో ఒక ధీమా వుంది! వెళ్ళిపోయిన తుఫాన్ని ఒక్కటుని ఎదుర్కొన్న ప్రశాంతత వుంది!! అమ్మాయిల్ని అల్లరి చిరునవ్వు స్థానే పెదవుల వెనుక బిగిసిన పట్టుదల వుంది.

భార్గవ లేచి నిలబడ్డాడు.

ప్రియ అతడివైపు చూసి, "మీరేదైనా చెప్పదల్చుకుంటే చెప్పండి, అనువదిస్తాను" అంది.

"నేనే స్వయంగా వ్రాస్తాను. నాకోసారి ఆ 'లిపి' చూ
అని అడిగాడు. ఆమె ఆశ్చర్యపోయినా, దాన్ని ప్రకటించకుండా
చింది. శేఖరంలాంటి ఛార్టెర్డ్ అకౌంటెంట్ కి అది నేర్చుకోవటాని
గంటలు పడితే, భార్గవలాంటి సైంటిస్టుకి ఆరునిముషాలు పట్టిం
సారి 26 అక్షరాల వంకా కాసేపు చూసి మనసులోనే వాటిని
కున్నాడు. తరువాత బ్రెయిలీ– స్కేలు తీసుకుని అక్షరాలు
(గుచ్చేడు)

"మిత్రమా! దేముడనే రచయిత నా సీరియస్ జీవితంలోకి
పాడుతూ తిరిగే నీ పాత్రని ఎందుకు తీసుకొచ్చాడా అని
ఆలోచిస్తూ వచ్చాను, ఇప్పుడు నాకు బోధపడింది. శలవ మళ్ళీ
కలుస్తాను. రేపు నాకో ముఖ్యమయిన పని వుంది."

అతడు వ్రాసిన అక్షరాల్ని తడిమిచూసి గ్రహించి,
నవ్వాడు. "రేపు నాకూ ఒక ముఖ్యమయిన పని వుంది" అని వ్రా

"ఏమిటి?"

"బాల్కనీగోడ పట్టుకుని వేలాడుతూ పంచె తాపీగా దిద
ఆనందించాడో పెద్దమనిషి. మనిషిగా పుట్టాక దెబ్బకి దెబ్బ
కదా."

"అవును, దెబ్బతీయాలి. నన్ను అణగదొక్కిన వాటి
ప్రజల అజ్ఞానం మీద మనిషిగా పుట్టినందుకు నేనూ పగ తీర్చు
అనుకున్నాడు భార్గవ.

అతని చేతిని తన చేతిలోకి తీసుకుని "వెళ్ళొస్తాను"
స్పృశించాడు.

"మంచిది" తలూపాడు శేఖరం. "నేను కనుక్కున్న
మీకు ఎల్లుండి చెపుతాను."

"అక్కర్లేదు. ఇక దాని అవసరం నాకు లేదు" అ
భార్గవ బయటకొచ్చేసేడు. విశాలమైన వరండా నడుస్తూ వుంటే
ఏదో అడ్డుకున్నట్టు అయింది. తీసి చూసేడు, సైనేడ్ సీసా.

దాన్ని తుప్పల్లోకి విసిరేసేడు.

అతడిప్పుడు భార్గవలా లేడు. "భార్గవుడి"లా వున్నాడు.

# నాలుగు

ఆ గది గోడలు నల్లగా మసి పట్టినట్టున్నాయి. ఎక్కడా మనుష అలికిడి లేదు. గదిలో పెద్దగా వస్తువులు కూడా ఏమీలేవు. ఒక మూల రెండు పెట్టెలు, చిన్న కూజా, మరో మూల ఒక బల్ల, దాని కిరుప్రక్కలా రెండు కుర్చీలూ ఉన్నాయి. చెరో కుర్చీలోనూ కూర్చొని వున్నారు... భార్గవ, జనార్ధన్ పాత్రో.

పాత్రో భార్గవకంటే దృఢంగా బలంగా వున్నాడు. అడవుల్లో తిరుగుతూ ఉండటంవల్ల అతడి శరీరం నల్లగా మొద్దు బారింది. పాత్రో భార్గవా ఒకే కాలేజీలో కలిసి చదువుకున్నారు. ఇద్దరూ బ్రిలియంట్స్. తరువాత దార్లు వేరయ్యాయి.

భార్గవ చెప్పినదంతా పాత్రో శ్రద్ధగా విన్నాడు. మొదట్లో ఆశ్చర్యం, క్రమక్రమంగా అతడి ముఖంలో భావాలు మారినయ్. భార్గవ చెప్పటం పూర్తికాగానే ఓ అయిదు నిముషాలు మౌనంగా వుండి- "మంచిదే. ఇన్‌స్టిట్యూట్‌ని ఎవరో పేల్చేసేరనగానే మొట్టమొదటి అనుమానం నీ మీదకే వస్తుంది" అన్నాడు.

"రైట్" అన్నాడు భార్గవ. "రాజకీయాల్తో కుళ్ళిపోయిన, స్వార్థంతో పుచ్చిపోయిన ఈ ఇన్‌స్టిట్యూట్‌ని బద్దలు కొట్టేస్తే ఆ తరువాత నేమైనా ఫర్లేదు. నన్ను కాదనకు."

"కాదనడమా? మంచి ఆశయాన్ని.... కేవలం పేపర్‌లో పేరు చూసుకోవటం కోసం నమ్మినట్టు నటించే చాలామందికన్నా నీలాంటి ప్రాక్టికల్ మనిషి మాకెంతో సాయం చేసినవాడౌతాడు" అంటూ లేచి "ఒక్క నిముషం కూర్చో" అని బయటకి వెళ్ళి నాలుగు నిమిషాల్లో తిరిగి వచ్చాడు. భార్గవ అతడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఇంకో అరగంటలో వస్తాయి. మొత్తం ఆరు చాలుగా"

"చాలు" అన్నాడు భార్గవ. "ఓ గంట తర్వాత రమ్మంటావా?"

"వద్దు. నువ్వు బయటకి లోపలికి తిరగటం ఎవరికయినా అనుమానం కలిగినా కష్టం."

ఆ మాటలకి భార్గవ స్థిమితంగా కూర్చుంటూ- "నిన్ను
టానికి చాలా కష్టపడవలసి వచ్చింది. ఎక్కడుంటావో తెలియ
పని అవుతుందో లేదో తెలీదు" అన్నాడు.

"అదృష్టవశాత్తు నేనింకా పోలీసుల రికార్డుల్లోకి ఎ
ముందు నిన్ను చూసి, ట్రాప్ చెయ్యటానికి వచ్చిన సి.ఐ.
అనుకున్నాను. అందుకే ఇన్ని ప్రశ్నలు వేయవలసి వచ్చింది."

భార్గవ మాట మారుస్తూ, "మనం కలుసుకొని పది స
అవలేదూ?" అనడిగాడు.

"అంతకన్నా ఎక్కువే"

భార్గవ పూర్వపు రోజులు జ్ఞాపకం చేసుకుంటూ, "అ
ఆర్గానిక్ కెమిస్ట్రీమీద అథారిటీవి- గుర్తుందా?" అనడిగాడు.

"అథారిటీవి అవునో కాదో తెలియదుకానీ, బయోకెమి
పోతే నీలాగా సైంటిస్టునో అవ్వాలని కోర్కె కాస్త వుండే
నన్ను....

"బయోకెమిస్ట్రీ సంగతి వచ్చింది కాబట్టి నీకూ ఇం
రెస్టు వుండవచ్చు"

అతడికింక ఆసక్తి ఏమీలేదు. అయినా వచ్చినపని అ
సమయం గడపాలి కాబట్టి అనాసక్తి "ఏమిటి?" అన్నాడు.

"కాశ్మీర్ లో 'హుంజా' అని ఒక తెగ వుంది. ఆ
కేన్సర్ రాదట"

"అవును. ప్రపంచం మొత్తానికే ఒక ఆశ్చర్యకరమైన
అమెరికా నుంచి కొందరు శాస్త్రజ్ఞులు అక్కడకు వెళ్ళి కొ
తరబడి వుండి ప్రయోగాలు చేశారు. అయినా ఆ రహస్యం
లేదు"

"కారణం ఏమై వుంటుంది?"

"ఇంటర్ ఫెరాన్" అన్నాడు భార్గవ.... "వైరస్ ని
యాంటీబాడీస్ వాళ్ళ శరీరంలో ఆటోమేటిక్ గా తయారవ
వచ్చు.... కేన్సర్ కి కారణం వైరస్సే అనుకునే పక్షంలో...."

"వాళ్ళ శరీరంలో తయారయ్యే యాంటీబాడీస్ మ
రాలలో ఎందుకు తయారవ్వవు?"

"కారణం ఏదయినా అయుండవచ్చు. చుట్టూ వుండే వాతావరణము, ...గాలి, తాగేనీరు, జెనెటిక్స్.... వీటిలో ఏదో! ఎలా కనుక్కోవటం? ...ని శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేస్తున్నారు. ఇంటర్నేషనల్ కేన్సర్ ...స్టిట్యూట్‌కి కొందరు హెడ్‌జాల్ని పంపే విషయం భారత ప్రభుత్వం ...స్తూ వుందికూడా"

"మొన్న మొన్నటివరకూ మేము వెంకటాపురంలో వుండేవాళ్ళం. ...న్న అడవుల్లో కోయల్ని "మరిశ" అనేవాళ్ళు. కొన్ని తరాలక్రితం ...లో వాళ్ళకో ఆధారం వుండేదట, నాకు చెప్పాడు. యుద్ధంలోగానీ ...జరిస్తే శత్రువుల తలలు తీసుకొచ్చి విజయ సూచకంగా తమ ...ళ్ళకి వేలాడగట్టుకునేవారట"

ఏదో గుర్తు వచ్చి, భార్గవ ఆసక్తిగా "అయితే...." అన్నాడు.

"ఆ రాత్రి వాళ్ళు విజయోత్సాహంతో పండగ జరుపుకునేవారట. ...పెంగిసలాంటిది మధ్యలో పెట్టి కొన్ని మూలికల కషాయం అందులో ...శత్రువుల తలలు అందులో వేసేవారట. పెద్దమంట, తప్పెల ...వీటిమధ్య విప్పసారా తాగి నృత్యం చేసి చేసి స్పృహతప్పి ...యేవారట. ప్రొద్దున్న లేచి చూసేసరికి ఆ తలలు చిన్న చిన్న ...గా అయ్యేవట. జీవకళ మాత్రం పోయేది కాదట."

"నేనూ ఒక సైన్స్ మాగజైన్‌లో చదివాను. అయితే నేను చది...ఆఫ్రికాలోని బుష్‌మెన్‌ల గురించి.... వాళ్ళు ఇలానే చేసేవారట. ...మూలికలు ఏమిటో నీకేమైనా తెలుసా?"

శాస్త్రి నవ్వాడు. "నేను వదిలి పెట్టలేదు. మనుష్యుల్లో మూఢా...న్ని పారద్రోలటం కూడా కర్తవ్యమే కదా! చాలా కష్టపడి ఆ తండా...న్ని పట్టుకుని పురాతన పత్రాల్లోంచి ఆ మూలికల పేర్లు సంపాదిం...చి ఒకరోజు ముహూర్తం పెట్టి ఆ కషాయం తయారుచేసేను. మనిషి ...తల దొరకలేదుగానీ, ఓ కుందేలుని వేసేను."

"చిన్నదయిందా?"

"లేదు"

భార్గవ కూడా నవ్వేడు. శాస్త్రి అన్నాడు, "అప్పుడే నాకు అను...మానం వచ్చింది, హేతువు లేకుండా ఏదీ వుండదు."

"మనకు తెలిసి వుండకపోవచ్చు. అంతమాత్రాన రేడి
హుంజా జాతివాళ్ళకి కేన్సర్ రాదు. అది మనందరికీ తెలిసిన
కానీ హేతువు ఇంకా కనుక్కోబడలేదు. ఇది అందరూ
సత్యమే...."

"పదార్థం చిన్నదవటానికి కారణం మరేమై వుంటుంది? నీరు ఎవాపరేట్ (ఆవిరి) అయిపోయి వుంటుందా?"

"అలా అయితే జీవకళ వుండదుగా?"

"మరి?"

"హైబ్రిడోమా సెల్స్ కారణం అయివుండవచ్చు. యాంటిజెన్ కావొచ్చు. కానీ కత్తిరించబడిన తలలో ఇవన్నీ చెందటం ఎలా సాధ్యమవుతుంది. అది కాకపోతే రేడియేష
కారణం కావచ్చు. కానీ మనకి నిజంగా వుందో లేదో తెలియని
గురించి ఇంత తల బద్దలు కొట్టుకోవటం అనవసరం."

"నువ్వు చెప్పిందీ నిజమేలే" ఆగి సాలోచనగా అన్నాడు
"కానీ ఆ తల కుదించుకు పోవటానికి నువ్వన్నట్లు హైబ్రిడో
రేడియేషన్‌గానీ కారణం అయివుంటే...."

"ఊఁ అయివుంటే—"

"అదే కేన్సర్ కి మందు"

భార్గవ అప్రతిభుడయ్యాడు. పెద్ద తరంగం వచ్చి
మొహాన్ని కొట్టినట్లయింది. అతడి మొహంలో మారిన భావా
పాత్రో బిగ్గరగా నవ్వుతూ- "ఏం? రెండో క్లాసువాడు చెప్పిన
వుందా?" అన్నాడు.

భార్గవ నవ్వలేదు. స్నేహితుడివైపు కన్నార్పకుండ
అన్నాడు— "కషాయం తలని కుదించటం పౌరాణికాల
కావొచ్చు. కోయలు నృత్యం చేస్తూ, చేస్తూ అకస్మాత్తుగా మైక
పడిపోవటం కేవలం జానపదాల్లోనే సాధ్యం కావొచ్చు. కానీ
మయిన వాడిని సరిగ్గా ఉపయోగించుకోకపోవటం కేవలం మన
సాధ్యమైంది."

ఇంతలో బయట చప్పుడయింది. ఏదో అనబోతున్న

బయటికెళ్ళి నాలుగు నిమిషాలలో తిరిగి వచ్చాడు. అతడి చేతిలో కవరు వుంది. దాన్ని భార్గవకి అందించాడు.

"ఏది ఖరీదు?"

పాత్రో నవ్వేడు. "మా తరపునుంచి కాంప్లిమెంట్‌గా స్వీకరించు"

"వెళ్ళొస్తాను"

"మంచిది"

భార్గవ గుమ్మం దగ్గరికి వెళ్ళాడు. మనసులో ఏదో సందిగ్ధావస్థ కలుగుతూంది. గుమ్మం దగ్గరే ఆగి, నెమ్మదిగా వెనక్కి తిరిగి ... "నేను.... నేను చెప్తున్నది సరయినదేనంటావా పాత్రో?"

స్నేహితుడి భావాల్ని తటపటాయింపునీ అర్థం చేసుకున్నట్టు పాత్రో అతని దగ్గరికి నడిచి భుజంమీద చెయ్యి వేసేడు. వేస్తూ ...—

"గరీబీ హటావో"- అన్న నినాదం ఆధారంగా ఒక పార్టీ పదవి ...ంది. రెండ్రూపాయలకి బియ్యం అన్న వాగ్దానాల్తో మరొక ... అధికారం సంపాయించింది. బియ్యంలేకపోతే, మనిషి పస్తుంటాడు ... కొంప మునిగిపోదు. కానీ దగ్గరవాళ్ళు జ్వరంతో అల్లల్లాడి ...ంటే కూలివాడైనా బిచ్చగాడైనా చూస్తూ వూరుకోలేడు. రెక్కలు ... చేసుకుని కూడబెట్టి దానికి ఉన్నది, తాకట్టు పెట్టింది కలిపి ... కొనటానికి పరుగెత్తాడు. ఆ అవసరాన్ని తెలిసినవాడు క్యాష్ ...చేసుకుంటున్నాడు. మోసం అన్నిట్లోనూ జరుగుతుంది.

కానీ తిండి, బట్ట, ఇల్లు పీటికన్నా ప్రస్తుతం మనిషికి "మెడిసన్" ...వసర వస్తువు అయిపోయింది. దీనిలో జరిగే మోసాల విషయం ... "ఇంటికి బియ్యానికి" ఇచ్చినంత ప్రాముఖ్యం ప్రభుత్వం ఇవ్వ...కపోవటం దురదృష్టం. కారణం చాలా చిన్నది. ప్రజలకి బియ్యం ఎంత ...ఉత్పత్తి అవుతుందో తెలుసు. కానీ మందులు ఎంతలో తయారవు... తెలీదు. నువ్వీ నాలుగు గోడల్లో కూలగొడుతున్నది ఒక మందుల ... కాదు, ఎవ్వరిదృష్టి వెళ్ళని ఒక చీకటి కోణంలోకి నువ్వు వెళ్ళు...కే. నువ్వు వేల్చే ఈ వెలుగుతో అందరి చూపు అటు మళ్ళుతుంది.

# 2

"ఇదే నా ఇల్లు..." అన్నాడు శేఖరం కుర్చీలో "ఈ రూమ్‌లోనే కూర్చుని ఇక నా జీవనాధారం గురించి అఫ్‌కోర్స్ నా జీవనాధారంవల్ల వచ్చే ఆదాయంలో నీ జీతం మిళితమై వుండాలనుకో...."

బ్రెయిలీ ద్వారా సంభాషించటం అతడికి చాలా సామా అయిపోయింది. మామూలుగా మాట్లాడినట్టే వ్రాయగలుగుతున్నా వాళ్ళు వ్రాసింది తెల్సుకోగలుగుతున్నాడు.

ఆస్పత్రినుంచి డిశ్చార్జ్ అవగానే ఇంటికి తీసుకొ కొద్దిగా వెన్నులో నొప్పిగా వున్నా- బాగా నడవగలుగుతున్నా

అతడు క్షణంకూడా వేస్ట్ చెయ్యలేదు. ఇంటినుం తీసుకుని అసిస్టెంటు సాయంతో బ్యాంక్‌కి వెళ్ళి, అంధులు కా చేసే విధానాన్ని తెలుసుకుని, ఆ విధంగా ఏర్పాట్లు చేసేడు.

తన వాహనంతో ఇక అవసరం లేదు కాబట్టి దా ఏర్పాట్లు చేసేడు.

మోహన్‌లాల్ ఇన్‌స్టిట్యూట్ వాళ్ళు ఉద్యోగంలో పోయినప్పుడు ఇచ్చిన డబ్బునంతా రెండ్రూపాయల కంపెనీల్లో పెట్టాడు.

సెక్రటరీ జీతం, తన యింటి అద్దె, తన నెలసరి మొత్తానికి.... తన ఇన్వెస్ట్‌మెంటువల్ల వచ్చే ఆదాయాని కొన్నాడు. దాదాపు మూడొందలు తక్కువొచ్చింది.

"మనం నెలకి మూడొందలు ఆదాయం వచ్చే ఉద్ కుంటే చాలన్నమాట. కాలుమీద కాలు వేసుకుని తినొచ్చు."

"మూడొందలంటే నా జీతం. నన్ను ఉద్యోగంలోంచి మీరిక అసలు కష్టపడక్కరలేదు."

"నిన్ను తీసెయ్యటమా? ప్రేమికులు అంటూంటారే. 'న నువ్వే' అని. అలా ఓ నా సెక్రటరీ! నా చెవి- కన్ను- న నువ్వే."

ప్రియ బుగ్గలు ఎర్రబడ్డాయి. ఏమీ మాట్లాడలేదు.

అతడు చెయ్యిసాచి బల్లమీద కాగితాలు అందుకోబోయాడు ఏదో శిరీము చూసేడు. టేప్‌రికార్డర్.

"ఏమీకూడా అమ్మెయ్యొచ్చు. దీని అవసరం కూడా లేదు– రాదు ?"

ఆమె మాట్లాడలేదు, అకస్మాత్తుగా మూడ్‌లో మార్పు వచ్చినట్టు ంది. ఈ లోపులో అతడు 'ప్లే' బటన్ నొక్కాడు.... అంతా .

"ఏం వినిపిస్తూంది?"

ఆమె జవాబు చెప్పలేదు. అతడు రెట్టించాడు. తప్పనిసరి అయి కాగితంమీద వ్రాసింది, 'ద్వారం వెంకటస్వామి నాయుడు వయొలిన్'.

దాన్ని ఆస్వాదిస్తున్నట్టూ అతడు మౌనంగా వుండిపోయాడు. ఈ ద్ని ఒక క్యాసెట్‌మీద రికార్డు చేసుకున్నాడు. ఆ క్యాసెట్టే అది. సంబంధించినంతవరకూ నిశ్శబ్దంగా తిరుగుతూంది. అతడి చేతి అప్రయత్నంగా బ్రెయిల్ పెన్సిల్‌ని తీసుకున్నాయ్. కాగితంమీద హొడవసాగేయి, నిరాసక్తంగా నిర్వేదంగా.

"ఇవతలి మనుష్యులు తమ మనసుల్లో భావాల్ని, మాటల రూపం కపరిస్తే, వాటిని నువ్వు చుక్కలు చుక్కలుగా కాగితంమీద కరిచి, స్పృశించి కష్టపడి అర్థం చేసుకోగలను. కానీ ఏ వెంకట నాయుడో. ఈమని శంకరశాస్త్రో మాటలకన్నా అతీతమైన తీగెలమీద రపశిస్తే ఆ కంపనాల్ని ఏ భాషలోకి అనువదించి నాకు సెక్రటరీ?"

ఆమె కళ్ళల్లోకి జివ్వున నీళ్ళు చిమ్మినయ్. ఇంతవరకు అతడు కొంకలేదు. ఇప్పుడు- ఒక తీగె ప్రకంపనముతో అతడి మనసు శ్వాన్ని కోల్పోయింది.

వెంటనే అతడూ ఆ విషయాన్ని తెలుసుకున్నాడు- క్షణంలో న్నాడు.

తంమీద గొప్ప కమేండ్ వున్నవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది. ష్టపడితే తప్ప వాళ్ళ మనసు తొణకదు. తొణికినా అది క్షణమో. మే. తరువాత వాళ్ళ చేలతనాన్ని 'ఈగో' డామినేట్ చేస్తుంది.

మళ్ళీ మెటీరియలిజం ముసుగు వేసుకుంటారు, ఛట్టా ష
ఆత్మస్థయిర్యాన్నే అహం అనుకుంటారు.

ఆమె అతడివేపు జాలిగా, అప్యాయంగా చూసింది.
వాళ్ళు ఎప్పుడు తెలుసుకుంటారు? ఎంత పరిపూర్ణమైన
స్థిరత్వంతో బైట ప్రవర్తించినా- కనీసం ఒక్కక్షణమైనా తన
వచ్చినా ఒకానొక స్త్రీ దగ్గిర ఆ బింకం వదిలేసి ఓదార
గితే.... అంతటి పురుషుడూ నాజూగ్గా తన ఒడిలో ఓటమిని
దుకు ఆ స్త్రీ సామ్రాజ్యాలు గెల్చినంత సంతృప్తి పొందుతుంద

అదే ప్రేమంటే!

ఆమె ఆ ఆలోచనల్లో వుండగా, ఆ మౌనాన్ని మరో
అర్థం చేసుకున్నాడు. తన మూడ్‌వల్ల ఆ చిన్న అమ్మ
నొప్పించటం ఇష్టంలేకపోయింది. తనకా హక్కు లేదుకూ
మనసులో భావాలు తనలోనే ఇంకిపోవాలి. పైకి చాలా రఫ్
కనబడాలి.

మాట మారుస్తూ "ఇక నువ్వు వెళ్ళరా, రేప్పొద్దున రా
వుంది చెయ్యవలసింది" అని వ్రాసేడు.

ఆమె లేచింది.

ఒక కాగితం తీసుకుని దానిమీద ఎనిమిది అక్షరాలు వ్రా
పెట్టి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన కొంచెం సేపటికి అతడూ లేచి లోపలికి
మీద కాగితాలు సర్దేడు. చేతికి కాగితం తగిలింది. చూప
అక్షరాల్ని తడిమి చూసేడు.

అర్థంకాలేదు. మళ్ళీ తడిమాడు, అర్థంకాలేదు.

ఈసారి కాగితాన్ని తిప్పి చదివాడు.

అతడి మొహంలో విస్మయంతో కూడిన ఒక అ
భావం కదలాడింది.

* * * *

"ఓ... ఇది ఎలా సాధ్యమవుతుంది ప్రియా?" ఆమె మాట్లాడ
రావు అరగంటనుంచి ఈ వాగ్వివాదం కొనసాగుతూనే వుంది.
తను నిద్రపోలేదు. ఆమె మరునటిరోజు రాగానే ఈ టాపిక్
ఎత్తారు.

"అయినా నా గురించి ఏమీ తెలియకుండానే రెండ్రోజుల్లో ప్రేమే
?"

"సంవత్సరంపాటూ సినిమాలకీ, హోటళ్ళకీ తిరిగి ప్రేమించేశా
న్న అమ్మాయిలకన్నా నేను ఎక్కువే మీ గురించి తెలుసుకున్నా
నున్నాను."

"కానీ నీ వయసేమిటి— నా వయసేమిటి?"

"ప్రేమకి వయసుతో నిమిత్తం లేదంటే అది మళ్ళీ ఇంకో సినిమా
అవుతుంది?"

అతడు విసుగ్గా వ్రాసేడు. "నా పూర్వజీవితం గురించి నీకు
నా భవిష్యత్తు ఎలా వుంటుందో నీకు తెలీదు. అసలు నా గురించి
కు తెలుసని? నీ వయసులో ఇవన్నీ థ్రిల్లింగ్‌గా వుంటాయి.
ఇన్‌ఫాచ్యుయేషన్, అంతే అనుభవంలోకి రావటం మొదలు
ఇలాటి నిర్ణయం తీసుకున్నందుకు చాలా చింతిస్తావు....?"

అతనెంత స్థిరంగా తన అభిప్రాయాలు వ్రాసేడో, ఆమెకూడా
స్థిరంగా తన నిర్ణయాన్ని వ్రాసింది. "మనిషి అసలు స్వరూపం
కష్టాల్లో వున్నప్పుడే బయటపడుతుందంటారు. మీకు వచ్చిన కష్టం
దాం మనుషుల కలలో కూడా వూహించుకోలేనంతగా ఘోరమయి
అయినటి పరిస్థితుల్లో కూడా మీరేమీ తొణక్కుండా కామ్‌గా మీ
ని చేసుకుపోవటం.... అదిగో అదే నాకు నచ్చింది. మీరన్నారే
చ్యుయేషన్ అని.... హంకీపాంకిలో కూర్చుని ఐస్‌క్రీమ్ తింటూ
చూసిన పిక్చర్‌లోని డిస్కో డాన్స్ గురించి డిస్కస్ చేస్తూ
సైలవ్" అని అరిచే అరుపు కాదండీ నాది! మన పరిచయం
రోజులదే. కానీ కొద్ది రోజుల్లోనూ, అనుక్షణమూ మిమ్మల్ని
సచ్చాను. ఐ హేవ్ బీన్ వాచింగ్ యు ది మూమెంట్ ఐ కేమ్
నేను చిన్నపిల్లనే- కాదన్ను- కానీ చాలామంది "పెద్ద" పిల్లల
మానసికంగా మెచ్యూర్ అయ్యాను. ప్రతీ అమ్మాయి అలానే అను

కుంటుందని మీరంటే నేనేమీ చెప్పలేను. కానీ, చిన్నప్పట్నుం[చీ]
పెరుగుతూ రావటం వల్లనేమో ఒక తోడుకోసం ఎన్నో అ[...]
సాయంత్రాలు అర్రులు సాచేను. గుడ్డివాడూ, కుంటివాడూ స[...]
సాగించినట్టూ మనం కలిసి జీవిద్దాం కాదనకండి."

చదువుతూ వుంటేనే అతడి మనసంతా అదోలా అయి[...]
ఇంతవరకూ అతడు ఆ అమ్మాయిపట్ల అదోలాంటి కమేండ్‌తో [...]
వాడు. స్త్రీలో ఇంతటి ఆర్ద్రత వుంటుందని ఇప్పుడే తెలిసింది.
అతడు ఆలోచిస్తున్నాడు! జీవితపు వాస్తవికత- నగ్న- చేదు నిజా[...]
కొంచెంసేపటికి అతడో నిర్ణయానికి వచ్చాడు.

"ఊహూఁ లాభంలేదు ప్రియా! ఎంత ఆలోచించినా [...]
నిర్ణయం మంచిది కాదనే అనిపిస్తూంది. ప్రేమికులూ, భా[...]
మనిషి- మనిషి- ఎంతో నాజూకు భావాల్ని, సున్నితమైన అ[...]
పంచుకోవాలనుకుంటే మాటలు చాలా ముఖ్యం. ఏదో సు[...]
కదా అని ఇప్పుడు ఒప్పేసుకుంటే తర్వాతంతా నీకు ద్రోహ[...]
అవుతుంది. నీ కన్నా పెద్దవాడిగా, నీ కన్నా ఎక్కువ జీవి[...]
వాడిగా నేను దీనికి ఒప్పుకోను- క్షమించు."

ఆమె లేచి నిలబడింది. "ప్రేమకీ, ఆప్యాయతకీ మా[...]
మనీ- అవి లేని కారణంగా మన స్నేహం కొనసాగదనీ మీర[...]
అంతేనా-"

"అవును"

"నేను వెళ్ళొస్తాను. నాకు శలవు కావాలి"

అతడు విస్మయం చెందాడు. "ఏమిటి? ఉద్యోగం వది[...]
ప్రియా?"

అతడు హతాశుడవటం ఆమెకు సంతోషాన్ని క[...]
నవ్వాపుకుంది. "నాకో రోజు శలవు కావాలి! మళ్ళీ రేప[...]
వస్తాను."

"ఎందుకు?"

"ఒకరోజు శలవు పెడితే కారణం అడిగేంత ఇంట[...]
నా మీద మీకు?"

అతడు తడబడ్డాడు. "లేదు, లేదు, వెళ్ళరా."

ఆమె వెళ్ళిపోయింది.

కానీ ఒంటరితనం అతడికేమాత్రం సంతోషాన్ని ఇవ్వలేదు. పని పక్క నాసికా ఆమెమీద నుంచీ వచ్చే గాలిని ఆస్వాదించి ఒంటరితనాన్ని పోగొట్టింది! ఆ రోజంతా అతడు అసహనంగానే గడిపాడు. ఆ దిగులు ఆమె వెళ్ళిపోవటంవల్ల వచ్చిందికాదు, తన ఒంటరితనంవల్ల వచ్చింది.

మర్నాటిరోజు ఆమె వస్తూ తనతోపాటూ ఓ కాగితాల కట్టని తీసుకువచ్చి బ్రెయిల్‌లో టైపు చేసివున్న దాదాపు నాలుగువందల పేజీలు అతడికి అందించింది.

రాత్రంతా నిద్ర లేనట్లూ ఆమె కళ్ళు ఎర్రగా వున్నాయి. ముఖంలో అలసట కొట్టొచ్చినట్టు వుంది. అతడు విస్మయం చెంది "ఏమిటి ఇవి" అడిగాడు.

"ప్రేమికులమధ్య మాటలు అవసరం లేదని, నిజమయిన ప్రేమకు మాటలు అక్కర లేదని తెలియచెప్పే నవల నొకదానిని నేను ఈమధ్యకాలం చదివాను. అందులో నిజం వున్నట్టూ కనబడింది. దాన్ని మీరు కూడా చదివిద్దామని...."

అతడు దిగ్భ్రాంతుడయ్యాడు. "అందుకోసం.... అందుకోసం ఈ కాపీని అన్ని పేజీల్ని బ్రెయిల్‌లోకి తర్జుమాచేసి దాన్ని టైపు చేశావా ప్రియా?"

"నాది ఇన్‌ఫాట్యుయేషన్ కాదు"

అని మాటని తిప్పికొట్టింది. దెబ్బతిన్నట్టు కనిపించాడు. కానీ లోపల రవ్వంత ఆనందముంది. తర్వాత ఆమె వ్రాసినదంతా చదవటానికి అతడికి రెండు గంటలు పట్టింది. అంతసేపూ ఆమె ఆత్రంగా అతడివైపే చూస్తూ వుంది. అతడు చదవటం పూర్తి చెయ్యగానే 'ఎలా వుంది' అని ప్రశ్నించింది.

"కథ బాగానే వుంది. పాత్రల పోషణ విషయం తీసుకుంటే...."

ఆమె రోషంగా "నేనడిగింది దానిమీద మీ అమూల్య అభిప్రాయం కాదు.. మన సంగతి" అని వ్రాసింది.

అతడి మొహంలో సీరియస్‌నెస్ ఇంకా అలానే ఉ
కాగితం మీద మాత్రం తాపీగా వ్రాసేడు.

"నేను ఒప్పుకుంటున్నాను"

మొదట ఓ క్షణం ఆమెకి అతడు చెపుతున్నది
అవగానే చిన్నపిల్లలా గాలిలోకి గెంతులేసి హుషారుగా అరిచె

"ఏం చేస్తున్నావు నువ్వు"

"ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాను"

"ఆ విషయం నాకెలా తెలుస్తుంది మరి?"

అతడి ప్రశ్నకి తనలోతాను నవ్వుకుని చేతులు వెనక్కి
మూతి సున్నాలా చుట్టి, వంగి అతడి పెదవులమీద క్షణంలో
పాటు ముద్దు పెట్టుకుని, లేచి నిలబడింది. ఆ పరిమళానికి అ
బిక్కిరి అయ్యాడు. కానీ వెంటనే తేరుకున్నాడు.

ప్రతీది వ్రాసి చూపించటం కుదరదు కాబట్టి ఇక
నిత్యావసరమైన వాటికి మనం సైగలు ఏర్పరచుకుంటే
అదాపర్చవచ్చు"

ఈ సూచన ఆమెకి బాగా నచ్చింది. "నిజమే చెప్పం
కావాలంటే ఏం సైగ చేస్తావు? అలాగే దాహానికి...." అత
స్వీకరించటానికి సిద్ధపడుతూ అడిగింది.

"నేను చెప్పేది ఇంకా ముఖ్య నిత్యావసర వస్తువు
"ఇంకానా? ఇంకా ముఖ్యమైనవి ఏమిటి?"

"ఉదాహరణకి నువ్వు నాకో ముద్దు ఇవ్వాలనుకో"

"వ్హాట్"

"కుడి అరచేతిలో ఎడమచెయ్యి పిడికిలి బిగిస్తే ఎక్క
దగ్గరకొచ్చి ముద్దు ఇవ్వాలి! అలాగే కుడిచేతి చూపుడువేలు
చూపుడువేలుమీద ఆలయ గోపురంలా అన్నాననుకో. అప్పుడే
దగ్గిరకు రావాలి. పోతే మూడో ముఖ్యావసరం గురించి
చెప్తాను"

ఆమె ఇంకా చిన్నపిల్ల కాబట్టి ఆఖరివాక్యం అర్థంకాలే
దాని గురించి పట్టించుకోకుండా "నేనిప్పుడే రవి అన్నయ్యన
గురించి చెపుతాను" అని వ్రాస్తూ లేచింది. ఆమెని

గ్గరికి పెట్టింది రవే. ప్రియ తండ్రి చచ్చిపోయాక అతడు ఆ ఇంటికి దగ్గరయ్యాడు.

"ఎందుకు అంత తొందరగా చెప్పటం?"

"తెలుసుగా, రవి అన్నయ్య రచయిత! మీ జీవితంలో జరిగిన ఆశ్చర్యకరమైన సంఘటన అతడిలో ఎంతో కుతూహలాన్ని రేపింది. ఓ రచన చేద్దామనుకుంటున్నాడు అతడు, ఈ ముగింపు గురించి స్తాడు."

"ఈ కథకి ముగింపు ఇదికాదు ప్రియా! అంతకన్నా థ్రిల్లింగ్ ముగింపునొకటి వుంది. నీ నిర్ణయం మీదే కథ సుఖాంతం అవ్వాలా ముగిసిపోవాలా అన్న నిర్ణయం ఆధారపడి వుంది. నువ్వేం చెప్పినా ను. కానీ ఈ ఒక్క విషయంలో మాత్రం కాంప్రమైజ అవను. సుఖాంతం జరగాలంటే దీనికి నువ్వు సిద్ధపడి తీరాలి. నాకీ సాయం ాలి."

ఎందుకో ఆమె మనసు కీడు శంకించింది. "ఏ సాయం?" అని డిగింది.

"సామ్సన్ అండ్ సామ్సన్ కంపెనీ అధినేత నాయుడిని చంపటంలో ము...."

పక్కనే అగ్నిపర్వతం బ్రద్దలయినట్టయి ఆమె కంపించి పోయింది. అతడు మాత్రం ఏదీ పట్టనట్టు వ్రాసుకుపోతున్నాడు. "చాలా జు అతడు. చీమలు నా చేతిని కుట్టటాన్ని చూసేడు. ఇప్పుడూ క్రూరంగా అతడిని మరణం వైపుకి చీమలు తీసుకుపోవటాన్ని చూడాలి!! దానికి నువ్వు సాయపడేట్టయితే, మన ప్రేమకి నాకు అభ్యంతరంలేదు. కానీ ఈ ప్రేమకన్నా నాకు పగ ముఖ్యం. పగ. పగ. జీవితాశయం. ఇప్పుడు చెప్పు సాయపడతావా– నన్ను వదులు కుంటావా?"

ఏమి చెపుతుంది ఆమె? వారిద్దామన్నా వినేటట్టు లేదు. ఒక దృఢము అతడి మొహంలో ప్రతిఫలింపిస్తూ వుంది. కానీ సంస్కారవంత కుటుంబంలో పుట్టి- చదువుకుని పైకి వచ్చిన ఒక చిన్నపిల్లని పట్టు ాతో కలిసి మర్డర్ చేస్తావా. తేల్చుకో' అని అడిగితే ఆమె ఏం సు చెపుతుంది? ఒక మనిషిని చంపటం.... ఆ ఆలోచనతోనే

ఆమె చిగురుటాకులా వణికిపోయింది. అతడినెలా కన్విన్స్ చే
మనసునిండా పగనిండిన వాడితో ఎలా-ఎలా పోటీపడిపి
నేరమని నచ్చచెప్పగలదు.

ఈ ప్రేమ– మలుపుతో వివాహంవైపు కాదు, ఒరిశ
దారి తీస్తుందని ఎలా ఎలా ఒప్పించగలదు? ఇప్పటివరకూ
వచ్చిన కథకు ఇది ముగింపు అని ఎలా చెప్పగలదు? అలా
నేను నీకు సాయపడలేను అని మాత్రం ఎలా అనగలదు?
ద్దాన్ని అతడు మరోలా అర్థం చేసుకున్నాడు.

"నీకు వెంటనే నిర్ణయం చెప్పటం కష్టమైతే ఓ నాల
గంటలు టైమ్ తీసుకో. నీకు ఇష్టం లేకపోతే నా సెక్రటరీగా
వచ్చు. దానికి నాకు అభ్యంతరంలేదు. కానీ ఏ విషయమూ
నాకు ఈ సాయంత్రంలోగా తెలియాలి. ఎందుకంటే నేను
నేననుకున్నది అమలుజరప దల్చుకున్నాను.... ఇంతకాలం
ఒంట్లో ఈ మాత్రం సత్తువరావటం కోసమే. ఇక ఆలస్యం
వీలులేదు. చెప్పు.... రాకపోతే నేను వంటరిగా అన్ని పన
కోవాలి. కాబట్టి– సాయంత్రం వరకూ టైమ్ తీసుకో...."

## 3

"గోవిందా... గోవిందా" అని తనలో తనే గొణు
ముందుకు సాగిపోతున్నాడో వృద్ధుడు. అతడి వెనకాలే భార్గవ
భార్గవ వెనుక పొడవాటి క్యూ వుంది.

కొండమీద గుడి అవటంవల్ల గాలి బలంగా వీస్తోంది.
జనం కిక్కిరిసి వుండటంవల్ల కాస్త ఉక్కగానే ఉంది. సా
లేయెండ పాలరాతిమీదపడి ప్రతిఫలిస్తూ వుంది. బైటనుంచి
మయిన 'క్యూ' చాలాదూరం అలాగే సాగి గుడి అంతర్భాగంలో
కిస్తూంది. కొంతమంది చేతులు ముడుచుకుని వున్నారు. కొంద
మూసుకుని భక్తిగీతాన్ని మనసులోనే గొణుక్కుంటున్నారు.
మంది సినిమా క్యూలో నిలబడ్డట్టూ లోకాభిరామాయణం మాట్లా
న్నారు రకరకాల వ్యక్తులు....

ఎందుకో తెలీదు. అకారణంగా, హఠాత్తుగా అతనికి వసుమతి గుర్తొచ్చింది. తనసుంచి తన ప్రార్థనని చట్టరీత్యా వేరుచేసిన వసుమతి, తోపాటూ కూతురి జ్ఞాపకాలు కూడా. ఆస్పత్రినుంచి వెళ్ళగొట్ట ప్రొద్దున్నించీ తనేమో చెట్లులూ, పుట్టలు పట్టుకు తిరుగు ది. అక్కడ తన కూతురు ఇప్పుడు ఎలా వుండి వుంటుంది? మర ఉంటుందా? ఇంటికి తీసుకొచ్చి వుంటారా? ఇంటికి తీసుకొచ్చేస్తే సు అగుతారా? చీకటి పడిపోతుందని శ్మశానానికి తీసుకువెళ్ళి రా? అసలు తనకోసం చూసి వుంటారా? చట్టరీత్యా విడిపోయిన గం చూసేదేమిటని అనుకొని వుంటారా? వెనకనుంచి ఎవరో స్కారు బాబూ' అని అనటంతో అతడు ఉలిక్కిపడ్డాడు. ముందు స్వామి విగ్రహం ముందు అడ్డంగా కట్టిన గొలుసుల దగ్గరికి చేరు సినగా నిలబడ్డాడు. అతడు వెళ్ళి: ముందు అనుకున్నట్టే కుడి పక్క నిలబడి సర్దుకుంటూ 'ఇదేమిటి నా కూతురి గురించి నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను' అనుకున్నాడు. ఒళ్ళు జలదరిం పందెం పేరుతో తనని మూర్ఖుణ్ని చేసిన దేముడు ఎదురుగా డు. ఆ దేముణ్ని కొలిచే భక్తులు చుట్టూ వున్నారు. ఈ జనమే. సుక్కున్న సత్యాన్ని నిండు సభలో వెల్లడిస్తే తనో మూర్ఖుడను మీదకు చెప్పులు విసిరారు.

తనని ఇంత హీనస్థితికి దిగజార్చిన ఈ దేముడి మీదా, ఈ జనం పగ తీర్చుకునే సమయం ఆసన్నమైంది.

అతడు అప్పటివరకూ దాచిన ఎక్స్‌ప్లోజివ్‌ని బయటకు తీసేడు. రి ఒక్కొక్కరి దగ్గరకూ హారతి పళ్ళెంతో వస్తున్నాడు. ఒక్కొ దగ్గరకి వంగి కళ్ళు మూసుకుని హారతి కళ్ళకద్దుకుంటూంటే, గాలికి పళ్ళెంలో మంట మినుక్కు మినుక్కుమంటూ ఆరిపోవ సిద్ధమవుతూంది. పూజారి హారతి ఇవ్వటానికి తన ముందుకు వచ్చి సరియైన సమయం!!! విసిరెయ్యటానికి అదే అనువైనది. తన పూజారి వుంటాడు. దూరంగా- లోపల విస్ఫోటం జరిగినా ప్రాణ ఉండదు ఎవరికీ.

ఇద్దరి మనుష్యుల అవతల వున్నాడు పూజారి.

ఎక్స్‌ప్లోజివ్ పేలాలంటే ఏం చెయ్యాలో చెప్పాడు పా
తీసెయ్యాలి. భార్గవ కుడిచేత్తో దానిని పట్టుకున్నాడు.

పూజారి పక్క మనిషి దగ్గిరకు వచ్చాడు.

అతడి వూపిరికి పళ్ళెంలో మంట మళ్ళీ ఒకసారి కా
దైంది. అతడు దగ్గిరకొస్తూంటే భార్గవలో టెన్షన్ ఎక్కువయిం
తిప్పి విగ్రహంవైపు చూసేడు. విగ్రహానికి చెరోవైపునా వున్న
మీద అతడి దృష్టి పడింది. ఎడమకుంది నుంచి వచ్చే పొగకి,
కుందిలో దీపం రెపరెపలాడి మళ్ళీ ఉజ్వలత్వాన్ని సంతరిం
పూజారి భార్గవ ముందుకు వచ్చాడు. భార్గవ అతడివైపు చూడ
విగ్రహంవైపే చూస్తున్నాడు. దూరంగా వున్న మనుష్యుల కద
దీపపు పొగ మరొక దీపంమీదకు వెళుతూంది. హారతి పళ్ళెంలో
తున్నది కూడా అదే.

....సడెన్‌గా భార్గవకి ఏదో స్ట్రయిక్ అయింది.

ఉజ్వలంగా వెలుగుతూన్న దీపం క్షణకాలం క్షీణ
కారణం! పక్కనుంచి వచ్చే కార్బన్ డయాక్సైడ్ అవులే, ఆలో
పనిచేసుకుంటున్న మనిషి ఫ్యాక్టరీలో మాస్క్ వేసుకోకపోతే
తప్పి పడిపోవటానికి కారణం మెథైల్ కోరిన్ ధరీన్!

నృత్యం చేస్తున్న కోయలు ఉన్నట్టుండి స్పృహతప్పి
టానికి కారణం కూడా విప్పసారా కాదు. పొదలు కాల్చటంవల్ల
పొగ-కార్సినోజిన్!!! మూలికల రసాయనంలో వేసిన శత్రువుల
చిన్నవి అవటానికి కారణం కూడా ఆ రసాయనం కాదు, కార్సినో

అతడు కళ్ళు మూసుకున్నాడు. చూసేవారికి, అతను
వెలుగుతున్న హారతిని చూసి భక్తిభావంతో కళ్ళు మూసుకు
పిస్తుంది. కానీ, అతడు క్షణమాత్రపు కాలంలోనే సర్వశక్తులా
రించి, తనకు వచ్చిన ఊహకు లాజిక్ ఏదయినా వుందా. లే
నిరర్థకమైనదా— అని ఆలోచిస్తున్నాడు. ఉజ్వలంగా వెల్గుతున్న
క్షీణపరిచేది పొగ— జీవనాకృతితో సహజంగా జరిగే మైటాసిస్‌ని
పరిచేదీ కార్సినోజిన్నేనా?

సైన్సు చరిత్రలో గొప్ప గొప్ప సత్యాలన్నీ సైంటిస్టుల చిన్న

...వల్లే బయటపడినయ్. మామూలు మనిషి మామూలుగా చూసి ...ను విషయాన్ని సైంటిస్టు తర్కంగా ఆలోచిస్తాడు. చలనసూత్రాలూ, ...కర్షణ శక్తి ఎక్స్‌రే థియరీ ఇలాగే కనుక్కోబడ్డాయి. ఇంతకన్నా ...టైన ఉదాహరణ బెంజిన్. బెంజిన్‌లో ఆరు ఉదజని పరమాణువులూ, ...ర్బన్ పరమాణువులూ వుంటాయని మొట్టమొదటిసారి కనుక్కో... ...ను సైంటిస్టులందరికీ మతిపోయింది. ఎందుకంటే ఆరు కార్బన్ ...ణువుల తమతోపాటూ పధ్నాలుగు ఉదజని పరమాణువుల్ని ...చి వుంచుతాయి. (సి. 6 హెచ్. 14) కానీ అప్పుడది హెక్సేన్ అనే ...ర్థ అవుతుంది. కానీ బెంజిన్ అవదు. మరి ప్రకృతిలో బెంజిన్ ఎలా ...వగలదు? ఒకవేళ అది CH–C–CH–CH–CH–CH–2 ...ల్లో వుంటుందనుకుంటే, అదే ప్రక్రియలో ఇంకేదో పదార్థాలు ...వుతున్నాయి. కానీ బెంజిన్ అవటంలేదు.



ఈ విషయ రహస్యం అర్థంకాక సైంటిస్టులు దాదాపు సంలభై ...ాలు బుర్రలు బద్దలు కొట్టుకున్నారు. ఈ రంగంలో ఎన్నో ...ధన చేసినవాడు 'కెకులే' అన్న శాస్త్రజ్ఞుడు.

బెంజిన్ అణువులో ఏ రకంగానయినా ఆరు ఉదజని, ఆరు ...న్ పరమాణువుల్ని పట్టి బంధించి వుంచటం కష్టమని ఆపాటికే ...యింది. 1865 ఒకరోజు కెకులే సిటీబస్‌లో వెళుతూ యథాలాప ...టికీలోంచి వీధి కిరువైపులా వున్న ఇళ్ళనీ, గొల్సానీ ఆర్చిలనీ ...సాగేడు. బస్ ముందుకు వెళుతూంటే రకరకాల భంగిమల్లో ఆర్చిలు ...ు వెళుతున్నాయి. ఆ తర్వాత బస్‌లోనే కొద్దిసేపటికి అతడు నిద్ర ...పోసాగాడు. ఆ మగతనిద్రలో కార్బన్ పరమాణువులు అతడి ...ను గుండ్రంగా నృత్యం చేయసాగాయి.

అప్పటివరకూ వేధిస్తున్న ప్రశ్నకి అతడికి అకస్మాత్తు
ధానం దొరికింది. బెంజీన్ అణువులో పరమాణువుల అమరి
ఆకారంలో అల్లిలా వుండి వుండవచ్చునని —

ఆ విధంగా బెంజీన్ రింగ్ రహస్యం బయటపడింది.
మెలిక విడిపడటంతో పరిశోధనలు తిరిగి పుంజుకున్నాయి.

ప్రస్తుతం భార్గవ పరిస్థితి కూడా అలానే వుంది. అ
కల్‌గా. ఒక్కొక్క విషయమే వేరుచేసుకుంటూ ఒకదాని కొకటి
పర్చుకుంటూ ఆలోచిస్తున్నాడు. 1. మామూలు జీవకణానికి కే
నికీ తేడా ఇంతవరకూ ఎవరికీ తెలీదు. 2. ప్రయోగశాలలో
మొట్టమొదటి జీవకణం కృత్రిమంగా తయారవకపోవటానికి
దానికి కావల్సిన పరిస్థితులలో 'ఏదో ఒకటి' లేకపోవటం. 3.
కోయలకి కేన్సర్ రాదు. ఇప్పటికీ రావటంలేదు. దానికి కా
శరీరాలు ఇమ్యూన్ అయిపోవటం. అంటే వాళ్ళ పూర్వీకుల
ఈ ప్రత్యేకత వుండి వుండటం. 4. శత్రువుల తలలు కుదిం
నికి కారణం మూలికల రసాయనం కాదు అని ముందే పాత్రో
చూసేడు. 5. నృత్యం చేస్తూ చేస్తూ కోయలు స్పృహతప్పి పడి
కారణం పొదల మీదనుంచి వచ్చే పొగే కారణం అయివుంటే
వాయువూ, సామ్సన్ కంపెనీనుంచి వచ్చే విషవాయువూ
సంతతికి సంబంధించిన వాయువులేనని అనుకుంటే కేన్సర్ ని
ఆ కార్సినోజిన్నే చచ్చిపోయిన మనిషి కుదించుకుపోయేలా చే
మాట. కానీ శత్రువుల తలలనీ కత్తిరించగానే అవి నిర్జీవ
కదా. అటువంటప్పుడు కుదించుకుపోవటం ఎలా సాధ్యం
అందులోనూ ఎముకలతో సహా?

నిర్జీవాకృతిలో సజీవకణ సృష్టి జరుగుతుందా? జరిగి
అంటే—కోయవాళ్ళ తలల్ని వేసే మూలికల రసాయనం;
తమకు తెలియకుండానే తయారుచేసే అమినో ఆసిడ్స్ మిశ్ర
మాట. ఈ లాజిక్ నిజమయితే అమినో ఆసిడ్స్ మీదుగా, కా
పంపిస్తే జీవకణం (అఫ్‌కోర్స్ కేన్సర్ కణం) సృష్టింపబడాలి.

'యురేకా' అని అరుచుకుంటూ పీళ్ళగదిలోంచి బయ
గెత్తిన ఆర్కిమెడీస్‌లా అతడు అరవలేదు, నడుస్తున్న బస్సులో

న్నావు' అని ఎగిరి క్రిందకు గంతేసిన కెరటంలా అతడు గెంత
హారతి తీసుకో బాబూ' అన్న పూజారి మాటలకి నెమ్మదిగా కళ్ళు
క్షణంలో ఎన్ని ఆలోచనలు?
తన తర్కంలో ఇంకా కొన్ని అర్థంకాని పాయింట్లున్నాయి.
ొగందేసి చూస్తేకాని తెలీదు.
చెయ్యాలా?
అతడు చుట్టూ చూసేడు.
జనం.
క్కని తరిమినట్టూ తనను తరిమిన జనం! రాళ్ళతో కొట్టి
విసిరిన జనం!! ఏమీ తెలియనితనం, అన్నీ తెలుసుననే అహం
న్న జనం! సోక్రటీసుకు విషమిచ్చిన జనం! భూమి గుండ్రం
న్నదన్నందుకు ప్రాణాలు తీసిన జనం! ఈ జనం కోసమా తను
సింది? ఈ జనం కోసమా సర్వం కోల్పోయిన తను తిరిగి
ిలా కేంద్రీకరించుకోవలసింది?
"హారతి తీసుకో నాయనా?"
అతడు పళ్ళెములో వెలుగుతున్న మంటవేపు చూసేడు.
ట్టూ నీలమూ, మధ్యలో ఎర్రటి మంట. మనిషి మనస్సులో
జోకొడుతున్న శాంతిలాగా- మంట అతడి ఆలోచనల నరళని
ంది.
మనుష్యుల తప్పేంలేదు. ప్రతి మనిషికీ తిండీ, బట్టా, ఆరోగ్యమూ
కలిగితే తనపై తనకి విశ్వాసం పెరిగి దేముడిపై ఆధారపడ
గ్గుతుంది. అది చెయ్యకుండా విగ్రహం బద్దలుకొడితే మరో
ం వెలుస్తుంది. కావల్సింది కన్‌స్ట్రక్షన్.
అతడి చేతులు మంటమీద పెట్టి కళ్ళకద్దుకున్నాడు. అతడికి
ర నమ్మకంలేదు. నమ్మకం లేదనడానికన్నా దేవుడి అవసరం
సటం సమంజసంగా వుంటుంది. కేవలం పాపులకీ, తనమీద
నమ్మకంలేని పిరికి మనస్కులకీ దేముడి అవసరం పడుతూ
ది. అయితే హారతి తీసుకుంటూ వుండగా అతడి మనసంతా
మైన నిర్మలత్వంతో ఒక విధమైన సంతృప్తికి గురయ్యింది.
తృప్తి మరో సరికొత్త ఆలోచనకి పునాది అయింది.

ప్రపంచ చరిత్రలో మానవ కళ్యాణం కోసం పాటుపడి నీయులంతా ఈ జనం తమని ఆదరిస్తారా లేదా అన్న ఆలోచ కృషి కొనసాగించలేదు. ఆ మాటకొస్తే జనం వాళ్ళని తనకన పగా బాధలుపెట్టారు. అయినా ఆ మహనీయులంతా ఒక దీక్షతో తమ గమ్యంవేపు సాగిపోయారు. జనం అజ్ఞానాన్ని తోనూ, జనం కోపాన్ని ఆప్యాయతతోనూ ఆదరించి స కొవ్వొత్తిలాగా లోకానికి వెలుగునిచ్చి, తాము కరిగిపోయారు. ఒక గొప్ప మలుపుకి కారణభూతులయ్యారు. వాళ్ళ జీవిత భూయిష్ఠమే అయింది.

వాళ్ళ కష్టాలలో పోల్చుకుంటే తనదేపాటిది?

అప్రయత్నంగా అతడి పెదవులమీద చిరునవ్వు వెలిగింది విగ్రహంవైపు చూసేడు. ఒక కుందెలో మంట అశుభసూచ పోయి వుంది. అయితేనేం మరో కుందెలో వెలుగు భాస్వంత మానంగా వుంది. ఆ భాస్వంతము భానంతమై– భవమే భవ్యమే భావికమై– భవిష్యమైనట్టు తోచింది.

అతడు అక్కణ్నుంచి కదిలిపోయాడు.

చేయవలసినది చాలా వుంది. ముఖ్యంగా తను ఆలోచించి కొన్ని లొసుగులున్నాయి. శిలలు చిన్నవి అవటాని డీ-హైడ్రేషన్ అయి వుండకూడదు. ఎముకలు ఎలా చిన్నవి లాజిక్‌కి దొరకటంలేదు. ఎమినో ఆసిడ్స్ సాధారణ ప్రకృతి మనగలిగాయో అర్థంకావటంలేదు. ఇవన్నీ చూడాలంటే ఒక శాల కావాలి. కొన్నిరోజులు టైమ్‌కావాలి. అన్నిటికన్నా మ ఒక కేన్సర్ పేషెంట్ కావాలి.

## 4

ఆ రోజు ఆస్పత్రి మామూలుకన్నా ఎక్కువ రష తెలిసినవాళ్ళు ఎవరూ తనను గుర్తుపట్టటానికి వీలులేకుండా మొహ చాటు చేసుకుని లోపలికి ప్రవేశించాడు భార్గవ.

వరండాలోంచి కాకుండా లాన్‌ద్వారా అవతలి వార్డు వే అదృష్టవశాత్తూ అక్కడ జనసంచారం తక్కువగా వుంది.

మలుపు తిరిగి మెట్లెక్కి పైకి వెళ్ళాడు. వసుమతిగానీ, డాక్టర్ జైన్‌గానీ కనబడతారేమోనని అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది. మెట్లెక్కి వరండా మీదకి రాకుండా మలుపు దగ్గరే నిలబడి లోపలికి తొంగిచూశాడు.

ప్రార్థన వున్న వార్డు అది! మెట్ల దగ్గిర్నుంచి వరుసగా మూడో గదిలో వుంది తన కూతురు.

ఆ లోపులో పైన వరండాలో ఇటునుండి అటు మరో నర్సు వెళ్తూ వుంది. ఏదో స్ఫురించి అతడు వెనుదిరిగి అప్పుడే పైకి వస్తున్నవాడిలా ఆయాసపడుతూ నర్సుతో ప్రార్థన ఉన్న గది చూపిస్తూ "ఆ గదిలో వసుమతి అనే ఆమె వుంటుంది. ఆమెను అర్జంటుగా డాక్టర్ జైన్ పిలుస్తున్నాడు అని చెప్పు" అని ఇంగ్లీషులో అనేసి ఆమెకి తిరిగి మాట్లాడే ఛాన్స్ ఇవ్వకుండా ఎంత స్పీడుగా వచ్చాడో అంత స్పీడుగా దిగిపోతూ మలుపు దగ్గర ఆగి, "డాక్టర్ జైన్ ఈజ్ ఇన్ ఫిమేల్-బర్న్స్" అని దాదాపు అరిచి విసురుగా క్రిందికి వెళ్ళిపోయాడు.

నర్సుకి ఒక క్షణంపాటు ఏమీ అర్థంకాలేదు. అయోమయంగా మెట్లవైపు చూసి తర్వాత ప్రార్థన గదివైపు తలతిప్పింది. డాక్టర్ జైన్ నుండి కబురు తీసుకొని వచ్చినవాడు, ఆస్పత్రికి సంబంధించినవాడే అనుకోవడంలో పొరపాటు లేదు. ప్రార్థన గది దగ్గరికి వెళ్ళి "మీరేనా వసుమతి?" అడిగింది. వసుమతి తల వూపగానే "డాక్టర్ జైన్ మిమ్మల్ని పిలుస్తున్నారు. ఫిమేల్-బర్న్స్‌లో వున్నారు" అంది.

అంత అకస్మాత్తుగా డాక్టర్ తనను ఎందుకు పిలిపించాడో తెలియక వసుమతి కంగారు పడింది. ఆందోళనగా లేచి నిలబడి "ఎందుకు?" అని అడిగింది. కానీ అప్పటికే నర్సు వచ్చిన పని పూర్తయినట్లుగా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

వసుమతి మెట్లు దిగి క్రిందకు వెళ్ళింది. జనరల్ హాస్పటల్ రోడ్‌కి ఆవైపు వుంది ఫిమేల్-బర్న్స్. ఎక్కడ వుందో ఆమెకు తెలీదు. అడుగుతూ వేసుకుంటూ అటువైపు మళ్ళింది.

ఈ లోపులో భార్గవ స్తంభం చాటునుండి వడివడిగా ప్రా
లోనికి ప్రవేశించాడు.

జననానికీ మరణానికీ మధ్య వూగిసలాడుతున్న కూతు
అతను చూస్తున్నది. తనని గుర్తించే వాళ్ళెవరయినా వ
అక్కడనుండి తప్పుకోవాలి. అతడు గదంతా కలయజూసాడు.
ఒకమూల స్టూలు, దానిమీద వసుమతి సగం వలిచి పెట్టిన బత్తా
ఉన్నాయంతే.

ఏం చెయ్యటానికీ పాలుపోక అతడు గదిలోనుండి
వచ్చాడు. వరండాలో ఒకమూల నాలుగు గుమ్మాల అవతల క
చక్రాల కుర్చీ.

వడివడిగా ఆ కుర్చీ దగ్గరకు వెళ్ళి దాన్ని తోసుకుంటూ
దగ్గరికి రాసాగాడు. ఇంకో రెండు గుమ్మాల అవతల ప్రార్థన గ
నగా లోపల గదిలోనుండి హఠాత్తుగా నర్సు బయటికి వచ్చింది.
కూడా తొందరలో ఎడమవైపునుండి వస్తుండడంతో ఆమె గుమ
బయట అడుగుపెట్టగానే కుర్చీతోసహా ఆమెను ఢీకొనబోయాడు.

కొద్దిపేపుంటే ఆమె చేతిలో సీసా నేలజారేదే. టాలె
కుర్చీ కోడు పట్టుకొని నిలదొక్కుకుంది. భార్గవ గుండె కొ
పోయింది. తల బాగా క్రిందకు వంచి క్షమాపణలు చెప్పుకుం
గొణిగాడు. అదృష్టవశాత్తూ ఆమె అతడివేపు చూడకుండా "ఇట్స్
అని మెట్లవైపు వెళ్ళిపోయింది.

భార్గవ గుండెలనిండుగా వూపిరి పీల్చుకుని ప్రార్థన గది
శించాడు. మంచం ప్రక్కగా కుర్చీ నిలబెట్టి అటువైపు వెళ్ళి కూ
వున్న ఐ.వి. ఫ్లూయిడ్ గొట్టాన్ని లాగేసాడు. ఆ నొప్పికి ప్రా
విప్పింది.

ఆ స్థితిలో కూడా ఆ అమ్మాయి మొహం తండ్రిని
గుర్తింపుగా వెలిగింది.

"వస్తావా! నాతో వచ్చేస్తావామ్మా? వచ్చేస్తావా?"

ప్రార్థన మాట్లాడలేదు. కానీ ఒక్కసారిగా కళ్ళలోకి వ
తోసుకురావడాన్ని అతడు గమనించేడు. "తీసుకు వెళ్ళిపో డాడీ!

వెళ్ళిపో" అని ఆమె హృదయ విదారకంగా అన్న మాటలు గుర్తొ
డు. ఎంతో బాధపడితేగాని. వెళ్ళిపోవడానికి అంత ఆనందపడడు.

"పాపా, నువ్విక్కడెలాగూ బతకవు, నాతో వచ్చెయ్యి. ఓ మహా
సమిధవయ్యావన్న సంతృప్తితోనైనా మరణిద్దువుగాని" పైకన
మాట, మనసులోనే అనుకున్నాడు. మెడక్రింద చెయ్యివేసి
గ్గా ఆమెను కుర్చీలో కూర్చోబెట్టాడు. చుట్టూ దుప్పటి కప్పాడు.

గా కుర్చీ తోసుకుంటూ గదిలోనుంచి బయటకువచ్చి వరం
ండి క్రిందికి దిగిపోయాడు.

న్ ప్రక్కనే వున్న సన్నటి సిమెంట్ బాటవెంట నడుస్తూ
కనబడుతుందేమోనని భయపడ్డాడు. కానీ ఆమె ఎదురు పడ
కుర్చీ మెయిన్ గేటుగుండా తీసుకువెళ్ళడం అతనికి యిష్టం
తను కారుని ఓ.పి. వెనుకవేపు ఆపుచేసి వుంచాడు. అటువైపు
తూ సడన్‌గా తను దారి తప్పానని గ్రహించాడు. వరండాలో
క్రిందకి రెండు మెట్లున్నాయి తప్ప చక్రాల కుర్చీ వెళ్ళడానికి
గాలేదు. మళ్ళీ వెనక్కు వెళ్ళడం ఇష్టంలేదు. అది రిస్కు. అతడు
ముందుభాగం పైకెత్తి కూతురు శరీరానికి ఏమాత్రం కుదుపు తగల
రెండుమెట్లు క్రిందకి దించబోయాడు. ఇంతలో వెనుకనుండి
డ్" అని వినబడింది.

భార్గవ ఒళ్ళు ఒక్కసారిగా జలదరించింది.

శిలాప్రతిమలా నిలబడిపోయాడు.

ఇంతలో అతన్ని పిలిచిన వ్యక్తి దగ్గరికి వచ్చాడు. అతడో డాక్టరు.

"వీల్‌చైర్ తీసుకువెళ్ళే దారి ఇటుకాదు"

భార్గవకి ఏం చెయ్యాలో తోచలేదు. అతడు దయవున్న వాడిలా
డు. భార్గవ చైర్‌ని ఆఖరిమెట్టు దింపడానికి సాయపడుతూ "ఏమిటి
ఇంట్?" అని అడిగాడు.

"మలేరియా" అని భార్గవ అతడికి కృతజ్ఞతలు చెప్పుకుంటూ
బయట తోటవైపుకి తోసుకువచ్చాడు. ఒక్కసారి చల్లటిగాలి
కొట్టింది. దూరంగా కారు కనిపిస్తోంది.

అతడు కారువరకూ కుర్చీ తీసుకువెళ్ళి పాపను రెండు చేతులతోను

ఎత్తి అందులో పడుకోబెట్టి వచ్చి, ముందుసీట్‌లో కూర్చుని కా
చేసాడు.

ఔట్ పేషెంట్ క్యూ నుంచి కారు సున్నితంగా ముందు
జారిపోయింది. దాన్నెవరూ పట్టించుకోలేదు.

* * * *

"ఫిమేల్-బర్న్స్ ఎక్కడా" అని వాకబు చేసుకుంటూ
అక్కడకు చేరుకునేసరికి దాదాపు పది నిముషాలు పట్టింది.
డాక్టర్‌ని ప్రశ్నిస్తే "ఎవరూ? అన్‌కాలజిస్ట్ మహేంద్రా! ఆయన
డెందుకుంటారు? కాన్సర్‌లో వుంటాడు" అన్నాడు.

"నేనా ఆసుపత్రి నుండే వస్తున్నాను."

"మీ కెవరో రాంగ్ ఇన్ఫర్మేషన్ ఇచ్చి వుంటారు" అని
నుండి కదిలిపోయాడు డాక్టర్.

వసుమతి హతాశురాలై ఏమీ పాలుపోక ఒక్కక్షణం అలాగే
వెనక్కి తిరిగింది. ఆమె తన గది చేరుకోబోతూ తనకి చెప్పిన న
చూసింది. కానీ ఆమె కనబడలేదు. ఆమె గదిలోకి వెళ్ళి సగం
బత్తాయిపండును చేతిలోకి తీసుకోబోతూంటే గదిలో ఏదో వెలి
బడింది, ఏదో లేక-పోయినట్టు....

అరక్షణం తరువాత అర్థమయింది. ఆ లేనిది ప
పేషెంటు—అని.

నోట మాటరాక అయోమయంగా ఆ ఖాళీ పక్కవైపే
పేపటివరకూ చూస్తూ వుండిపోయింది వసుమతి. తరువాత చప్పున
లోనికి వచ్చినదానిలా గాలిలా గదిలోంచి బయటకు వచ్చింది.

అదే సమయానికి మెట్లెక్కి పైకి వస్తున్నాడు డాక్టర్ స
తడారిన గొంతుతో "ప్రా....ప్రార్థన కనిపించటంలేదు" అంది.
చెప్తున్నది అతడికి అర్థంకాలేదు. భృకుటి ముడిపడింది– "సర్
బిగ్గరగా పిలుస్తూ లోపలికి అడుగుపెట్టాడు.

"మీరు నా కోసం కబురు పంపారని తెలిసి నేనటు రా
అంటూ ఏదో చెప్పబోతూ వుంటే అతడు మధ్యలో కట్‌చేసి "నే
పంపటం ఏమిటి?" అన్నాడు.

ఆమె జవాబు చెప్పబోయి ఏదో స్ఫురించినట్లు చప్పున ఆగి ంది.

* * * *

మోహన్‌లాల్ కపాడియా ఇన్‌స్టిట్యూట్ ఆవరణలోకి భార్గవ ప్రవేశించింది. ఎవరూ దానిని ఆపుచేయలేదు. అప్పటికి బాగా చీకటి పల్ల స్టాఫ్‌కూడా లేదు. భార్గవ సరాసరి కారుని తన లాబ్‌వరకూ వెళ్ళి ఆపుచేసాడు. పాపని ఎత్తుకుని గదిలోకి తీసుకువెళ్ళి కోబెట్టాడు. తిరిగివచ్చి కారులోంచి ఎక్స్‌ప్లోజివ్స్ ఒకటి తర్వాత ఒకటి వెళ్ళి లోపల పెట్టుకున్నాడు. తర్వాత కారు తీసుకువెళ్ళి దూరంగా పెట్టి వచ్చాడు. ముందు తలుపులు బిగించి వేశాడు. కిటికీ తలుపు సరిగ్గా లాక్‌చేసి వున్నాయో లేదో పరీక్షించాడు. బయటనుండి ఎవరు లిచినా వినపడటానికి అనువుగా హాండ్‌బాంబ్ చేతికి అందే లో పెట్టుకుని అమినో ఆసిడ్స్ వున్న బీకరువైపు నడిచాడు. నడుస్తూ నే అతని పాలభాగం ఎడమవైపు అదిరింది.

దక్షిణ కేరళ ప్రాంతంలో అలా పాలభాగం అదిరితే అతి తొంద తన మరణంగానీ తన దగ్గిర వాళ్ళ మరణంగానీ సంభవిస్తుందని ప్రతీ నమ్ముతారు. భార్గవ కలాంటి నమ్మకాలు లేవు.

* * * *

సరిగ్గా అదే సమయాన మ్రోగుతున్న ఫోన్ రిసీవర్ యెత్తి హల్లో" అన్నాడు రవూఫ్.

"నేను మహేంద్రని. డాక్టర్ మహేంద్ర జైన్‌ని మాట్లాడు తున్నా."

"చెప్పండి సర్."

అవతల్నించి చెప్తున్నది వింటూ రవూఫ్ ముఖ కవళికలు పోసాగాయి. అయితే తనేమీ మాట్లాడకుండా మధ్యలో "అచ్చా– చ్చా" అంటూ కాగితంమీద నోట్ చేసుకోసాగాడు.

జైన్ చెప్పటం పూర్తవగానే ఫోన్ పెట్టేశాడు. అతడి పెదాలమీద రమైన నవ్వు వెలిసింది.

పేషెంటుని ఎత్తుకుపోయింది భార్గవే! అందుకు సందేహంలేదు.

అతడు ముల్లోకాల్లో ఎక్కడవున్నా గంటా, రెండు గంటల్లో
గలడు. ఆ తరువాత....

రవూఫ్ నవ్వు మరింత విశాలమైనది. డ్రాయర్ తెరిచాడు.
లాడుతున్న రివాల్వర్ చేతిలోకి తీసుకున్నాడు.

తన చొక్కాల్లో ఖార్గవ కొట్టిన దెబ్బని అతడింకా మర్చి
లాకప్‌నుండి వదిలిపెడుతూ తనన్న మాటలు కూడా మర్చిపోలేదు.

కనపడగానే ఎఫ్. ఐ. ఆర్., అరెస్టు అలాంటివేమీ లేవ
చేసెయ్యటమే.

అతడు లేచి నిలబడ్డాడు.

## 5

"నాయుడూ, కదలకు!"

"నాయుడూ, కదలకు"

"నీ చుట్టూ బిగుసుకున్న క్లాంప్స్‌కి సైనేడ్ పూయబడింది."

.............

"కొంచెం టైమివ్వు" అన్నట్టు సైగ చేశాడు శేఖరం.
టేప్‌రికార్డర్ బటన్ ముందుకు నొక్కింది.

.............

"చెదరకు! నేనే శేఖరాన్ని. నీ దయవల్ల మాట్లాడలేను
కంఠం అరువు తెచ్చుకున్నాను."

అతడు బ్రెయిలీలో వ్రాసుకుపోతుంటే ఆమె మాటల్ని
చేస్తూంది.

ఆ రోజు రాత్రి నాయుడు ఇంట్లో జరగబోయే దృశ్యం
వూహించుకుంటూ, అతడు తన వంతు సంభాషణని రన్నింగ్ కా
రీలా వ్రాస్తున్నాడు. ఆమె దాన్ని టేప్‌లోకి ఎక్కిస్తూంది. అలా
అరగంట గడిచింది.

అంతకుముందే అతడు తనేం చెయ్యదల్చుకున్నాడో వివ
ప్లాన్ వేసి, దానికి కావాల్సిన సామాన్లు కొనుక్కున్నాడు. కొద్దిగా
పడుతూ వుండగా, ఇద్దరూ నాయుడింటికి బయల్దేరారు. శేఖరం
గంభీరంగా వుంది తను చెయ్యటానికి పూనుకున్న పని కష్టసాధ్యమై

...గా తను గుర్తివాడు అవటంవల్ల అది మరింత కష్టం అవుతుందనీ, ...తెలుసు. అందుకే అతడు ప్రియని ఈ వ్యవహారానికి చాలా ...లో వుంచదలిచాడు. పొరపాటున తను పట్టుబడితే, తనొక్కడే శిక్ష ...అనుభవించాలి తప్ప దీనిలో ఆ అమ్మాయి ఇరుక్కోకూడదు అని అతడి ...్యం.

వాళ్ళు నాయుడు ఇంటికి చేరుకునేసరికి మసక చీకటి పడింది. ...ఇల్లు మిగతా వాటినుంచి దూరంగా విసిరేసినట్టు వుంటుంది. ...వాచ్‌మెన్‌కి వెనుక జరుగుతున్నది ఏదీ తెలీదు. యిల్లు తాళం ...వుంది. నాయుడు కుటుంబంతో సహా గుజరాత్, భార్య పుట్టింటికి ...ఆ రోజు ఫ్లయిట్‌లో రావాలి. అదృష్టవశాత్తు అదో మూడు ...లేటు. ఈ విషయాలన్నీ ప్రియ కనుక్కుంది.

అతడు ఆ ఇంటిలోకి ప్రవేశించిన తరువాత ఆమెని వెళ్ళిపొమ్మని ...నాయుడు ఇంటిలో ప్రవేశించిన అరగంటకి వెనుకవైపు వీధి ...లో నిలబడితే, తను వస్తాడు. ఒకవేళ ప్లాను ఫెయిల్ అయ్యి, తను ...తే, ప్రియ అట్నుంచి అటే వెళ్ళిపోవాలి.

అసలిదంతా ఆమెకిష్టంలేదు. కానీ అతడి పట్టుదల ఆమెకు ...తెలుసు. కావలిస్తే ప్రియురాలినయినా వదులుకుంటాడేమో కానీ, పగ ...వదులుకోలేడు. ఈ సంగతి తెలుసుకున్నాక ఆమె మరి ఎదురు చెప్పలేదు.

ఇద్దరూ ఇంటి వెనుకవైపు నిలబడ్డారు. నీటి గొట్టం మీదుగా అతడు ...లోనికి ప్రవేశించటానికి దాదాపు అరగంట పట్టింది. ఆమె వివరించిన ఆ ...ఫోటోగ్రఫీ తీర్ధించుకోవటానికి అతడికి మరో పది నిముషాలు ...పట్టింది. ఆమె వెళ్ళిపోవటానికి సిద్ధపడింది.

అతడు జేబులోంచి ఒక కాగితాన్ని తీసి యిచ్చి క్రిందకు వెళ్ళి ...కొమ్మన్నట్టు సైగ చేశాడు. అంతకుముందే వ్రాసి వుంచి, ఇప్పుడే ...ఈ క్షణంలో ఇవ్వవలసినంత కాగితం ఏమిటా అని ఆశ్చర్యపోయింది. ...అయినా విస్మయాన్ని ప్రకటించకుండానే వెనుదిరిగింది. వెళ్ళబోతూ ...తిరిగి చూసింది.

అతడు గది మధ్యలో నిశ్చలంగా నిలబడి వున్నాడు.

అతడి ప్లాన్ ఫెయిల్ అయ్యి, ఏ మాత్రం పట్టుబడినా యిదే ఆఖరి ...సారి యిలా కలుసుకోవటం.

ఆ ఊహ రాగానే ఆమె మనసులో ప్రేమా, ఆప్యాయతా,
టిని మించిన భావం ఏదో కదలాడింది. అతడి దగ్గరికి వె
కోర్కెని అతికష్టంమీద అణచుకుని బయటకు వెళ్ళిపోయింది.
వుండగా అతడిచ్చిన ఉత్తరం జ్ఞాపకం వచ్చింది. వీధి లైటు వెలు
ఆగి, కాగితాన్ని విప్పి చదవనారంభించింది.

"ప్రియా!

నేను చేస్తున్న పని ఎంత ప్రమాదకరమైనదో నాకు
నాయుడు తప్పించుకుంటే ఇక్కడికిక్కడే నేను అరెస్టు అవుతా
వేళ నాయుడు మరణించినా పోలీసుల ఇన్వెస్టిగేషన్ బారినుం
తప్పించుకోలేను. కనీసం చేతికి గ్లౌస్ కూడా వేసుకోలేదు నేను.
నన్ను రక్షించలేవని నా ఉద్దేశ్యం. ఇంతకీ నేను చెప్పదల్చు
ఏమిటంటే— ఎటు తిరిగి ఏమయినా నాకోసం శిక్ష కాసుకుని వుంది
వంటి వాడిని ప్రేమించవలసి రావటం నీ దురదృష్టం. నన్ను మ
ఇదేదో మెలోడ్రమటిక్ డైలాగ్ కాదు. జీవితాన్ని ప్రాక్టికల్‌గా
నేను నీ కిస్తున్న సలహా!

—శేఖరం"

చదవటం పూర్తిచేసి ఆమె దూరంగా ఆ చీకట్లో వున్న ఆ
కేసి చూసింది.

ఎందుకో ఆమె పెదవులమీద సన్నటి నవ్వు కదలాడింది.

* * * *

మంచం క్రిందనుండి క్లాంప్స్ బిగించడానికి అతడు చాలా క
వలసి వచ్చింది. లివర్ లాగగానే అడుగునుండి క్లాంప్స్ పైకి వచ్చి
మీద పడుకున్న మనిషిచుట్టూ తోసులా బిగుసుకుంటాయి.
నాలుగు జతల క్లాంప్స్. మోకాళ్ళ దగ్గర ఒకటి, నడుము దగ్గర
తల దగ్గర, కాళ్ళ దగ్గర చెరొకటి.

క్లాంప్స్ బిగించడానికి ముందే అతడు తనతోపాటు తీసుకు
ద్రవాన్ని ప్రియ చూపించిన చోటునుండి ఒక్కొక్క చుక్క మంచం
పోసుకుంటూ వచ్చాడు.

మంచం క్రింద రాడ్ బిగించడానికి అతడికి దాదాపు
గంటలు పట్టింది. అతడి శరీరమంతా చెమటతో తడిసిపోయింది. నా

...నికి ఇంకా చాలా టైం వుంది. అప్పటివరకూ చేసేదేమీ లేదు. ఈ ...నా చెయ్యడానికి ఎంతసేపు పట్టిందో, నాయుడు ఇంకా ఎంతసేపటిలో ...స్తాడో, తనింకా ఎంతసేపు ఇలా వేచి ఉండాలో శేఖరానికి తెలీదు. టైం ...చూసే శక్తి అతనికి లేదు. అతడు అలాగే ఆ మంచం క్రిందే పడుకుని ...న్నాడు. క్షణం ఓ యుగంలా గడుస్తోంది. అకస్మాత్తుగా చేతిమీద ఏదో ...కింది. అతడు చప్పున చెయ్యి వెనక్కి తీసుకోలేదు, ఆనందంగా ...కున్నాడు.

తన ప్లాన్ సగంవరకూ సక్సెస్ అయినట్లే.

*     *     *     *

వేచుకున్న నిశ్శబ్దంలో చిన్న కదలిక.

అతడు కొద్దిగా కదిలాడు.

గదిలోంచి ఎవరో వచ్చిన సవ్వడి. అంటే ఆ ధ్వని అతనికి విని ...పడని కాదు. తలుపు తీసిన కదలికకి గచ్చుమీద కలిగిన కంపనం ...తోడు నాసిక అందించిన బీరువాసన.

ఫ్లయిట్ దిగి, ఇంటికి వచ్చి, బీరుతాగి ఇప్పటికి వడక గదిలోకి ...న్నమాట! అందుకే ఇంత ఆలస్యం అయింది అనుకున్నాడు ...డు. అతడి ఊహ నిజమే అన్నట్టు నాయుడు వచ్చి మంచంమీద పడు ...న్నాడు. అతడు దగ్గరకు వచ్చిన తర్వాత శేఖరానికి మొదట వచ్చింది ...వాసన అదోరకం ఫారిన్ సెంటుసీ, కేవలం నాయుడే దానిని వాడ ...సే గుర్తువచ్చింది. అతడు సంతృప్తి చెందాడు. అయినా ఏ విధ ...మైన చర్య తీసుకోదలచుకోలేదు. ఒకవేళ అతడు ఇంకా మంచంమీద ...కూర్చుండానే కూర్చుని ఉండగా క్లాంప్స్ షట్ చేస్తే అతడు తప్పించుకునే ...కాశం వుంది.

అందుకనే నాయుడు గదిలోకి ప్రవేశించాడని తెలియగానే క్రింద ...స్తున వెల్లకిలా పడుకుని ఉన్న అతడు మంచం క్రింద స్ప్రింగుల ...కరం అనేచోట ఒకచెయ్యి, నడుమనేచోట మరో చెయ్యి, కాళ్ళు ...చోట తనకాలు పెట్టి వుంచాడు.

శబ్దమూ, దృశ్యమూ గ్రహించలేని ఆ అశక్తుడయిన యువకుని ...మీ, తెలివి తేటలనీ, దృఢ నిశ్చయాన్ని గమనిస్తున్నట్టు ఆ రాత్రి ...డిగా వుంది.

మంచం దగ్గరకు వచ్చి నాయుడు దానిమీద పడుకున్నట్లు స్ప్రింగుల కదలికవల్ల గ్రహించాడు, మరి ఇక ఆలస్యంలేదు. చేతులతో పట్టుకుని గట్టిగా లివర్ లాగాడు.

ఆదమరచి గడ్డిపరకలు తింటున్న లేడిపిల్లమీదకు ఏమ వెనకనుండి పులిపంజా వచ్చినట్టూ మంచాని కిరువైపుల ము చప్పుడుతో క్లాంప్స్ వచ్చి బిగుసుకున్నాయి. వెంటనే శేఖ నొక్కాడు.

"నాయుడూ, కదలకు!"

ఇంత అకస్మాత్ పరిణామాన్ని నాయుడు వూహించలేదని గట్టిగా తోసేస్తే క్లాంప్స్ చెరోవైపుకీ పడిపోతాయని శేఖరానికి అందుకే టేప్‌రికార్డర్‌లో రెండో వాక్యం వచ్చేవరకూ ఆగాడు.

"నీ చుట్టూవున్న క్లాంప్స్‌కి సైనేడ్ పూయబడి వుంది."

స్టీలు షాపువాడికి ఆర్డరు ఇచ్చి క్లాంప్స్ తయారు చేయిం చాప ముళ్ళలాంటి చిన్న చిన్న సూదిమొనలు వచ్చేటట్లు ఆ ఇన తయారు చేయించాడు శేఖరం. ఏ మాత్రం వాటిని తొలగి టానికి ప్రయత్నించినా ఎక్కడో ఒకచోట సూది గుచ్చుకోవడం పక్కమీద బందీ అయిన నాయుడికి ఇదంతా అయోమయంగానే దనీ, ఆ అయోమయంలో పొరపాటున క్లాంప్స్ తొలగించే ప్ర చేస్తే కష్టమనీ భావించి శేఖరం మంచం క్రిందనుండి బయటికి అతడు వస్తూండగా టేప్‌లో మూడో వాక్యం వినబడింది.

"బెదరకు, నేనే శేఖరాన్ని! నీ దయవల్ల మాట్లాడలేన కంఠం అరువు తెచ్చుకున్నాను. ఆగు కదలకు! సైనేడ్ తగిలినా నీ మరణం ఖాయం."

శేఖరం టేప్‌రికార్డర్ దూరంగా పెట్టి మంచం దగ్గరగా నాయుడిని తడిమి చూశాడు. అప్పటికే అతడి వళ్ళు చల్లగా చెమటతో తడిసి ముద్దయిపోయింది. అతడో కంపెనీ యజమాని గురించి అతడికి బాగా తెలుసు. మృత్యువు రెండంగుళాల దూరం వుంటే చెమటలు పట్టకేం చేస్తుంది?

శేఖరం పెదవులమీద నవ్వు వెలసింది.

"ఒకప్పుడు నేనూ ఇలాగే బాల్కనీ గోడ పట్టుకుని

…్ నాయుడూ! బ్రతుక్కీ, చావుకీ మధ్య ఊగిసలాడావు. అప్పుడే …లో తెలుసా?"

శరీరం తనతోపాటూ తెచ్చిన ద్రవాన్ని నాయుడు శరీరంమీద …గా చల్లాడు. రెండు మూడు చుక్కలు అంచులకి రాశాడు.

టేప్‌రికార్డర్‌లో వస్తున్న మాటలు, వాక్యానికీ, వాక్యానికీ మధ్య …ంగ్, ఏ వాక్యం ఎప్పుడొస్తుందీ, దీని తర్వాత ఏ పని చెయ్యాలీ– …్ని చావు ఇరవై సార్లు రిహార్సల్ వెయ్యడం వలన ఎక్కడా తడబడ …ా తనే మాట్లాడుతూ పనులు చేసుకుంటూ పోతున్నట్లు వుంది. …ు కంఠం మాత్రం స్త్రీది. అంతే!

"ఈ ద్రవం తేనె, నువ్వు ఎయిర్‌పోర్టు నుంచి ఇంటికి వచ్చే సమ …టి చీమల్ని నీ మంచంవరకూ ఆహ్వానించాను. ఇప్పుడిక ఇవి మంచం …ి నీ శరీరాన్ని ఆక్రమిస్తాయి."

శరీరం తడుముకుంటూ వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

"ఇప్పుడు నీ మొహాన్ని చూడాలని నాకెంతో కోరికగా వుంది. …టని ఆశల్లో ఇదొకటిగా మిగిలిపోయింది. నీ కసలు తెలివిలేదు …యుడూ! నీ దగ్గర్లో సైనేడ్ వుందని నాకు తెలుసు. నీకే మాత్రం …ు తెలిసినా నేను తడిమి చూడటానికి నీ దగ్గరికి వచ్చినప్పుడు …టానికి ఓ ఒక్కముల్లు గీసుకుపోయేటట్లు చేసినా నేనక్కడ …క్కే మరణించి ఉండేవాణ్ని. ప్రాణభయంతో నీకే ఆలోచన కూడా …వడం నీ దురదృష్టం. నీకా మాత్రం ఆలోచన కూడా రాదని నేను …కే ఊహించి అదికూడా టేప్ చేశాను.

మిస్టర్ నాయుడూ! అరవడానికి ప్రయత్నించకు. అరిచినా ఈ …గొంతు బయటికి వినిపించదు. ఇంకో అయిదు, పది నిముషాల్లో …లు కుట్టడం ప్రారంభిస్తాయి. ఓర్చుకోవడానికి ప్రయత్నించు, …మరి. తెల్లవారేవరకూ ఓర్చుకుంటే పొద్దున్న వరకూ నువ్వు బ్రతి …ీ అదృష్టం బాగుంటే పొద్దున్న ఎవరో వచ్చి రక్షిస్తారు. లేదూ– …ధ భరించలేనూ అంటే.... చాలా సులభం! నీ చేతిని కొంచెం …గా పైకెత్తు క్లాంప్స్ గుచ్చుకుని క్షణాలమీద చచ్చిపోతావు. …త సులభమయిన మరణం కావాలో, ఈ రాత్రి నీ జీవితపు కాళ …గా మార్చుకుంటావో నీ మీద ఆధారపడి వుంది" టేపు ఆగింది.

శేఖరం టేపు రికార్డర్ చేతిలోకి తీసుకున్నాడు. గుమ్మం నడిచాడు. అక్కడ ఆగి తన మనసులోని ఆఖరి వాక్యాలకోసం క్షణం నిలబడ్డాడు.

"ఆ రాత్రికూడా నేను ఇలాగే నిస్సహాయంగా ఏమీ క్షణం క్షణం భయంతో రాత్రంతా గడిపాను. ఇదిగో ఈ క్షణం ఇన్నాళ్ళూ ఎదురు చూసాను. ఏ చీమలయితే నన్ను అందుకే ఆ చీమలే నీ భవితవ్యాన్ని నిర్ధారణ చేయబోతున్నాయి. ఈ శిక్ష నా తరఫు నుండి వ్యక్తిగత మయిందే కాదు, మందులో కల్తీచేసి ధరల్లో మోసం చేసినందుకూ నీ పాపానికి పరిహారం.... గుడ్‌బై"

* * * *

అతడు బయటికి రావటానికి కొద్దిగా కష్టం అయింది. లోనూ చేతిలో టేప్‌రికార్డర్ ఉండటంచేత రావడానికి దాదాపు నిముషాలు పట్టింది. వీధి మొదట్లో ప్రియ ఎదురుచూస్తూ వుంది. కలిసి ఇంటికి వచ్చేసరికి దాదాపు పన్నెండు కావస్తోంది.

"నువ్వు ఇంటికి వెళ్ళవా?"

"ఊహూఁ! వెళ్ళను. ఇక్కడే వుంటాను" ఆమె వ్రాసింది.

"ఈ కథ ఎలా ముగుస్తుందో నాకు తెలీదు ప్రియా! నా బ్రతికివున్నా, చచ్చిపోయినా నేను అరెస్టు అవటం ఖాయం. హత్య చెయ్యటానికి ప్రయత్నించినా శిక్ష దాదాపు సమానమే. నేరస్థుడితోపాటు ఈ రాత్రి వుండి నీ కారెక్టర్‌కి మచ్చ తెచ్చుకో

ఆమె వినలేదు. అతడు బలవంతంగా ఒప్పుకోవలసి ఆ రాత్రి అతను నిద్రపోలేదు. అనుక్షణం నాయుడ్ని ఊహించు గడిపాడు.

తెల్లవారింది. దాదాపు తొమ్మిది అవుతుండగా శేఖరం సూచన ఇచ్చాడు. "ఈ పాటికి ఎవరో ఒకరు లోపలికి ప్ర వుంటారు. అక్కడి పరిస్థితి ఎలా వుందో ఫోన్ చెయ్యి. చెప్పకు. కేవలం నాయుడి కోసం చేసినట్లు మామూలుగా చెయ్యి."

ఆమె ఫోన్ అందుకుని డయల్ చేసింది. అటునుండి

మోగింది. నిముషం తరువాత అవతలవైపు రిసీవర్ ఎత్తిన ధ్వని వినిపించింది. "హలో" అంది. "కెన్ ఐ స్పీక్ టు మిస్టర్ నాయుడు?"

శేఖరం ఊపిరి బిగపట్టాడు.

మరో నిముషం మాట్లాడి, ప్రియ ఫోన్ పెట్టేసింది.

ఆమె చెప్పబోయే విషయం వినటం కోసం అతడు ఆతృతపడుతున్నాడు. అతడి గుండె వడివడిగా కొట్టుకుంటూంది. 'ఏమైంది' అన్న ప్రశ్న అతడి మొహంలో స్పష్టంగా కనబడుతూంది....

ఆమె బ్రెయిలీలో చెప్పింది. "నాయుడిని అపస్మారక స్థితిలో ...గా ప్రొద్దున్న నౌఖరు చూశాడట. ఒళ్ళంతా దద్దుర్లతో ఆస్పత్రిలో చేర్చారట."

శేఖరం బిగ్గరగా నవ్వేడు. అతడింత గట్టిగా నవ్వటం ఆమె ఎప్పుడూ చూడలేదు.

"అదృష్టవంతుడు బ్రతికి బయటపడ్డాడు. పాపం రాత్రంతా భయంతో బిర్రబిగుసుకుపోయి ఉంటాడు. ఒక్కొక్క చీమా ఒక్కొక్క చోట కుడుతూ వుంటే కదల్లేక మెదల్లేక సతమతమైపోయి ఉంటాడు.... మధ్యలో.... పాపం తన చుట్టూ కాంప్లెక్స్‌కు నిజంగా సైనేడ్ పూయబడిందే అనుకుంటున్నాడు, దాన్ని ముట్టుకోవటానికి భయపడి ఉంటాడు. అసలు సైనేడ్ సంపాదించటం ఈ పరిస్థితుల్లో నాకు సాధ్యంకాదు అన్న చిన్న వూహకూడా అతడికి ఎందుకు రాలేదో?.... తలుచుకుంటే నవ్వొస్తోంది. ప్రొద్దున్నే నౌఖర్‌కి ఈ సైనేడ్ సంగతేమీ తెలీదు కాబట్టి మామూలుగా చేతితో వాటిని తీసేసి వుంటాడు."

ఆమె అచేతనంగా వుండిపోయింది. క్లాంప్స్‌కి సైనేడ్ పూయబడలేదన్న విషయం ఆమెకు కూడా తెలుసు. శేఖరం ఆమెకు ముందే చెప్పాడు.

"కేవలం చీమకాటువల్ల స్పృహ తప్పడు. భయంవల్ల కలిగిన అపస్మారక స్థితినుంచి ఈపాటికి అతడు బయటపడి ఉంటాడు. పోలీసులకు జరిగినదంతా చెప్తూ ఉండి ఉంటాడు. ఇంకో గంటలోనో- రెండు గంటల్లోనో నన్ను అరెస్టు చేయటానికి పోలీసులు వస్తారు."

ఆమె దానికి సమాధానం చెప్పలేదు.

గంట గడిచింది.

ఎవరూ రాలేదు.

శేఖరంలో టెన్షన్ పెరగసాగింది. అయిపోవటం వేరు,
తూందని ఎదురు చూడటం వేరు. ఇక ఆపుకోలేక ఆమెను తిరి
ఫోన్ చెయ్యమన్నాడు. ఆమె ఫోన్‌చేసి, రిసీవర్ పెట్టేసి, '
ఆస్పత్రినుంచి తిరిగి వచ్చేశాడని, రెస్టు తీసుకుంటున్నాడని' చెప్పి

అతడు ఆశ్చర్యపోయాడు. 'పోలీసులకేమీ చెప్పలేదా?'

"అసలు పోలీసు లెవరూ రానేలేదట"

"రాలేదా?"

"లేదు. క్లాంప్స్ విషయం కూడా ఎవరికీ చెప్పవద్దని
హెచ్చరిస్తున్నాడు. నేను కొంచెం బెదిరించేసరికి నాతో చెప్పేశాడు

శేఖరం ఆలోచనలో పడ్డాడు. అంతలో ఏదో స్ఫురిం
అదన్నమాట సంగతి" అన్నట్టూ తల పంకించాడు.

"అతడిమీద నేను పోలీసు రిపోర్టు ఇవ్వలేదు. నా
తీర్చుకున్నాను. ఇప్పుడు అతడు కూడా అదే విధంగా
'స్వయంగా' తనే పగ తీర్చుకోవటానికి ఏదో పథకం ఆలోచిస్తు
మాట.... చూద్దాం ఏం చేస్తాడో!"

ఆమె దానికన్నా ఏమీ మాట్లాడలేదు.

అయితే ఆ తర్వాత ఎన్ని రోజులు గడిచినా నాయుడి ద
రెస్పాన్స్ రాలేదు. రాదన్న సంగతి ఆమెకి తెలుసు. శేఖరం ఆ
భ్రాంతిలో ఉండటమే మంచిది.

నాయుడు ఆ రాత్రి విమానంలో రాబోవటంలేదన్న
తనకి ముందే తెలుసుననీ, కావాలనే తప్పుడు ఇన్ఫర్మేషన్ ఇ
ఆ రాత్రి శేఖరంతో పాటూ తను కూడా ఆ ఇంట్లో ప్రవేశించి
వాడే సెంట్‌సీసా ఉపయోగించిందనీ, శేఖరం తడిమి చూసిం
చేతినేననీ, శేఖరం నాయుడు ఇంటినుంచి బయటకు రాగానే
బిగించిన క్లాంప్స్ విప్పి వాటిని తీసుకుని తనూ బయటకు వచ్చే
శేఖరానికి ఎప్పటికీ తెలిసే వీలులేదు. తన కాబోయేభర్త అంధ
చెముడునీ ఆ విధంగా ఉపయోగించుకోవలసి రావటం విధా
అయినా హంతకుడుగా తననుంచి వేరుపడటం ఇష్టంలేక ఆ
రిస్కు తీసుకోక తప్పలేదు.

కేవలం మాత్రం నాయుడు ఎప్పటికయినా తనమీద పగ తీరు ...లని ఎదురుచూస్తూనే ఉన్నాడు.

## 6

రవూఫ్ ఒకవైపునుండి చకచకా ఎంక్వైరీ పూర్తిచేసుకుంటూ ...న్నాడు. 'ప్రార్థన కనబడటంలేదు' అన్న న్యూస్ అందిన వెంటనే ...హుటిన ఆస్పత్రికే వెళ్ళాడు. వసుమతికి 'డాక్టర్ జైన్ పిలుస్తు ...న్నారు' అని కబురందించిన నర్సుని వాకబుచేస్తే తనకా విషయం చెప్పిన ...పోలికల్ని ఆమె వివరించింది.

అవి భార్గవకి సరిగ్గా అతికినట్లు సరిపోయాయి. క్రింద మెట్ల దగ్గర ...లో పడిఉన్న చక్రాలకుర్చీ మిగతా విషయాల్ని ఋజువు పరచింది. ...ప్రార్థనని తన కారులోనే తీసుకువెళ్ళాడని నిర్ధారణ అయింది.

రవూఫ్ వెంటనే పోలీస్‌స్టేషన్‌కి తిరిగివచ్చాడు. ఊరి బయటకు ...దార్లన్నింటిలో ఉన్న పోలీస్ స్టేషన్లకి భార్గవ కారు నెంబరుచెప్పి ...తక్షణం ఆపుచేయమని మెసేజ్ ఇచ్చాడు. ఆ తరువాత సిటీలో ...డయినా ఆ కారు కనబడుతుందేమోనని సెర్చ్‌పార్టీని నలువైపులకి ...పించారు.

భార్గవ ఒకవేళ కూతుర్ని ఇంటికి తీసుకు వెళ్ళాడేమోనని అక్క...డా పంపించాడు. కానీ అక్కడ దొరకలేదు. సరిగ్గా ఒంటిగంట ...ఖండగా అతడి ముందున్న ఫోన్ మ్రోగింది. దానికోసమే ఎదురు ...స్తున్నట్టు రిసీవర్ చప్పున అందుకున్నాడు రవూఫ్. అవతల్నించి ...జ్ వచ్చింది.

మోహన్‌లాల్ కపాడియా ఇన్‌స్టిట్యూట్ ఆవరణలో కారు కన ...డ్డ... రవూఫ్ ఆనందంతో సన్నగా విజిల్ వేశాడు. ఆస్పత్రి ఆవర ...నుండి కంటెంప్ట్ ఆఫ్ కోర్టుక్రింద పేషెంటుని తీసుకువెళ్ళడం ... ఇంకొకసారి ఆవరణలోకి క్రిమినల్ ట్రెస్‌పాస్ క్రింద ప్రవేశిం... మరింత పెద్దనేరం. శంకర్‌లాల్ నుండి వ్రాతపూర్వకంగా ...తీసుకుండే దొంగతనం చేస్తూ పట్టుబడి, పారిపోవడానికి

ప్రయత్నించాడనీ అప్పుడు షూట్ చెయ్యవలసి వచ్చిందని పై అధికా
చెప్పవచ్చు.

హుషారుగా బయటకు నడిచాడు రవూఫ్.

అతడు శంకర్‌లాల్ దగ్గరకు చేరుకునేసరికి ఒంటిగంట
కావొస్తూంది. రవూఫ్ చెప్పిందంతా విని శంకర్‌లాల్ విచలితుడయ

"కారు మా ఆవరణలో వుందా?"

"అవును సార్. మీరు కంప్లయింట్ వ్రాసిచ్చారంటే ఎ
వున్నా అరెస్ట్ చేస్తాను."

"ఎక్కడున్నా— అన్న ప్రశ్న లేదు. అతడు మా ఇన్‌స్టిట
లోనే– మా లాబ్‌లోనే వున్నాడు" సాలోచనగా అన్నాడు శంకర్‌
ఇన్‌స్పెక్టర్ అవాక్కయ్యాడు.

"అవును ఇన్‌స్పెక్టర్. అతడు అక్కడికి ఎందుకు చేరుకున
కూడా నేను వూహించగలను. పాపం తను ఇంతకాలం వున్న లాబ్
తన థియరీమీదా ఇంకా మమకారం పోలేదన్నమాట."

"మనం పోగొడ్దాం సార్" నవ్వేడు రవూఫ్. శంకర్‌లాల్
నవ్వుతూ "అతడిని అక్కడనుండి లేపగొట్టటానికి కంప్లయింట్
వ్వాలి. అంతేగా" అన్నాడు.

"ప్రవేశించినందుకు వ్రాసివ్వండి సార్. ఎక్కణ్నుంచి లేవగొ
నేను చూసుకుంటాను."

"ఎందుకు అతడిమీద నీకు అంత పగ?" వ్రాస్తూ అడిగాడు.

"నన్ను కొట్టినవాడు ఇంతవరకూ లేడు సార్. ఆ రోజు స్టేష
దానికి జవాబు చెపుదామంటే మీరువచ్చి విడిపించారు. అప్పటి
అలాగే వుండిపోయింది."

"విడిచిపెట్టినందుకు మా ఋణం తీర్చుకున్నావు కరచ
కాగితం అందిస్తూ అన్నాడు. "....ఈ రోజు శలవు కాబట్టి పరిపో
కానీ రేప్రొద్దున్న తొమ్మిదింటికి ఉద్యోగులందరూ వచ్చేస్తారు.
చేరుకునే లోపులో అంతా పూర్తవ్వాలి. అక్కడో నీకు తయారు
నా కిష్టంలేదు."

"రేపు తొమ్మిదా! అంతవరకూ ఎందుకు సార్. ఇంకో అరగం
మొత్తమంతా పూర్తి చేసెయ్యనూ."

"మంచిది ఇన్‌స్పెక్టర్. మళ్ళీ మేం మీకు ఋణపడే అవకాశాన్ని
వ్వారన్న మాట" గంభీరంగా నవ్వేడు.

రవూఫ్ మొహం ఆనందంతో విశాలమైంది. రివాల్వర్ సర్దుకుంటూ
సాబ్.... థాంక్స్" అన్నాడు.

ప్పటికీ జరగవలసింది అర్థమయింది. పద్మశ్రీ చంపాలాల్,
లాల్‌కి చాలా కావల్సినవాడు.

* * * *

ంకర్‌లాల్ దగ్గరనుంచి రవూఫ్ వ్రాతపూర్వకమైన కంప్లయింట్
టున్న సమయానికి శేఖరం ప్రియతో కలిసి యింటిమెట్లు దిగు
న్నాడు. "మనం ఎక్కడికి వెళుతున్నాం" అని అడుగుతోందామె.

డ్రైయిరీ బాగా అలవాటు అయితే షార్టుహాండ్‌లాగే షార్టుకట్‌లో
గోవచ్చు. చిన్న స్కేలులాంటి పరికరంతో నడుస్తూనే వాళ్ళు
నిస్తున్నారు.

"నాయుడికి జరిగిన పరాభవం సంగతి తెలిస్తే సంతోషించేవాళ్ళు
కున్నారు. అతడి దగ్గిరకి వెళుతున్నాం మనం."

"ఎవరు?"

"భార్గవ"

"ఇంటికా" అతడిని తీసుకువెళ్ళటం కోసం అడిగింది.

"కాదు, ఇన్‌స్టిట్యూట్‌కి"

"ఈ రోజు ఆదివారం, శలవు"

"భార్గవలాంటి సైంటిస్టులకి ఆదివారాలూ శలవలూ ఉండవు."

'కన్నకూతురు మరణశయ్య మీద వుంటే ఏ తంత్రీ ప్రయోగాలు
కార్చేదు' అని చెప్పదామనుకొని, మళ్ళీ అతడు బాధపడతాడని
. ఇప్పుడు భార్గవకి కూడా నాయుడి విషయం— అసలు
— చెప్పాలి.

వాళ్ళు ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళేసరికి పావుతక్కువ రెండయింది.

ఇన్‌స్టిట్యూట్ వాచ్‌మెన్ శేఖరానికి శాల్యూట్ చేశాడు. అయితే
కొత్తగా వచ్చినవాడు. శేఖరం, ప్రియలు అందులో పనిచేసే
నే అనుకున్నాడు.

ఆ రోజు శలవు అవటంవల్ల ఆ వాతావరణమంతా నిర
ముగా ఉంది. దూరంగా ఒక కారు దగ్గిర మాత్రం ఇద్దరు పో
నిలబడి ఉన్నారు. వాళ్ళు తమ ఇన్‌స్పెక్టర్ కోసం ఎదురు చూస్తు
తమకు రెండువందల గజాల దూరంలోనే తాము వెతుకుతున్న
వున్నాడని వారికి తెలీదు.

శేఖరం ప్రియతో సహా తనకి అలవాటయిన కారిడార్
భార్గవ లాబ్ చేరుకున్నాడు.

ఇన్‌స్టిట్యూట్ ప్రశాంతంగా, నిశ్శబ్దంగా వుంది. సముద్ర
ములో అగ్నిపర్వతం పేలటానికి కొద్దికొద్దిగా ఆయత్తమ
వ్వడు, రాబోయే ప్రమాదాన్ని గ్రహించి సకల చరాలూ దూరం
పోగా స్తబ్దత పొందుతున్న సాగర జలాల్లా వుంది అక్కడ ప్రశాం

వాళ్ళు వెళ్ళే సమయానికి భార్గవ మోనోక్లోనల్ యాంటీ
ఇన్‌ఫ్యూజ్డ్ చేసే కల్చర్ ఛాంబర్ దగ్గిర వున్నాడు. కల్చర్ ఛా
మూడు నాలుగు నెలలపాటూ రోగి శరీరంలోనే ఆపరేష
అమరుస్తారు. అది తన పని తాను చేసుకుపోతుంది. దాన్ని శాశ
అమర్చటం పట్ల ఇంకా ఏకాభిప్రాయం కుదరలేదు. ఈ ఛాం
వాడబడే హోమోపోలిమర్‌ని అతడు తన ప్రయోగంలో ఉపయ
దల్చుకున్నాడు. ఈ పలుచటి పొరే యాంటీబాడీస్ డిఫ్యూజ్ అ
తోడ్పడుతుంది.

ఒక కన్ను బయట ద్వారంమీద ఉంచి, మరోవైపు ల
చూసుకోవటం అతడికి కష్టం అవుతూంది. తానెక్కడున్నదీ గ
టానికి బహుశా పోలీసులకి ఎక్కువకాలం పట్టకపోవచ్చు. ఏ క్ష
వాళ్ళు వస్తారు.... మాటిమాటికీ ద్వారంవైపు చూస్తూ ఉండట
అతడి ఏకాగ్రత ప్రయోగం మీద నిలవటంలేదు.

సరిగ్గా అదే సమయానికి దూరంగా అడుగులచప్పుడు విన
అతడు చప్పున టేబిల్ దగ్గరికి పరుగెత్తి ఎక్స్‌ప్లోజివ్ తీసుకొ
వేగంతో గుమ్మం దగ్గిరకి పరుగెత్తాడు. కానీ అతడూహించినట్టు
శేఖరం, ప్రియ వస్తూ కనబడ్డారు. ఆ సమయంలో వాళ్ళు అ
ఎందుకు వస్తున్నారో అతడికి అర్థంకాలేదు. ప్రియ, భార్గవని అ
చూసి తన అభిప్రాయం తప్పయినందుకు విస్మయం చెం

డుగుబు వేయగానే లోపల దృశ్యం కనబడింది. లోపల కుని వుంది.

పె అవాక్కయి నిలబడింది.

మె శేఖరానికి తెలీదు. అతడు ఆమెకి భార్గవ ఉన్నాడా అని దేసున్నాడు. అదే సమయానికి భార్గవ వచ్చి శేఖరం చేతిని లోకి తీసుకున్నాడు.

ప్ప జ్ఞానేంద్రియాలు పోతే, మిగిలిన ఇంద్రియాలు మరింత క్తి సంతరించుకుంటాయంటారు. కేవలం స్పర్శని బట్టి భార్గవ లో వున్నాడని గ్రహించాడు శేఖరం. 'ఏమైంది' అన్నట్టు డు....

ని నిముషాల్లో భార్గవ జరిగినదంతా సంక్షిప్తంగా, అయిన ఏ మా వదలకుండా శేఖరానికి చెప్పాడు.

రిగినదంతా చదువుతూంటే శేఖరం మొహంలో రంగులు యి. ఇది.... యిదంతా నిజమేనా అన్న అనుమానం కలిగి, డుసార్లు చదవవలసి వచ్చింది. తన పరోక్షంలో ఇన్ని విష నాయని అతడికి తెలీదు. చదవటం పూర్తి చేసేసరికి అతడి వాల్సిన స్థానంనుంచి రెండు నీటి చుక్కలు చంపల మీదకు !

ాయితితో— పట్టుదలతో తను నమ్మిన ఒక అంశం మీద చెయ్యాలనుకున్న ఒక సైంటిస్టుకి యెన్ని కష్టాలు? జరుగు న్యాయాన్ని ప్రజలకు విప్పి చెప్పటం కోసం తాపత్రయపడ్డ ఒక కి ఎంత వ్యతిరేకత!! మానవ కళ్యాణం కోసం అన్నీ త్యాగం న్న ఒక మహర్షి చుట్టూ ప్రశాంతమయిన ఆలయాన్ని నిర్మించ యి ఈ ప్రజలు, పోలీసులు, న్యాయస్థానాలు, అధికారులు— కూడా అతడిమీద తలో రాయీ విసరటానికి ప్రయత్నిస్తు

హాయతా, వేదనా, సానుభూతి మొదలయిన భావాలన్నీ ఒక్క మ్ముట్టి అతడు చిగురుటాకులా కదిలిపోయాడు, ఇంతకన్నా ళ్ళ ఎదుర్కొన్న శేఖరం....

గితం తీసుకుని ఒకే ఒక వాక్యం వ్రాసి భార్గవకు అందించాడు.

"నేనూ నీతో ఉంటాను"

భార్గవకు అర్థంకాలేదు. "....ఏమిటి?"

"ఈ క్రమంలో నన్నూ పాలుపంచుకోనివ్వు. మంత్రాలు చదవలేను కానీ మంట ఆరకుండా అరచేతుల గలను."

భార్గవ కళ్ళు చెమ్మగిల్లాయి. అతడు ఈ మాత్రం చాలాకాలం నుండీ నోచుకోలేదు. గాద్గదికమైన కంఠంతో 'సరే

ఆ మాటలు శేఖరానికి వినిపించలేదు. భార్గవ ఏం అతడికి అనవసరం కూడా! అతడో నిర్ణయానికి వస్తే బ్రహ్మ వచ్చినా దానికి తిరుగులేదు. సైన్యంలో అధికారాన్ని అప్ప తీసుకున్న లెఫ్టినెంట్ లా "మనం ఇక్కడ ఎన్ని రోజుల వుంటుంది?" అని అడిగాడు.

"నాకు వచ్చిన వూహ సరైనదో కాదో ప్రయో వరకూ.... ఈ లోపులో ప్రార్థనకి ఏదైనా అయితే...." వా చేయలేకపోయాడు భార్గవ.

దాన్ని పట్టించుకోలేదు శేఖరం. ఇతడు ప్రాక్టికల్ మ

"ఈ గదిని మనం దాదాపు ఎయిర్—టైట్ చెయ్యా తెలియకుండా ఎవరూ ఈ గదివైపు కనీసం చూడటానికి కూడా చెయ్యకుండా బందోబస్తు చెయ్యాలి. అదంతా సరే.... మరి ఇవి తిండి?"

భార్గవ గతుక్కుమన్నాడు. ఇంతవరకూ తనకీ విషయ రాలేదు. అణు నిర్మాణం, కణ విచ్ఛేదంలాంటి విషయాల గు చించగలడు తప్ప ఇలాటి సమస్యలు తట్టవు. కేవలం ప్రార్థన మయినవి మాత్రమే తీసుకున్నాడు.

ఈ లోపులో శేఖరం ప్రియ వున్నవైపు తిరిగాడు. అర్థమయిందిగా! నాయుడి కేసుతో నీకీ క్రిమినల్స్ బాధ దనుకున్నాను. ఇప్పుడీ రెండో కేసు వచ్చిపడింది. చెప్పు, సెక్రటరీ?"

ఆమె వస్తూన్న కోపాన్ని అణుచుకుంది. "అనుమానా వేస్టు చెయ్యకండి. ఏమేం కావాలో త్వరగా చెప్పండి"

"టి.... వారం రోజులుకి సరిపడా ఏ గడ్డి దొరికితే అది"
చి వేగంగా బయలుదేరబోయింది.
"ఉండు" అన్నట్టూ సైగ చేశాడు. ఆమె ఆగింది. అతడు అందిం
కం అందుకుంది. అందులో ఇలా వుంది.
"ఏదైనా జరగొచ్చు. మా తలకు మించి మేము చేస్తూన్న ఈ
లో మా ప్రాణాలకే మోసం రావచ్చు. అలాగే కాపీ అయితే.
...."

ర్ధాంతరంగా ఆగిపోయిన ఈ వాక్యాన్ని చూసి ఆమె తల ఎత్తింది.
తడు కుడి అరచేతిలో ఎడమచెయ్యి పిడికిలి బిగించి రెండు
వేళ్ళు గోపురంలా ఆనించాడు.
ఆమె సిగ్గుపడలేదు. ఎందుకో అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు
. కానీ సెంటిమెంటుకి ఇది టైమ్ కాదు. దాదాపు పరుగెడు
ఆమె అక్కడ్నించి కదిలింది.

*　　　*　　　*　　　*

జరీలాల్ దగ్గరనుంచి రవూఫ్ తిన్నగా ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళ
స్టేషన్‌కి వెళ్లాడు. భార్గవ ఎక్కడున్నాడో తెలిపిన తర్వాత ఇక
కొంపరలేదు. ఒక్కో వేపునుంచి వల పన్నుకుంటూ వస్తున్నాడు.
పరింటెండెంట్ ఆఫ్ పోలీస్ దగ్గరికి వెళ్ళి జరిగినదంతా
కావలసినచోట మాత్రం 'కొద్దిగా' విశ్లేషణాలు చేర్చాడు.
నుంచి ఒక పాప అపహరణ.... కొన్ని లక్షల రూపాయల విలువ
యోగశాల ఆక్రమణ.... దగ్గరకొచ్చి బంధించటానికి ప్రయత్నిస్తే
చంపేస్తామని బెదిరింపు.... వగైరా....
తనికి కావాల్సిన ఫలితాన్ని పై అధికారి నించి పొందగలిగాడు.
దాని హైజాకింగ్‌తో సమానం. యూ ట్రీట్ ది బాస్టర్డ్ అకార్డింగ్లీ"
ఎస్. పి.
వూఫ్‌కి కావల్సింది అదే!
పని చేసి తరువాత చెప్పటం వేరు; చెప్పి తరువాత చేయటం
అతడు తెలివయినవాడు.

*　　　*　　　*　　　*

వారంరోజులకు సరిపడా ఏం కావాలో ఆమెస వె
బ్రెడ్, జామ్ కొన్నది. ఫ్రూట్స్ కూడా తీసుకుంది. దారి
చూసిందామె.

అయినా అసలు వాళ్ళేం చెయ్యబోతున్నారో ఆమెకి
అర్థంకాలేదు. ముందు ముందు ఏం జరుగుతుందో కూడా
అనూహ్యంగానే వుంది. ఆలోచనలతోనే పని పూర్తి చేసుకుని
తిరిగి ఇన్‌స్టిట్యూట్‌కి బొమ్మంది.

ఊరి చివర ఇన్‌స్టిట్యూట్. ఇంకో రెండు కిలోమీటర్ల
చిన్న శబ్దంతో ఆటో ఆగిపోయింది. డ్రైవర్ దిగి తను కూర్చు
ఎత్తి ప్లగ్ విప్పసాగేడు. ఈ ఆలస్యం ఆమెని కంగారు
డ్రైవర్ ఇసుక కాగితంలో వేసి ప్లగ్‌ని శుభ్రం చెయ్యసాగేడు.

"నేనింకో ఆటోలో వెళ్ళిపోతాను" అందామె.

"క్షమించండి మేంసాబ్! ఏక్ మినిట్ మే హోజాయేగా!!"
అతడు. కానీ మొత్తం అంతా అయ్యేసరికి పది నిముషాలు పట్టి
పది నిముషాలు ఆమెకి ముళ్ళమీద కూర్చున్నట్టే వుంది. ఆమె
దుకో కీడు శంకించసాగింది.

ఇన్‌స్టిట్యూట్ ప్రహరీగోడ పక్కనుంచి ఆటో వె
లోపలి ఆవరణలోకి తొంగిచూసి అప్రయత్నంగా 'ఆపు' అని

రోడ్డు మధ్యలో కీచుమని శబ్దం చేస్తూ ఆటో ఆగింది.

కాళ్ళలో సత్తువ లేనట్టూ, దిగటానికి ఓపిక లేనట్టూ ఆమె
కూర్చుండిపోయింది. కాళ్ళముందు తిండి పదార్థాల బుట్ట పరిహా
కనబడింది.

ఇన్‌స్టిట్యూట్ ఆవరణలో ప్రతి చెట్టుకి దాదాపు ఒ
చొప్పున నిలబడి వున్నాడు. వ్యాన్ పక్కనే వున్న రఘ
ఆదేశాలిస్తున్నాడు.

పోలీసుల ఉనికిని మొట్టమొదట గమనించినవాడు భార్గవ
చూసి అతడు స్తంభించిపోయాడు. అంత తొందరగా వాళ్ళు
స్కాని, చుట్టుముడతారని ఊహించలేదు.

అతడు శేఖరానికి బయట జరుగుతున్నది వివరించి
అయితే శేఖరం భార్గవలా కంగారు పడలేదు. ఎప్పుడో ఒకప్పు

ప్రవేశించి వస్తుందని అతడికి తెలుసు. అతడు ఆందోళన చెందింది పనిలేదు. ఈ పోలీసుల మధ్యనుండి ఆమె ఆహారపదార్థాలను తప్పించుకుని అందివ్వడం దాదాపు అసాధ్యం.

ఇలా తమ తమ ఆలోచనలలో వుండగా రవూఫ్ ఇద్దరు పోలీసు గుమ్మంవైపు వస్తూ కనబడ్డాడు. భార్గవ టేబుల్‌మీద ఉన్న ఎక్స్ తీసుకున్నాడు. కిటికీలోనుండి బయట ఖాళీ ఆవరణలోకి విసిరి ద్వారా తన దగ్గిర బాంబ్స్ వున్నాయనీ, దగ్గరకు రావడం అనీ అవతలివాళ్ళని హెచ్చరించాలని భార్గవ ఆలోచన. కానీ శేఖరం ఒప్పుకోలేదు. చూడటానికి ఖాళీ ఆవరణే అయినా విసిరే దానికి అటువైపు ఎవరయినా వస్తే అప్పుడు హత్యానేరం కూడా అవుతుందనీ, అది మరింత ప్రమాదకరం అనీ అతడు భావించాడు. అది పేలినప్పుడు దాని ప్రభావం ఎంతదూరం వరకూ వుంటుందో! వున్న ప్రయోగశాలలోని విలువైన పరికరాల్ని అది ఎంతవరకూ నష్టం చేస్తుందో తెలీదు. అవసరమైతే ఎలాగూ తప్పదు. కేసు పెద్దచేసే అనవసరమైన కొందరపాటు చర్యలు ఇప్పుడే ఎందుకు?

"అయితే ఏం చేద్దాం?" అడిగాడు భార్గవ. శేఖరం చెప్పాడు.

రవూఫ్ అదే సమయానికి అడుగులో అడుగు వేసుకుంటూ గదివేపు వస్తున్నాడు. గుమ్మానికి దూరం చెరోవైపు నుండీ పోలీసులు కూడా రహస్యంగా సమీపిస్తున్నారు. ఇంకో పది అడుగుల్లో గుమ్మం ఉందనగా అకస్మాత్తుగా గది తలుపు నెమ్మదిగా తెరుచు ఇది ఊహించని రవూఫ్ ఒక్క గెంతులో స్తంభం చాటుకి అయితే అతడు అనుకున్నట్టు రివాల్వర్ చప్పుడేమీ వినబడ ఒక బంతిలాంటి పదార్థం వరండాలో దొర్లుకుంటూ వచ్చి కొంత లో ఆగింది. చూడగానే దానిని గుర్తుపట్టాడతను.

హేండ్ బాంబ్!

ప్రొఫెషనల్ అనుభవంతో ఒక్క గెంతులో అక్కడినుండి గా పరుగెత్తబోయి ఏదో అనుమానం వచ్చి ఆగాడు.

బాంబ్‌తోపాటు ఓ కాగితం కూడా వుంది. దూరంగానే అయిదు పాటు వేచిచూసి తటపటాయిస్తూ దగ్గిరకి వెళ్ళి కాగితాన్ని తీసి చది ఉండే వాక్యాలు.

"కావాలంటే పరీక్షించండి. ముందుకు రావడం మీకే ప్ర
కరం."

రవూఫ్ మొహం క్రోధంతో ఎర్రబడింది. కసిగా పళ్ళు కొ
న్నాడు. లోపల ఒకరు కాదు, ఇద్దరు వ్యక్తులున్నారు. తలుపు
కున్నప్పుడు అతడ్ని చూశాడు.

శేఖరం వేసిన ఈ ఎత్తు సరి అయిన ఫలితాన్నే ఇచ్చింది.
పేల్చివుంటే ఆ హడావుడిలో రవూఫ్ ఫైరింగ్ ఆర్డరు ఇచ్చేవా
అప్పుడు రక్తపాతం అనివార్యం అయివుండేది.

కానీ ఇప్పుడు రవూఫ్ ఇరకాటంలో పడ్డాడు. వాళ్ళ దగ్గర
ల్వరో ఉందనుకున్నా అతడు కాస్త సాహసం చేసి వుండేవాడు.
వైపులనుండీ చుట్టుముడితే ఒక్క రివాల్వర్‌తో అవతలి వ్యక్తు
చెయ్యలేరు. కానీ ఇప్పుడు వున్నవి బాంబులు. అదీ శత్రువుల
హెచ్చరికలు చేశారు కూడా. ఇప్పుడు తన బలగాన్ని ముందు
పడం అనాలోచితమే అవుతుంది.

అంతలో అతనికి అసలీ బాంబు నిజమైనదా కాదా అని అను
వచ్చింది. దానిని అనాలిసిస్‌కి పంపించాడు.

ఈ విధంగా భార్గవకి మరో అయిదారు గంటల సమయం
మయింది.

లోపల భార్గవ, శేఖరం భవిష్యత్ కార్యక్రమం గురించి
న్నారు.

"ప్రియ ఇంకా రాలేదు."

"అవును, ఇక రాదుకూడా. ఆ ఆశ వదులుకోవడం
మనం ఉండగలిగినన్ని రోజులు ఆకలితోనే వుండాలి."

"ఇన్‌స్పెక్టర్‌ని చూస్తుంటే అంత సులభంగా మనని వ
లేడు. ఒక్క క్షణం ఏమరుపాటుగా వున్నా ప్రమాదమే."

"దాన్ని గురించి మీరేమీ ఆలోచించకండి. మీరు మీ ప్ర
మీద పూర్తి దృష్టి నిలపండి."

"నువ్వేం చెయ్యగలవు శేఖరం?"

శేఖరం నవ్వాడు. "లోపల వున్నదెవరో వాళ్ళకు తెలీదు. ఆ
వాడికి కళ్ళూ, చెవులూ లేవన్న సంగతికూడా తెలీదు. అందువల్ల భా

తల వున్న కిటికీ బయటకి పీడ పడేటట్టు నేను పచార్లుచేస్తూ వుంటాను.
వాళ్ళని చూడకపోవచ్చు. కానీ మనిషి గుమ్మం దగ్గిర పచార్లుచేస్తూ
గా, అందులోనూ బాంబు వుందని తెలిశాక వాళ్ళు దగ్గిరకి రావటానికి
సించరు. మనం చెయ్యవలసిందల్లా మనం మేల్కొని వున్నామని
కి తెలిసేలా ప్రవర్తించడమే."

"కానీ ఎంతసేపలా పచార్లు చేస్తూ వుండగలవు శేఖరం?"

"కనీసం అయిదారు రోజులు. కొద్దిగా రాత్రిపూట రెస్టుతో పది
వరకూ కాపు కాయగలను అనుకుంటున్నాను. ఆఫ్టరాల్ ప్రపంచ
344 మైళ్ళుంది. అందులో మూడోవంతయినా సాధించలేనా?—
ర్గాం."

భార్గవ కన్నార్పకుండా అతడివైపు చూశాడు. చూస్తూండగానే తన
ముందు ఎదిగిపోయిన శేఖరాన్ని ప్రేక్షకుడిగా చూస్తూండటం తప్ప
మీ చెయ్యలేకపోయాడు.

శేఖరమే మరో విషయం ప్రస్తావించాడు.

"అయితే ఓ షరతు! మాటిమాటికీ నా దగ్గిరకి రావొద్దు. జాలీ,
భూతి చూపించవద్దు. మీ ప్రపంచంలో మీరు, నా నడకతో నేను
సులోనూ, శరీరంలోనూ ఆఖరినరం అలిసిపోయేవరకూ పోరాడదాం.
ఏకాగ్రతనుండి మీరు మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ బయటకు రాకూ
. బయట ప్రపంచమూ, పోలీసులు ఇవన్నీ నాకు వదిలేసి మీరు మర్చి
. మీ దగ్గిరనుండి ఓ అద్భుతమైన విజయాన్ని ఆశిస్తున్నాను నేను.
ఆశ వమ్ము చెయ్యకండి —"

తనపై అతడుంచిన నమ్మకాన్ని చూసి భార్గవ కళ్ళు చెమ్మగిల్లాయి.
మాటలేకాదు, శేఖరం తను చెప్పినదాన్ని చేతల్లో పెట్టి చూపిం
. తలుపునుండి ఛాంబర్ కిటికీవరకూ ఆరడుగులు వేసి మరుక్షణం
వెనక్కి నడవడం సాగించాడు. సరిగ్గా రెండు నిముషాలలో అతనికి
అలవాటయిపోయింది. నడుస్తూనే వున్నాడు.

గంట— రెండు గంటలు— మూడు గంటలు—

బయట రవూఫ్, మరో యస్సై ఇది చూస్తూనే వున్నారు. లోపల
జరుగుతున్నది గమనించి, "ఎంతసేపు తిరుగుతారిలా?" కసిగా అన్నాడు
ఊఫ్ అటే చూస్తూ.

"అతడటువైపుకు వెళ్ళినప్పుడు కిటికీ దగ్గరగా వెళ్ళి అతడు వస్తున్నప్పుడు పేల్చేస్తే?" అనడిగాడు యప్పై దృష్టి మరల్చకుండా.

"అతడు అటు వెళ్ళినప్పుడు మనం స్పీడుగా కిటికీ దగ్గరకు కోవచ్చు, అతి పెద్ద సమస్య. కానీ లోపల ఒకరుకాదు. ఇద్దరు వాళ్ళు పంతుల ప్రకారం కాస్తున్నారు. ఒకణ్ని కాల్చేస్తే ఇంకొకడు శంతో బాంబు విసరేస్తాడు. హైజాకర్స్ మన స్తత్వం అలాగే వుం వాళ్ళిద్దర్నీ బంధించాలంటే మనం ఎలాగో ఓలాగ లోపలకి ప్రవేశించ

"ఎలా?"

రఫూఫ్ మొహంమీద సాదిబంతో కూడిన నవ్వు కదలాడింది.

"ఎంతకాలం తిరుగుతారో చూద్దాం. కొంతసేపటికి చీకటి తుంది, రాత్రవుతుంది. అప్పుడు కూడా నిద్రపోరా?" అన్నాడు.

యప్పై మాట్లాడలేదు.

అంతలో దూరంగా కారు వస్తున్న చప్పుడయ్యింది. కారులో శంకర్‌లాల్ దిగాడు. దూరంగానే వున్న పోలీసుల్ని, రఫూఫ్‌ని చిరాకు మిళితమైన స్వరంతో "ఏమిటి ఇంకా అరెస్టు చెయ్యలేదా" అడిగాడు.

రఫూఫ్ అక్కడ పరిస్థితిని వివరించి చెప్పాడు. అది విం కొద్దీ శంకర్‌లాల్ మొహం కఠినంగా మారసాగింది.

"మైగాడ్! ఇంతకు తెగించాడా?" అన్నాడు విస్మయంతో.

రఫూఫ్ మాట్లాడలేదు.

"ఏమిటతని ఉద్దేశ్యం? అసలిక్కడి నుండి ఎలా బయటప మని?" తనలో తనే అనుకున్నట్లు అన్నాడు శంకర్‌లాల్. అంతలో స్ఫురించి అతని మొహంమీద చిరునవ్వు కదలాడింది. "ఇంతవరకు కేవలం క్రిమినల్ ట్రస్-పాసే! ఇప్పుడు ఈ ఎక్స్‌ప్లోజివ్స్, ఈ చటం వీటితో అతడిచుట్టూ చట్టం గట్టిగా బిగుసుకుంటోంది కదా!"

"చట్టం వరకూ ఎందుకు సార్? ఏ మాత్రం వీలు దొరికినా ఖండఖండాలుగా పేల్చేస్తాను" ఇరిటేషన్ అణుచుకుంటూ అన రఫూఫ్.

"పేల్చేయగలిగితే మంచిదే! కానీ మీ పోరాటంలో ఏ

...కరానికి నష్టం కలిగినా ఊరుకోను. లోపల ఒక్కో ఇన్స్ట్రుమెంట్ ...కిఖ ఖరీదు చేసేది?" హెచ్చరించాడు.

రవూఫ్ ముఖం కందగడ్డలా మారింది. "అలాగే సర్!" అన్నాడు ...ణుగుతున్నట్లు.

"ఏమిటి మీ ప్లాను?"

"రాత్రవ్వాలి సర్. తెల్లవారుజామువరకూ అలా తిరుగుతూ ఉండ లేకదా! చిన్న కునుకు తియ్యనివ్వండి. అప్పుడు చూద్దురుగాని!"

శంకర్‌లాల్ కారువైపు వెళ్ళడానికి ఆయత్తమవుతూ "ప్రొద్దున్న ...ల్లా పేళ్ళ నెలాగయినా ఇక్కడినుండి ఖాళీ చేయించాలి. రేపు ఈ ఇన్ స్ట్రూమెంట్ ఒక తీర్థంలా తయారవడం నా కిష్టంలేదు" అని అక్కడనుండి వెళ్ళిపోయాడు. అటే చూస్తున్న రవూఫ్ పళ్ళు కొరుక్కున్నాడు. 'ప్రొద్దున తనతో ఎంతో లోపాయికారిగా మాట్లాడిన మనిషి, ప్రక్కన ఇంకో పోలీసు ఆఫీసరు ఉండేసరికి ఇలా మారిపోయాడు. అందుకే వ్యాపారంలో ఇంతగా రాణించగలిగాడు.'

అంతలో ఓ పోలీసు ఫ్లాస్కుతో టీ తీసుకువచ్చాడు. ఇద్దరూ తాగారు. చేసే పనేమీలేదు. చూస్తూ ఉండడమే.... అవకాశం రావాలి.... వస్తుంది.... వస్తుందన్న నమ్మకం వుంది రవూఫ్‌కి.... అతడెన్నో కేసులు చూశాడు. ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఒకచోట నేరస్థులు రిలాక్స్ అవుతారు. పులి పంజా విసిరినట్లు ఊహించని వేగంతో అప్పుడు విసరాలి? దానికోసమే ఎదురు చూస్తున్నాడు....

* * * *

ఈ ఎత్తులూ, పైఎత్తుల యుద్ధంలో ఎటూ దారి తోచనిది వసు మతి ఒక్కతే.

ఆస్పత్రిలో ప్రార్థన కనబడలేదనగానే మహేంద్రజైన్ పోలీసు స్టేషన్‌కి ఫోన్ చేస్తున్నప్పుడు ఆమె ఫోన్ ప్రక్కనే వుంది. అయితే ఆమెకు ఒక్కమాట కూడా వినబడలేదు. అనూహ్యమైన ఈ సంఘటనకి ఆమె శరీరం సన్నగా కంపించసాగింది. దాదాపు గంటా రెండు గంటల వరకూ ఆమె తేరుకోలేదు. 'ప్రార్థన కనబడటంలేదు' అదొక్కటే ఆమె ...కం అయింది. ప్రార్థనను ఆమె తండ్రి తీసుకువెళ్ళి వుంటాడన్న ఆలోచన రాలేదు. ఈ సంఘటనకి ఆ కుటుంబం మొత్తానికి తను జవాబుదారీ

అన్న భావంతో ఆమె వణికిపోతూంది. తనుకూడా ఆ కుటుంబంలో
సభ్యురాలినే అన్న సంపూర్ణమైన భావం పెళ్ళైన తర్వాత ఆమెకి ఎప్పుడు
కలగనేలేదు. అదేం ప్రారబ్ధమో పరిస్థితులన్నీ కూడబలుక్కున్నట్లు
ఆమెని ఆ కుటుంబం నుండి వేరుగా ఉంచుతూనే ఉన్నాయి.

రవూఫ్‌తో మాట్లాడి మహేంద్ర ఫోన్ పెట్టేస్తూండగా, అప్పు
సూపరింటెండెంట్ దగ్గరనుండి అర్జంటుగా రమ్మని కబురొచ్చింది. అప్పు
ఈ విషయం అక్కడిదాకా పాకిపోయిందా అనుకొంటూ మహేం
హడావుడిగా వెళ్ళిపోయాడు.

గదిలో ఆమె ఒక్కతే మిగిలిపోయింది. ఎంతసేపటికీ మహేం
వెనక్కి రాలేదు. ఆమెకి కనీసపు ఓదార్పు మాటలుకూడా కరువయ్యా
ఆ గదిలో ఒంటరితనం మరింత భయంకరంగా తోచి గది బయ
వచ్చింది. చిరు ఆశతో తిరిగి తమ గదికి వెళ్ళింది. ఖాళీగా వున్న పక
వెక్కిరించింది. నర్సులూ, డాక్టర్లూ అందరూ తమపని తాము చేసు
పోతున్నారు. ఇదేదో చాలా సామాన్యమైన సంఘటనలా వుంది వాళ్ళ
ఆమెకు పిచ్చెక్కిపోతూంది. బిగ్గరగా ఏడవాలనీ, ఆస్పత్రి గోడలకే
తల కొట్టుకోవాలనీ, పెరుగుతున్న కసిని అతికష్టంమీద అణుచుకుం
అకస్మాత్తుగా ఆమెకీ విషయం తోచింది. తనకీ ఆస్పత్రికీ ఇక సంబం
లేదు. ప్రార్థన లేకపోతే ఇక తను ఇక్కడ వుండే అవసరం ఏముంది?

ఆమె వెతుక్కుంటూ మహేంద్ర దగ్గరికి వెళ్ళింది. అప్పుడే బ
టికి వస్తూన్న అతడు ఆమెను చూడగానే ఓదార్పుగా "మీరేమీ కంగా
పడకండి. ఎక్కడున్నా పట్టుకుంటారు. ఇన్‌స్పెక్టర్‌కి వివరాలు చెప్పా
కదా!" అనేసి హడావుడిగా ఆపరేషన్ థియేటర్‌లోకి నడిచాడు. "మీ
ఇంటికి వెళ్ళచ్చు" అన్న అర్థం అతని మాటల్లో ఆమెకి కనబడింది. నిజ
అక్కడ వుండి చేసేదేముంది? రంగస్థలం ఆస్పత్రినుండి పోలీసుస్టేషని
మారింది. ఇంట్లో మిగతా పిల్లలిద్దరూ లేరు. అంత పెద్ద ఇంట్లో
ఒంటరిగా ప్రవేశించేసరికి అపుకున్న దుఃఖం అంతా ఒక్కసారిగా కట్ట
తెంచుకుని ప్రవహించినట్టూ పెల్లుబికింది. పక్కమీద పడుకుని బిగ్గర
చాలాసేపు రోదించింది. అన్నినాళ్ళనుండి ఆపుకున్న నిస్సత్తువ ఆమె
నెమ్మది నెమ్మదిగా ఆక్రమించింది. ఆ మైకంలో అలా ఎంతసేపు వుం
పోయిందో తెలీదు. ఆమె కళ్ళువిప్పి చూసేసరికి బయట చీకటిపడిం

చాలాసేపటివరకూ ఆమెకి తనెక్కడుందో, ఏం జరుగుతుందో అర్థం కాలేదు. అర్థమయ్యేసరికి మళ్ళీ దిగులు ఆవరించింది. డాక్టర్ మహేంద్ర పోలీసుస్టేషనని చెప్పాడుగానీ ఏ స్టేషనో ఏమోకూడా తెలీదు.

ఆమెకి పరిచయాలూ, పలుకుబడీ ఏమీలేవు. భర్త ఎక్కడున్నాడో కూడా తెలీదు. తెలిసిందల్లా స్కూలు ఒక్కటే. ఆమె తిరిగి మహేంద్రకి ఫోన్ చేసింది. ఈ సమయంలో అతనొక్కడే కాస్త ఆప్తుడిగా కనిపించాడు. అట్నుంచి అతడు ఫోన్ ఎత్తి "ఎవరూ?" అని అడిగాడు.

"నేనండీ! వసుమతిని. మా పాప సంగతి...." ఆ మాట పూర్తవకుండానే అతడు "మీకింకా తెలీదా? ఆస్పత్రి నుండి పాపని ఎత్తుకుపోయింది భార్గవే! ప్రస్తుతం ఇన్‌స్టిట్యూట్‌లో దాక్కొని ఉన్నాట్ట. ఇంకెంతసేపులెండి, పోలీసులు చుట్టుముట్టారు. అతడ్ని అరెస్టుచేసి పాపని తీసుకురావడమే!"

ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. "ఆ....ఆయన్నా!" అంది వణుకుతున్న కంఠంతో.

"ఆ! భార్గవే! లోపల బాంబ్సు కూడా పెట్టుకున్నాట్ట. అందుకే ఆలస్యం అవుతోంది."

"బాంబులా!" అన్న ఆమె మాట పూర్తికాకుండానే పెద్ద చప్పుడుతో ఆమె చేతిలో రిసీవర్ జారిపోయింది.

* * * *

రాత్రయింది. ఛాంబర్ లోపల కిటికీ దగ్గర నీడ కదులుతూనే ఉంది. అప్పటివరకూ దూరంగా ఉన్న యస్పై ఏదో గొప్ప ఆలోచన స్ఫురించినట్టూ దగ్గరికి వచ్చి-

"లోపలికి స్మోక్ బాంబు విసిర్తే!" అని అడిగాడు. రవూఫ్ అతన్ని విసుగ్గా చూసి "లోపల అనారోగ్యంతో ఓ పేషెంటు ఉంది. మన ఉద్యోగాలు పోతాయి" అన్నాడు. మొహం చిన్నది చేసుకుని యస్పై తన యథాస్థానానికి వెళ్ళిపోయాడు.

దట్టమైన చీకటి చుట్టూ అలుముకుంది.

రాత్రి పదయింది.

పదకొండు....

పన్నెండు....

లోపల భార్గవ తన ప్రయోగంలో లీనమై ఉన్నాడు. వా ముందనుకున్న ఒప్పందం ప్రకారం ఎవరిపని వాళ్ళు చేసుకుపోతున్నా శేఖరానికి పగలూ, చీకటీ తేడాలేదు. టైమ్ ప్రసక్తే రాదు. అతడ తిరుగుతూనే వున్నాడు. తనేమాత్రం ఏమరుపాటుగా వున్నా వాళ్ళు ర రావచ్చు. తలుపు తూట్లు తూట్లుగా రివాల్వర్‌తో కాల్చేయవచ్చు లోపల భార్గవతోపాటు వున్నది ఒక అంధుడు అన్న విషయం ఒక్కసా తెలిసిందంటే ఇక వాళ్ళనెవరూ ఆపలేరు. తనున్నా లేకపోయినా ఒ భార్గవని గాయపరచి నిస్సహాయుల్ని చేస్తారు. ఇక్కడ కావల్సింది వాళ్ళ దూరంగా వుంచడం- భార్గవ ప్రయోగం కొనసాగేలా చూడడం.

దాదాపు అర్ధరాత్రి కావస్తూ వుండగా హఠాత్తుగా నిద్రలో మేల్కొన్నట్టు భార్గవ ఈ లోకంలోకి వచ్చి తన పరికరాల మధ్యని శేఖరాన్ని చూశాడు. అతడింకా పచార్లు చేస్తూ వుండటంచూసి మిల్లి ఫ్లాస్కు ప్రక్కకి జరిపి శేఖరం దగ్గరకు వచ్చి ఆప్యాయంగా అత చేతిమీద చెయ్యి వేసేడు.

"ఎంతవరకూ వచ్చింది?" అన్నట్టూ సైగ చేశాడు శేఖరం.

"1966 వరకూ వచ్చింది" వ్రాస్తూ వుండే భార్గవ పెదాలమీ పేలవమైన నవ్వు కదలాడింది.

"అంతే?"

"కృత్రిమంగా క్లోరోఫిల్ తయారు చెయ్యడం వరకూ. అంతకన్నా ముందుకి వెళ్ళడం లేదు. 1966లో కెనడాకి సంబంధించిన బయ కెమిస్టులు పత్రహరితంలో ముఖ్య పదార్థమైన ఒకదానిని కృత్రిమంగా సృష్టించవచ్చని కనుక్కొన్నారు" అంటూ ఆ వివరాలన్నీ వ్రా చూపించాడు.

చదవటం పూర్తిచేసి శేఖరం తలెత్తాడు. అతని మొహంలో సన్నటి విచారరేఖ ప్రతిబింబించింది.

"ఇప్పటివరకూ నేను అంధుణ్ణయినందుకు ఎప్పుడూ బాధపడలేదు. మీకు ఇంకా ఉపయోగకరంగా వుండలేకపోతున్నందుకు ఈ క్షణం బాధ పడుతున్నాను."

భార్గవ వెంటనే రియాక్టయ్యాడు. "ప్రాణాలకి తెగించి ఈ అర్ధ రాత్రి నువ్వు చేస్తున్న సహాయం సామాన్యమైనదేమీకాదు శేఖరం. నిజాన్ని

...లాగే చాలామంది మనుషుల కన్నా ఏమీలేని నువ్వే జరుగుతున్న ...న్ని అర్థం చేసుకోగలిగావు."

ఈ ప్రసక్తి ఇష్టంలేని శేఖరం "టైమెంతయ్యింది?" అని మాట ...ర్చాడు.

"ఒంటిగంట. కొద్దిసేపు నువ్వు రెస్టు తీసుకో శేఖరం, నేనిక్కడ ...ఉంటానులే!?"

"అదేమిటి మీరు....?" అతడు వాక్యం పూర్తి చెయ్యలేదు.

"ఇప్పుడు నేను చూసేది కూడా ఏమీలేదు. ఛాంబర్స్‌లో రియాక్షన్స్ ...స్తూనే వుంటాను. రేపంతా మేలుకుని వుండాల్సిన అవసరం నీకు ...ఉంది. ఇప్పుడు నువ్వు రెస్టు తీసుకోవడం చాలా అవసరం. నేనిక్కడ ...టాను, నువ్వు పడుకో."

శేఖరానికి అది నిజమే అనిపించింది. అతను రెస్టు తీసుకోడానికి ...పోయాడు.

భార్గవ మెయిన్ హాల్ గుమ్మం దగ్గర నిలబడి ఆలోచనలలోకి ...వున్నాడు. దూరంగా కిటికీలోంచి ఆకాశం కనబడుతోంది. నక్ష...లూ, చంద్రుడూ, మేఘాలు అన్నీ ఈ సైంటిస్టు ఏం చేస్తాడా? అని ...స్తున్నట్టు నిశ్చలంగా చూస్తున్నాయి. ఒక్కసారి ఆలోచిస్తూ తన ...లోకి వెళ్ళిపోతే ఆ అచేతనత్వం నుంచి భంగం కలగటానికి అతడికి ...సేపు పడుతుంది. శూన్యంలోకి చూస్తూ ఆ ఊహా లోకంలోనే ...సేపు వుండిపోయాడు.

కిటికీ రెక్కమీద అతడి నీడకూడా అతడిలాగే నిశ్చలంగా వుంది. ...సమయానికి అక్కడికి రెండువందల గజాల దూరంలో చెట్టు వెనుక ... కదలిక....

రవూఫ్ చెట్టుచాటునుంచి నెమ్మదిగా బయటికి వచ్చాడు. సరిగ్గా ...అవకాశం కోసమే అతడు చీకటి పడినప్పటినుండీ వేచి చూస్తూన్నాడు. ...ప్రయత్నం ఫలించిందని అతడు ఊహించాడు. శేఖరం-భార్గవల ...షణ పూర్తి అయి శేఖరం పడుకోవడానికి వెళ్ళి, భార్గవ నీడ కదల ...కిటికీ రెక్కలమీద అలాగే వుండేసరికి రవూఫ్ వేరేవిధంగా ...లోచించాడు.

ఆ ట్రిక్ అతడికి బాగా తెలుసు.

మనిషి ఆకారంలో సిద్ధపడేటట్లు వస్తువుల్ని పేర్చి అవ వాళ్ళకి భ్రమ కలిగిస్తూ లోపల తమ పని తాము చేసుకోవడం ట్రిక్‌తో లోపలి వాళ్ళిద్దరూ తమని మెథడ్స్ చేసి నిద్రనప్రక మనుకున్నారన్నది.

రవూఫ్ చప్పుడు కాకుండా కిటికీ వద్దకు చేరుకున్నాడు. అతను ఊహించని విధంగా కేవలం రెండడుగుల దూరంలో ఉన్నాడు. అతడిని చూసి ఉలిక్కిపడి చప్పున అక్కడినుండి వెన వరుగెత్తబోయాడు.

మళ్ళీ అంతలోనే ఏదో స్ఫురించినట్టు ఆగిపోయాడు.

భార్గవలో తనని చూసిన కదలికే లేదు.

ఆ సైంటిస్టు ఎప్పుడో ఆలోచనల్లోకి జారుకుని తన చుట్టూ దాన్ని గ్రహించే స్థితిలో లేడు.

రవూఫ్ ఒక్కక్షణం కదలకుండా నిలబడి ఈ విషయాన్ని పరచుకున్నాడు. భార్గవ వెనుక గదిలో దూరంగా పడుకుని వున్న రె వ్యక్తి కూడా రివాల్వర్ రేంజిలోనే వున్నాడు.

ఇలాంటి అవకాశం మరి దొరకదు.

అతడు చప్పుడు చెయ్యకుండా నెమ్మదిగా బెల్టునుండి రివా తీశాడు.... నల్లటి రివాల్వర్ మీద తెల్లటి వెన్నెల తళుక్కుమని బింబించింది. అతడు కిటికీలో నుండి రివాల్వర్ లోపలికి జొర్చి పడు శేఖరాన్ని గురి చూస్తూ ట్రిగ్గర్ నొక్కాడు.

కానీ ఒక్కక్షణం ఆలస్యం అయింది.

రివాల్వర్‌మీద పడిన వెలుగు కళ్ళల్లోకి రిఫ్లెక్ట అవటంతో మెరిసినట్టయి భార్గవ చప్పున ఈ లోకంలోకి వచ్చి అటువైపు తిప్పాడు కొద్దిదూరంలో మిలమిలా మెరుస్తున్న రివాల్వర్ కనబ ఒక్క క్షణంపాటూ అర్థంకాలేదు. అర్థం అయిన వెంటనే స్పృహలేనియ చేతనావస్థలోనికి వచ్చి ఒక్క గెంతులో గాలిలా దూసుకుపోయి, వేగంతో కిటికీ రెక్కని కాలితో తన్నాడు.

కిటికీరెక్క రివాల్వర్‌కి కొట్టుకోవటం, రివాల్వర్ పేలటం క్షణంలో జరిగాయి.

బుల్లెట్ తగిలి భళ్ళుమన్న శబ్దంతో అద్దం బ్రద్దలయింది. పడు

...పైనుండి అయిదారడుగుల ఛేడాలో బుల్లెట్ దూసుకుపోయింది. ...నిండా గాజుపెంకులు విసిరేసినట్లు పడ్డాయి. కానీ దానితోపాటు ...గమనించని మరో చిన్న సంఘటన కూడా జరిగింది. రవూఫ్ ...బుల్లెట్ గురితప్పి ఛాంబర్‌లో ఓజోన్ లేయర్‌కి అమర్చిన ...ని రాసుకుంటూ శేఖరంవైపు వెళ్ళింది.

భార్గవ శేఖరానికి చెప్పినట్టు తన ప్రయోగాన్ని రెండు రంగాలుగా ...చేస్తున్నాడు. ఒకటి మైటాసిస్ సమయంలో మ్యూటేషన్ కలిగిం... రెండు కృత్రిమ కణ నిర్మాణ సమయంలో కార్బినోజిన్‌ని ...డం, రవూఫ్ పేల్చిన బుల్లెట్‌వల్ల ట్యూబ్ ఛాంబర్‌లోని ఓజోన్‌ని ...వుండే పొరకి రంధ్రం చేసింది? ఇది యిలా వుండగా....

ఈ లోపులో భార్గవ కనురెప్పపాటు సమయంలో బల్లమీద ఎక్స్... ...ని చూసి అందుకుని కిటికీ గుండా బయటకు విసిరాడు. మీదకు ...న్న బాంబుని చూసి రవూఫ్ భయభ్రాంతుడై మూడు అంగల్లో ...గా వెళ్ళిపోయాడు.

ఒక క్షణం.... ఒక నిముషం.... రెండు నిముషాలు.... గడిచాయి. బాంబు పేలలేదు.

అయినా రవూఫ్ దాని దగ్గరకు వెళ్ళే సాహసం చెయ్యలేదు. ... అంతకుముందు సాయంత్రమే అవి నిజమైన బాంబులే అన్న ...న వచ్చింది.

ఈ హడావుడికి బయట పోలీసులూ, లోపల శేఖరమూ నిద్ర ...రు.

"ఏం జరిగింది?" శేఖరం అడిగాడు.

భార్గవ జరిగినదంతా చెప్పాడు. "ఆ కంగారులో బాంబు సీలు ...ం మర్చిపోయాను."

"అదే మంచిదయ్యింది. బాంబు పేలి ప్రాణనష్టం జరిగితే మన ... బయట ఒరికంబం సిద్ధంగా వుండేది. మన గమ్యం అదికాదు. ఇంక ...పడుకోండి, ఇలా కాపలా కాయడాలూ అవీ మీకు అచ్చిరావు"

"అదికాదు శేఖరం. నేనూ...." అని ఇంకేదో వ్రాయబోతూంటే ...ం ఆపుచేసాడు.

"మీరు చెప్పబోయేది నాకు తెలుసు. ఇంక ఏ వాదనా మీరు కాస్త ప్రశాంతంగా ఆలోచించాలి అంటే ఇలాటి డిస్టర్బెన్సెస్ కూడదు."

శేఖరం తిరిగి పచార్లు చెయ్యటం మొదలుపెట్టాడు.

....రాత్రి రెండు కావస్తూంది.

# 7

చేతిలో బ్రెడ్‌పాకెట్, కాళ్ళదగ్గర పళ్ళబుట్టా పెట్టుకుని ఆటోలోంచి, గోడకు అవతలవైపున దృశ్యాన్ని చూసిన కొంచెంసేపుపాటూ ఏం చెయ్యాలో తోచలేదు. అవి ఎలాగైనా అందించాలని, వాళ్ళతోపాటు ఉండడం కోసం లోపల ప్రవే పుట్టిన కోర్కని అతికష్టంమీద అణుచుకుంది. అది ఎంత తొంద ఆలోచనో ఆమెకు తెలుసు.

ఆమె సరాసరి డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ వెళ్ళి ఆయనను కలుసుకోవాలి అని అనుమతి అడిగింది. పళ్ళ ఆటోలోంచి దిగి, డి. ఎస్. పి. ని కలుసుకోవాలి అని అడుగుతు అమ్మాయిని చిత్రంగా చూశాడు జవాను. అయినా ఏం మాట్లా ఆమె అందించిన చీటీ అందుకొని లోపలికి వెళ్ళాడు. రెండు ని ఆమెకి పిలుపు వచ్చింది.

డి. ఎస్. పి.కి దాదాపు యాభై ఏళ్ళుంటాయి.... డైరెక్ట ట్స్‌లో వుండే నెమ్మదీ విషయం విని అర్థంచేసుకుని న్యాయం జరి అన్న తపన అతడిలో లేవు ఇలాంటి వాళ్ళను సవాలక్ష మందిని అనుభవంతో విసుగ్గా ఆమె వంక చూసాడు. అదే ఇంకే విజి అయితే అప్పటికప్పుడే పొమ్మనేవాడు. కాని వచ్చింది అమ్మాయి అవ ఎదుటి కుర్చీ చూపిస్తూ కూర్చోమన్నాడు.

ప్రియ ముక్తసరిగా తను వచ్చినపని చెప్పింది.

"అవును, మా ఇన్‌స్పెక్టర్ చెప్పాడు. ఆ భార్గవ ఎవరో ఈజ్ ఎ క్రిమినల్. వెంటనే అరెస్టు చెయ్యాలి. మా వాళ్ళింకా ఎ ఆలస్యం చేస్తున్నారో అర్థంకావడంలేదు."

ప్రేమ కోపాన్ని అణుచుకుంటూ "మీరింత తొందరగా ఒక నిర్ణ
రాకండి. అతడు చేసిన దొంగతనం ఏముంది? తన కూతుర్ని
సుకు వెళ్ళాడు. అంతేగా!"

"కోర్టు ఆర్డర్ కి వ్యతిరేకంగా!" వ్యంగ్యంగా అన్నాడు.

"స్వంత కూతురికి కోర్టేమిటి?"

"అది తేల్చాల్సింది కోర్టు."

"కోర్టు ఎలాగూ అతని పక్షమే తీర్పు యిస్తుంది. దావా వేసింది
తల్లి కాదు, సవతి తల్లి."

"నీతో వాదించడానికి లేను నేనిక్కడ" విసుగ్గా అన్నాడు.
నా అతను మీకేమౌతాడు?"

"ఆయన నాకు తెలుసు" అంది. ఆమె కంఠంలో తడబాటు
అతను వంకరగా నవ్వాడు. ఆ నవ్వు ఆమెకి అసహ్యం కలి
. అంతలో అతనన్నాడు, "భార్గవమీద ఆ కోర్టు కేసే కాదు;
ప్యాల్ అధికారులు కూడా ఫిర్యాదు చేసారు."

"ఆయన తప్పేమిటండీ? తన కూతుర్ని తీసుకెళ్ళి తను వైద్యం
చేసుకుంటున్నారు- అంతేగా!" నిస్సహాయతా, కోపమూ మిళితమైన
తో అంది.

"అలా అని చెప్పి ప్రతీ డాక్టరూ తన పేషెంటును ఏ ఉస్మా
నియా, కె. జి. హెచ్. కో తీసుకెళ్ళి వాళ్ళ ఖరీదైన ఆపరేషన్ థియే
టర్ తలుపులు బిగించి తన స్వంతవైద్యం మొదలెడతానంటే మేము
ఊరుకోవాలా?" హేళనగా అడిగాడు.

"ఎంతో కాదండీ, రెండు మూడురోజులు" ప్రాధేయ పూర్వకంగా
. "అతడికేమీ హాని జరక్కుండా చూడండి, చాలు."

"అలా చూట్టానికి అతడు నాకేమీ బావగానీ, బావమరిదిగానీ కాడు.
మీకు తెలిసినట్టుగా నాకు అతడు తెలీదు కూడా" అన్నాడు. 'తెలిసినట్టుగా'
పదాన్ని నొక్కి పలుకుతూ.

ఆమె మొహం జేవురించింది. కుర్చీలోంచి విసురుగా లేచి నిల
. "మనిషికీ మనిషికీ వున్న సంబంధం కేవలం మీకు 'తెలిసిన
కాదండీ, ఇంకా చాలా వున్నాయి. అది తెలుసుకోవాలంటే మీరు
ఇంకా చాలా ఎదగాలి. మీరు అనాలోచితంగా తీసుకుంటున్న

ఈ చర్యవల్ల ఆయనకేమన్నా అపాయం జరిగితే దేశం ఒ సైంటిస్టుని కోల్పోవడానికి మీరే కారణభూతులవుతారు. ఆ పాప అనేసి అక్కడినుండి విసురుగా వెళ్ళిపోయింది.

ఆమె నేరుగా గుమ్మందాటుతూ ఎదురుగా వస్తూన్న ఒక య దాదాపు డాష్ ఇవ్వబోయి, అతికష్టంమీద తమాయించుకుని పక్క 'సారీ' చెప్పి వెళ్ళిపోయింది.

అతడు ఆమె వెళ్ళినవేపే క్షణంపాటు చూసి లోపలికి అతడిని చూసి డి. ఎస్. పి. ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచి చేసాడు.

"ఆ పాపం మీదే అంటుంది. ఎవరా అమ్మాయి?" ప్ర అ యువకుడు.

"ఏ....ఏ....ఏం లేద్సార్" అన్నాడు డి. ఎస్. పి. తడ

పై అధికారిని చూసి అన్ని డిపార్టుమెంట్లకన్నా ఎక్కు వడేది పోలీసు డిపార్టుమెంటులోనే.

* * * *

మరునటిరోజు ప్రొద్దున్నకి ఈ వార్త నెమ్మదిగా ప్రాకడం పెట్టింది. ప్రొద్దున్నే మామూలుగా ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చేవా దూరంగా వుంచటం పోలీసులకి కష్టమయినపని అయ్యింది. గుంపులుగా ఆవరణలో చేరి వాళ్ళు మాట్లాడుకోసాగారు. అ లోపల వున్నది అప్పటివరకూ తమతో పనిచేసి రాజీనామా ఇచ్చి అయి వుండడం వారిలో మరింత కుతూహలాన్ని కలిగించింది. అక్కడినుండి కదలకపోవడంతో వెంటనే వెళ్ళి తమ తమ పను కోవలసిందిగా శంకర్‌లాల్ సర్క్యులర్ ఇవ్వవలసి వచ్చింది. ఉ కనుక భయపడి తమ తమ స్థానాలకు వెళ్ళిపోయారు. కానీ ప్రహరీగోడకి అవతల వున్న రోడ్డుమీద మాత్రం జనం కి పెరగసాగారు.

చుట్టూ పోలీసులు. వాళ్ళ చేతుల్లో తుపాకులు. రకరకాల ప్రాకడానికి దోహదం చేసినాయి. ఏదో హత్య చేసిన హంతకుడ ఉన్నాడని ఒకరంటే, కాదు- రేప్ చేసిన మనిషి పారిపోయి వచ్చి దాక్కున్నాడని మరొకరన్నారు.

గుతున్నా వేగంగా ఈ రూమర్లు వ్యాప్తి చెందాయి. ఈ లోపులో త్రి కొంచెం సాహసించి గోడకి దగ్గరగా వున్న పోలీసుని పిలిచి, ట పాపకూడా వున్నదన్న సంగతి సేకరించాడు. దాంతో వున్నది హంతకుడు అన్న పుకారు లేవదీసిన వ్యక్తి, ఆ ను పాకిస్తాన్ వెళ్ళిపోవడానికి ప్రభుత్వంతో బేరం పెట్టాడనీ, పాప ప్రాణం అడ్డుగా పెట్టాడనీ, తన రూమర్‌కి జోడించి మళ్ళీ గి వదిలాడు.

రేప్ చేశాడన్న పుకారు పుట్టించిన వ్యక్తి, లోపలున్నవాడు తల్లిని కూతుర్ని సాక్ష్యం ఇవ్వకుండా చంపడానికి తీసుకువచ్చాడు అని మర్‌ని సమర్థించుకున్నాడు. ఈ విధంగా తెలిసిన కొత్త వాస్తవానికి ఊహాకల్పనలను జోడించి సంతృప్తి పడసాగారు జనం.

గోడకవతల ఈ గోల జరుగుతూండగా- ఇన్‌స్టిట్యూట్ లోపల గ్ డైరెక్టర్‌తో పత్రికా విలేఖరులు గొడవ పడసాగారు. ఈ వార్త న వివరాలు చెప్పడానికి, వాళ్ళని లాబ్ తాలూకు ఫోటోలు తీసు టికి అతడి అనుమతి నిరాకరించడంతో ఈ గొడవ ప్రారంభం ంది. ప్రభుత్వం అనుమతి లేకుండా లోపలికి ప్రవేశించడానికి కోనని అతని వాదన. పత్రికలవాళ్ళ విషయంలో అలాంటి కరాలుండకూడదని వాళ్ళ వాదన.

చివరికి అతడు పూర్తి వివరాలు చెప్పేటట్లూ, ఫోటోలు మాత్రం దూరి తీసుకునేటట్లూ ఒప్పందం కుదిరింది.

అతడు విలేఖర్లకి ఈ విధంగా స్టేట్‌మెంట్ ఇచ్చాడు.

"కాన్సర్‌ని నయంచేసే విధానాలమీద నమ్మకం లేని ఒక తండ్రి త్రి నుండి సొంత కూతుర్ని అపహరించుకుపోయి మందులివ్వ ంపెయ్యడానికి ప్రయత్నం చేస్తున్నాడు. పాపని రక్షించడానికి ం చేస్తున్న ప్రయత్నాలన్నీ విఫలమౌతున్నాయి. ఆ కన్నతల్లి ోకయితే అంతేలేదు."

సాయంత్రం ఎడిషన్‌లో వచ్చిన ఈ వార్త చూసి శంకర్‌లాల్ తో నవ్వుకున్నాడు. తను అనుకున్నది అక్షరాల జరుగుతూంది. దీనితో భార్గవ మరణించినా ఎవరి సానుభూతి ఉండదు. కానీ

ఇంత ఆనందంలోనూ అతడికో మూల కంగారుగానే వుంది. ఇంక తర్వాత భార్గవకి ఏ మాత్రం విజయం లభించినా అది సంఘ నాయుడుకే కాకుండా తనకీ ప్రమాదకరమే. అందుకే రఘూప్‌ని పెడుతున్నాడు.

లోపల భార్గవ ఖాళీగా లేడని అతడొక్కడికే తెలుసు.

లోక కళ్యాణం కోసం, సర్వజనావళి కోసం ఒక పనిని తలపెట్టినా, దానిని నాశనం చెయ్యాలని ప్రయత్నించేవాడు. పూర్వ కొక్కడుండేవాడు. ఇప్పుడు నూటికొక్కడున్నాడు.

....పేపర్లో వచ్చిన ఈ వార్త చూసి వసుమతి తల్లడిల్లిపో ప్రార్థనకి భార్గవ కంటే తానెక్కువ కాదనీ, తన భర్త అభిప్రా తనెప్పుడూ గౌరవిస్తుందనీ ప్రతి ఒక్కరికీ చెప్పాలని ఆమె ఆరాటపడింది. కానీ ఆమె మాట వినేదెవరు?

ఆమె మళ్ళీ ఇన్‌స్టిట్యూట్‌కి బయలుదేరింది. అంతకు ఫోన్‌లో విషయం తెలుసుకున్న వెంటనే ఆమె అక్కడికి ఒకసారి గానీ- లోపలికి వెళ్ళడానికి అనుమతి దొరకలేదు....నిద్రలేమితో పీక్కుపోయి, తైల సంస్కారం లేని చింపిరి జుట్టుతో ఉన్న చూసి ఆమె చెప్పేది వాచ్‌మెన్ కూడా వినలేదు.

కొంచెం సర్దుకొని ఆమె ఈ రోజు తిరిగి అక్కడకు దేరింది. ఆమె ప్రార్థన తల్లి అని తెలియగానే విలేఖరులు చుట్టుము "మీకూ మీ భర్తకి ఏమైనా పొరపొచ్చాలున్నాయా?".... " ప్రార్థనకీ మధ్య సంబంధాలు ఎలా వుండేవి?".... "మీరు కోర్టుకి వెళ్ళవలసి వచ్చింది?".... వగైరా ప్రశ్నలకి సమాధానాలు చెప్ప ఆమె రఘూప్‌ని చేరుకుంది. అదే సమయాన రఘూప్ మైకులో చేస్తున్నాడు.

"మిస్టర్ భార్గవా! ఎంతోకాలం మీరలా లోపల ఉండలేరు. బయటకి రావడం మీకు శ్రేయస్కరం. అయిదు నిముషాల ఇస్తున్నాను. ఈ లోపల బయటకి రాకపోతే లోపలికి స్మోక్ వినరవలసి ఉంటుంది...."

బిగ్గరగా వినిపిస్తున్న ఈ మాటల్ని విని వుంటే భార్గవ ఏ ఉండేవాడో కానీ తన ప్రయోగంలో నిమగ్నమైన అతనికి

...ల ఏదీ వినబడటంలేదు. శేఖరం సంగతి సరేసరి! పరిశీలనగా చూస్తే శేఖరం మొహంలో అలసట కన్పిస్తుంది. నాయుడు ఇంట్లో ...రాత్రినుంచీ అతడికి కంటిమీద అసలు కునుకులేదు. ముప్పైఆరు గంటల పైగా ఆహారం లేదు. ఇంకా ఎంతసేపు వుండాలో తెలీదు. ...ప్రార్థనే.... ప్రయోగం ఫలించని పక్షంలో ఆ పాప మరణమే ...ముగింపు చెప్పాలి.

ఆమె పఠీనానుంచి హెమరేజ్ మొదలయింది. పెదాలు బాగా ...డ్డాయి. కన్వల్షన్స్ ప్రారంభం అయ్యాయి.

ఈ లోపులో బయట జన ప్రవాహం ఎక్కువయింది. పేపర్లలో ...చదివి అది ఏదో తిరనాళ్ళలాగా జనం అక్కడికి చేరుకోసాగారు. ...సులకి వాళ్ళని అదుపు చెయ్యటం కష్టం అయింది. అది లా అండ్ ...ర్ సమస్య అయి కూర్చుంది. కన్నకూతుర్ని హత్యచేస్తున్న కిరాత...ని, అతన్ని బంధించకుండా చూస్తూ ఊరుకున్న పోలీసులనీ దుయ్య...డూ అక్కడికక్కడే ఒక ఛోటా ప్రజానాయకుడు స్పీచ్ యిచ్చాడు. ...ల్లో ఉద్రిక్తత కట్టలు తెంచుకుంది. రోడ్డుప్రక్కన ఉన్న కంకర ...ను లోపలికి విసరసాగారు. చిన్నసైజు లాఠీఛార్జీ జరిగింది. గుంపు ...చెదరయింది. ఇదంతా చూసి వసుమతి భీతావహురాలయింది.

అసలిదంతా ఎందుకు జరుగుతుందో, తన భర్త ఇంత మూర్ఖ...గా కూతుర్ని తీసుకుని అలా తలుపులు బంధించుకోవలసిన పరిస్థితి ...ఏర్పడిందో, పైగా బాంబులతో ఎందుకు బెదిరించవలసి వచ్చిందో ...కి అర్థంకాలేదు. ఆసుపత్రిలో ట్రీట్‌మెంట్ ఇష్టంలేకపోతే ఇంటికి ...సి వచ్చేయ్యొచ్చు. కోర్టు ఆర్డరుపట్ల కోపం వచ్చివుంటే ఆ విషయం ...తో ఒక్కమాట చెప్పవచ్చు. తను మాత్రం కాదంటుందా? ఎందుకింత ...ప్లికేషన్ గాప్? ఎందుకు పరిస్థితులు ఇంత తీవ్రతరమయ్యేవరకూ ...కొచ్చాడు?

ఆమె ఆలోచనల్లో వుండగా లాఠీఛార్జీ ప్రారంభం అయింది. ...ళ్ళు విసిరే జనాన్ని పోలీసులు చెల్లా చెదురు చేయసాగారు. లాఠీఛార్జీ ...న తరువాత అక్కడ జనం కొద్దిగా తగ్గారు. రవూఫ్ భోజనానికి ...టికి వెళ్ళిపోయాడు. సాయంత్రంవరకూ అక్కడ నిలబడ్డ జనం ...ా ఇటు పోలీసులు ఎంతసేపటికీ ఏమీ చెయ్యలేక పోవటంతోనూ,

అటు లోపలినుండి ఏ అలికిడీ వినబడక పోవటంతోనూ అసంతృప్తి
అక్కడినుండి వెదిరిపోసాగారు. రోడ్డుమీద ఆక్సిడెంట్ అవగానే గొ
ఆసక్తితో ఆగి ఎవరికీ గాయాలు తగల్లేదని తెలిసి కదిలిపోయేటప్పు
కలిగే అసంతృప్తి లాంటిది అది.

.............

మరో మూడు గంటలు గడిచాయి.

ఆకలిని పళ్ళ బిగువున అదిమిపెట్టి పైకి మామూలుగా కన
దానికి ప్రయత్నిస్తున్నారిద్దరూ. నడుస్తున్న శేఖరం గోడ దగ్గరకి
కుని నిముషంపాటూ దానికి ఆనుకుని పేద తీర్చుకుని తిరిగి వెన
పచార్లు చెయ్యవలసి వస్తోంది. అతడి మొహం పీక్కుపోయి వుంది.

భార్గవ పరిస్థితి కూడా అంతకు తక్కువగా ఏమీలేదు. మ
రోజులక్రితం ఆత్మహత్యా ప్రయత్నం తలపెట్టినప్పటినుండి ఇప
వరకూ అతడు దాదాపు ఏమీ తినలేదు. అదీగాక రవూఫ్ చేసిన గా
కాలి దగ్గర ఇంకా బాధపెడుతూనే వుంది.

బయట వసుమతి, రవూఫ్ తిరిగి రాగానే అతడి దగ్గరగా
"మీరేమీ చెయ్యలేరా? పాపకి ఆస్పత్రి మందులు ఇవ్వకుండా ఉంచ
ఆయనకి కావల్సిందయితే నేనూ ఒప్పుకుంటాను. పాపని ఇక్క
దాయవలసిన అవసరంలేదు. మా ఇంటికే వెళ్ళిపోవచ్చు. కొంచెం
విషయం మైక్‌లో చెప్పండి" అంది.

రవూఫ్ ఆమె మాటలపై అంత శ్రద్ధ చూపకుండా, సాలోచ
ఆమెవైపు చూశాడు. దగ్గరగా వచ్చిన ఆమెను చూడగానే అతడికి
ఆలోచన మెరుపులా స్ఫురించింది. ఈమెను ముందు పెట్టుకుని
నాటకం ఆడవచ్చు.

మొహంలో తనకొచ్చిన ఆలోచన తాలూకు ఆనందం ఏదీ ప్ర
తిబింబించకుండా "తప్పకుండా అలా చెయ్యవచ్చు మేడమ్! కానీ ఈ
యం చెప్పడానికి మైక్ ఎందుకు? ఛాంబర్ కిటికీ దగ్గరకు వెళ్ళి కి
లోంచి చెప్పండి. నేచెప్పేకన్నా మీరు చెపితే మీ భర్త కన్విన్స్ అవతా
అన్నాడు.

వసుమతికి ఈ ఆలోచన బాగానే ఉందనిపించింది. ఒక్కసా
తను 'పాపని ఇంటికి తీసుకెళ్ళిపోదాం' అని చెపితే ఇంక సమస్యేము

న తలుపు తెరుచుకుని బయటకు వచ్చేస్తాడు. ఈ ఆలోచనతో కిటికీ దగ్గరికి వెళ్ళింది. అయితే ఆమె తనతోపాటే చీకటిలో చాటుగా న్న రఫూఫ్‌ని చూసుకోలేదు.

ఆమె కిటికీ దగ్గర నిలబడి లోపలికి తొంగిచూసింది. శేఖరం ర్రే పచార్లు చేస్తున్నా ఆమె ఉనికి అతడికి తెలియలేదు. ఆమె మాత్రం న్ని చూసి ఆశ్చర్యంగా ఆ రెండో మనిషి "నువ్వా శేఖరం" అంది. మాటలు వినబడని శేఖరం మామూలుగానే తిరగసాగాడు. కానీ లోపల వసుమతి కంఠాన్ని గుర్తుపట్టి ఛాంబర్ దగ్గరిగా వచ్చి "నువ్వా!" నబోయాడు.

కాని ఈ లోపులోనే ఓ అనూహ్యమైన సంఘటన జరిగింది.

వసుమతితోపాటే దూరంనుండి చాటుగా వస్తూన్న రఫూఫ్, భార్గవ కిటికీ వున్న ఛాంబర్ దగ్గరికి వచ్చారనీ, లోపలున్న యిద్దరు స్థియా బయట ఛాంబర్ దగ్గరే వున్నారు అని నిర్ధారణ చేసుకోగానే కి రివాల్వర్ పేల్చాడు. అదే సంకేతంగా లాన్‌కి అవతల వున్న పు దగ్గర పొంచివున్న యస్సై, తలుపు గడియ వున్నచోట రివాల్వర్ రెండు షాట్లు వరసగా పేల్చి గడియ ఊడిపడగానే ఒక్క ఊపులో పు తోసుకుని లోపలికి ప్రవేశించాడు.

బయటనుండి ఒకసారి వెంటనే దూరంగా వెనుకనుండి రెండు ట్లు వరుసగా రివాల్వర్ ధ్వనులు వినబడగానే భార్గవ స్థాణువయ్యాడు. ంపాటూ ఏం జరుగుతుందో అర్థంకాలేదు. ఏం చెయ్యాలో తోచలేదు. నీ అది క్షణంసేపే. కలలోంచి హఠాత్తుగా మెలకువ వచ్చినవాడిలా రం చెయ్యి పట్టుకొని "క్విక్!" అని బిగ్గరగా అరుస్తూ లోపలికి పరుగు రాడు.

శేఖరానికి సంబంధించినంతవరకూ వసుమతి రాకగాని, రివాల్వర్ ప్పులుగానీ ఏమీ తెలీదు. ఒక చెయ్యివచ్చి అతణ్ని లోపలికి లాక్కెళు కుంది. ఏదో జరిగిందని అతడు గ్రహించి, అతడు పరుగు వేగం పెంచాడు. విరిగిన తలుపుగుండా లోపలికి ప్రవేశించిన యస్సై వరండా గొంచి పరుగెత్తుకువచ్చి లోపలగది దగ్గరకు చేరుకునే లోపులో ముందు దిలోంచి వాళ్ళిద్దరూ లోపలికి ప్రవేశించి తలుపు వేసేసుకున్నారు. ఇదంతా రెప్పపాటులో జరిగిపోయింది.

లోపల్నుంచి జేవురించిన మొహంతో భార్గవ బిగ్గరగా అరిచాడు. "మీరింకోసారి ఏ మాత్రం ఇలాంటి ప్రయత్నాలు చేసినా ఈ లా బిడ్డలు కాల్చేస్తాను- జాగ్రత్త" అతడి మాటలు ఆ ఆవరణలో ప్రతిధ్వనించాయి. నిశ్శబ్దమే జవాబయింది. యస్సై, రవూఫ్ దగ్గర కొచ్చాడు.

"నేను కొంచెం వేగంగా పరుగెత్తి వుంటే వాళ్ళకన్నా ముందే ఆ బాంబుల దగ్గరకు వెళ్ళి వుండేవాడిని సార్" విచారంగా అన్నాడు యస్సై. రవూఫ్ జరిగినదాన్ని చూసి విచారపడలేదు. సంతోషంగా యస్సై వేపు చూస్తూ "పరవాలేదు. వాళ్ళ రాజ్యంలోకి ప్రవేశించాం. ఇంక మన వాళ్ళకీ ఒక్క గోడా, ఒక్క తలుపే అడ్డు! అలాంటి ఆలోచనే ఇంకొకరికి తట్టిందంటే ఈ సంవత్సరపు పోలీసు అవార్డులు మనిద్దరికీ తప్పవు" అన్నాడు.

వసుమతి ఇంకా షాక్‌నుంచి తేరుకోలేదు. శిఖండిలాగా తనని అడ్డు పెట్టుకుని ఈ ఇన్‌స్పెక్టర్ ఈ ఎత్తు వేస్తాడని ఆమె కలలో కూడా అనుకోలేదు. అయినా అదికాదు ఆమె ఆలోచిస్తున్నది.

భార్గవ గురించి....

"ఏమనుకుని వుంటాడు తన భర్త తన గురించి? ఈ పోలీసుల్ని దగ్గరగా తీసుకువచ్చింది తనే అనుకోడూ? ఈ ఆలోచన తనదే అనుకుని మరింత అసహ్యం పెంచుకోడూ! 'భగవంతుడా! మా భార్యాభర్తల మధ్య యింకా ఎన్ని అనర్థాలు సృష్టిస్తే నీకు తృప్తి కలుగుతుందయ్యా' అనుకుంది.

చిత్తరువులా నిలబడిపోయిన వసుమతిని ఓరగా చూశాడు రవూఫ్. ఆమె ఇంకా షాక్‌నుండి బయటికి రాలేదని గ్రహించి– మొహంనిండా నవ్వు పులుముకుని దగ్గరికి వచ్చాడు.

"నీకిదంతా కొత్తగా వుండి వుండవచ్చు మేడమ్! కానీ మాకు అలవాటే! లోపల వారి బారినుండి మీ పాపను కాపాడటమే మా లక్ష్యం" అన్నాడు.

ఆమె అయోమయంగా అతనివేపు చూస్తూ "వాళ్ళ బారినుండి కాపాడటమేమిటి? వాళ్ళేవరనుకున్నారు? ప్రార్థనను ప్రాణంకన్నా ఎక్కువగా ప్రేమించే ఆయనా తన కూతురికి హాని చేసేది? లేక మా

టరిగా కలిసిపోయిన శేఖరమా?" కోపమూ, ఉక్రోషమూ కలిసిన కంఠంతో అంది.

"భార్గవతో వున్న ఆ రెండవ వ్యక్తి శేఖరమా మేడమ్?"

"అవును. శేఖరమని.... పాపం అతడికి చెవులు వినిపించవు, కళ్ళు కనిపించవు. అతడేం అపకారం చేస్తాడు?" అంది. భార్గవతో వున్నది శేఖరమే అని ఆమెకు ఎందుకో అనిపించింది.

ఒక్కసారిగా రవూఫ్ ముఖం ఆనందంతో వెలిగింది.

"వ్హాట్!" అని అరిచాడు.

"అవును.... ఇన్స్పె...." చెప్పబోతున్న వసుమతి ఏదో అర్థం అయినట్టూ చప్పున ఆగిపోయింది. రక్తం ఇంకినట్టూ మొహం తెల్లబడింది. కానీ అప్పటికే రవూఫ్‌కి కావలసిన పాయింట్ దొరికిపోయింది.

ఇన్స్పెక్టర్ రవూఫ్ ఆలోచనలు మిషన్‌కన్నా వేగంగా కదులుతున్నాయి. లోపల యిద్దరు పరిపూర్ణమైన వ్యక్తులు ఉన్నారనుకొని ఇన్ని రోజులూ తటపటాయించాడు. ఇప్పుడు శేఖరం కాపలా వున్నా— అతడ్ని పట్టించుకోనక్కరలేదు. భార్గవ నిద్రపోతున్న సమయంలో మరొక్కసారి ఆ రెండోగది తలుపుల్ని కూడా షూట్ చేస్తే భార్గవ నిద్ర లేచి బాంబులు వున్నచోటుకి వెళ్ళేలోపులో అతడ్ని చుట్టుముట్టవచ్చు. ఈ విషయాలేవీ శేఖరానికి తెలిసే అవకాశం లేదు.

అతడు తనకొచ్చిన ఆలోచనని యస్పీకి చెప్పాడు.

యస్పీ- "ఇంకెంతసేపు సర్? ఉన్నది ఒకడే అయితే వాడెంతసేపు మెలకువగా వుండగలడు? ఈ రాత్రే మన పని పూర్తవుతుంది" అన్నాడు ధీమాగా.

"ఈ జరిగిన హడావుడికి భార్గవ అప్పుడే నిద్రపోతాడనుకోను. ఇంకో రెండుగంటలు వేచి వుందాం. ఆ రెండవవాడి పీడ మనకి పరి పయమేగా! వాడొచ్చినప్పుడు చెప్పు. ఈ లోపులో నేను వెళ్ళి ముందు గది మనం ఆక్రమించుకున్నామన్న మెసేజ్ డియస్పీగారికి పంపించి వస్తాను" అన్నాడు. ఇంత సంభాషణ జరుగుతున్నా వసుమతి కదలలేదు. అసలామె ఈ మాటలన్నీ విన్నదో లేదో కూడా అనుమానమే. తను నోరు జారి చెప్పిన విషయం ఇంత ప్రమాదానికి దారి తీస్తుందని ఆమె ఊహించలేదు.

ఈ లోపల భార్గవ జరిగిన సంఘటన కలిగించిన అలజడి నుండి తేరుకున్నాడు. ఏం జరిగిందని ఆందోళనగా అడుగుతున్న శేఖరానికి వివరాలన్నీ చెప్పాడు. "అదృష్టవశాత్తూ ఎక్స్‌ప్లోజివ్స్ లోపల గదిలో వుంచుకున్నాం కాబట్టి సరిపోయింది...."

"వెనక తలుపు గడియ షూట్ చేసి లోపలికి రావచ్చు కదా!" అడిగాడు శేఖరం.

"మన దగ్గర వున్న ఎక్స్‌ప్లోజివ్స్‌ని చూసి భయపడి వుంటారు"

"దేవుడి విగ్రహాన్ని బద్దలు కొట్టడానికి తీసుకున్న ఎక్స్‌ప్లోజివ్స్ మనకీ విధంగా ఉపయోగపడ్డాయన్న మాట?"

"ఏం ఉపయోగ పడటమో! ఇలా నిద్రలేకుండా అనుక్షణం టెన్షన్‌తో మనం ఏం సాధించగలం? ప్రార్థనని తిరిగి ఆస్పత్రికే అప్పజెపుదామా?"

"వద్దు వద్దు. ఇంతవరకూ వచ్చాక దీని అంతేమిటో చూడవలసిందే. ఈ రాత్రి నేను నిద్రపోను. నా కంఠంలో ప్రాణం వుండగా వాళ్ళు మనల్ని ప్రయోగశాలనుండి ఖాళీ చేయించలేరు."

"కానీ ఎంతకాలం?"

"విధి మనల్ని పూర్తిగా ఓడించేవరకు లేదా సృష్టిని మనం గెలిచే వరకూ. ఏది ముందు జరిగితే అది"

దూరంగా ఎక్కడో ఎనిమిది గంటలు కొట్టింది.

* * * *

ఆందోళనగా చేతి గడియారంవైపు చూసుకుంది ప్రియ.

ఎనిమిదయింది. బాగా చీకటి పడింది. డి. ఐ. జి. ఇంటిదగ్గర విజిటర్స్ రూమ్‌లో కూర్చొని ఉందామె. దాదాపు మూడు గంటల నుంచీ వేచి వుంది.

రెండురోజుల నుంచీ ఆమె తిరుగుతూనే వుంది. ఇన్‌స్టిట్యూట్‌కి ఆహారం తీసుకువెళ్ళే ప్రయత్నం విఫలమయిన తర్వాత ఆమె మరి అక్కడ ఉండలేదు. అక్కడ పోలీసులతోపాటూ తనూ ఓ ప్రేక్షకురాలిలా నిలబడి చూడటమే కానీ మరేమీ సాధించలేనని ఆమెకు తెలుసు. టైమ్ వేస్టు తప్ప మరేమీ కాదు. ఈ ఆలోచనతో ఆమె మరి ఇన్‌స్టిట్యూట్‌వైపు మరోసారి వెళ్ళలేదు. సమస్యని ఇంకొకవైపు నుంచీ

పడుక్కారావడానికి ప్రయత్నించింది. ముందు పై అధికారి అయిన డి.యస్.పి. దగ్గరికి వెళ్ళింది.

డియస్పీ వెకిలిగా మాట్లాడిన తర్వాత ఆ రోజు మధ్యాహ్నమే ఆమె యస్పీ దగ్గరకు వెళ్ళింది. యస్పీ, డియస్పీకి పూర్తి వ్యతిరేకం. మంచి వాడే! కానీ రూల్స్ని పూర్తిగా ఒంటబట్టించుకున్నవాడు "అవును నిజమే" అన్నది అతని ఊతపదం.

"అవున్నిజమే!! ఆ అమ్మాయి అతని సొంత కూతురే!! కానీ తల్లిని కాదని కూతుర్ని తీసుకుపోవడం నేరం కదా!"

"కానీ ఆవిడ సవతి తల్లండీ!!"

"అవున్నిజమే! కాని కోర్టు అర్థముంది కదా!"

"పోనీ ఆ తల్లి దగ్గరనుండి తన కభ్యంతరం లేదని లిఖిత పూర్వకంగా తెప్పిస్తే...."

"అవున్నిజమే! తెప్పిస్తారు. కానీ మోహన్‌లాల్ కపాడియా ఇన్‌స్టిట్యూట్ పబ్లిక్ యూరినల్స్ కాదు కదా, లోపలికెళ్ళి తలుపేసు కోడానికి!"

ఆమె కోపాన్ని అణుచుకుని "అవున్నిజమే" అని విరక్తిగా అనేసి అక్కడనుండి లేచి వచ్చేసింది.

అక్కడనుండి ఆమె సరాసరి పత్రికాఫీసుకి వెళ్ళింది. మంచి సర్క్యులేషన్ ఉన్న ఇంగ్లీషు దినపత్రిక అది. నేరుగా వెళ్ళి ఎడిటర్‌ని కలుసుకుంది. ఆ ఎడిటర్ నేషనలిస్టు భావాలున్నవాడు. ఆమె చెప్పినదంతా విన్నాడు. లోలోపలే చాలా ఆశ్చర్యపోయాడు. అసలు కథ ఇదన్న మాట.... తమకి ఇప్పటివరకూ వచ్చిన వార్త వేరు! "ఒక తండ్రి తన కూతురికి, ఆస్పత్రి మందులు ఇవ్వడం ఇష్టంలేక, దూరంగా తీసుకెళ్ళి పోయి, ఆ పిల్ల మరణంకోసం ఎదురు చూస్తున్నాడు".... ఇదే తమకి తెలిసింది. వెనకున్న సత్యం తెలీదు.

ముఖ్యంగా 'కాన్స్-క్యూర్' సంగతి!

దాన్ని భార్గవ ఎదిరించిన సంగతి!!

అతడు రాజీనామా ఇవ్వవలసి వచ్చిన పరిస్థితుల సంగతి!!!

ఆ రోజు ప్రొద్దున్న శేఖరమూ, తనూ కలిసి లాబ్‌కి వెళ్ళినపుడు భార్గవ బ్రెయిలీలో అన్ని విషయాలూ శేఖరానికి వివరించి చెపుతూ వ్రాసిన

కాగితాన్ని ఎడిటర్ ముందుకు తోసింది ఆమె. దాంట్లో వివరాలన్నీ వున్నాయి- మొత్తం కథంతా.

దాని ఇంగ్లీషు తర్జుమాని చదువుతూ ఎడిటర్ మొహంలో రంగులు మారసాగాయి. చదవటం పూర్తిచేసి చాలాసేపు కళ్ళు మూసుకుని అలాగే వుండిపోయాడు.

మనసులోనే ఆమె చెప్పిన వివరాలన్నీ సమీక్షించుకున్నాడు. ఆమె చెప్పేదేగాని ఏ మాత్రం నిజమైనా, ఈ వార్త పార్లమెంటుని పునాదుల్తో సహా కదిలించి వేస్తుంది.

అంతేకాదు! ఒక నిస్సహాయుడయిన సైంటిస్టు ఈ కాపిటలిస్టుల చేతిలో ఎలా నాశనమైపోయిందీ మొత్తం దేశానికీ తెలుస్తుంది. పత్రిక ఎడిటర్‌గా పుట్టినందుకు కనీసం కప్పబడిపోతున్న ఒక నిజాన్ని వెలికి తీసిన సంతృప్తి అయినా తనకి మిగుల్తుంది.

....కానీ అతడు వెంటనే నిర్ణయానికి రాలేదు. పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చేసేడు. పత్రిక ఎడిటర్ తల్చుకుంటే ఇలాంటి వివరాలు బయట పడటం ఎంతసేపు! కొన్నిరోజుల క్రితం భార్గవని ఒక రాత్రి అంతా లాకప్‌లో పెట్టారనీ, మరుసటిరోజు ప్రొద్దున్నే శంకర్‌లాల్ వచ్చి అతడిని విడిపించాడనీ తెలిసింది. దానికన్నా ముఖ్యమైన వార్త ఏమిటంటే- ఆ రోజే భార్గవ తన పదవికి రాజీనామా ఇచ్చాడు. అతడు మరి ఆలస్యం చేయలేదు. ఒక విలేఖరిని పిలిచి ఆ అమ్మాయితో వెంటనే ఇంటర్వ్యూ తీసుకోమన్నాడు. మరుసటిరోజు ప్రొద్దున్నే పేపర్లో ఈ ఇంటర్వ్యూ రావాలనీ, నాలుగు కాలమ్స్‌లో వచ్చేలా మొత్తం వివరాలన్నీ తీసుకొమ్మనీ చెప్పాడు. ఇందులో కాస్త రిస్కు వుందని తెలుసు. కానీ కొడితే కుంభస్థలం కొట్టాలి!

ఆమెకు అక్కడ పని పూర్తయ్యేసరికి సాయంత్రమయింది. విలేఖరికి తనకి తెలిసిన విషయాలన్నీ చెప్పింది.... తను లాబ్‌లో ప్రార్థనని చూడటం, ఆమె చేతికి ఐ. వి. ఫ్లూయిడ్స్ వుండటం వివరించింది. కూతుర్ని భార్గవ తీసుకెళ్ళింది సహజ మరణంకోసం కాదనీ, తనకు చేతనయిన రీతిలో ఇమ్యూనోథెరపీ కోసమనీ చెప్పింది. నిజంగా భార్గవకి అందరూ అనుకునే ఉద్దేశ్యమే ఉంటే లాబ్‌వరకూ వెళ్ళాల్సిన అవసరమే లేదనీ.... వేరే ఇంకెవరికీ తెలియని చోటే దాక్కోవచ్చనీ

అభిప్రాయంగా చెప్పింది. ఈ పాయింటులో విలేఖరికి లాజిక్ దొరి
డాన్ని హెడ్డింగ్‌గా పెట్టదల్చుకున్నాడు.

ఇంటర్వ్యూ ఇచ్చిందన్న మాటేగానీ దీనివల్ల ఎంతవరకూ ఫలితం
టుందో ఆమెకే తెలీదు. ఇక్కడ లాకప్‌లో వున్నవాళ్ళకి నిద్రాహారాలు
క్షణమో యుగంగా గడుస్తూ వుందన్న విషయం ఆమె మర్చిపోలేదు.
ఇన్‌స్పెక్టర్ రవూఫ్ ప్రమాదం అనే రూపంలో పక్కనే వుండి ఏ క్షణ
నా కాటు వేస్తాడని ఆమెకి గుర్తుంది.

అందుకే ఆమె ఇంటర్వ్యూ పూర్తవగానే మళ్ళీ తన పనిలో
పడింది. ఈసారి ఇంకా పై అధికారిని కలుసుకోడానికి ప్రయత్నించింది.
తనే డి. ఐ. జి.

ఆమె వయసులో చాలా చిన్నది. లోకజ్ఞానం కూడా అంతగా లేదు
సలేక అరచేతులతోనే మిణుక్కు మిణుక్కుమంటూ కొడిగట్టబోతున్న
చిన్న దీపాన్ని కాపాడటానికి శక్తివంచన లేకుండా ఆ అమ్మాయి
స్తున్న ప్రయత్నం మాత్రం గొప్పది!

పలుకుబడి లేక, సహాయంచేసే ఆప్తులులేక ఒంటరిగా కేవలం
ధైర్యంలా, నమ్మినదానిపట్ల నిజాయితీ— ఈ రెంటి సాయంతోనే ఆమె
త సాహసాన్ని చేపట్టలేకపోయేదేమో కాని కొన్ని కొన్ని పరిచయాలు
నకి తెలియకుండానే అంతర్లీనంగా మనకి కావలసిన స్ఫూర్తినీ జీవితం
క కమెండ్‌నీ కలిగిస్తాయి. శేఖరంతో పరిచయం కొన్నాళ్ళదే అయినా,
మెకి అలాటి ఉద్దీపనని కలిగించింది అది.

ఆమె డి. ఐ. జి. ఇంట్లో రాత్రి తొమ్మిదిన్నరవరకూ కూర్చుంది.
వాడు ఇంటికి రాలేదు. ఏదో పార్టీలో వున్నాడనీ— ఆలస్యంగా వస్తాడనీ
సింది. మరుసటిరోజు ప్రొద్దున్న రమ్మని అక్కడి మనిషి చెప్పాడు.
మె నిరాశతో ఇంటి మొహం పట్టింది.

ఇంటికి వచ్చాక గుర్తువచ్చింది. తను దాదాపు పన్నెండు గంట
ప్పింది ఏమీ తినలేదని. ఒక్కసారిగా ఆకలి ముంచుకొచ్చింది. అంతలో
ల్లి ఆ బ్రెడ్ పాకెట్టూ అవీ చూపిస్తూ "ఎందుకే ఇవన్నీ తెచ్చావ్?" అని
గింది కూతుర్ని.

అంతే! దాంతో శేఖరం గుర్తు వచ్చాడు. అతడి ఆకలి గుర్తు

వచ్చింది. తన ఆకలి చచ్చిపోయింది. కంచం ముందునుంచి లేచిపోయి 'అదేమిటే' అని విడ్డూరంగా చూస్తున్న తల్లికి జవాబు చెప్పకుండా.

పక్కమీద పడుకొని పైకప్పుకేసి చూస్తూ "రేపు అంతా జరి కథ సుఖాంతమై, శేఖరాన్ని కలుసుకుంటే తనకి అన్నం సహిం విషయం అతడికి చెప్పాలి" అనుకుంది. ఏమంటాడో తనకి బాగా తెలి తన గురించి అనేది ఒకేమాట—

'అడాలిసెంట్'

# 8

ఆ చరిత్రాత్మకమైన సంఘటన రాత్రి 11-07 నిముషా జరిగింది.

సైన్సు చరిత్రలో బయటపడ్డ గొప్ప గొప్ప వాస్తవాలన్నీ ఎ యాదృచ్ఛికంగా బయటపడ్డాయో ఈ సత్యంకూడా అంత యాదృచ్ఛిక బయటపడింది.

ఆ రాత్రి రవూఫ్ తనని రెండో గదిలోకి తోసేసి మొదటి ఆక్రమించుకున్న సంఘటన తరువాత శేఖరం మామూలుగా ప చేస్తున్నా చాలాసేపటివరకూ ఖడ్గప మాత్రం తేరుకోలేకపోయాడు. క్షణాన్నయినా వాళ్ళు లోపలికి విరుచుకు పడవచ్చునని అందో తలుపు వేపుకు చూస్తూ గడిపాడు. అరగంట వరకూ బయట అలాంటి ప్రయత్నం తాలూకు సూచన ఏదీ కనబడక పోయేసరికి కొ సర్దుకుని తన పని కుపక్రమించాడు.

అప్పుడు గమనించాడు. పరికరాల మధ్యగా బుల్లెట్ వెళ్ళత సీల్డు కవరున్న ఓజోన్ ట్యూబ్ స్థానభ్రంశం చెంది ఇంటర్న ఛాంబరులో ఓజోన్ పొరకి రంధ్రం చేసిన సంగతి!

ఎన్నడూ లేనంత నిస్సత్తువ అతడిని ఆ క్షణం ఆవరించి మూడు రోజులుగా చేస్తున్న ప్రయోగం అంతా వృధా అయిపో నందుకు దుఃఖం కలిగింది. శేఖరం వేపు చూశాడు. తనకోసం అతడ పట్టుదలతో నిలబడ్డాడు. తానేమో నిర్లక్ష్యంతో అసలేం జరుగుతు చూసుకోలేదు. ఇప్పుడు దొరికినంత సమయం మళ్ళీ దొరకడం, ప ఈ ప్రయోగం మొదటినుండీ కొనసాగించడం దాదాపు అసాధ్యం.

ఇంతకాలం చేసింది. వృధా అయిందన్నమాట! ఏమీ తోచనట్టుగా ఆ ఫ్లాస్కులవేపు చూస్తూ చాలాసేపు ఉండిపోయాడు. తరువాత ఫ్లాస్కు ఖాళీ చేయడానికి ఉపక్రమించాడు. భూమి చుట్టూవున్న పొరని కృత్రిమంగా సృష్టించి, దానిగుండా అల్ట్రావయొలెట్ ల్ని పంపించాడు. ఈ మూడురోజులూ.... ఆ కిరణాన్ని ఓజోన్ ంది. కాబట్టి.... అలా పంపించటంవల్ల ఫలితమేమీ లేకపోయినా, ప్రయోగం ప్రారంభించినప్పుడు ఆ ఒక్క ఛాన్సు కూడా పోవటం ఇష్టంలేక ఆ ఛాంబర్ కూడా తయారుచేశాడు. రవూఫ్ ర్ తాలూకు బుల్లెట్ తగిలి, ట్యూబ్ కదిలి, రంధ్రం చేసింది ఈ . దాంతో అతడు కృత్రిమంగా తయారుచేసిన అట్మాస్ఫియర్ ....2 యింది.

పాడయిపోయిన ఛాంబర్‌ని ఖాళీచేసి, శుభ్రం చేద్దామనుకుంటూ ఎందుకో అందులో పదార్థాన్ని కూడా మిగతా వాటిలాగే పరిశీలిద్దా న్నాడు. కొన్ని రసాయనాలతో కూడిన ఉప్పునీటితో ఆ కణాల్ని ' ముక్కలుగా కత్తిరించి వాటి ఫోటోలు తీసి చూసేడు.

అతడి భృకుటి ముడిపడింది.

ఫోటోగ్రాఫ్‌లో సన్నటి తీగెలు కనిపించాయి.

తన కళ్ళని తానే నమ్మలేకపోయాడు.

తిరిగి మరికొన్ని కణాల్ని ఉప్పునీటిలో ట్రీట్ చేశాడు. వాటిని ఫోటో తీసి చూసాడు. ఆ తీగెలు తిరిగి కనిపించాయి.

క్రోమోజోమ్స్!!

అతడి చేతులు వణకసాగాయి. నుదుటిమీద చెమట పట్టింది. మోస్కైప్' ద్వారా లెక్కకడితే కాస్త అటూ యిటూగా వాటి లెక్క ంది కానీ, అతడు ఆ లెక్క గురించి అంతగా పట్టించుకోలేదు.

వణుకుతున్న చేతుల్తో అతడు ఎలక్ట్రానిక్ మైక్రోస్కోపును పరి . లోహపు వాయువుని పదార్థం మీదకు వెదజల్లడం వల్ల ఏర్పడే ఆధారంతో మిల్లీమీటర్‌లో మిలియనో వంతు భాగాన్ని కూడా గలిగే అత్యంత అధునాతనమైన పరికరం అది.

రొట్టెని తరిగినట్టూ సన్నగా తరిగే మైక్రోటోమ్‌తో దాన్ని స్లై చేసి, దానిమీద క్రొమోటిన్ (రంగు) జల్లాడు.

ఎలక్ట్రానిక్ మైక్రోస్కోప్ క్రింద దాన్ని పెట్టి కెమేరా చేశాడు.

ఆటోమాటిక్ కెమేరా ఫోటోలు తీయసాగింది. కొంచెంసే ఫోటోలు బయటికి వచ్చాయి. అతడిలో క్షణక్షణానికి టెన్షన్ పోతూంది. ఒక్కొక్క ఫోటోనే లైటుక్రింద పెట్టి చూసేడు.

సడెన్‌గా అతడు ఊపిరి బిగపట్టాడు.

ఫోటో తరువాత ఫోటో....

ఆస్టర్ బాడీ రెండుగా విడిపోవటం క్రోమోజోమ్‌లు రా ఏర్పడడం.... అవి చెరోవైపుకీ చేరుకోవటం నె....మ్మ....ది.... కణం రెండుగా చీలిపోవటం— చీలిన ఆ రెండు కణాలచుట్టూ తిరిగి పూర్ణమయిన పొర ఏర్పడటం....

అప్పుడు అతడు ఆనందంతో పెట్టిన కేకకి గది గోడలు పోయాయి.

అతడు చిన్నపిల్లాడిలా కేరింతలు కొట్టాలనుకున్నాడు. య డిలా నాట్యం చెయ్యాలనుకున్నాడు. వయసు గుర్తొచ్చి గంభీరంగా లనుకున్నాడు. మూడింట్లో ఏ ఒక్కటీ చెయ్యలేకపోయాడు. చుట్టూ పరికరాల్తో ఆప్యాయంగా మాట్లాడాడు. వాటికి కృతజ్ఞతలు చెప్పుకున్నా సృష్టికి ప్రతిసృష్టి జరగటం చూసి బ్రహ్మదేవుణ్ని శీర్షం వడ కోరుకున్నాడు. కదిలే గాలి తెమ్మెరకీ, నిశ్చలమైన పాలవెన్నెలకీ సాధించిన విజయం గురించి చెప్పుకున్నాడు.

అలౌకికమయిన ఆ స్థాయీ భావం నుంచి విడివడకుండానే శేఖరాన్ని చూసి, ఒక్క అంగలో వెళ్ళి అతడిని చేతుల్లోకి తీసుకున్నా "నా యీ విజయానికి అసలు కారణం నువ్వు మిత్రుడా! న ఆత్మహత్యకు సిద్ధపడిన ఒక జీవన్మృతుడుని నీ మాటల్తోనూ చేతల్తో ప్రభావితం చేసి, తిరిగి గమ్యంవేపు నడిపించావు. ఒక వర్షం క సాయంత్రం జరిగిన మన పరిచయం యింత గొప్ప పరిణామానికి తీయటం నా అదృష్టం.... నీకెలా కృతజ్ఞతలు చెప్పుకోను?"

అని అందామనుకున్నాడు. ఆనందంతో నోటమాట రా

ఖరం ఆ స్పర్శలో లేదాని కనుక్కోగలిగాడు. విజయం సంగతి పోయింది. భార్గవ మొహాన్ని ఆప్యాయంగా తడిమాడు. కళ్ళదగ్గిర గిరి ఆగిపోయాడు. చెంపలమీదకు ధారాపాతంగా కారుతున్న టి తుడుస్తూ 'కంగ్రాట్స్' అందామనుకున్నాడు, అనలేకపోయాడు.

ఆనందంతో మాటరాని మనిషి, ఆనందాన్ని మాటల్లో చెప్పలేని ... మాటలకతీతమైన భావంతో అలాగే చాలాసేపు వుండిపోయారు.

ముందు తేరుకున్నది భార్గవే. చేసింది తక్కువ, చెయ్యవలసింది వుంది. ఓజోన్ ట్యూబ్ దగ్గిరగా వెళ్ళి పరీక్ష చేశాడు.

చప్పున అతడికో విషయం స్ఫురించింది.

ఓజోన్ కూడా కార్సినోజినే.

తనింతవరకూ మందుల కంపెనీనుంచి వెలువడే విషవాయువునే యోగంలో వాడుతూ వచ్చాడు. దాని ద్వారా ఫలితం రావడానికి ఆలస్యమై వుండేదో!.... అదృష్టం ఈ రూపంలోనేకాదు, ఇంకో కూడా లాభించింది. ఏ క్లిష్టమయిన లివింగ్‌సెల్లో తయారవకుండా, మయిన క్రోమోజోమ్స్‌తో స్పష్టమయిన ఆకారం ఏర్పడటం నిజంగా ష్టం.

అతడు తన పనిని కొనసాగించాడు.

ఛాంబర్ అన్నిటినీ వాక్యూమ్-డ్రై-ఆఫ్ చేసి, వేర్వేరు పత్రికల్లో, ఉష్ణోగ్రతల్లో వుంచి, కార్సినోజెన్ సరఫరా చేశాడు. సరిగ్గా రెండు తర్వాత అతడి ప్రయత్నం ఫలించింది. ఇరవై మూడు జతల జోమ్స్ వున్న పరిపూర్ణమైన కేన్సర్ సెల్ తయారైంది.

* * * *

రాత్రి రెండింటికి రవూఫ్ మోటార్‌సైకిల్ ఇన్‌స్టిట్యూట్ మెయిన్ ముందు ఆగింది. అక్కడినుండి శబ్దం చెయ్యకుండా లోపలికి తోసుకు డు.

సరిగ్గా ఆ సమయానికి వస్తానని అతడు ముందే చెప్పడంవల్ల ఎదురు చూస్తున్నాడు. దగ్గిరకు వచ్చి శాల్యూట్ చేశాడు.

"ఎలా వుంది పరిస్థితి?" హిందీలో అడిగాడు రవూఫ్.

"అలాగే వుంది సాబ్! ఇంకా ఎవరూ నిద్రపోలేదనుకుంటా"

రవూఫ్ విసుగ్గా లాట్‌వైపు చూశాడు. "ఇడియట్స్" అ
చిరాగ్గా. ఈ రాత్రితో అతడు ఈ పని పూర్తయిపోయిందను
కానీ చూస్తూంటే అది అంత దగ్గరలో వున్నట్లు కనబడడంలేదు. అ
అతడిదృష్టి దూరంగా లాట్ దగ్గర నిలబడ్డ వసుమతిమీద పడింది.

"ఈ అర్ధరాత్రిపూట ఈవిడ ఇక్కడెందుకుంది?" మొహం
అడిగాడు.

"ఎంత చెప్పినా వెళ్ళలేదుసార్! రాత్రంతా మెలకువగానే వ

వసుమతి వున్న వేపు రవూఫ్ రెండడుగులు వేసి చప్
పోయాడు. అతడు ఎందుకు ఆగాడో తెలీక యస్పీ కూడా
చూస్తున్న వైపే దృష్టి సారించాడు. ఇద్దరి చూపూ శేఖరం వాక్య
పైభాగాన పడింది.

లోపలి దీపపు కాంతి వెంటిలేటర్లోంచి బయట పడుతోంది.

ఇద్దరూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

"ఇదున్నట్టు మనం ఇంతసేపూ గమనించక పోవడం
కరం" అని యస్పీవేపు తిరిగి "క్విక్...." అన్నాడు. అతడి
అర్థం చేసుకున్నట్టు వేగంగా అక్కడినుండి కదిలాడు.

* * * *

"నాదో చిన్న అనుమానం?"

"ఏమిటి?"

"మామూలు కణానికీ, కేన్సర్ కణానికీ తేడా లేదని అంట
అటువంటప్పుడు అది మామూలు జీవకణమే అయివుండొచ్చుగా!
ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతున్నారు?"

భార్గవ, శేఖరంవైపు మెచ్చుకోలుగా చూశాడు. ఏదో మొక్క
కాకుండా తనతోపాటు ప్రతి విషయంలోనూ అతడు పాలు పంచు
చాలా ఉత్సాహంగా వుంది. ఈ పరిస్థితుల్లో కావలసింది అదే!
చెప్పాడు.

"నా వూహ నిజమైతే ఈ 'ప్యూర్' కేన్సర్ కణం చాల
వంతమైందే అయి వుండాలి. ఇది ఒక ఆరోగ్యవంతమైన శరీర
ప్రవేశపెడితే— అక్కడి యాంటిజెన్‌గా పనిచేసి అనూహ్యమైన వే

పెంచుతుంది. అప్పుడా శరీరంలోంచి ఇంటర్ ఫెరాన్‌ని తీసి ఎక్కించి యుద్ధానికి ఆయత్తం చెయ్యటమే కేన్సర్‌కి మందు. ఈ ఆంటీబాడీస్‌ని సృష్టించటమే ఇన్నాళ్ళూ నేను కలలుగన్న నో థెరపీ.

ఇదంతా అర్థం చేసుకోడానికా అన్నట్టు శేఖరం కాసేపు మౌనంగా తర్వాత అడిగేడు– "మనం ఇప్పుడు ఈ కేన్సర్ కణాల్ని ఏ శరీ ప్రవేశపెడతాం?"

"దాందేముంది? చాలా సులభం. మన లాబ్‌లో వున్న ఏ కుందే ..." వ్రాయబోతూ సగంలో ఆపుచేసాడు భార్గవ. అతడి మొహం యింది. ప్రక్కగది తమ ఆధీనంలో లేదు, అందులోనే ప్రయో కావలసిన జంతువులున్నాయి. తనలో తనే గొణుక్కుంటున్నట్టు ... ఎలా?....' అనుకున్నాడు. అతడు మౌనంగా వుండటం చూసి "ఏం జరిగింది" అని అడిగాడు.

భార్గవ అతడికి తనకు వచ్చిన క్రొత్త సమస్య గురించి చెప్పాడు. ప్రతిదానికీ చాలా సులభంగా పరిష్కారమార్గం చెప్పే శేఖరం ఏం చెయ్యాలో తోచనట్టు ఆలోచనలో పడ్డాడు. అంతలో ఏదో చినట్టు "పోనీ మనం బైటకి వెళ్తే? మీరు సాధించిన విజయం పదేమీ కాదు. ప్రపంచం మీకు జోహార్లర్పిస్తుంది. మిగతా గం బయటే చేసుకోవచ్చు" అని వివరించాడు.

"ప్రపంచం జోహార్లర్పించటానికి కాదు శేఖరం నేనిదంతా . ఏదే శరీరంలో యాంటీజెన్‌ని ప్రభావితంచేసి దాన్ని ప్రార్థన లోకి ఎక్కించాలి. నా కూతురు ఎలాగూ చచ్చిపోతుందన్న నిర్ణ కి వచ్చి తనమీద ఈ ప్రయోగం చేయదల్చుకున్నాను. ఈ వాక్సి నాలుగు గోడల మధ్య జరగాల్సిందే శేఖరం! మందు తాలూకు పం సరిగ్గా తెలియనిదే దాన్ని మనిషిమీద ప్రయోగిస్తానంటే బైట సం దానికి ఒప్పుకోదు. ఎలా? ఎలా?"

దూరంగా మూడుకొట్టింది. బైట ప్రకృతి అంతా ఆ చీకట్లో ఉస్తోంది. ఆశా నిరాశల మధ్య వూగుతూ ఆ ఇద్దరూ ఏం చెయ్యాలో చోః నిశ్చలంగా కూర్చుని వున్నారు. బైటనుంచి వడుతున్న

మనక వెలుతురు, చీకటితో పోరాడి ఓడిపోయి నేలమీద నల్లగా ప
కుంది. విజయం చేతివరకూ వచ్చి జారిపోయింది.

వాళ్ళలాగే కూర్చుని వున్నారు. స్థాణువుల్లా.... స్తబ్దంగా....

*        *        *        *

బయట ప్రకృతి కూడా అలాగే నిశ్శబ్దంగా వుంది. అంతే
బ్దంగా ఇద్దరు పోలీసులు ఒక నిచ్చెనని తీసుకుని వెంటిలేటర్ వేప
తున్నారు. రవూఫ్ దూరంగా వుండి పర్యవేక్షణ చేస్తున్నాడు.

లోపల వాళ్ళకి ఏ మాత్రం శబ్దం వినపడకుండా వెంటిలే
కిందుగా నిచ్చెన అమర్చబడింది. యస్సై నెమ్మదిగా పైకెక్కి లో
తొంగిచూసాడు. తర్వాత కిందికి దిగి రవూఫ్ దగ్గరికి వచ్చాడు.

రవూఫ్ అతడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు. యస్సై హుషా
"ఇంతకాలం మన దృష్టికి రాకపోవడం వాళ్ళ అదృష్టం సార్. ఇ
అంతా స్పష్టంగా కనబడుతోంది. వాళ్ళిద్దరూ ఆ పాప పడుకున్న
వున్నారు" అన్నాడు. రవూఫ్ ఆనందంతో సన్నగా విజిల్ వేసాడు.

"నువ్వొద్దు, నేను వెళతాను. ఆ గుడ్డివాడు నిరపాయకరం.
డున్నా లేకపోయినా ఒకటే. భార్గవని షూట్ చేస్తాను. నా రివా
శబ్దం వినిపించగానే ఇంతకుముందు చేసినట్టే తలుపు గడియ షూ
లోపలికి ప్రవేశించు. ఒకవేళ నేను పేల్చిన బుల్లెట్ అతని కాలికి
తగలక, బాంబు వున్నవైపు పరిగెడితే నిస్సందేహంగా అతడిని
చేసి పడేస్తాను" అన్నాడు రవూఫ్. యస్సై తలూపాడు. రవూ
సులో అసలు ఉద్దేశ్యం వేరు, తరువాత గొడవా ఎంక్వైరీ రాకుండా
అన్నాడే తప్ప అతడు నిశ్చయంగా భార్గవని షూట్ చెయ్యటానికే
యించుకున్నాడు.

యస్సై అతడు చెప్పింది విని అర్థమైనట్టు తలూపి రెండో పై
వెళ్ళగానే రవూఫ్ కాలిబూట్లు విప్పి నిచ్చెన ఎక్కడం ప్రారంభించాడు

ఆ సమయానికి శేఖరం; భార్గవలు ప్రార్థన దగ్గిర వున్నారు.

భార్గవ శేఖరానికి ఏదో చెప్పటం కోసం కాగితం అందుకో
చటుక్కున ఆగాడు.

నెమ్మదిగా వినిపిస్తూంది.... ఏదో శబ్దం!

అతడు చెవులు రిక్కించి విన్నాడు. మళ్ళీ వినిపించింది. కిటికీ బైటనుంచి ఎవరో సన్నగా కొడుతున్నారు. అతడిదృష్టి అప్రయ ...గా ఎక్స్‌ప్లోజివ్స్ మీద పడింది. ఒకదాన్ని చేతుల్లోకి తీసుకొని ...సగా వున్న వేరే కిటికీ రెక్క కొద్దిగా తెరచి ఆ సందులోంచి ...సేడు.

వెన్నెల్లో వసుమతి కనబడింది. ఆమె భయం భయంగా అటూ ...చూస్తూ తలుపు తట్టడం కనిపిస్తూంది.

భార్గవ భృకుటి ముడిపడింది. మళ్ళీ ఇందులో ఏదయినా క్రొత్త ...వుందా అని ఆలోచించాడు. కానీ వసుమతి మొహంలో క్షణ ...కీ పెరుగుతూన్న భయం అతడి అనుమానాన్ని తగ్గించింది. ఆ ...లో నిజాయితీ కనబడింది.

వెళ్ళి ఆ కిటికీ చాటునుంచి "ఏమిటన్నట్టు" చూశాడు.

"తలుపు తెరవండి తొందరగా...." అంది. అతడు తటపటాయిం...మళ్ళీ అంతలో అనిపించింది. ఏమిటిది భార్యాభర్తల మధ్య ...అనుమానాలు! అవనీ ఏం జరుగుతుందో చూద్దాం. ఆమెగానీ అంత ...టానికి పూనుకుంటే ఇంక మనుష్యులున్న లోకంలో బ్రతకటం, ...ఈ మానవజాతిమీద విశ్వాసం పెంచుకోవటం కూడా అనవసరమే.

అతడు వెళ్ళి తలుపు తీసేడు.

ఆమె వేగంగా లోపలికి దూసుకువచ్చి అతడిని ఛాంబర్ వెనక్కి ...స్తూ, 'అలా వెళ్ళిపోండి తొందరగా' అంది. అతడికి ఆమె చెపుతున్నది ...మయ్యేలోపులోనే అతడిని దాదాపు తోసుకుంటూ ఆ ప్రదేశానికి ...ంది. అతడు అయోమయంగా ఆమెవైపు చూడసాగేడు. అంతలో ...శేఖరాన్ని కూడా అక్కడికి తీసుకొచ్చింది.

అదే సమయానికి రవూఫ్ నిచ్చెన ఆఖరి మెట్టుమీద కాలుపెట్టి ...లేటర్ గుండా లోపలికి తొంగిచూసేడు.

లోపల గది నిర్మానుష్యంగా వుంది!

అతడు తన కళ్ళని నమ్మలేకపోయాడు. కళ్ళు నులుముకుంటూ ...గదంతా కలియచూసేడు.

ప్రార్థన తప్ప ఎవరూ లేరు.

ఇంతలో క్రింద ఎవరో దగ్గరకు పరుగెత్తి వస్తూన్న చప్పుడవ వెంటిలేటర్ లోంచి తల బయటకు తీసి క్రిందకు చూసేడు.

వస్తూన్నది యస్సై.... ఏదో జరిగిందని గ్రహించాడు రఫ నిచ్చెన మెట్లమీద నుండి తొందరగా క్రిందకు దిగాడు.

"ఆవిడ.... ఆవిడ...." సబ్ ఇన్స్పెక్టర్ రొప్పుతూ అన్నా

"ఆవిడెవరు?.... సరిగ్గా చెప్పు అన్నట్లు" విసుగ్గా అన రఫూఫ్.

"అదే సార్, ఆ సైంటిస్టు భార్య. నేను ప్రక్కకి వె లోపలికి మెల్లగా జారుకుంది. వాళ్ళూ వాళ్ళూ ఒకటే."

రఫూఫ్ స్థాణువయ్యాడు. ఒక్కసారి రక్తం మొహంలోకి చి చిమ్మింది. లోపల ఎవరూ తనకి కనబడకపోవటానికి కారణం అర్థమ కోపంతో పళ్ళు పటపట కొరికేడు. ఆమె వున్నదన్న విషయం మర్చి తన ప్లాన్ బహిరంగంగా చెప్పాడు. యిప్పటివరకూ తనవైపు ఆమె, ఆఖరి క్షణంలో అటు జారుతుందనుకోలేదు.

లోపల ఈ లోపులో వసుమతి భార్గవకి బయట పోలీసులు చేయదల్చుకున్నదీ చెపుతుంటే భార్గవ వళ్ళు జలదరించింది. క వెంటిలేటర్ వైపు చూసేడు. అతనికి కూడా ఇంతవరకూ దాని గు అనుమానం రాలేదు. దానిమీద నుంచి దృష్టి మరలుస్తూ, నెమ్మదిగా తిప్పి అతడు భార్యవైపు అభిమానంగా చూసేడు. పెళ్ళయిన ఇన్నా మొట్టమొదటిసారిగా ఆప్యాయతతో కూడిన అదోలాటి భావం అత కలిగింది. 'ఎంతయినా తామూ, తామూ ఒకటి! తమదొక కుటుంబం!'

ఈ ఆలోచన అతడికెంతో తృప్తి నిచ్చింది.

వసుమతికి కూడా నిశ్చింతగానే వుంది. తనూ లోపలికి వచ్చేసి ఇంకేమయినా ఫర్వాలేదు. కష్టాన్ని కూడా అందరూ ఆనందంగా స కుంటారు.

ఆమె ఇక భార్గవకి బయట జరుగుతున్నది చెప్పగానే బాధ్యత తీరిపోయినట్టు ప్రార్థన దగ్గరకు వెళ్ళిపోయింది. వెంటిలే నుండి తను రివాల్వర్ రేంజిలోకి వస్తోందని ఆమెకి తెలుసు. కోప మండిపడే ఇన్స్పెక్టర్, ఆ ఉక్రోషంతో తనని కాల్చేసే ప్రమాదం కూ

ంది. అయినా ఆమె దేన్నీ పట్టించుకోలేదు. మూడురోజుల ఎడబాటుతో మె తల్లడిల్లిపోయింది.

ప్రార్థన దగ్గిరకు చేరుకుని వంగి మొహంమీదకు పడుతూన్న ముంగురుల్ని వెనక్కి తోయబోతూ ఆగిపోయింది. అసలు అక్కడున్నది ప్రార్థనేనా అన్న అనుమానం వచ్చింది. పెనుగాలికి మినుక్కు మినుక్కు మంటూ ఆరిపోవటానికి సిద్ధంగా వున్న దీపంలా వుంది. రెండు మూడు రోజుల్లోనే ఎంత మార్పు.... మృత్యువు ఆహ్వానం ఇంత భయంకరంగా వుంటుందా?.... ఆమె కంటినుంచి చెంపమీదకు నీటిచుక్క రాలింది. ఆమె ప్పున దాన్ని తుడుచుకుంది.

బాధ.... బాధ.... బయట కెందుకు వస్తావే బాధ.... నా చుట్టూ వున్న ఆత్మీయులు నా గురించి ఎంత అపార్థపు స్థితిలో వున్నారంటే నన్ను చూసి రాయివంటి మనసున్న ఈ ఆడదానికి కంటివెంట 'నీరు' కూడా వస్తుందా అనుకుంటారు.

ఏ సెంటిమెంటూ లేకుండా జరగవలసిన దాని గురించి ఆలో చిస్తున్నది శేఖరం ఒక్కడే. భార్గవ జరిగినదంతా వివరించి వసుమతి లోపలికి వచ్చిన విషయం చెప్పగానే "మనం ఆ వెంటిలేటర్‌ని మూసే య్యాలి" అని చెప్పాడు.

"ఎలా మూయగలం?"

"బలంగా, పెర్మనెంటుగా అక్కర్లేదు. కేవలం వాళ్ళు అక్కడికి చేరుకుంటే ఆ విషయం మనకి తెలిసేలా వుంటే చాలు."

"దానివల్ల ఏమిటి లాభం? వాళ్ళు ఆ అడ్డుని తేలిగ్గా తీసేసి నన్ను షూట్ చేసెయ్యగలరు."

"అలా చెయ్యరు. అది చేసే ఉద్దేశ్యం వుంటే లోపల తోడున్నది ఓ గుడ్డివాడని తెలియగానే బయట్నుంచి తలుపు గడియనే షూట్‌చేసి వుండేవారు వెంటిలేటర్ ఎక్కడం ఎందుకు?"

భార్గవ సాలోచనగా శేఖరంవైపు చూసేడు— శేఖరం కొనసాగిం చాడు.

"అంటే వాళ్ళు మీకు భయపడుతున్నారన్నమాట. బయటనుండి డోర్ పేల్చి లోపలికి వచ్చే లోపులో మనం బాంబు విసుర్తామని భయ పడుతున్నారు. మనం అంటే నేను గాదు, మీరు. నేనెలాగో వాళ్ళ దృష్టిలో

వున్నా లేకపోయినా ఒకటే. మీరు ఎక్స్‌ప్లోజివ్స్‌కి దూరంగా వున్నప్పుడు గమనించి మిమ్మల్ని షూట్ చేస్తే ఆ తరువాత నిస్సంకోచంగా వాళ్ళు లోపలికి వచ్చేయొచ్చు. మనకసలు బాంబు పేల్చే ఉద్దేశమే లేదని, విషయం అంతవరకూ వస్తే హత్య చెయ్యకుండా మనం లొంగిపోతామనీ వాళ్ళకి తెలీకుండా వుండటమే మంచిది. వాళ్ళు భయంలో వున్నంత కాలం మనం వెంటిలేటర్ దగ్గర పెట్టిన అడ్డుని వాళ్ళు తీసేసే సాహసం చెయ్యలేరు. మనకి ఏ మాత్రం కోపం వచ్చినా పిచ్చివాళ్ళలాగా ప్రవర్తిస్తామన్న భయం వాళ్ళలో కలిగించాలి. దానికోసమయినా మనం వెంటిలేటర్‌కి అడ్డుపెట్టాలి. కొంచెం కష్టం అయినా తప్పదు."

భార్గవకి అతడి లాజిక్, వివరించిన తీరూ బాగా నచ్చింది. అతడు వెంటిలేటర్ దగ్గరకు నడిచాడు.

దూరంనుంచి చూస్తున్న రవూఫ్‌కి వెంటిలేటర్‌లోంచి బయటకి వస్తున్న వెలుగు... నెమ్మది నెమ్మదిగా క్షీణ మవటం మొదట కనిపించింది. తరువాత ఏదో అడ్డుగా వచ్చి, దాన్ని పూర్తిగా మూసేసింది.... కోపమూ, నిస్సహాయతా అతడ్ని పెనవేసుకున్నాయి. "డామిట్" అనుకున్నాడు కసిగా.

వెంటిలేటర్‌కి అడ్డుపెట్టి క్రిందికి దిగిన తర్వాత భార్గవకి మరేం చేయాలో తోచలేదు. అంతా శూన్యంగానే తోచింది. శేఖరం కూడా ఆలోచనలో వున్నవాడిలానే కనబడ్డాడు. వాళ్ళిద్దరూ అలా ఖాళీగా మౌనంగా వుండటం వసుమతికి అర్థంకాలేదు. ముఖ్యంగా భార్గవ!

ఆమె భయపడుతూనే అతని దగ్గరకు వెళ్ళింది.

"ఏమండీ!"

అతడు తలతిప్పి చూశాడు.

"ప్రార్థన ఒళ్ళు కాలిపోతుందండీ! అంతేకాదు, రక్తం...." ఆమె సందిగ్ధంగా ఆపుచేసింది. నాకు తెలుసన్నట్టు అతడు తల వూపాడు. అతడు ఆ క్షణం ప్రార్థన గురించి ఆలోచించడంలేదు, వసుమతి గురించి ఆలోచిస్తున్నాడు.

వాలుగా పడుతున్న వెలుతురులో ఆమెని పరిశీలించి చూస్తే ఈ నాలుగు రోజుల్లో నిద్రాహారాలు లేక ఆమె ఎంత కృశించి పోయిందో

స్పష్టంగా తెలుస్తూంది. ఈ అర్ధరాత్రి రెండింటికి బయట చలిలో పోలీసుల వద్ద ఆమె వేచివుంది....కేవలం తన కూతురి కోసం.

ఒకసారి 'ఆమె వైపునుంచి' ఆలోచించటం మొదలుపెట్టే-సరికి ఆమెమీద అమితమైన జాలి కలిగింది. కానీ యిప్పుడిక దాన్ని ప్రకటించలేదు. ఇద్దరిమధ్యా సున్నితమయినదేదో తెగిపోయింది. ఇప్పట్లో అతుకుతుందా! ఏమో.... కాలమే చెప్పాలి.

ప్రార్థన స్థితి గురించి ఆమెకు వివరించి చెప్పాల్సిన బాధ్యత తన మీద వుందనుకున్నాడు. ప్రార్థనమీద తనకి ఎంత హక్కు వుందో.... ఆమెకీ అంత హక్కు వుందని ఆ క్షణమే అతడు మనస్ఫూర్తిగా నమ్మేడు. ఒక పక్క కూతుర్ని మరణశయ్య మీద పెట్టుకుని యీ వివరణంతా ఇవ్వటం హాస్యాస్పదమే అవుతుంది. కానీ, తన కుటుంబ భవిష్యత్తుని నిర్ణయించే అత్యంత కీలకమైన, అపాయకరమయిన నిర్ణయాన్ని తీసుకోవలసిన బాధ్యత తన యిద్దరిమీదా యీ క్షణం వుంది. దానికోసమయినా తనే అంతా వివరించి చెప్పాలి.... నెమ్మదిగా "వసుమతీ" అని పిల్చేడు.

మొట్టమొదటిసారిగా అతడి నోటివెంట అలా తన పేరు వినిపించటంతో ఆమె సంభ్రమంగా తలెత్తి చూసింది. అతడి కళ్ళు ఆమెమీద నుంచి శూన్యంలోకి చూస్తున్నాయి. ఎటో చూస్తూ అతడు చెప్పుకుపోతున్నాడు. "....మనిషికి ఈ ప్రపంచంలో [సాటి మనిషి తరువాత] అత్యంత ప్రమాదకరమైన శత్రువేమిటో తెలుసా వసుమతీ.... వైరస్! మనిషి శరీరంలో ఒక భాగంగా కలిసిపోయే ఈ వైరస్‌ను చంపటానికి మందులు లేవు. 'దాన్ని ఆహ్వానించి' సంధి చేసుకోవటమే!! మనిషి ఈ విషయాన్ని సరిగ్గా రెండు వందల సంవత్సరాల క్రితం కనుక్కున్నాడు. అప్పటినుంచే ప్రారంభమైంది....

'అమ్యూన్ థెరపీ'

ఈ అర్ధరాత్రి, మన కూతురు చావుబ్రతుకుల మధ్య వుండగా నేనిలా నీకు సైన్స్ చరిత్రనంతా వివరించి చెప్పటం అసంబద్ధంగా వుండొచ్చు. కానీ ఇప్పుడు మనం- అంటే నువ్వూ- నేనూ- కలిసి తీసుకోబోయే నిర్ణయం మన చిన్నారి ప్రార్థన భవిష్యత్తును నిర్ణయిస్తుంది. ఒకవేళ పొరపాటున ఏదయినా జరిగితే, ఇప్పుడీ నిర్ణయం తీసుకున్నందుకు మనం

భవిష్యత్తులో ఎప్పుడూ మరి బాధపడకూడదు. అందుకే.... ఇప్పు
కావల్సినంత వివరంగా ఆలోచించాలి."

ఆమె మనసు కీడు శంకించింది. బెదురుతూ అతడివైపు చూసింది
అతడు ఆమెను పట్టించుకోకుండా చెప్పుకుపోతున్నాడు.

ఇప్పుడు మనం కేన్సర్ అంటే ఎలా భయపడుతున్నామో, రెం
వందల సంవత్సరాల క్రితం ప్రజలు మశూచి అంటే అలా భయపడేవారు
పల్లెల్ని చంపినట్టూ ఆ రోజుల్లో మశూచి మనుష్యుల్ని చంపింది. దా
పేరు చెపితేనే ప్రజలు గ్రామాల్ని వదిలి వలస వెళ్ళిపోయేవారు. ఇదం
ఒకవైపు.... ఆ రోజుల్లో మరో వ్యాధికూడా వుండేది, దాని పేరు—
"కౌపాక్స్". ఇది పశువులకీ, అప్పుడప్పుడూ మనుషులకీ వచ్చేది. కా
చిత్రమేమిటంటే కౌపాక్స్ వచ్చినవారికి స్మాల్‌పాక్స్ (మశూచి) వచ్చే
కాదు. ప్రతివారూ తమకి కౌపాక్స్ వస్తే బాగుండును అని కోరుకునేవార
కారణం, కౌపాక్స్ చాలా చిన్న జ్వరం. అటలమ్మలాగా ఇదికూ
మొహంమీద మచ్చల్ని వదిలివెళ్ళదు. చావు భయంలేదు. కానీ ఈ కౌపాక్
అందరినీ వరించేది కాదు. ఎక్కువగా పాలుపితికే స్త్రీలకే వచ్చేది.

1796లో జెన్నర్ అనే డాక్టర్‌కి ఒక ఆలోచన స్ఫురించిం
కౌపాక్స్ రావటానికి కారణభూతమయిన వైరస్ మనిషి శరీరాని
యుద్ధానికి ఆయత్తం చేసి తిరిగి జీవితంలో మరెప్పుడూ భయంకరమై
మశూచి రాకుండా కాపాడుతుందేమో అని! అతడీ ప్రయోగం చేసి చూ
లనుకున్నాడు.

దీనికి అతడు ఎన్నుకున్నది- ఎనిమిదేళ్ళ తన స్వంత కొడుకుని

చరిత్రలో నిల్చిపోయే మహోన్నతమైన త్యాగాన్ని చెయ్యటాని
అతడు నిశ్చయించుకున్నాడు. కౌపాక్స్ వ్యాధి వచ్చిన ఒక పాలుపిత
స్త్రీ పొంగునుంచి 'రసి' తీసి తన కొడుక్కి ఎక్కించాడు. అతని
కొద్దిగా జ్వరంవచ్చి తగ్గిపోయింది. అతడు మామూలుగానే వున్నాడు
రెండు నెలల తర్వాత ఈ పరీక్షలో అతి కీలకమైన పాత్ర వహించేరోజ
వచ్చింది. మశూచిలో చావటానికి సిద్ధంగా వున్న ఒక రోగి శరీరంను
'రసి' తీసి తన కొడుక్కి ఎక్కించాడు. మనుష్యులు దేన్ని చూసి భయ
భ్రాంతులై పారిపోతారో, ఆ అపాయాన్ని తనే స్వయంగా కొడుక్కి

జెక్ట్ చేశాడు. బహుశా క్షణాలు యుగాలుగా అతడు రెండురోజులు పి వుంటాడు! రెండు రాత్రులూ రెండు పగళ్ళు గడిచాయి.

....కుర్రవాడు చావలేదు!

మశూచి తాలూకు వైరస్ అతడినేమీ చేయలేదు!! మనుష్యజాతిని సించే 'వాక్సిన్' కనుక్కోబడింది!!!

ప్రపంచం అంతా దీనికోసం ఎంత తహతహలాడిందీ అంటే వలం పదిరోజుల్లో యాభై కోట్ల సీసాలు తయారు చేయబడ్డాయి.

ఇప్పుడు చెప్పు వసుమతి.... అలాటి మరొక ప్రయోగం కోసం. మానవజాతిని రక్షించటం కోసం. నీ కూతుర్ని ధారపోస్తావా?"

మామూలుగా వింటూన్న ఆమె, ఈ ఆఖరు ప్రశ్నతో ఉలిక్కి పడింది.

గదంతా నిశ్శబ్దంగా వుంది.

ఇంకో రెండు గంటల్లో ప్రపంచాన్ని వెలుగుతో నింపటం కోసం త్యుడు ఆయత్తమవుతున్నాడు. ఎక్కువ సమయం లేదు వెంటనే ర్ణయించుకోవాలి. ఆమె అతడి దగ్గరగా వచ్చింది. "మీరు....మీరేమీ అనుకోకపోతే మిమ్మల్ని ఓ ప్రశ్న అడగవచ్చునా?"

"దానికేముంది వసుమతీ! అడుగు."

"మీరేమీ అనుకోకూడదు సుమా!"

"ఇంతవరకూ వచ్చాక అనుకోవడం ఏమిటి?"

"పాపనిక్కడికి తీసుకువచ్చారు. చుట్టూ పోలీసులున్నారు. ఇప్పుడు ఇప్పుడెందుకు వచ్చిందీ సమస్య?"

అతడు శుష్కంగా నవ్వేడు. "నీ ప్రశ్నే ఇంకో రకంగా అడగా ంటే 'ఎవర్నడిగి ఇదంతా చేశావు? నన్నడిగి చేశావా? ఇప్పుడీ ఆఖరి క్షణంలో నా సలహా ఎందుకు కావల్సి వచ్చింది' అని కదూ?"

ఆమె నొచ్చుకుని "అయ్యో! నా అభిప్రాయం అదికాదండీ!" అంది.

"నీ అభిప్రాయం ఏదయినా సమాధానం ఒకటే! ఇది మనిషి మన స్తత్వానికి సంబంధించినది. విజయం సాధించేవరకూ అది యుక్తా యుక్తా ను విస్మరించేటట్టు చేస్తుంది. ఒకసారి అది సాధించాక వెనక్కి తిరిగి

చూసుకుంటే లెక్కలేనన్ని సందేహాల్ని కలుగజేస్తుంది. ఇప్పుడు నా పరిస్థితి అదే...."

"విజయం అంటే...." అర్థోక్తిలో ఆపు చేసింది.

"నువ్వు రావటానికి కొన్ని గంటల ముందే మొట్టమొదటి సజీవ కణం ఇక్కడ కృత్రిమంగా సృష్టించబడింది వసుమతీ!"

"అంత గొప్ప విషయాన్ని అతి సాధారణమైన స్వరంతో చెప్తున్నందుకు ఆమె అప్రతిభురాలై అతనికేసి తలెత్తి చూసింది. అతని ముఖంలో ఏ భావమూ లేదు. ఆమె చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయింది. అతడు ఆమెవైపే చూస్తున్నాడు. అతడు తను సాధించిన విజయంకన్నా ఇప్పుడు తీసుకోబోయే నిర్ణయంపట్ల ఎక్కువ ఆశక్తుడై వున్నాడని గ్రహించింది. ఆమె సంశయిస్తూ— "ఇప్పుడు వెంటనే పాపని తీసుకెళ్ళి ఆస్పత్రిలో చేర్పిస్తే ఫలితం ఏమైనా వుంటుందా?" అని అడిగింది. ఆమె ప్రశ్నలకి అతడికి కోపం రాలేదు. అడగ్గానే ఏదో ఒక నిర్ణయం తీసుకోకుండా, ఇది తన సొంత సమస్యలాగే తీసుకొని పరిణామాలు చర్చించడం సంతోషం వేసింది.

"ఉండదు.... కాని ఇది నా అభిప్రాయం మాత్రమే" అని చివరలో కలిపాడు.

"ఛాన్సు"

"నూటికి తొంభై తొమ్మిది శాతం ఉండదని."

ఆమె మరి ఆలోచించలేదు. "మానవ కళ్యాణం, ప్రపంచ సౌభాగ్యంలాంటి పెద్దపెద్ద మాటలు నాకెందుకు? ప్రార్థన నా కూతురు. ఆ విషయం మీరు ఒప్పుకుంటే!.... ప్రార్థన బ్రతకడానికి అక్కడ ఆసుపత్రిలోకన్నా ఈ ప్రయోగశాలలో ఎక్కువ ఛాన్సు వుంటే ఆమె ఇక్కడే వుంచండి. ఒక తండ్రిగా కాదు.... డాక్టరుగా పాపని బ్రతికించి నాకివ్వండి—" అంది.

అతడు సంతృప్తిగా నిశ్వసించి శేఖరం దగ్గరికి వెళ్ళాడు. వాళ్ళిద్దరూ చాలాసేపు బ్రెయిలీలో సంభాషించుకున్నారు. అంతసేపు పాటూ వాళ్ళు మాట్లాడుకున్న దేమిటో ఆమెకు అర్థంకాలేదు. 'ఏమిటీ ఆలస్యం' అని భర్తని అడిగింది. అతడు సమస్య చెప్పాడు.

"మనకి కొన్ని కుందేళ్ళు కావాలి. కనీసం ఒక డజనన్నా కావాలి. దృష్టవశాత్తు అవి వున్న గది పోలీసుల ఆధీనంలో వుంది."

"ఇప్పుడీ పరిస్థితుల్లో అన్ని కుందేళ్ళా?" అందామె.

"అవును. పాశ్చర్ ప్రయోగానికీ, ఎమిల్ వేన్ ప్రయోగానికీ వాలి."

(పిచ్చికుక్క కాటుకి మందు కనుక్కున్న లూయీపాశ్చర్, టేన్ తాలూకు వైరస్‌ని ఒక కుందేలు మెదడులోకి ఎక్కించి, అది మర వే సమయంలో దాని రసిని ఇంకో కుందేలు మెదడులోకి ఎక్కించి, గా క్రమక్రమంగా వైరస్ శక్తిని నిరపాయకరం చేసేడు. దాన్నే వాక్సి గా ఉపయోగిస్తూ కుక్కకాటుకి గురైన జోసెఫ్ అనే ఒక తొమ్మిదేళ్ళ వాడికి ఎక్కించాడు. జోసెఫ్‌కి రాబిస్ వ్యాధి రాలేదు. పిచ్చికుక్క చిన తర్వాతకూడా ఏ బాధా లేకుండా బ్రతికిన ప్రపంచపు మొట్టమొదటి నిషి జోసెఫేనేమో! ఆ తర్వాత జోసెఫ్ పెద్దయి, పాశ్చర్ ఇన్‌స్టి ్యూట్‌కి గేట్ కీపర్ అయ్యాడు. జర్మన్ నాజీలు పారిస్‌ని వశపరచు ని పాశ్చర్ సమాధిని బలవంతంగా బ్రద్దలు కొడుతున్నప్పుడు ఇతను త్మహత్య చేసుకున్నాడు.... ఒక రకంగా ఇమ్యూనాలజీకి జెన్నర్, శ్చర్, ఎమిల్ వేన్‌లు పితామహాలు.)

"ఆ ప్రయోగాలన్నీ ఇప్పుడు ఇక్కడ ఎందుకు? డాక్టర్ మహేంద్ర ప్పిన కోర్టు కాగితం వెనక్కి తీసుకుంటే, అప్పుడు మనకి సమస్యే ంది? పాపని తీసుకుని ఇంటికే వెళ్ళిపోవచ్చుగా" అంది వసుమతి.

"ఈ అధునాతనమైన పరికరాలన్నీ ఇంట్లో ఎక్కడ దొరుకు ాయి వసుమతీ!"

ఆమె తన అజ్ఞానానికి సిగ్గుపడి "పోనీ మీరు ఇప్పటివరకూ సాధించిందీ, చెయ్యదల్చుకున్నదీ పై వాళ్ళకు చెప్పి ప్రయోగం కొన సాగించడానికి అనుమతి ఇమ్మంటే?"

అప్పటివరకూ ప్రార్థన బ్రతుకుతుందనుకోను. ఆమె దెబ్బ న్నట్టూ చూసి, చూపు మరల్చి ఏమీ పాలుపోనట్టు కిటికీలోంచి బయ కి చూసింది. దూరంగా ఒక ప్రత్యూషరేఖ ఆకాశాన్ని ఎరుపురంగు గా మారుస్తుంది. ఆమె తలతిప్పి శేఖరాన్ని చూసింది. ఎప్పుడూ

హుషారుగా, సంతోషంగా కనబడే అతడు కూడా ఈ సమస్యను ఎ
పరిష్కరించాలా అన్న సందిగ్ధంతో కొట్టుమిట్టాడుతున్నట్టు కనబడ్డా

ఆమె దృష్టి పాపమీదకు వెళ్ళింది. జీవితంలో నాలుగో వ
కూడా నిండకుండా నిండకముండే, మరింకా ఎన్నో.... ఎన్నెన్నో వ
తాలు చూడకముందే వీడ్కోలు చెప్పవలసి వస్తున్నందుకు కలిగిన
తోనో, ఈ ప్రపంచపు కుత్సితత్వాన్ని చూసి కలిగిన నిరాస క్తతతోన
తనని రక్షించటానికి తన తండ్రి చేస్తున్న ప్రయత్నాన్ని చూసి కలి
వేదనతోనో పాప నిస్త్రాణగా పడుకుని వుంది.

వసుమతి ఒక నిర్ణయానికి వచ్చింది.

"ఎమిల్ వేన్ ప్రయోగానికయితే ఒకటి చాలుగా, పాశ్చర్ అయ
చాలా కావాలి, అవునా?"

"అవును."

"నేను ఒకదాన్ని సంపాదించగలను అనుకుంటున్నాను."

"ఎలా?"

"ఎలాగో ఓలాగ"

"ఈ పరిస్థితుల్లో నువ్వు బయటికి వెళ్ళడం ప్రమాదకరం వ
మతీ! బయట ఇన్‌స్పెక్టర్ చాలా కోపంగా వుండి వుంటాడు."

ఆమె నవ్వింది. 'భర్తమీదే కోర్టుకి వెళ్ళిన స్త్రీకి ఈ సాహసం
లెక్కా!' అని అనుకున్నట్టూ నిర్లిప్తంగా వున్నదా నవ్వు. లోకమ
తన గురించి ఏమనుకుంటుందో తనూ దాన్నొప్పుకోవటం ఎంతో గొ
అవగాహన వుంటేగాని సాధ్యంకాదు.

"చెప్పండి"

"నిజానికి పాశ్చర్ ప్రయోగం వ్యాధి నిరోధకంగానే
చేస్తుంది తప్ప వచ్చిన వ్యాధిని తగ్గించదు. చెయ్యవలసింది ఎమిల్
ప్రయోగమే. కానీ ఏ విధమైన రిస్కూ తీసుకోవడం ఇష్టంలేక అ
కుందేళ్ళు కావాలన్నాను."

"నేను బయటికి వెళ్ళి ఇన్‌స్పెక్టర్‌తో నన్ను బెదిరించి మీరు ల
లికి తీసుకు వెళ్ళారని చెప్తాను. తర్వాత వాళ్ళ కన్నుగప్పి కుందే
తీసుకువస్తాను. ఒకవేళ నేను రాలేకపోయినా దాన్ని లోపలికి అందిస్తాను

"అదంత సులభంకాదు."

"ఈ పరిస్థితుల్లో ఇంతకన్నా ఇంకో మార్గం ఏముంది?" అతడికి
లేదు.

"మీరింకేమీ ఆలోచించకండి. ఇక ప్రతి క్షణమూ అమూల్యమైనదే!"
సందిగ్ధంగానే అంగీకారం తెలిపాడు.

"మనం ఇంజెక్టు చేసిన ఎంతసేపటికి ఆ జంతువులో మనకా-
న మార్పు వస్తుంది?" అని అడిగింది.

"చెప్పలేను! మామూలు పరిస్థితికన్నా వేగంగానే యాంటీబాడీస్
త్తి అవుతాయనుకున్నాను."

"అయితే ఆ సీరంతో నాకివ్వండి, నాతోపాటు బయటకు తీసు
తాను."

అతడికి ఆమె చెపుతున్నది అర్థంకాక 'ఏమిటి?' అన్నట్టు చూశాడు. తిరిగి చెప్పింది. "నీకేమయినా మతిపోయిందా?" అన్నాడు. ఏజెంట్ ఇన్‌స్పెక్టర్ కళ్ళబడితే—"

"నాకు ప్రార్థన ముఖ్యమని ముందే చెప్పాను. ఒకవేళ నేను ఆ డేటను లోపలికి పంపించటం ఆలస్యం అయి, ఆ తర్వాత మీరు క్ట్ చేస్తే ఆ తర్వాతెప్పుడో దానికి రియాక్షన్ ప్రారంభం అయితే ఎప్పటికి తేలేను కనుక? నేను వెళ్ళగానే ఎలాగో ఒకలాగ క్షన్ ఇచ్చేస్తాను. ఆ తర్వాత దాన్ని ఎప్పుడు మీ దగ్గరికి పంపించినా క సమస్య వుండదు కదా!"

అతడికీ ఆలోచన నచ్చింది. ఒకసారి ఆమె బయటికి వెళ్ళిపోతే తిరిగి లోపలికి రాకుండా వుండటమే మంచిది. పోలీసుల కన్ను కిటికీద్వారా దాన్ని లోపలికి అందివ్వడం పెద్ద సమస్య కాకపోవచ్చు.

అతడీ విషయాన్ని శేఖరంతో సంప్రదించాడు. శేఖరం దాన్ని నసే ఆమోదించి ఈ ఆలోచన వచ్చినందుకు ఆమెని అభినందిం డు. లిక్విడ్ నైట్రోజన్‌లో భద్రపరచిన సైటో ప్లాజం (కాన్సరస్)లో మో కెమికల్స్ కలిపి, భార్గవ ఇంజెక్షన్ సిద్ధం చేస్తూ వుండగా శేఖరం మతికి చిన్న కాగితంమీద రాసిచ్చాడు. అలికినట్టు వున్న అక్షరాలతో....

"ఆస్పత్రిలో రవి అని వుంటాడు. అతన్ని కలుసుకుని భార్గ
సాధించిన విజయం గురించి చెప్పండి. ఈ విషయం బయట ప్రపంచాని
తెలిస్తే మనపట్ల వ్యతిరేకత పూర్తిగా తగ్గిపోతుంది."

అతడందించిన కాగితం, భార్గవ అందించిన ఇంజెక్షన్ తీసుకు
ఆమె తలుపు దగ్గరికి వచ్చింది.

"లైట్ ఆర్పితే మంచిదేమో!" అన్నట్టూ సైగ చేసాడు శేఖరం
లైటార్పితే విషయం బయటవారికి తెలిసే అవకాశంలేదు.

వసుమతి మౌనంగా ఇద్దర్నీ చూస్తూ వుంది.

భార్గవ వెళ్ళి స్విచ్ ఆఫ్ చేసాడు. ఒక్కసారి వెలుగు చీకటయ్యే
సరికి అలవాటుపడ్డ కళ్ళకి మరీ చీకటనిపించింది. బయట జరగబోయే
అలజడిని వూహిస్తూ ఏ క్షణమయినా పేలబోయే రివాల్వర్ చప్పుడు
వినటంకోసం భార్గవ వూపిరి బిగపట్టాడు. తలుపు తెరుచుకోగానే
అవకాశం వదులుకోక ఎవరయినా పిస్టల్ పేల్చవచ్చని అతడి అభిప్రాయం

కానీ ఎంతసేపటికీ తలుపు తెరుచుకోలేదు.

అతడికి ఏం జరుగుతున్నదీ అర్థంకాక— "వసుమతీ" అన్నాడు.

"ఊఁ!" అందామె.

"వెళ్ళలేదా?"

"లైటు వెయ్యండి!" అందామె.

అతడు కన్ఫ్యూజ్ అయ్యి ఆ అయోమయంలోనే లైటు వేసేడు.

ఆమె గుమ్మం దగ్గర అలాగే నిలబడి వుంది. ఆమె మొహం
నిర్మలంగా వుంది.

"మీరు మీ ప్రయోగం చెయ్యటానికి ఒక జంతువు కావాలన్నారు
కదూ!"

"అవును"

"ఆ జంతువు కోసం మనం బయటికి వెళ్ళక్కరలేదండీ!"

"వసుమతీ!"

"అవునండీ, అది ఇక్కడే ఉంది— అన్నిటికన్నా పెద్దజంతువు
నేనే!"

ఏదో స్ఫురించి అతడు చప్పున ముందుకు వెళ్ళాడు.

ఆమె సిరెంజి అతడికి అందించింది. అది ఖాళీగా వుంది.

ఆమె చెపుతున్నది మొదట అతని కర్థంకాలేదు. అంతలో ఒక ్డిన కెరటం విసురుగా వచ్చి మొహాన్ని తాకినట్లయింది. మత్తుమందు సం నుంచి నెమ్మదిగా బయటికి వస్తున్నట్టు....

"ఏ....ఏమిటిది....ఏమిటి వసుమతీ నువ్వు చెపుతున్నది...." ్నడు. నమ్మలేని నిజం.... నమ్మకుండా వుండాలన్న ఆశ, నమ్మినది కాకూడదని కోర్కె....

"ఇన్ని ఆలోచించే ఈ పని చేశానండీ?"

క్రమ క్రమంగా అతడి మొహంలో కోపం చోటు చేసుకోసాగింది.

"ఏమిటి నువ్వాలోచించింది? ఆ ఇంజెక్షన్ ఏమిటో తెలుసా? ఇన్ఫె గ్నెంట్ సెల్"

"నాకు తెలుసు...."

"అది రెండు నాలుగు, నాలుగు ఎనిమిదిగా విడిపోయే విషపూరిత కణం" విస్మయంగా, కోపంగా అరిచేడు.

"ముందే చెప్పారుగా ఆ సంగతి!"

అతడు దాదాపు పిచ్చివాడయ్యాడు. ఒకవేపు విస్మయతా, మరో ఉక్రోషం, ఏం చెయ్యాలో తోచని స్థితి. ఈ లోపులో శేఖరం ఆ ో ఏమి జరుగుతూందో తెలీక భార్గవ కోసం తడుముకుంటూ రాసా భార్గవ ఏదీ గమనించడంలేదు. అతడి మెదడంతా శూన్యంగా ి. అతికష్టంమీద తనని తాను కంట్రోల్ చేసుకోవటానికి ప్రయ ్తూ "ఎంతపని చేశావు వసుమతీ!" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. ఆ మొహంలో చిరునవ్వు అలాగే వుంది. తనికి జ్ఞాపకం వచ్చింది. లూయీపాశ్చర్ ప్రయోగం గురించి న్నప్పుడే మొట్టమొదటిసారి ఆమె మొహంలో ఈ నవ్వు కద ింది. తను సరిగ్గా గమనించలేదు. కానీ అప్పట్నుంచే ఆ మొహంలో కుముందు లేని ఒక రకమైన తేటదనం చోటు చేసుకుంది. అంటే అప్పుడే ఈ నిర్ణయానికి వచ్చిందన్నమాట. బయటికి వెళ్ళే వీలు ోవటం గురించి, పై అధికారుల సాయం తీసుకోలేకపోవటం గురించి అడిగిన ప్రశ్నలన్నింటికీ తనొక ఫూల్‌లాగా సమాధానం చెప్పాడు.

అది ఇంత దారుణమైన పరిణామాలకి దారి తీస్తుందని కల్లోకూ వూహించలేదు.

అతడు ఓ నిర్ణయానికి వచ్చినట్టు గుమ్మం దగ్గిరకి వేగంగా నడు "పద, నిన్ను వెంటనే ఆస్పత్రికి తీసికెళ్ళాలి" అన్నాడు.

ఆమె తలుపు దగ్గిర్నుంచి కదలలేదు.

"వెళ్తే ఫలితం వుంటుందంటారా?" తాపీగా అడిగింది.

అతడు నిర్విణ్ణుడయ్యాడు. నిజమే! పరిస్థితి చెయ్యి జారిపో నట్టే. టోటల్ బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ కూడా వీలవదు.

ఆమె అన్నది— "నేను చేసిన పని చాలా మూర్ఖంగా కనిపి వచ్చు. కానీ ఇంకో మార్గం ఏముంది? ఈ ఇన్‌స్టిట్యూట్ నుంచి బయ అడుగు పెట్టగానే ఇన్‌స్పెక్టర్ మనల్ని అరెస్టు చేస్తాడు. మీరు సాధిం దాన్ని పై అధికారులకు వివరించి వారిని నమ్మించే వరకూ మన ప్ర బ్రతకదని మీరే చెప్పారు కదా! పోనీ మీరనుకున్నట్టు నేను బయ వెళితే అప్పుడు మాత్రం ఇన్‌స్పెక్టర్ ఊరుకుంటాడా! అతడు ఏ మా నన్ని ఆవరణలోంచి బయటికి పంపించివేసినా అప్పుడేమౌతుంది? బయ నేనూ— లోపల మీరూ— ఎక్కడ ఏం జరుగుతుందో- ప్రార్థనకి ఏ వుందో తెలీక క్షణక్షణం నరకయాతన ఒక వేపూ.... మీకు సాయపడ పోతున్నానే అన్న దుఃఖం మరోవేపూ- ఇంత వేదనలో ఈ తెల్ల ఝామున ఏ అధికారి ఇంటి తలుపు తట్టను.... ఏ రిసెర్చి డైరెక్టర్ కా మీద పడి మనల్ని రక్షించమని వేడుకోను? వద్దండీ- వద్దు. ఈ పో టంలో నేను చాలా అలిసిపోయాను. ఇక నాలో ఓపికలేదు. ఈ మా లతో దయచేసి నన్ను మరింత బలహీనపర్చకండీ...."

"కానీ.... కానీ...."

"నో.... అలా జరగటానికి వీలులేదు. నిన్ను.... నిన్ను ముందు...."

"చూడండీ! నిర్ణయం తీసుకోవటంలో నేను ఆలస్యం చేసి మా కంగా మీకు దూరమయ్యేను. అదే నిర్ణయం తీసుకోవటంలో మీ ఆలస్యం చేసి ప్రార్థనని దూరం చేసుకోకండి!"

అతడు ఏమీ పాలుపోనట్టూ శేఖరంవేపు చూసేడు.

# 9

ఒక బాంబులాగా పేలింది అది!

ప్రొద్దున్న ఆరింటికి సైకిళ్ళ మీద ఇంటింటికీ వెళ్ళి అందిస్తారు పత్రవాళ్ళు.

ఆరున్నరకి, పత్రిక ఎడిటరు ఇంకా పక్కమీద వుండగానే మొదటి కాల్ వచ్చింది. అంతే.... ఆ తరువాత క్షణం కూడా రిసీవరు ఫోన్ పెట్టటానికి వీలులేకపోయింది. ఫోను మీద ఫోన్....

ప్రియ ఎవరు? ఆ అమ్మాయి ఎక్కడ వుంటుంది? ఆ అమ్మాయి ర్వ్యూలో ఇచ్చిన వార్త నిజమేనా? ఒక సైంటిస్టుని బలవంతానా నామా చేయించారా? కాన్స్-క్యూర్ నిజంగా కేన్సర్ తగ్గించదా?

వగైరా ప్రశ్నలు అన్నివైపుల్నించీ తుఫానులా కురవసాగేయి. ఒక్క ఫోనే కాదు- పోలీస్‌స్టేషన్‌కీ, కపాడియా ఇన్‌స్టిట్యూట్ రి. కీ, స్టేట్ మినిష్టర్‌కీ....

ఒక సైంటిస్టును చంపడానికి ప్రయత్నిస్తున్నారా? తిండి లేకుండా ముట్టారా? అసలు అతడెందుకు రాజీనామా ఇవ్వవలసి వచ్చింది? ం కొన్నాళ్ళక్రితం అతడు పేపర్లో కాన్స్-క్యూర్ గురించి యిచ్చిన ర్వ్యూ వల్లనేనా మీరు కక్ష కట్టింది?

తను ప్రచురించిన ఇంటర్వ్యూకి జనంలో ఇంత సంచలనం వస్తుం హించని ఎడిటరు సంతృప్తిగా గాలి పీల్చుకున్నాడు. అతడి ంకో ప్రియను చూసిన మరుక్షణం ఆమె నిజం చెపుతోందని అన్పిం ది. ఆమె చెప్పినదంతా నిజమైన పక్షంలో ఒక దారుణం జరగకుండా పుచెయ్యటానికి తను సాయపడ్డాడు. ఆఫ్టరాల్! ఒక లార్జెస్టు ఇంగ్లీషు పత్రిక ఎడిటరుగా తనమీద ఆ మాత్రం సాంఘిక బాధ్యత ఉంది!!

అయితే అతడు అనుకున్న దానికన్నా ఎక్కువ పరిణామాలే ఆ జు మధ్యాహ్నం జరిగాయి. ఆరోగ్యశాఖ మంత్రి ఎన్విరాన్‌మెంట్ ట్రోల్ అండ్ రిసెర్చి డైరెక్టర్‌ని స్వయంగా పిలిచి, సాంప్సన్ కంపెనీ చి వచ్చే వాయువుని పరీక్ష చేసి, రెండు రోజుల్లోపులో తనకి రిపోర్టు పమని ఆదేశాలిచ్చారు. అంతేకాదు, ప్రజల్లో వచ్చిన అనుమానం దృష్ట్యా పాడియా ఇన్‌స్టిట్యూట్ పేటెంట్ పేపర్స్‌నీ, కేన్స్-క్యూర్ ఫార్ములాను

పునః పరిశీలించవలసిందిగా డ్రగ్ కంట్రోలర్‌ని ఆదేశించవలసింది కేంద్రాలకి రికమెండ్ చేసాడు. సమాజానికి సేవ చేయాలనే కోర్కె ఇం మిగిలివున్న అతికొద్ది మంత్రుల్లో అతనొక్కడు.

తన వెనక ఇంత సంచలనం జరగబోతూ వుందని తెలియ ప్రియ, ప్రొద్దున్న ఎనిమిదింటికే డి. ఐ. జి. ఇంటికి వచ్చి విజిటర్ రూమ్‌లో కూర్చుంది. రాత్రంతా నిద్రపోనట్టూ ఆమె కళ్ళు ఎర్ర వున్నాయి. ఇప్పుడు ఇతడు కూడా కాదంటే ఎక్కడికి వెళ్ళాలా అ ఆలోచిస్తూ వుందామె. ఏదో ఇంగ్లీషు పిక్చర్‌లో లాగా జీపులో అవ పదార్థాలు వేసుకుని డైరెక్టుగా ఇన్‌స్టిట్యూట్ గోడల్ని బద్దలు కొ కుంటూ లోపలికి దూసుకుపోతే ఎలా వుంటుందన్న ఆలోచన వచ్చింది కానీ, మళ్ళీ శేఖరం తనని తిట్టేమాట జ్ఞాపకం వచ్చింది- 'ఎడాలిసెంట్

ఆమె గడియారం వంక చూసింది. తొమ్మిదవుతూంది.

ఆ క్రితంరోజు రాత్రి డి. ఐ. జి. ఇంటికి ఆలస్యంగా వచ్చారి ప్రొద్దున్న లేచేసరికి ఆలస్యం అవుతుందనీ నౌఖరు ఆమె రాగానే చెప్పాడు అరగంట తర్వాత వచ్చి, ఆయన లేచారనీ స్నానం చేసి వస్తార చెప్పాడు. ఆపైన కొద్దిసేపటికి అతడు లోపల్నుంచి వచ్చాడు. అతని చూసి ఆమె ఆశ్చర్యపోయింది. డి. ఐ. జి. అంటే ఎవరో ముసలివా అయి వుంటాడనుకుంది. వచ్చింది యువకుడు. అందుకుకాదు ఆమె ఆశ్చర్యపోయింది. తనకి పోలీస్‌స్టేషన్ నుంచి బయటకు వస్తూం ఎదురుపడిన యువకుడే.

"నిన్నెక్కడో చూసేను" అన్నాడు అతను సాలోచనగా.

"పోలీస్‌స్టేషన్‌లో" అందామె. అతడు అనుమానంగా చూసేస ఆమె కంగారుపడి "ఐ మీన్.... యస్. పీ. దగ్గర" అంది.

"అనుకదూ! 'ఆ పాపం మీదే' అని అనుకుంటూ పోలీ స్టేషన్ లోపల్నుంచి నువ్వు బయటికి వస్తూంటే మా వాళ్ళు మళ్ళీ ఏ యినా ఘోరం చేసారా అనుకున్నాను. ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది అయినా అదికాదు. ఎక్కడో చూసాను.... ఎక్కడ?"

"నా పేరు ప్రియ" అంది.

అతను ఉలిక్కిపడ్డాడు. ప్రొద్దున టాయిలెట్‌లో చదివిన పేపర్లో ఫోటో గుర్తు వచ్చింది. 'ఓ నువ్వా' అన్నాడు. ఉన్నట్టుండి అత

హంలో కనబడిన ఉద్వేగాన్ని ఆమె గుర్తించి "ఏమిటి అలా గేరు?" అన్నట్టు చూసింది.

"మీ గురించి పేపర్లో చదివాను"

"నా గురించా?" అందామె ఆశ్చర్యంగా.

అతడూ అంతే ఆశ్చర్యంగా "అదేమిటి! ఈ రోజు పేపరు చూడలే?" అన్నాడు.

"ఊహూ.... ఈ రోజు పేపర్లో అప్పుడే వచ్చేసిందా! ఇంత దరగానా?"

అతడు బెల్ కొట్టి పేపరు లోపల్నుంచి తెప్పించాడు. ఆమెకి క్సైటింగ్‌గా వుంది. తన గురించి పేపర్లో పడటం! చేతులు కొద్దిగా పించసాగినయ్. వణుకుతున్న వేళ్ళతో చదివింది. తన గురించి కొద్దిగే చ్చారు. కానీ తను చెప్పినదంతా యథాతథంగా ప్రచురించాడు. అదే వాల్సింది.

చదవటం పూర్తిచేసి ఆమె తలెత్తేసరికే అతడు ఆమెవైపే చూస్తు న్నాడు. "నువ్వీ ఇంటర్వ్యూలో చెప్పిన విషయాలు అన్నీ నిజమేనా?" అని సూటిగా అడిగాడు.

"నాకు తెలిసినంతవరకూ నిజమేసార్" అంది అంతా వివరిస్తూ.

"మరి విషయాలన్నీ మాకెవరికీ చెప్పలేదేం ముందే!"

"డియస్పీ దగ్గరికి వెళ్ళాను సార్"

"ఈ పాపం అతనిదే అన్నమాట. పోనీ యస్పీ దగ్గరికి వెళ్ళాల్సింది."

"అవున్నిజమే" అంది ఆమె కసిగా. ఆమె స్పాంటేనియటీకి అతడికి నవ్వొచ్చింది. అంత చిన్న వయసులో ఆమెలో కనబడుతున్న పట్టుదలా, ఈ రెండ్రోజుల్నుంచీ పడిన కష్టం గమనించి అతడికి ముచ్చటేసింది.

"శంకర్‌లాల్ పోలీస్‌స్టేషన్‌లో అన్‌డ్యూ ఇన్‌ఫ్లూయెన్స్ క్రింద రాజీనామా తీసుకున్నది నిజమేనా?"

"తీసుకోవటం మాత్రం నిజమే సార్. అదీ ఇన్‌ఫ్లూయెన్స్ నాకు తెలీదు."

"ఇంకొక్క ప్రశ్నకి సమాధానం చెప్పు. వసుమతి ఆ పాపకి సవతి తల్లేనా!"

"ఆ నిజం మాత్రం నాకు బాగా తెలుసు సార్"

అతడు లేచి నిలబడ్డాడు. "పద, మనం డైరెక్టుగా ఆ స్పాట్
వెళ్ళిపోదాం. నా ఉద్దేశ్యం ఈ పాటికే అక్కడ అంతా సర్దుకుని వుంట
దని" అంటూ కారువైపు కదిలాడు. ఆమె అతడిని అనుసరించింది.

* * * *

తను చేసిన ఇంజెక్షను యాంటీజెన్‌గా మారి అనుకున్న గ
కన్నా ఎక్కువ వేగంతో పనిచేసే వసుమతి ఇమ్యూన్ సిస్టమ్‌ని అభివృ
చెయ్యడంతో భార్గవలో రవ్వంత ఆశ జనించింది.... ఆమె బ్రతి
తుందేమో అని! ఆ ఆశ ఎక్కువకాలం నిలబడలేదు. ఆమె శరీరం
కేన్సర్ కణంతో పోరాడడానికి ఉత్పత్తి అవుతున్న యాంటీబాడీస్‌కన్నా
క్షణక్షణానికి పెరిగిపోతున్న కేన్సర్ కణాలే ఎక్కువ కనబడుతున్నాయి

ఇలా జరగకపోతే ఎంత బాగుణ్ను- ఇలా జరగకపోతే ఎం
బాగుణ్ను అని మాటికీ మాటికీ అనుకుంటూనే అతడు తన పని సాగి
న్నాడు. అతని మనసంతా చికాకుగా వుంది. ఎలా.... ఇప్పుడెలా ఈమె
ప్రాణాల్ని కాపాడగలడు? రేడియం థెరపీ కూడా ఏమీ చెయ్యలేదు
ఒక్క జంతువు.... ఒక చిన్న కుందేలు వుండి వుంటే ఎంత బాగు
డేది! నిండు ప్రాణం రక్షించబడేది కదా! ఆఖరి క్షణంలో తనమం
వాటిని వేరుచేసిన ఈ ప్రపంచానికి తెలుస్తుందా? చట్టం పేరిటా—
న్యాయం పేరిటా ఒక ప్రాణాన్ని బలిగొన్నామని!!

ఈ ఆలోచనలలో ఏకాగ్రత కుదరటంలేదు. అయినదానికి వగ
లాభంలేదు- జరగవలసింది ముఖ్యం. ఈ ఆలోచన రాగానే అతడు త
విదిలించి, మనసు అదుపులో వుంచుకుని మిగతా పని ప్రారంభించాడు

ప్రయోగంలో రెండవ స్టేజి మరింత కఠినమైనది. ఇమ్యూని
RNA ను కలిగివున్న టి—లింఫోసైట్స్‌ని తయారు చేయాలి.

దానికోసం అతడు ప్రార్థన రక్తంలోంచి నియోప్లాస్టిక్ కణాల్ని
వేరుచేసి తన శరీరంలోకి ఎక్కించుకున్నాడు. అవి నిరపాయకరమైనవి.
తన శరీరమే ఒక కాబలిస్టులా వాటిని ప్రభావితం చెయ్యాలి. అతడిలో
తిరిగి టెన్షన్ ప్రారంభమైంది. కొంచెంసేపు గడవనిచ్చి తన శరీరం
లోంచి రక్తాన్ని బయటికి తీసి అందులోంచి టి—లింఫోసైట్స్‌ని వేరు
చేసేడు. వాటిని పరీక్షించి చూసి సంతృప్తిగా వూపిరి పీల్చుకున్నాడు.

అవి ఇమ్యూన్ RNA లను కలిగివున్నాయి!

తరువాత చకచకా మిగతా పని చేసేడు.

ఇంతకుముందే తయారుచేసి పెట్టుకున్న మోనోక్లోనల్ యాంటీ న్నూ, వసుమతి శరీరంలోంచి తీసిన యాంటీబాడీస్‌నూ వీటికి కలిసి సైజ్ చేశాడు. కేన్సర్‌ని సాధారణంగా వాడే టాక్సికెంట్‌ను ఫిల్టర్ రు. అప్పుడు వచ్చిన ఆ కాషాయవర్ణంతో కూడిన జేగురురంగు ద్రవ ర్థం వంక కొన్ని క్షణాలపాటూ కన్నార్పకుండా చూసేడు. తన యోగం ఫలించి— ఈ పదార్థమేగానీ అనుకున్నది సాధించగలిగితే నవ చరిత్ర భవిష్యత్ పుటల్లోంచి కేన్సర్ పేరు శాశ్వతంగా తొలగించ వుంది!

అతడు తన చేతిలోని పదార్థాన్ని మరోసారి చూసుకుని నెమ్మదిగా మతి మీదికి దృష్టి సారించాడు. అతడి మనసులో అప్పుడే ఆ మందుకి పేరు క్రమక్రమంగా రూపు దిద్దుకుంది.

"వి-ఇమ్యూనోకెమ్"

'వి'కి అర్థం ప్రపంచానికి తెలియపర్చనక్కర్లేదు—

మరి ఆలస్యం చేయకుండా అతడు విడి కేన్సర్ కణాలకి ఈ ను కమ్యూనికేట్ చేసి ఫ్లోరోసెంట్ మైక్రోస్కోప్ క్రింద పరీ రాడు నెమ్మదిగా. కేన్సర్ కణం విడిపోయింది. అందులోని 'గాల్గి' ర్థం మాత్రం నాశనం కాకుండా మరొక యాంటీబాడీస్‌గా తయారై మన్న మరో కేన్సర్ కణాన్ని నాశనం చేయటం గమనించాడు. రించిన ప్రతి శత్రువూ తిరిగి జీవం పోసుకుని ఈసారి తన తరపు కరిగా మారి మిగతా శత్రువుల్తో యుద్ధం చేయటం ప్రారంభించటంతో డు 'సైమల్టెనియస్'ను సాధించగలిగాడు.

ఈ రకమయిన రెమిషన్ వల్ల, శరీరంలో ఉత్పత్తి అయ్యే కేన్సర్ లకన్నా, వాటితో యుద్ధంచేసే కణాలసంఖ్య వేగంగా పెరుగుతుంది. కావాల్సింది. తన ప్రయోగంలో సంతృప్తి చెంది అతడు కూతురు రికి నడిచాడు. చేతిలో సిరెంజి ఒక కణం అలాగే పట్టుకుని కూతురు హంలోకి చూసేడు. నెమ్మదిగా వంగి, కూతుర్ని బోర్లా తిప్పి ఇంజెక్షన్ చ్చాడు. నిశ్చలంగా వున్న కూతురు శరీరంవైపు మళ్ళీ కొద్దిసేపు ర్పకుండా చూసి, శేఖరం దగ్గరికి వచ్చాడు.

"మనం చేయవలసింది అయిపోయింది శేఖరం. ఇక తలుపు తెరు వచ్చు. కొంచెంసేపట్లో నా అంచనా నిజమై రెమిషన్ ప్రారంభమయితే ఇకనుంచీ కావల్సింది మామూలు ఆస్పత్రి ట్రీట్‌మెంటే...."

ఇద్దరూ తలుపు తెరిచారు.

చల్లటిగాలి రివ్వున కొట్టింది. మూడు రోజుల తరువాత ప్ర వెలుగును చూస్తూ ఇద్దరూ మొదటి మెట్టుమీద అడుగుపెట్టారు.

వారిని ముందు గమనించింది రవూఫ్. రెప్పపాటు తన కళ్ళ తనే నమ్మలేకపోయాడు. కానీ వెంటనే సర్దుకుని నిశ్శబ్దంగా జేబులో రివాల్వర్ తీసేడు. యస్సైలేదు.

ముందు భార్గవని పేల్చేసి, తరువాత అక్కడ అలజడి జరిగినట్ల వాతావరణం సృష్టిస్తే సరి. ఎవరూ చూడకముందే ఇది జరగాలి.

వాళ్ళు మరో రెండడుగులు క్రిందకు దిగారు. గురి చూశాడు అంతలో దూరంగా కారు వస్తున్న చప్పుడయింది. అతడు దాన్ని గమ నించలేదు. ఈ లోపులో భార్గవ శేఖరానికి అటువైపునుంచి యిటు వచ్చాడు

సరిగ్గా ట్రిగ్గర్ నొక్కబోతూన్న సమయానికి ఒక కారు ఇద్ద మధ్య వచ్చి ఆగింది. వెనుకసీట్లో ఒకవైపునుంచి డి. ఐ. జి. వేరొకవై నుండీ ప్రియ దిగారు.

# 10

వర్షం వచ్చేముందు ఎంత దట్టంగా మేఘాలు అలుముకుంటాయో అది వెలిసిన తర్వాత అంత వేగంగానూ అదృశ్యమైపోతాయి.

అందరికన్నా ముందు అతన్ని కంగ్రాట్యులేట్ చేసినవాడు డాక్ట మహేంద్ర. ఆస్పత్రి బయట వరండాలో భార్గవ నిలబడి వుండగా అత దగ్గరగా వచ్చాడు.

"ఎలా వుంది డాక్టర్?"

"ఇంకొక గంటా రెండు గంటలు పోతేగానీ ఏం చెప్పలేం."

భార్గవ విషాదంగా నవ్వాడు. "ఇంకా గంటా, రెండు గంటలు శరీరంలో తగ్గించటానికీ, మరో శరీరంలో పెరగటానికీ."

మహేంద్ర మాట్లాడలేదు.

"ఇట్సాల్‌రైట్ డాక్టర్! వీ విల్ వాచ్."

మహేంద్ర అతడి దగ్గరకు వచ్చి చేతిమీద చెయ్యి వేశాడు.

"అయామ్ సారీ ఫర్ వాటాల్ హేపెండ్."

భార్గవ అన్నాడు.... "నోనో. అటువంటిదేమీ లేదు. నేను మిమ్మల్ని అర్థం చేసుకోగలను. మీ థెరపీతో ఏ లాభమూ వుండదని నేనెలా అనుకున్నానో అలాగే నిష్కారణంగా నేనూ ఒక పాపని నా మూర్ఖపు పద్ధతులతో చంపబోతున్నానని మీరనుకున్నారు. ఇది కేవలం రెండు సిద్ధాంతాల మధ్య సంఘర్షణ. అంతే!"

"నేను లోపలికి వెళుతున్నాను" అని ఆగి, "మా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాం డాక్టర్ భార్గవా! కానీ వచ్చిన చిక్కేమిటంటే...."

"నాకు తెలుసు" ముక్తసరిగా అన్నాడు భార్గవ.

డాక్టర్ మహేంద్ర చేయి చాచాడు. భార్గవ అందుకున్నాడు.... "కంగ్రాట్స్" అన్నాడు చివరగా.

"థాంక్స్."

"ఇమ్యూన్ థెరపీ గురించి అలా వుంచండి. ఆర్టిఫిషియల్ సెల్ గురించి, నాలుగయిదు గంటలు కాలేదు. అప్పుడే ప్రపంచ వ్యాప్తంగా సంచలనం మొదలయింది. జెనీవా నుండి డాక్టర్ రాబర్ట్సన్ కొంచెం సేపటిక్రితమే మన ఎన్. ఎస్. సీ. డైరెక్టర్‌కి ఫోన్ చేశాడట."

"ఇంకా థీసిస్ అందజేయకుండానే!"

"ఇలాంటి విషయాలు దాచినా దాగవు భార్గవా! వెళ్ళొస్తాను."

భార్గవ అతడు వెళ్ళినవైపే చూస్తూ తిరిగి తల పక్కకి తిప్పేసరికి దూరంగా కారులోంచి శంకర్‌లాల్ దిగడం కనిపించింది. వస్తూనే చేయి చాచి "కంగ్రాట్యులేషన్స్! నాకు తెలుసు, మీరు సాధిస్తారని! అయామ్ ప్రౌడ్ ఆఫ్ యూ" అన్నాడు.

భార్గవ అతడివైపు కన్నార్పకుండా చూసేడు. ఎంత చిత్రం! ఎంత కొద్ది సమయంలో ఇతడు ప్లేటు మార్చేయ గలిగేడు. అందుకేనేమో వాళ్ళు డైరెక్టర్లూ, ఛైర్మన్లూ అవ్వగలిగేది. ఒకప్పుడు తామిద్దరూ కత్తులు దూసుకున్నారన్న ఛాయా మాత్రపు అనుమానం కూడా రాకుండా ఎంత మామూలుగా ఏమీ జరగనట్టు మాట్లాడేస్తున్నాడు.

"మీకేమీ అభ్యంతరం లేకపోతే అలా క్రిందికి వెళ్ళి మాట్లాడుకుందాం వస్తారా?"

భార్గవ మాట్లాడకుండా అతనితోపాటు ఆస్పత్రి మధ్యన వున్న లాన్‌లోకి నడిచాడు.

"భార్గవా! మీకు తెలుసా? ఈ రోజు సామ్సన్ అండ్ సామ్సన్‌లో పెద్ద ఆక్సిడెంట్ జరిగింది! ఒక బాయిలర్ పూర్తిగా పేలిపోయింది."

భార్గవ ఆశ్చర్యపడలేదు. పేలిపోతే ఇన్సూరెన్స్ వస్తుంది. అది కాదు అక్కడ విషయం. కార్సినోజిన్ సంగతి బయట పడకుండా ఎక్కడి కక్కడ నొక్కెయ్యడానికి అప్పుడే ప్రయత్నాలు జరగడం మొదలయిం దన్నమాట. చివరికేమీ జరగదు. బాయిలర్ పేలిపోయిన దృష్ట్యా రిపోర్టు పంపించటం కుదరదని వీళ్ళు చెప్తారు. మళ్ళీ కొన్నాళ్ళకి యధాతథంగా ఫ్యాక్టరీ పని ప్రారంభిస్తుంది.

"భార్గవా!"

భార్గవ ఆలోచనల్లోంచి తెప్పరిల్లి తలెత్తి చూశాడు.

"మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడదామని వచ్చాను." భార్గవ అతడివైపు చూశాడు. "నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ అండ్ రిసెర్చికి మిమ్మల్ని ఆనరరీ డైరెక్టర్‌గా రికమండ్ చేస్తూ మన డైరెక్టర్లు ఒక ప్రపోజల్ పంపించబోతున్నారు. నాకిప్పుడే తెలిసిందీ విషయం. అఫ్‌కోర్స్- దీన్ని కొంచెం రహస్యంగా వుంచండి."

నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ అండ్ రిసెర్చికి డైరెక్టరు అంటే సామాన్యమైన పదవేం కాదు. వస్తే విజయాలు పరంపరగా వస్తా యన్నమాట. ఇది మొదటిమెట్టు మాత్రమే.

"బహుశా ఆ పదవిని నేను స్వీకరించనేమో!" అన్నాడు భార్గవ ఇంగ్లీషులో.

"అఫ్‌కోర్స్ మీరు సాధించిన విజయంతో మీకు అంతకన్నా పెద్ద పదవే రావచ్చు. కానీ మా చేతిలో వున్నదీ చేయగలిగిందీ అది."

"థాంక్స్" ముక్తసరిగా అన్నాడు.

"భార్గవా! మీరేం చేద్దామనుకుంటున్నారు? మీరింకా రిసెర్చి కొన సాగించాలనుకుంటే మన ఇన్‌స్టిట్యూట్‌లోనే చెయ్యొచ్చు. మీ కూతురు మీద మీరు ఉపయోగించిన మందు సత్ఫలితాన్ని ఇస్తుందని ఆశిద్దాం. దురదృష్టవశాత్తూ ఒకవేళ అలా కాకపోతే మాత్రం...." ఆతడాగాడు.

"మన ఇన్‌స్టిట్యూట్‌లో మీరు పరిశోధన కొనసాగిస్తానంటే చాలా ఆనం దంగా ఆహ్వానిస్తాం."
"థాంక్స్. నా రిజిగ్నేషన్ లెటర్?"
"అదింకా నా దగ్గర వుంది భార్గవా!"
"నా మీద పోలీస్ కేసు?"
"అదేంటి భార్గవా? ప్రొద్దున్నే ఉపసంహరించుకున్నాంగా!"
"థాంక్స్."
అతడంత ముక్తసరిగా, మామూలుగా, ఏమీ జరగనట్టు మాట్లా డంతో శంకర్‌లాల్ కొద్దిగా కన్‌ఫ్యూజ్ అయ్యాడు.
"భార్గవా! నేను వచ్చింది కేన్స్‌రక్యూర్ గురించి మాట్లాడదామని."
అదీ అలా చెప్పు. ఈ క్షణం నుండి నేనేది మాట్లాడినా దానికి విలువుంటుంది. ఒక్కసారి కాన్సెక్యూర్ గురించి టీవీ ఇంటర్వ్యూ లోనో పేపర్ స్టేట్‌మెంట్‌గానో చెప్పానంటే అదొక విస్ఫోటనమై దేశాన్ని కదిలించి వేస్తుంది. అందుకొచ్చావన్నమాట నువ్వు!
"ఊ చెప్పండి" మనసులో ఆలోచనలు పైకి కనబడకుండా వుండటం కోసం ప్రయత్నం చేస్తూ అన్నాడు.
"ఎప్పుడో కొన్ని సంవత్సరాల క్రితం అతడు కనుక్కున్నది తప్పనీ, అతనికిచ్చిన పద్మశ్రీ తిరిగి తీసేసుకోవాలనీ నేనెందుకంటాను మిస్టర్ శంకర్‌లాల్! నేనంత బాధ్యత తెలియనివాణ్ని కాదు. నాకూ ఎథిక్స్ మీద గౌరవం వుంది. అయితే నాదో షరతు. వెంటనే సామ్సన్ అండ్ సామ్సన్ కంపెనీకి, మోహన్‌లాల్ కపాడియా ఇన్‌స్టిట్యూట్ ఇచ్చిన కాన్సెక్యూర్ ఫార్ములాని రద్దు చేసుకుంటూ ఈ క్షణం నుంచే దాని ఉత్పత్తి మానేయ్యాలి. అది ఎలా చేస్తారో మీ ఇష్టం"
శంకర్‌లాల్ మొహంలో రక్తం ఇంకిపోయింది. "వెంటనే అంటే కష్టం. ఒక సంవత్సరమన్నా టైమిస్తే" అతడి మాటలు పూర్తికాలేదు. కాలరు పట్టుకుని విసురుగా అతడిని దగ్గరికి లాక్కున్నాడు భార్గవ. అది ఆస్పత్రి అనీ, అందరూ చూస్తున్నారనీ కూడా మర్చిపోయాడు. ఎన్నాళ్ళ నుందో నొక్కిపట్టిన ఆవేదన, ఆవేశం ఒక్కసారిగా కట్టలు తెంచు కుంది. అగ్నిపర్వతం బ్రద్దలయింది.
"నిన్నిక్కడ ఇలా నేను నిలదీస్తున్నది నాకు నువ్వు చేసిన

అన్యాయానికి కాదు మిస్టర్ శంకర్‌లాల్? నన్ను జైల్లో పెట్టించినందుకు కాదు. నా ఉద్యోగం ఊడబెరికినందుకూ కాదు! ఇప్పుడు నువ్వు జవాబు చెప్పాల్సింది ఏనుపాదం మరణానికి! వేల వేల ఏనుపాదం లాంటి మూగజీవాల బలికి? ఇంకా ఎంతకాలం నీ కల్తీ మందుల్తో. నీ కల్తీ ఫార్ములాలతో అమాయక జనాన్ని చంపుతావు? యూ రాటెన్ ఎగ్! ఇంకో సంవత్సరం టైమ్ కావాల్రా నీకు! సంవత్సరంలోగా ఎలాగో నా ఇమ్యూనోకెమ్ మార్కెట్లోకి వచ్చేస్తుందని తెలిసి, ఈలోగా నీ మందుని వీలయినంత క్యాష్ చేసుకుందామనుకుంటున్నావా? యూ ది సివిలైజ్డ్ డెవిల్ ఆఫ్ ది హిపోక్రటిక్ సొసైటీ! జాగ్రత్తగా విను. వెంటనే నేను చెప్పినట్టు చెయ్యకపోతే మొత్తం మీ సంగతంతా బైటపడేటట్టు చేస్తాను. అప్పుడు నువ్వూ, నీ పద్మశ్రీ చంపాలాల్, నీ బావ నాయుడూ ఎక్కడ వుంటారో ఒకసారి ఆలోచించు" అంటూ ఇంకా ఏదో మాట్లాడబోతూంటే లోపల్నుంచి మహేంద్రజైన్ పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"ఏమిటిది భార్గవా! వదలండి, ఆవేశపడకండి" అంటూ విడిపించాడు. శంకర్‌లాల్ టై సర్దుకుంటూ కారు దగ్గరికి వెళ్ళిపోయాడు.

"మీకు తెలీదు జైన్! నాకు చేతకాదు గాబట్టి వూరుకోవల్సి వస్తోంది. లేకపోతే ఇన్నాళ్ళనుంచీ, ఇన్నాళ్ళుగా ఈ మందుమీద వాళ్ళు సంపాదించిన లక్షలు లక్షల్ని కక్కించి వుండేవాణ్ని."

"అయిపోయిందేదో అయిపోయింది. బహుశా వాళ్ళు నీతో శతృత్వం పెట్టుకోరు, ఈ మందుని ఆపు చేస్తారు."

"ఇంకో మందు మొదలుపెడతారు" గొణుక్కుంటూ అన్నాడు భార్గవ.

"ఈ కంగారులో పడి అసలు విషయం చెప్పటం మర్చిపోయాను భార్గవా? కంగ్రాట్యులేషన్స్ ప్రార్థనలో రెమిషన్ ప్రారంభమైంది. లుకేమియాకి వ్యతిరేకంగా మీ చరిత్రాత్మకమైన ఇమ్యూనోకెమ్ విజయం సాధించింది" ఇంగ్లీషులో అన్నాడు.

ఒక ఆనంద వీచిక భార్గవ మొహంలో గుప్పున వెలిగింది.

"గుడ్. కౌంట్ ఎంత?"

"96000"

"ఎక్సలెంట్." అంతలో భార్గవ మొహంలో సందేహం కనబడింది.

"నా భార్యకెలా వుంది డాక్టర్?" అన్నాడు.

మహేంద్రజైన్ తటపటాయిస్తూ నెమ్మదిగా అన్నాడు, "అన్ని బాగా ప్రయత్నించాం. చివరికి మీ ఇమ్యూనోకెమ్ కూడా ప్రయో దాం. కానీ ఆమెలో ప్రవేశించిన ఫారిన్ బాడీ మరీ బలంగా వుంది. యామ్ సారీ ఆమె.... ఆఖరి క్షణాల్లో వుంది."

అతడు నిర్విణ్ణుడయ్యాడు. 'వసుమతీ.... క్షమించు నిన్ను రక్షించు లేకపోతున్నాను. కానీ ఒకటి మాత్రం నిజం. కేన్సర్‌తో మరణించే ళ్ళలో నీవే ఆఖరిదానివి కావాలని నా ఆకాంక్ష. అవుతావు కదా'

* * * *

అతికష్టంమీద ఆమె తల తిప్పి ప్రక్కకి చూసింది. భార్గవ పలికొస్తూ కనబడ్డాడు. ఆమె ఒళ్ళంతా మంటల్లో కాలుతున్నట్టూ బాధ. రెప్పలు మూతపడిపోతున్నాయి. తన తల్లినీ, తండ్రినీ, చెల్లినీ కు వెళ్ళిపోయిన అన్నాత్రి ఇప్పుడు తననీ కబంధ హస్తాల్లోకి తీసు లోంది. కొద్ది కొద్దిగా తలుపులు మూసుకుపోతున్నాయి.

ఆమె పరిస్థితి గమనించి అతడు చప్పున దగ్గిరకి వచ్చి నుదుటి న చెయ్యివేశాడు. ఆమె చాలా చెప్పాలనుకుంది.

....మీ కుటుంబంలో ఒకదానిగా కలిసిపోదామని పెళ్ళైన మరు ణం నుంచీ ప్రయత్నిస్తూనే వచ్చానండీ కానీ కలవలేకపోయాను. అది దురదృష్టం. మనకోసం నేను చేసిన ప్రతిపనీ ఎదురు తిరిగి నన్ను మా, మీ కుటుంబానికీ మరింత దూరం చేసింది. నా మనసులో ఏ దురు శమూ లేదండీ. నాకు తెలిసిన చిన్న ప్రపంచంలో ఆప్తులపట్ల నా న్న కొద్ది పరిజ్ఞానముతో నేను చేస్తున్నదే నిజమనుకున్నాను. ఏ పదాల ందికతో, ఏ మాటల కూర్పుతో, నా మనసులో భావాల్ని, నా ఉద్దే ల్ని పేర్చి మీకందిస్తే మీరు ఈ చివరి క్షణాల్లోనైనా నా మనసుని సుకోగలుగుతారు? మీలాంటి ఎందరో సైంటిస్టులు ఎన్నెన్నో కను క్కున్నారు. మానవాళి అభ్యుదయానికి సోపానాలు వేసారు. కానీ ఎవ నా ఒక్క సైంటిస్టు, మనిషి తన మనసును యథాతథంగా ఎదుటి నిషికి చూపించి చెప్పగలిగే పరికరాల్ని కనుక్కుంటే బావుండును. ప్పుడు నా మనసులో భావాల్ని, నా చేతల్లో నిష్కల్మషాన్ని, మాటల్లో ప్పలేని నా దృక్పథాన్ని మీకు వివరించి చెప్పగలిగి వుండేదాన్ని.

ఓ దుర్మార్గురాలిగా ఈ లోకంచేత శాశ్వతంగా ముద్రవేయించుకునే పాప నుంచి తప్పించుకుని వుండేదాన్ని. ఒక నా మాటనేముంది? మనిషి మనిషికీ మధ్య కమ్యూనికేషన్ గాప్ తొలగిపోయిన రోజు స్వార్థ చింత మానసిక వృధా వాటంతటవే పోతాయి. కాన్సర్ మందుకన్నా అది గొప్ప మందౌతుంది. అదీ ఈ ప్రపంచానికి కావలసింది.

వెళ్ళొస్తానన్నట్టు ఆమె నెమ్మదిగా చేతులు జోడించబోయింది శక్తిలేక చేతులు మధ్యలోనే కిందికి వాలిపోసాగేయి. అతడు ముందుకి వెళ్ళి ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు. ఆమెకి నవ్వొచ్చింది తనేమో నమస్కారం చెయ్యాలనుకుంది. అతదేమో తనకేదో సహాయం వదాలని చేతులు పట్టుకున్నాడు. జీవితం మొదట్నుంచీ చివరివరకూ ఇదే కమ్యూనికేషన్ గాప్!.... ఆమె నవ్వు మరింత విశాలమైంది. ఆ నవ్వు తోనే ఆమె తల పక్కకి వాలిపోయింది.

# ఉపసంహారం

గోధూళి వేళ ఒక ఎర్రటి సంధ్యా కిరణం అతడి తెల్లటి జుట్టు మీద అందంగా ప్రతిబింబిస్తూ వుంది. అతడు రెయిలింగ్ పట్టుకుని నిలబడి దూరంగా రోడ్డుమీద నలుసుల్లా కనబడుతున్న జనాన్ని చూస్తున్నాడు. అతడి కళ్ళలో ప్రశాంతత వుంది. దాని వెనుక తీక్షణత వుంది. సంతృప్తి వుంది. ఆ పొరల వెనుక రవ్వంత విషాదం కూడా వుంది. అతడి చేతిలో కొత్తగా అలవాటయిన పైప్ వుంది.

ఎకరం విస్తీర్ణంలో చుట్టూ చెట్లతో- మధ్య చిన్న బంగళా. ఎంతో ప్రశాంతంగా హాయిగా వుంది. గడియారం ఆరుకొట్టింది. తిరిగి రోడ్డువేపు చూసేడు. గేటులోంచి లోపలికి వస్తున్న కారుని చూసి మెట్లుదిగి వచ్చాడు. కారు వచ్చి మెట్లముందు ఆగింది.

"ఏమ్మా- ఇంత ఆలస్యం అయింది?"

"ఆస్పత్రిలో ఆలస్యం అయింది డాడీ" అంది ప్రార్థన కారు డోరు వేసి దగ్గరకువస్తూ. ఇద్దరూ లోపలికి నడిచారు.

"టిప్పీ! కొంచెం టీ ఇస్తావా- ప్లీజ్" డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చుంటూ అంది ప్రార్థన.

"ష్యూర్" జెస్సీ కిచెన్‌లోకి వెళ్ళింది.

"ఈ రోజు బాగా అలసిపోయినట్టూ కనబడుతున్నావేమిటి" తన్ని పరీక్షగా చూస్తూ అన్నాడు భార్గవ.

"సెరబ్రల్ హెమరేజస్ డాడీ! రోజుకి నాలుగు కేసులకి తక్కువ కుండా వస్తున్నాయ్" అంది.

(రక్తనాళాల్లో కొవ్వు చేరటాన్ని ఎథెరోస్ క్లైరోసిస్ అంటారు. ఈ అడ్డుపల్ల గుండె అవసరమైనదానికన్నా ఎక్కువ వత్తిడితో శరీరం కి రక్తాన్ని "పంప్" చెయ్యవలసి వస్తుంది. ఈ వత్తిడికి తట్టుకోలేక దడులో రక్తనాళాలు పగిలి పోవటాన్ని సెరబ్రల్ హేమరేజ్ అంటారు.)

"డాడీ"

అతడు తలెత్తి చూసేడు.

"మీ రోజుల్లో ఈ వ్యాధి ఇంతలా వుండేది కాదుకదా!"

"అవును, వుండేదికాదు."

"అదృష్టవంతులు డాడీ"

అతడికి నవ్వు వచ్చింది. లూయీ పాశ్చర్‌ని అతడి మనవరాలు రోజులలో కరిచే కుక్కని చూసి జనం పులిని చూసినట్టూ భయపడి గెత్తేవారట కదా' అని అడిగినప్పుడు అతనూ ఇలానే నవ్వుకొని టాడు.

"ఈ ఎథిరోస్ క్లైరోసిస్ విల్సన్ అండ్ రిచర్డ్‌సన్ కంపెనీ మందు ! మైగాడ్ – అసలది ఎంతవరకూ పనిచేస్తుందో మాకే అర్థంకావటం ను. ఏదో గుడ్డెద్దు చేలో పడ్డట్టు వాడుతున్నామంతే. ఆస్పత్రిలో ఆ ందు తప్ప ఇంకేమీ లేదు"

"చరిత్ర" అన్నాడు.

"నేను మందుల గురించి మాట్లాడుతూ వుంటే నువ్వు చరిత్ర రించి మాట్లాడతావేమిటి?"

"నేను మాట్లాడేది మందుల చరిత్ర గురించేలే"

శ్రీనూ వచ్చి ఫోన్ వచ్చిందని చెప్పాడు. భార్గవ వెళ్ళి రిసీవర్ ందుకున్నాడు.

"నేనూ— శేఖరాన్ని"

"చెప్పు"

"రేపొద్దున్న ప్రియ లంచ్‌కి రమ్మని పిలుస్తోంది."

"తనేగానీ నువ్వు పిలవటం లేదా?"

"....హోమ్ డిపార్ట్‌మెంట్ పరిహద్దుల్లోకి మనం వెళ్ళం"

"అందరమూ వచ్చేస్తాము. సరేనా?"

"సాయంత్రం అయిదింటికే వచ్చేయండి. టీ.వీ.లో మా అమ్మాయి డాన్స్ వుంది"

"కొత్త టీవీ కొన్నావటగా?"

"అవును! 120 ఛానెల్‌ది"

"ప్రాక్టీసు పెట్టిన తర్వాత నీ పని బాగున్నట్టుందే"

"ఆ....కొద్దిగే...." అంటూ శేఖరం నవ్వాడు. "రేపు వచ్చేస్తారుగా! అందరం కలిసి చూడాలని మా అమ్మాయి పట్టుబడుతోంది"

"తప్పకుండా"

"భార్గవా!"

"ఊఁ"

"నీ మనసంత బాగున్నట్టు లేదే."

భార్గవ విస్మయంతో "నీకెలా తెలిసింది?" అనడిగాడు.

"కంఠంలో మార్పు ఆమాత్రం గుర్తుపట్టలేనా?"

భార్గవ వెంటనే సమాధానం ఇవ్వకుండా ఆగి, అన్నాడు- "కొంచెం డిస్టర్బ్ అయ్యాను.... నేను అప్పుడప్పుడూ ఆలోచిస్తూంటాను శేఖరం. జీవకణపు స్వరూపాన్ని కనుక్కున్నాక ఈ పది, పదిహేను సంవత్సరాలలో మనిషి దాదాపు అవయవాల్ని కన్నూ, చెవీ, చివరికి నాలుక కూడా సృష్టించగలిగాడు కానీ 'రోగాన్ని' ఎదుర్కోలేక పోతున్నాడు. ఒకదాన్ని జయించగానే వేరొకటి- దీనికి అంతే వున్నట్టు కనపడటంలేదు."

"సెరెబ్రల్ హెమరేజ్ గురించా?"

"అవును! 1992లో కదూ హృద్రోగం అరికట్టబడింది— అదీ పోయిందీ అనుకుంటే ఇప్పుడు ఇది"

భార్గవ నవ్వేడు.

"సర్లే- ఇప్పుడు నీ మూడ్ కూడా పాడుచేయటం ఎందుకు? రేపు కలుద్దాం. ఈ లోపులో నీ జ్యోతిష్యం ఉపయోగించి దీనికి మందు ఎవరు ఎప్పుడు కనుక్కుంటారో ఆలోచించి వుంచు గుడ్‌బై" అని ఫోన్ పెట్టేస్తూ వుండే ప్రార్థన, టిన్నీ తయారయి వచ్చారు. టిన్నీ చేతిలో టెన్నీస్ రాకెట్ వుంది.

"ఈ రోజు ఫైనల్స్ డాడీ! అక్కని కూడా తీసుకు వెళుతున్నాను చూపించటానికి"

"రేపు మాత్రం ఏ ప్రోగ్రామూ పెట్టుకోకండి. శేఖరం ఇంటికి డిన్నర్ కి వెళ్ళాలి"

"అంకుల్ ఇంటికా- ఎక్సలెంట్" అంటూ సన్నగా విజిల్ వేసింది టిన్నీ.

"ఇంకా చిన్నపిల్లలా ఆ విజిల్ ఏమిటి?" అని ప్రార్థన కోప్పడింది. "ఆ టీవీ ప్రోగ్రాంలు చూసి పాడైపోతున్నావ్"

"పదిహేను సంవత్సరాల క్రితమూ అంతే. ఏమీ మారలేదు" అన్నాడు భార్గవ.

"ఏమిటి? నేనా- టీ.వీ. ప్రోగ్రామా?" అంది అమాయకంగా టిన్నీ. అందరూ నవ్వేరు.

నవ్వులతోపాటూ ఆ ఇంటినుంచి వాళ్ళు కారులో వెళ్ళిపోయాక ఆ నిశ్శబ్దపు మసక చీకట్లో అతడు ముందుగేటు వరకూ నడుచుకుంటూ బయలుదేరాడు.

ఇంటినుంచి గేటువరకూ ఎర్రమట్టి రోడ్డు. రోడ్డుకిరువైపులా పెద్ద పెద్ద చెట్లు.... కుడివేపు కొద్దిదూరంలో చెట్టుపక్కగా చిన్న శిలా విగ్రహం.... బస్ట్ సైజుది.... జననం- మరణం- మానవజాతిని రక్షించ టము కోసం.... బాపతు శిలాశాసన అక్షరాలు- అన్నిటినీ దాటుకుంటూ అతడు గేటువరకూ వచ్చాడు. అతడి చేతిలో పైప్ వుంది.

ఇంకా పూర్తిగా చీకటి పడలేదు. రోడ్డు అంతా రష్‌గా వుంది.

అతడి దృష్టి ఇద్దరు కాన్వెంట్ పిల్లలమీద పడింది. దూరంగా నిలబడి తనవైపే చూస్తూ వాళ్ళలో వాళ్ళే ఏదో సంప్రదించుకుంటున్నారు. చివరికి ధైర్యంచేసి అతడి దగ్గరికి వచ్చారు.